శ్రీశ్రీశ్రీ హరిబాబు యోగీంద్రకృత

# శ్రీ బుద్ధగీత

(విశ్వయోగము – 3)



: పరిష్కర్త మరియు ప్రచురణకర్త :

"పౌరాణికరత్న" "మహాపురాణాంధ్రీకరణచణ"

**పుట్టంపలి శివసుబ్బరాయ గుప్త**



: రూప శిల్పి :

"సరస సాహితీ చరణ చారణ చక్రవర్తి"

**జి. వి. యల్. యన్. విద్యాసాగరశర్మ, M.A.,**

( రిటైర్డ్ ప్రభుత్వ డిగ్రీకళాశాల ప్రిన్సిపాల్ )

ACC NO 22052

ప్రథమ ముద్రణ :

ప్రతులు – 1000

సర్వస్వామ్య సంకలితము

ఆవిష్కరణ :

బుద్ధపూర్ణిమ

(14-5-95)

వెల : రూ. 80/-

తపస్విభ్యోఽధికో యోగీ, జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ, తస్మాద్యోగీ భవార్జున

(భగవద్గీత - 6-46)

ఓ అర్జునా! యోగితపస్వుల కంటేగొప్పవాడు. జ్ఞానులకంటే గొప్పవాడు. కర్మిష్ఠుల కంటేకూడా గొప్పవాడు. అందువలన నీవు యోగివి కమ్ము !!

ప్రతులకు :

1. మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త
శివా ఇంజనీరింగ్ కంపెనీ
స్టేషన్‌రోడ్డు, గుంటూరు-1.
ఫోన్ : 220827

2. గుండా అనసూర్యమ్మ
నరసరావుపేట.
వేంకటేశ్వర టాకీస్‌వద్ద
దత్తాత్రేయ మందిరం ప్రక్క.

ముద్రణ :

సాయిశర్వాణి ప్రింటర్స్
రెంటవలైను, ఏ. టి. అగ్రహారం
గుంటూరు–4.

గ్రంథకర్త



శ్రీ శ్రీ శ్రీ హరిబాబు యోగిమహరాజ్

"సమ్యక్ సంబుద్ధుడు"



కరుణామయుడు శ్రీ బుద్ధభగవానుని అరుణారుణ చరణ కమలాలకు
ఈ గ్రంథం అంకితం చేస్తున్నాము

—మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త

# దివ్యాశీస్సులు

అన్ని జన్మలలోకి మానవజన్మ ఉత్తమమైనది. మానవజన్మ లభించుటయే దుర్లభము. అదృష్టవశమున దివ్యవరముగా లభించిన మానవజన్మను మానవుడు సద్వినియోగము చేసికొనుటకు సక్రమముగా యత్నించవలెను. మునుముందుగా మనిషిగా మారి, మహాత్మునిగా, మహాశక్తి స్వరూపునిగా, సాక్షాత్తు మహేశ్వరునిగా మారటానికి దివ్యపథముపై పయనించాలి.

పరిపూర్ణ మానవత్వమే దివ్యత్వము. సనాతన ధర్మం మానవుని పరిపూర్ణ మానవునిగా తీర్చిదిద్దటానికి దోహదపడే మార్గం. ఇది ఒక ప్రాంతమునకో, మతమునకో సంబంధించినది కాదు. యావత్ మానవ జాతికి, యావత్ మానవకల్యాణమునకు, సనాతన ధర్మం ఎంతయో ఆచరణీయము అయివున్నది.

"వసుధైక కుటుంబము" అని చాటిచెప్పినది సనాతన ధర్మం. "ఏకం సత్, విప్రాః బహుధా వదంతి" అని చెప్పినది సనాతనధర్మం. "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అని మనిషి మనిషికి సందేశమిచ్చినది సనాతన ధర్మం. మనిషిని సంస్కరించి, కుటుంబ వ్యవస్థను చక్కదిద్ది, గృహమును ప్రశాంతి నిలయముగా తద్వారా మార్చి యావత్ మానవ సమాజమును ఒక స్వర్గధామముగా, ఒక కలియుగ వైకుంఠముగా మార్చటానికి మార్గదర్శక మయింది.

అట్టి సనాతన ధర్మాన్ని విస్మరించి, వ్యక్తిని విస్మరించి, కుటుంబమును విస్మరించి, సమాజమును బాగుచేయాలని ప్రణాళికలు వేస్తున్నాము. కాబట్టి అన్నింటిలోను అపజయమును రుచిచూచి, ఇప్పుడు యావత్ ప్రపంచాన్ని ఒక అగ్నిగుండగా, ఒక అశాంతి నిలయంగా దిగజార్చటానికి నాగరికత పేర, విశృంఖల స్వతంత్రత పేర, మితిమీరిన తెలివితేటలపేర సహాయపడుతున్నాము. ఇవి విచారించదగ్గ విషయం.

మొట్టమొదటగా మనిషి సంస్కరించబడాలి. తరువాత సమాజము దానికదే సంస్కరించబడుతుంది. సంస్కారముగల వ్యక్తులతో విరాజిల్లే కుటుంబములను, గృహములను కలిగిన సమాజము ప్రశాంత పరిమళములను

వికసిమ్ముతూ ప్రకాశవంతముగా వెలుగొందుతుంది. విశ్వమానవ సమైక్య తతో సుసంఘటితంగా జీవిస్తూ, విశ్వమానవ కళ్యాణాన్ని రుచిచూస్తుంది. ఇదే ! ఇదే ! ముక్కోటి దేవతల దివ్యసంకల్పము, సందేశము. ఇదే ! ఇదే ! సమస్త మానవజాతియొక్క ఆశ. ఆకాంక్ష. ఆశయము. లక్ష్యము

ఇట్టి సనాతన ధర్మాన్ని బోధించిన వాడు బుద్ధభగవానుడు. ఆయన సృష్టి స్థితి లయాత్మకమైన విశ్వశక్తిని దత్తంచేసుకొన్న మహాయోగి. తక్కిన ప్రవర్తలకూ బుద్ధుడికీఒకముఖ్యభేదంఉన్నది. వాళ్ళందరూ తాముమోక్షప్రదా తల మని చెప్పుకొంటే, బుద్ధుడుమాత్రం తాను"మార్గదాతను" మాత్రమే నని చెప్పుకొన్నాడు. ధర్మప్రవర్తనలో శీలానికున్న ప్రాధాన్యం గమనించిఅష్టాంగ మార్గాన్ని లోకానికి ప్రసాదించాడు. బుద్ధుడు నాస్తికుడు కాదు హేతు వాది. మనవుల దృష్టిని అంతర్ముఖంగా పయనింప జేసిన విశ్వయోగి. కుల మతాల కతీతమైన ప్రేమ మతాన్ని ఆయన స్థాపించాడు. సర్వప్రాణులసేవే సర్వేశ్వరునిసేవ అని ప్రపంచించాడు. తాను దేవుణ్ణని చెప్పుకోలేదు. దేవుడి పేరు చెప్పుకొని అత్యాచారాలు చేస్తున్న వారిని చూచి తపించాడు. మనిషికీ మనిషికీ మధ్యనున్న అడ్డుగోడల్ని మైత్రీకరుణలతో కూలగొట్టాడు. "వేయి గ్రంధాలు బట్టీపెట్టి వల్లించడంకన్నా, అందులోని ఒక్కధర్మాన్నైనా నిజ జీవితంలో ఆచరిస్తే చాలు"నన్నాడు. అంతటి మానవతావాది, ప్రేమ మూర్తి, కరుణామయుడు ప్రపంచ చరిత్రలో మరొకడు మనకు కనిపించడు. ఆయన బోధలు సర్వమానవులకూ శిరోధార్యాలు.

ఆ కరుణామయుడు బోధించిన నైతిక జీవన విధానాన్ని ఈ కాలానికి అనుగుణంగా, 'శ్రీబుద్ధగీత'గా వ్రాసిన శ్రీ హరిబాబుయోగి నేటిసమాజ రుగ్మతకు వలసిన చికిత్సను ఈ గ్రంథంద్వారా చక్కగా చేసి, తమ యోగ్య తను చాటుకొని చరితార్థులైనారు. శ్రీ బుద్ధగీతను మహోదాత్తంగా సంత రించిన పరిష్కర్త మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్తను. రూపశిల్పి విద్యాసాగర శర్మను అభినందిస్తున్నాను. ఈ గ్రంథం మతాలమత్తును, కులాల దుర్వ్యా మోహాన్ని పోగొట్టి ప్రతిహృదయంలోను ప్రేమపరీమళాలు నింపి, మనిషిని మహామనీషిగా మార్చి విశ్వశాంతికి వైతాళిక గీతా లాలపించగలదని విశ్వ సిస్తున్నాను.

విశ్వమందిరం,
కృష్ణనగర్,
గుంటూరు,

శ్రీశ్రీశ్రీ విశ్వయోగివిశ్వంజీ

# పునరాహ్వానము



దయసేయంగదవయ్య ! శాక్యమునిచంద్రా ! నీ పదస్పర్శచే
గయిసేయంగదవయ్య భారతమహీఖండంబు ! దివ్యత్కృపా
మయ మందార మరంధబిందులహరీ మందస్మితాలోకముల్
దయసేయంగదవయ్య మానవమనస్తాపంబు చల్లారగన్ !!

స్వార్థజ్వాలల దేశభద్రతలు స్వాహా యయ్యె; విద్రోహముల్
వర్ధిల్లెన్; కుటిల ప్రచారములు దుర్వారంబు లయ్యెన్; మన
స్పర్థాసంకులమైన యీజగతికిన్ శాంతింబ్రసాదింప సి
ద్ధార్థస్వామి ! మరొక్కమారు దిగిరావయ్యా ! పురోగామివై !!

హింసాశక్తుల్ రక్తదాహమున దండెత్తెన్ దరిద్రప్రజా
సంసారమ్ములపై; పురోగమనముల్ స్తంభించె; స్వాతంత్ర్యమే
ధ్వంసమయ్యె; కిరాతశాత శరవిద్ధంబైన యిద్ధాత్మణీ
హంసన్ గాయము మాన్పి కావవలెనయ్యా ! రమ్ము! వేగమ్మునన్ !!

ఆటంబాబుల బీటువారినది బ్రహ్మాండంబు; సద్భావమే
మోటై పోయెను; పంచశీల పథకమ్ముల్ దుమ్మువట్టెన్; దురా
శాటోపంబులు హద్దుమీరినవి; పోరాటమ్మె ఆరాటమై
లూటీచేసిరి మానవత్వమును; ఆలోకింపు లోకప్రభూ !!

హాలోన్మత్తులు దేవదత్తులు; జిఘాంసాలోలులౌ అంగుళీ
మాలుల్ రేగిరి; లోభ, మోహ, మద, కామ, క్రోధ, మాత్సర్య దు
ర్వ్యాళక్ష్వేళ కరాళ హాలాహల కీలాభీలమై అల్లక
ల్లోలమ్మయ్యె జగమ్ము సర్వము; దయాళూ ! రమ్ము ! రక్షింపగన్ !!

ఘీంకారం బొనరించుచుం బయికి దూకెన్ చీనిచీనాంబరా
లంకారమ్ముల కొమ్ముటేన్గు; తడవేలా శాక్యసింహా ! ఇకన్
జంకుం గొంకును లేని నీమధురహస్తస్పర్శతో తన్మనో
హంకారం బెడలించి పాదముల సాష్టాంగంపడంజేయవే !!

యుద్ధజ్వాలలు మూగె; భీతిలి జగ మ్ముయ్యాల లూగెన్; రుషా
క్రుద్ధవ్యాఘ్రము "గాండ్రు గాండ్రు" మనుచున్ గ్రొన్నెత్తురుల్ ద్రాగె; జా
త్యౌద్ధత్యములు రేగె; దుండగుల యత్యాచారముల్ సాగె; నో
సిద్ధార్థా ! ప్రళయాగ్ను లార్పవె ! ప్రజాశ్రేయమ్ము చేకూర్చవే !!

(డాక్టర్ "కరుణశ్రీ" జంధ్యాలపాపయ్యశాస్త్రిగారి "కరుణశ్రీ" కావ్యంనుండి)



"సమ్యక్ సంబుద్ధుడు" శ్రీ విశ్వయోగి విశ్వంజీ



విశ్వయోగి దీక్ష విశ్వ మానవ రక్ష
విశ్వయోగి దృష్టి విజయ వృష్టి
విశ్వయోగి బోధ విజ్ఞానమయ గాథ
విశ్వయోగి మాట ! వెలుగుబాట



విశ్వయోగి

# ప్రవేశిక

''దివా తపతి అదిక్కో రాత్తిం అభాతి చందమా
సన్నద్ధో కత్తియో తపతి మాయా తపతి బ్రహమణో
అత్తా శబ్బాయని అహోరాత్తాయిన్ బుద్ధో తపతి తేజసా॥

(దమ్మపథం)

"సూర్యుడు పగటి పూటమాత్రమే ప్రకాశిస్తాడు! చంద్రుడు రాత్రి సమయంలో ప్రకాశిస్తాడు యోధుడు ఆయుధంతో ఉన్నప్పుడే ప్రకాశిస్తాడు. బ్రాహ్మణుడు ధ్యానసమయంతో ఉన్నప్పుడే ప్రకాశిస్తాడు. కాని బుద్ధభగవానుడు అహోరాత్రాలు ప్రకాశిస్తూ ఉంటాడు. బుద్ధుడు ఈ విశ్వానికే వెలుగు. మరొక విధంగా చెప్పాలంటే ఆయనే విశ్వం. విశ్వమే ఆయన. కనుకనే ఆయన విశ్వగురువైనాడు. మానవ సంఘంపైగల మహిత కారుణ్యంతో, మానవుల్ని బాధావిముక్తుల్నిజేసి, శాంతినీ, ఆనందాన్నీ ప్రసాదించాలని ఇంతగాఅలమటించిన వాళ్ళూ, ఇంతగా ఆరాటపడినవాళ్ళూ, ఇంతగా తపించినవాళ్ళూ చరిత్రలో చాలాతక్కువ మంది మనకు కన్పించినా ఇంత హేతువాద దృష్టిగల బోధకుడు, ఇంతటిప్రేమూర్తి, మరొకడులేడని పిస్తుంది.

బుద్ధుడు తాను ప్రవక్తననిగానీ, దేవదూత నని గానీ ఎక్కడా చెప్పుకోలేదు. మిగిలిన ప్రవక్తలంతా తాము మోక్షదాతలమని చెప్పుకుంటే, బుద్ధుడుమాత్రం తాను మార్గదాతనని చెప్పుకున్నాడు. 'మోక్ష' మంటే బుద్ధధర్మ విధానంలో "నిర్వాణం". అంటే వాంఛల నన్నింటిని అదుపు చెయ్యటం. బుద్ధుడు బోధించిన ''ధమ్మ, అధమ్మ, సధమ్మ'' అనే మూడింటిని అర్ధం చేసుకుంటేనే కానీ ఆయనబోధించిన ధర్మమేమిటో మనకు అర్థం కాదు.

ధమ్మమంటే 1) స్వచ్ఛమైన జీవితం గడపడం 2) జీవితంలో సంపూర్ణత్వాన్ని పొందటం 3) నిర్వాణ మార్గంలో జీవించటం 4) కోరి కల్ని వదలి వెయ్యటం 5) భౌతిక విషయాలు అనిత్యాలని నమ్మటం 6) కర్మే నీతిమార్గానికి ఉపకరణమని నమ్మటం.

సత్యం. బ్రహ్మకెట్టి మార్పులేదు. జీవాత్మ, పరమాత్మ అభిన్నాలు. మానవుని ఆత్మ, విశ్వాత్మలో ఏకమౌతుంది" అనేది. మూడోది చార్వాక మతం – "జీవితం కేవలం సుఖాలు అనుభవించడానికే ఏర్పడిం"దనేది. ఈ మూడు ఆనాటి మానవుడికి శాంతిని ఇవ్వలేకపోయాయి. వేద ధర్మంలో, కర్మకాండ లకే ప్రాధాన్యం ఇచ్చారుగాని ఆత్మత్యాగం, సంకల్ప సిద్ధి అనే వాటికి స్థానం లేదు. ఋగ్వేదాన్ని మనం పరిశీలిస్తే ఆకాలంలో మనిషి ఆలోచన బహిర్ము ఖమై దేవతలవైపు మళ్ళటం కనిపిస్తుంది. బౌద్ధమతం మనిషి అన్వేషణను అంతర్ముఖం చేసి, తనలోని సామర్థ్యాన్ని గుర్తించేలా చేసింది. బౌద్ధమతం మొట్టమొదటిసారిగా మానవుడు ధర్మబద్ధంగా ప్రవర్తించేందుకు మనస్సుకు శిక్షణ ఇవ్వాలని పూనుకొంది. బౌద్ధమతానికి ఇతర మతాలకీ చాలా వ్యత్యా సముంది. అన్నిమతాలూ "మానవుడు చేరుకోవలసిన గమ్యస్థానం భగవంతు" డని చెబుతుంటే బౌద్ధం "మానవుడి ధ్యేయం నిర్వాణం (కోరికలను వదలి పెట్టడం) అదే మోక్షం" అని అంటుంది. బుద్ధుడు దేవతలనూ, స్వర్గ నరకా లనూ విశ్వసించినా, నిర్వాణ ప్రాప్తికీ, దేవునికీ ఏమీ సంబంధం లేదని, ఆయనను గురించి ఆలోచించడం అనవసరమని చెప్పాడు. ఆయన ప్రవచిం చిన సిద్ధాంతాల్లో చాలావరకు తనకు ముందున్న కపిలుడి సాంఖ్య మొదలైన పవిత్ర గ్రంథాలనుంచి స్వీకరించినవే. అయితే వాటిలో కొన్నింటిని నిరాక రించి, కొన్నింటిని సవరించి, కొన్నిటిని ఆమోదించాడు.

**బుద్ధుడు నిరాకరించినవి :—**

1) వేదాలు అపౌరుషేయాలు అని నమ్మటం, 2) ఆత్మకు మోక్ష సిద్ధి కల్గుతుందనీ, అది కలగనప్పుడు పునర్జన్మ లెత్తుతుందనీ నమ్మటం. 3) యజ్ఞయాగాదులవల్ల, వైదిక కర్మకాండవల్ల మోక్షంవస్తుందని నమ్మటం. 4) చాతుర్వర్ణ విభజన తగినదని నమ్మటం. 5) ప్రపంచానికి మూలం ఈశ్వరుడని నమ్మటం. నేనెవర్ని ఎక్కడినుంచి వచ్చాను. ఎక్కడికి వెళ్తాను. అనే ఊహాగానాల్ని ఖండించటంతో ఆత్మగురించిన పిచ్చి పిచ్చి భ్రమలను బుద్ధుడు త్రోసిపుచ్చాడు. దేవుడు మానవుని సృష్టించాడనే సిద్ధాంతాన్ని ఖండించాడు. ఆత్మ ఉనికిని నిరాకరించాడు.

అతడు సవరించినవి :-

1) కార్యకారణ సిద్ధాంతాన్ని కపిలుని సాంఖ్యంలోంచి స్వీకరించి సవరించాడు. 2) మానవప్రమేయం లేకుండాఅంతావిధివిహితం (తలరాత) ప్రకారమే జరుగుతుందన్న వాదాన్ని త్రోసిపుచ్చాడు. 3) పూర్వ జన్మలో చేసిన కర్మలు ఈ జన్మలో దుఃఖాన్ని కల్గిస్తాయి అనే సిద్ధాంతాన్ని సవరించి శాస్త్రీయమైన కర్మవాదాన్ని ప్రవచించాడు. 4) మోక్ష సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించాడు.

బౌద్ధమతంలోని ప్రత్యేక లక్షణాలు :

1) మనంచేసే అన్ని పనులకూ మనస్సే కేంద్ర స్థానంగా గుర్తించటం, 2) మనస్సును తెలుసుకొంటే అన్ని విషయాలు తెలుసుకొన్నట్లే. కనుక మనస్సును సంస్కరించుకోవటమే మొట్టమొదటగా మనం చేయవలసిన పని అని గ్రహించటం, 3) తనలో పుట్టిన, బయటినుంచి సంప్రాప్తించిన మంచి, చెడులకు మనస్సే కేంద్రము. కాబట్టి ఎప్పటికప్పుడు మనం మనస్సును క్షాళనం చేసుకుంటూ. పాప భూయిష్ఠమైన పనులను విసర్జించటం, 5) నిజమైన మతం మత గ్రంథాల్లో ఉండదు. ఆ మత సూత్రాలను పాటించడంలో ఉంటుందని చెప్పటం. బుద్ధునకు ఇతర తత్వజ్ఞులకు చాలా భేదమున్నది. తక్కిన తత్వజ్ఞులు ఊహతో, తార్కిక బుద్ధితో సిద్ధాంతాలు ప్రవచిస్తే బుద్ధుడు మానవ జీవితంలోని దుఃఖాన్ని చూచి, దుఃఖించే వారితోపాటు తానూ దుఃఖించి, దాని నివారణకోసం ఆరు సంవత్సరాలు అతి తీవ్రంగా తపించి, సిద్ధార్థుడైనాడు. ప్రపంచంలోని సర్వ వస్తురూపాలను ఆయన పరీక్షించి "అనిచ్ఛ, దుఃఖము, అనాత్మ అను మూడింటి స్వరూపమే ఈ ప్రపంచం"అని నిరూపించాడు.

చతురార్య సత్యములు :

బుద్ధుడు ఉపదేశించిన ఈ నాల్గు ఆర్య సత్యములు మానవుని అతని స్వయంకృషి చేతనే లక్ష్య సిద్ధిని పొందేటట్లు చేస్తాయి. మొదటి సత్యము

"జీవితమంతా, బాధలతో, అసంతృప్తితో, రోగాలతోకూడి ఉండి సంతో షాన్ని పొందలేక పోవటంచేత దుఃఖమయమై ఉంది" అనేది. రెండవది "స్వార్థముతో కూడిన కోరికలే, ఆ దుఃఖానికి కారణము" అనేది. మూడవది "ఆ కోరికలు నశింపచేస్తే దుఃఖముకూడా నశించి పోతుంది"అనేది. నాల్గవది "బుద్ధుడు ఉపదేశించిన మధ్యమ మార్గాన్ని అవలంబించి పవిత్ర జీవనం గడిపితే లక్ష్యసిద్ధి కలుగుతుంది" అనేది.

మధ్యమ మార్గము :- "ఒకవైపు విషయవాంఛలను తీర్చుకోవ డానికి కేవలము ప్రాపంచిక దృష్టి కలవాళ్ళు బొత్తిగా లాభంలేని, యోగ్యం కాని తుచ్ఛ, వ్యర్థ ప్రయత్నాలు చేస్తూ ఉండటం, మరొకవైపు సాధకులు కఠోర ఉపవాసాలతో దేహాన్ని కృశింప చేసుకొంటూ బాధాకరమైన తపస్సు చేస్తూ ఉండటం గాక, ఈ రెండు అతివాద మార్గాలనూ త్రోసిపుచ్చి, మధ్యమమార్గంలో పయనిస్తే అది నిర్వాణాన్ని చేరుకునేటట్లు చేస్తుం"దని బుద్ధుడు చెప్పాడు. దాన్ని పొందటానికి అష్టాంగ మార్గాన్ని సూచించాడు. అదే బుద్ధుని ధర్మమార్గము.

అష్టాంగమార్గము :

1) సమదృష్టి 2) సమ సంకల్పం 3) సమవాక్కు 4) సమ కర్మ 5) సమ ఆర్జన 6) సమ వ్యాయామం 7) సమశక్తి 8) సమ సమాధి వీటిని అష్టాంగ మార్గం అంటారు. ఇవి సాధించాలని ప్రయ త్నించే వాడికి 1) అత్యాశ 2) దుర్బుద్ధి 3) జడత్వం 5) అనిశ్చి తత్వం అనే అవరోధాలు ఎదురౌతవి. వాటిని తొలగించుకోవాలి.

పంచశీల :

"బౌద్ధధర్మాన్ని పాటించేవాడు ముఖ్యంగా ఐదు సూత్రాలను పాటించి శీలవంతుడు కావా"లని బుద్ధుడు చెప్పాడు-అవి 1) అహింస 2) దొంగ తనం చేయకుండటం 3) ఇంద్రియములకు దాసుడు కాకుండటం 4) అసత్యమాడకుండా ఉండటం 5) మద్యపానము, చేయకుండా ఉండటం,

బుద్ధునిపదిఆజ్ఞలు :

1) అహింస 2) సత్యం 3) దొంగతనం చేయకుండటం 4) వ్యభిచారం చేయకుండటం 5) ఇతరులను గురించి, చెడుగా మాట్లాడకుండా ఉండటం 6) ఇతరులను తప్పుపట్ట కుండా ఉండటం 7) అసభ్యంగా మాట్లాడకుండాఉండటం 8) దురాశలేకుండా ఉండటం 9)ఇతరులను ద్వేషించకుండా ఉండటం 10) అజ్ఞానాన్ని లోకంలో నిర్మూలింపచేయటం అనేవి బుద్ధుడి పది ఆజ్ఞలు. వీటిని పారమితలంటారు. బుద్ధుడు బోధించిన ఈ శీలపథం మధ్యేమార్గాన్ని అవలంబించటాన్ని సులభతరం చేస్తుంది. నిర్వాణం శ్రీఘంగా ప్రాప్తింప చేస్తుంది.

ఆత్మ-పునర్జన్మ :

బౌద్ధధర్మంలోని కర్మ సిద్ధాంతం వేదధర్మంలోని కర్మసిద్ధాంతానికి పూర్తిగా విరుద్ధమైంది. వేదధర్మంలో కర్మ ఆత్మ ప్రాతిపదికపై ఉంటుంది. బౌద్ధంలో అట్లా ఉండదు. దేహం నశించినా ఆత్మకుచావు లేదంటుంది హైందవ ధర్మం. బౌద్ధ సిద్ధాంతం ప్రకారం ఒక మనిషిచేసే కర్మవల్ల రెండు రకాలైన పర్యవసానాలు కలుతున్నాయి. ఒకటి కర్మకర్తను ప్రభావితం చేస్తుంది. మనిషి చేసేప్రతికర్మ అతని ఆత్మమీదప్రభావాన్ని చూపిస్తుంది. మరణానంతరం అతడు చేసిన కర్మ ఫలాలు అతని ఆత్మనుచుట్టుకొంటాయి. ఆ కర్మఫలాలే మనిషి తరువాతి జన్మనూ సుఖదుఃఖాలనూ నిర్ణయిస్తాయి. ఈ హిందూ కర్మ సిద్ధాంతం ఆత్మరాహిత్య బౌద్ధ సిద్ధాంతంతో విభేదిస్తుంది.

విశ్వమంతా కర్మసిద్ధాంతంపై ఆధారపడి కార్యకారణ సంబంధం గల గొప్ప సూత్రంగా బౌద్ధులకు కన్పిస్తుంది. విత్తనాన్నిబట్టి ఫలమని ఈకర్మ సిద్ధాంతానికి బుద్ధుడు చాలా ప్రాధాన్యమిచ్చాడు. ఈ సిద్ధాంతం నైతిక బోధలకు చాలా సాయపడుతుంది. చెడుపనిచేస్తే ఇప్పుడో, మరొకప్పుడో చెడు ఫలాన్ని అనుభవించ వలసి వస్తుంది. కాబట్టి మనం మంచినే కోరుకుంటూ మంచినే చెయ్యాలి. మానసిక ప్రపంచంలో మానవుని స్వభావం అతనికి కతిగిన భావనా పరంపరల సమూహామే! అంతేకాదు అతని స్వభావంపైనే,

అతడుచేసేపని ఆధారపడి ఉంటుంది. అందువల్ల చెడ్డభావనలకు మనస్సు తావివ్వరాదు. భగవంతుడే మన సుఖదుఃఖాలకు కారకుడని భావి రాదు. మన భవిష్యత్తును దిద్దుకోవటం మన చేతుల్లోనేఉంది. మన ప్రవ నను క్రమబద్ధం చేసుకోవడానికి ఈసిద్ధాంతం ఎంతగానో తోడ్పడుతుంది.

ఈ కర్మఫలంగానే పునర్జన్మ కలుగుతుంది. హిందూ ధర ఆత్మయే మరోదేహాన్ని ధరిస్తున్నదని చెబుతుంటే బౌద్ధం దాన్ని తిర రిస్తున్నది. బుద్ధుని సిద్ధాంతం ప్రకారం పృథ్వి, అగ్ని, తేజ వాయువు అనే నాలుగు ధాతువులవల్ల శరీరం ఏర్పడుతున్నది. మానవ శరీ మరణిస్తే ఆ ధాతువులు విశ్వాంతరాళంలో తేలియాడుతున్న ఆ ధాతువ కలిసిపోతాయి. ఆ ధాతు పుంజంలోని నాలుగు ధాతువులు తిరిగి క నప్పుడు ఒక కొత్త జన్మ ఏర్పడుతుంది. ఆ నాలుగు ధాతువులు చనిపో ఒక దేహంనుండి వచ్చినవే కానక్కరలేదు. అవి ఏ దేహంనుంచైనా వ కలియవచ్చు. మరణించిన పలువురు మనుష్యులలోని ధాతువుల మిశ్రవ వల్ల ఒక కొత్తదేహం రూపొందితే అదీ పునర్జన్మే కానీ మరణించిన మనిషి ఆ పునర్జన్మ అనటానికి వీలులేదు, మరణమన్నది ఈ జన్మకూ పునర్జన్మకు మధ్యనున్న విశ్రాంతివంటిది. రెండు దినాలకు మధ్యగల నిద్రగా మ దాన్ని భావించవచ్చు. మనం పొద్దున్నే నిద్రలేచి క్రిందటి రోజులాగే నిత కృత్యాలను నిర్వర్తించుకొంటున్నాం. అట్లాగే పునర్జన్మలోకూడా క్రింద జన్మలోని అనుభవాలూ, సంస్కారాలూ, అన్నీ కూడగట్టుకొని మన మ ఫలకంపై మనకు కనిపించని వ్రాతలో వ్రాయబడి ఉంటాయి. దాన్నే మన "తలరాత" అంటున్నాం. క్రిందటి జన్మ అనుభవం ఈ జన్మలో తప్ప పడుతుంది. "పతిచ్చ సముప్పదం" ఈ విషయాన్నే ధృవపరుస్తున్న "మనం పూర్వజన్మను మరచిపోవటానికి కారణం జ్ఞాపకాలను కలిగిం మేధస్సు ప్రతి జన్మలోనూ క్రొత్తగా సృష్టించబడుతూ ఉండడమే" అ అంటాడు బుద్ధుడు. "పూర్వజన్మ పరకాయప్రవేశంకాదు" అంటుంది బౌద్ధం ఒక మనిషి ఒక దీపంతో మరొక దీపాన్ని వెలిగిస్తే ఆ దీపం మరో దీప లోనికి ప్రవేశించిందని ఎట్లా చెప్పగలం ? అంటుం దది.

నిర్వాణం (నిబ్బానం) :

బుద్ధుడుడు బోధించిన పరమలక్ష్యం నిర్వాణం. నిర్వాణమంటే వికారం మంచి విముక్తి. కోరికలన్నీ నశించిన తర్వాత, దుఃఖ నిర్మూలనము శాశ్వతముగా జరిగిన స్థితి. బౌద్ధాచార్యుడైననాగసేనుడు "చిత్తవృత్తి నిరోధక దశ", "భావ నిరోధకదశ" అని దీన్ని వర్ణించాడు. ఈ స్థితిలో దుఃఖానికిగానీ, అశాశ్వతత్వమునకుగానీ, పరస్పరం ఒకరిపై ఒకరు ఆధారపడటానికి గానీ తావులేదు.

"దేవుని పూజలు, ఉపాసనలు వ్యర్థము. అవి దైవము మీద నమ్మకంతో, పాపభీతిని కల్పించి, సత్కర్మాచరణకు ప్రేరేపించి, మానసిక పరిణామ వికాసం తేవడంకోసం ఏర్పడ్డవి. మానసిక వికాసంలేని (చిత్తశుద్ధిలేని) పూజలు వ్యర్థం. ఒక నది ఉప్పొంగి ప్రవహిస్తున్నప్పుడు ఒకడు ఇవతల గట్టున నిలచి అవతలి గట్టును "ఇక్కడికిరా !" అంటే అది వస్తుందా ? అట్లాగే మంత్రాలు వల్లిస్తూ "ఇంద్రా దయచెయ్యి ! బ్రహ్మ ! దయచెయ్యి ! ప్రజాపతీ ! దయ చెయ్యి !" అంటే కేవలం ఈ ప్రార్థనలు, స్తోత్రాలద్వారా మోక్షం ప్రాప్తిస్తుందా ? నిర్వాణ ప్రాప్తే మోక్షప్రాప్తి" అని బోధిస్తాడు బుద్ధుడు. అది యదార్థమే ననిపిస్తుంది. విషయవాంఛలకు దూరమై, ఇంద్రియ నిగ్రహంతో మనస్సును స్వాధీనం చేసుకొని చేసే ధ్యానంవల్లా, అనుష్ఠించే యోగంవల్లా నిర్వాణం (మోక్షం) సిద్ధిస్తుంది. కానీ పూజలు, కర్మలువల్ల మోక్షంరాదు. సుఖమయమైన పునర్జన్మ కలుగుతుంది.

త్రిరత్నములు – భిక్షువులలోని రకాలు :-

బౌద్ధమతంలోని బిక్షువులు (సన్యాసదీక్ష తీసుకొన్నవారు) ఉపాసకులు (సామాన్య బౌద్ధులు) అనురెండు తరగతులు ఉన్నవి. ఉపాసకులు సంఘములో సభ్యులుకారు. బౌద్ధబిక్షువైన ప్రతివాడూ ముందుగా పరివ్రాజకుడై ఉండాలి. పరివ్రాజకవ్యవస్థ బిక్షువుల సంఘంకంటే ప్రాచీనమైంది. బిక్షువుల సంఘాన్నే సంఘమంటారు. సంఘంలో కులానికితావులేదు. బుద్ధంశరణంగచ్ఛామి, ధర్మం శరణంగచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి అనేవి త్రిశరణాలు (త్రిరత్నాలు)

నిర్వాణ ధర్మాన్నీ, ఆ ధర్మాన్ని తెలుసుకొని లోకానికి తెలియజెప్పిన బుద్ధుణ్ణీ (బుద్ధులనా – మహాపరి నిర్వాణం సాధించిన వారందరూ బుద్ధులే)! ఆ ధర్మాన్ని ఆచరించి, అనుభవంలోకి తెచ్చుకొంటున్న భిక్షు సంఘాన్నీ త్రిరత్నములంటారు. ఈ త్రిశరణములతోపాటు 1) హత్య, దొంగతనం నుండి దూరంగా ఉండటం, 2) బ్రహ్మచర్యం పాటించటం 3) అబద్ధ మాడకుండా ఉండటం, 4) మద్యపానం చేయకుండటం, 5) అకాల బోజనం చేయకుండా ఉండటం, 6) అసభ్య అవినీతికర చర్యలకు పాల్పడకుండటం 7) భూషణాలు ధరించకుండటం, 8) అలంకరణలు చేసుకొనకపోవటం, 9) ఆడంబరాలనుండి దూరంగా ఉండటం, 10) బంగారం, వెండి యెడల అపేక్ష కలగకుండటం అనే పది ధర్మసూత్రాలు ఆచరించడంవల్ల ఇరవై సంవత్సరముల లోపలి వయసున్నవారు "శ్రమణేరులు" అవుతారు. వాళ్ళ సంఘాన్ని ఎప్పుడైనా వదలిపోయి సామాన్య బౌద్ధుడిగా ఉండవచ్చు. శ్రమణేరుడు పరివ్రాజక దశపొంది, ఆ తర్వాత ఉపసంపద దశ పొంది తర్వాత బిక్షువు అవుతాడు.

**బోధిసత్వుడు - బుద్ధుడు :**

బోధిసత్వుడు, బుద్ధుడు అనే పేర్లు సమానార్థకాలు కావు. బుద్ధుడు కాగోరే వ్యక్తి బోధిసత్వుడు. బోధిసత్వుడైనవాడు వరుసగా పదిజన్మలపాటు బోధిసత్వునిగా ఉండాలి. బుద్ధత్వం పొందే అర్హత క్రమక్రమంగా ఆజన్మల్లో సంపాదించి, పదవజన్మలో బుద్ధుడై (పదిశక్తులుపొంది) అనంత దివ్యదృష్టిని పొందుతాడు. బోధిసత్వుడు దశలవారీగా, ఈ పది శక్తులనూ పొందటమే కాకుండా ఈ పదింటిలో సంపూర్ణత్వం సిద్ధించేవరకూ సాధన చెయ్యాలి.

మొదటి జన్మలో బోధిసత్వుడు "ముదిత" ఆనందం పొందుతాడు. దుష్ట భావాలు తొలిగి మనస్సు నిర్మలమౌతుంది. ప్రశాంత చిత్తుడౌతాడు. అప్పుడు అందరికీ మేలు చెయ్యాలనే కోరిక అతడిలో కలుగుతుంది. రెండవ జన్మలో "విమల"ను పొందుతాడు అతనిలో కామపరమైన ఆలోచనలు తొలగిపోతాయి. అందరిపట్ల దయగలవాడవుతాడు. మూడవ జన్మలో

"ప్రభాకరి'' తేజస్సు సంపాదిస్తాడు. పరిపూర్ణ జ్ఞానంతో ఉంటాడు. దేనినైనా త్యాగం చేయటానికి సంసిద్ధమౌతాడు. నాలుగవ జన్మలో ''అర్చిష్మతి'' సాధిస్తాడు ఈ జన్మలో అతడు అష్టాంగమార్గంపై మనస్సు నిలుపుతాడు. ఐదవ జన్మలో ''సుదుర్జయ'' అజేయ స్థితిని పొందుతాడు. నిరపేక్ష సాపేక్షలమధ్యగల సంబంధం ఈ జన్మలో పూర్తిగా అర్థమౌతుంది. ఆరవజన్మలో ''అభిముఖి''గా మారతాడు ఈ జ్ఞానంవల్ల అందరిపట్ల అమిత దయ ఏర్పడుతుంది. ఏడవజన్మలో ''దూరంగమ''గా మారతాడు. విషయవాంఛ లేవీ అతణ్ణి అంటుకోవు. అందరి కోర్కెలను తీర్చే సామర్థ్యం పొందుతాడు. పరమ శాంతిమూర్తిగా ఉంటాడు. ఎనిమిదవ జన్మలో ''అచలు'' డవుతాడు. మంచినే అనుసరిస్తాడు. అన్ని కార్యాలలోనూ విజయం సాధిస్తాడు. తొమ్మిదవజన్మలో ''సాధుమతి'' అవుతాడు. సకలధర్మాలు, శాస్త్రాలు కరతలామలకమౌతాయి. పదవ జన్మలో ''ధర్మమేఘు''నిగా మారతాడు. అనంతమైన దివ్యదృష్టిని పొందుతాడు బుద్ధుడుగా అతడు మారిన తరువాత దశలవారిగా సంక్రమించిన పది శక్తులూ అతడికి ఉంటాయి. బుద్ధుడైన తర్వాత ఇక జన్మ అంటూ ఉండదు.

## బుద్ధుడు నాస్తికుడా ?

బుద్ధుడు నాస్తికుడనటం కన్నా హేతువాది అనటం సబబు. హేతువాదులంతా నాస్తికులు కాదు. ఆత్మనూ, కర్మ సిద్ధాంతాన్నీ, పునర్జన్మనూ, భగవంతుణ్ణీ నమ్మనివాడు నాస్తికుడు. బుద్ధుడు వేదాలను, ప్రమాణంగా గ్రహించనంత మాత్రాన నాస్తికుడనటం భావ్య మనిపించుకోదు. భూలోకం పైన వేరే లోకాలున్నాయనీ; దేవతలున్నారనీ, స్వర్గనరకాలున్నాయనీ, బుద్ధుడు చెప్పాడు. సమ్యక్ సంబుద్ధి ప్రాప్తించిన తర్వాత బ్రహ్మలోకం నుండి బ్రహ్మసహాంపతి ఆయన దగ్గరకు వచ్చాడనీ, తనభార్యపై ప్రేమను వదలలేని నందుణ్ణి తన మంత్ర శక్తితో బుద్ధుడు స్వర్గానికి తీసుకపోయి అక్కడి అప్సరసలను చూపించాడనీ ఇట్లా బౌద్ధ వాఙ్మయంలో పలుచోట్ల దేవతల ప్రస్తావన కనిపిస్తుంది. "మిళింద పన్హ" అనే గ్రంథంలో బౌద్ధంలోని మంత్ర విషయాల ప్రస్తావనఉంది. ఒకసారి హుయన్‌త్సాంగ్ గోబీ ఎడారిలో

నుంచి పోతుంటే అతణ్ణి పిశాచాలు చుట్టుముట్టి బెదిరిస్తుంటే అప్పుడు వాటి నుంచి విముక్తి కోసం కొన్ని మంత్రాలు ఆయన చదివాడట! అవి ఆయన్ను వదలివెళ్ళక పోయేసరికి ఇక లాభం లేదని "గతే గతే పారగతే పారసంగతే బోధిస్వాహా" అనే బ్రహ్మాస్త్రంలాంటి ప్రజ్ఞాపారమిత మంత్రాన్ని ఆయన చదివాడట. అప్పుడవి పారిపోయాయట! బోధిసత్వుడైన అవలోకితేశ్వరుడు లోకానికి సదయుడై ప్రసాదించిన "ఓంమణి పద్మేహుం" అనే మంత్రం టిబెట్టులో ఇప్పుడు బహుళ ప్రచారంలో ఉంది. నాగార్జునాచార్యా మహాయానం, నాగసేనాచార్యుల మిళిందపన్హ (శ్రావకయానం) గ్రంథాలలో ఈ మంత్రాల విషయం చెప్పబడింది. బుద్ధుడు ఆత్మను ఒప్పుకో లేదనటం కన్నా ఉపేక్షించాడనటం సబబు. అట్లాగే దేవుడి విషయం కూడా. "దేవుడున్నాడా? లేడా?" అన్న మీమాంసతో కాలంవృథా చేసేదానికంటే "మానవుడికీ సాటిమానవుడికే మధ్య ఏలాంటిసంబంధా లుండా? అన్నదే మతం పరమార్థం కావా"లని బుద్ధుడంటాడు. మానవుల మధ్య సత్సంబంధాలుంటే తద్వారా లోకం సుఖశాంతులతో తులతూగుతుంది కదామరి! "బుద్ధుడు "దేవుడున్నాడా?" అనేవాదాన్నిఎందుకు త్రోసిపుచ్చాడంటేదానికి ఒకముఖ్యకారణంఉంది. దేవుడి పేరుతోజరిగేపూజాపునస్కారాలవల్ల(మూఢాచారాలవల్ల)మానవునిలోసదావగాహన లోపిస్తుంది. బుద్ధుని బోధకు (అష్టాంగమార్గానికి) సదవగాహన ఎంతో ముఖ్యం. అందువల్ల బుద్ధుడిదృష్టిలో దేవునిపై నమ్మకం చాలా ప్రమాదకరమైంది. ఎందుకంటే దేవుడున్నాడనుకొంటే పూజలూ, క్రతువులూ తప్పవు. అవి ఆచరించేందుకూ పూజారి అవసరం తప్పదు. ఈ పూజారి తెలివి చాలా కుటిలమైంది. అతడు మూఢాచారాలనూ మూడనమ్మకాలనూ ప్రోత్సహించి మానవునిలో సమ్మాదిత్తి (సమదృష్టి) ఏర్పడకుండాచేస్తాడు. కాలం, ప్రకృతి, అవకాశం, దేవుళ్ళు, అదృష్టం, అవసరంలాంటి వాటికి వశమైతే మానవుడు కీలు బొమ్మ అవుతాడు. మానవుల మేధాశక్తి వమ్మైపోతుంది. కాబట్టి ప్రకృతికతీతమైన వాటిని నమ్మటం ధర్మం కాదంటాడు బుద్ధుడు. మానవుణ్ణి హేతువాద దృక్పథంవైపు నడిపించటం, సత్యాన్వేషణవైపు స్వేచ్ఛగా పయనింపచేయడం, మూఢనమ్మకాలను అనుసరించడంద్వారా అన్వేషణాశక్తిని కోల్పో

తాడు కాబట్టిమూఢనమ్మకాలకుఅతణ్ణిదూరంగా ఉంచటంమంచిదనుకొన్నాడు. దీన్నే కర్మసిద్ధాంతం లేదా కార్యకారణసిద్ధాంతంగా ఆయనపేర్కొన్నాడు. బౌద్ధ మతంలో ఈ కార్యకారణ సిద్ధాంతం అత్యంతప్రధానమైంది. ఈసిద్ధాంత ప్రకారం "దేవుణ్ణినమ్మడం బౌద్ధధర్మంలో భాగంకాదు. ఆత్మఅనేది ఉన్నదని నమ్మడం ధర్మంలో భాగంకాదు. ఊహాజనితమైనవాటినినమ్మడం ధర్మంలో భాగంకాదు. ధార్మికగ్రంధాల పఠనమే ధర్మంలో భాగంకాదు."అని వాటిని ఉపేక్షించాడు. మనసులోని మాలిన్యాలను క్షాళనంచెయ్యడమే సద్ధర్మమని, మానవుని సత్ప్రవర్తనానికి ప్రథమస్థానమిచ్చాడు బుద్ధుడు. "మతం ధ్యేయం ఊహాజనితమైన స్వర్గానికి చేరుకోవడం కాదు. స్వర్గం భూమిపైనే ఉంది. మానవుడు. సద్ధర్మ వర్తనుడైనప్పుడు భూమి స్వర్గమౌతుం"దని బుద్ధుడు చెప్పాడు. బుద్ధుడు బోధించిన దానికి ఇతరమతాలకుగల ముఖ్యభేదం ఇదే"! మానవులు సత్ప్రవర్తనా శీలురు కావాలన్న ఆశయంతోనే బుద్ధుడు అష్టాంగ మార్గం, పారమితలు ప్రబోధించాడు.

## బౌద్ధమతం – దాని ప్రత్యేకత

బౌద్ధమతమునందు ఎటువంటి మూఢవిశ్వాసములులేవు. బౌద్ధమతానికి ఎటువంటి అపౌరుషేయములులైన గ్రంధాలులేవు. బుద్ధుడు భగవంతుడు కాడు. తానుదేవదూతననిగానీ, దేవునిపుత్రుడననిగానీ, దైవాంశసంభూతుణ్ణని గానీ ఎప్పుడూచెప్పలేదు. మానవుడుగా పుట్టి, మానవాతీతమైన దివ్యశక్తు లతో ప్రబలంగా ప్రయత్నించి తన లక్ష్యాన్ని సాధించాడు. లక్ష్యాన్ని సాధించిన తర్వాత స్వార్థంతో తనతోటి మానవులను మరచిపోక, తాను పొం దిన నిర్వాణ మార్గాన్నే మానవాళికి చూపాలని ప్రయత్నించాడు. అంధకార బంధురమైన లోకంలో జ్ఞానదీపాన్ని వెల్గించి ఆ కాంతితో సమస్త విశ్వాన్ని జాగృతం చేశాడు.

బుద్ధునిలో ప్రత్యేకత ఏమిటంటే ఆయన మానవునిలో అంతర్గతంగా ఉన్న శక్తిని దర్శించి, దాన్ని ఉద్బుద్ధం చెయ్యడానికి మార్గం చూపాడు. ఇట్లా ఏ అవతారమూర్తీ, ఏ ప్రవక్తాచెయ్యలేదు. మానవుని భావన సర్వతంత్ర

స్వతంత్రమైంది. అతడు ఆత్మాభివృద్ధి చేసుకోవడానికి కావలసినంత సమయం ఉంది. కార్యకారణ సంబంధసిద్ధాంతముచే జన్మజన్మాంతరములలో అతడు నేర్చుకోవలసిందినేర్చుకొంటునేఉన్నాడు.అతడిప్రయత్నం ఎంతత్వరగాసాగుతుందో అతని కర్మబంధమోచనంకూడా అంత త్వరగా జరుగుతుంది. ఆత్మ శక్తి అంటే ఇదే! ఈ శక్తిగలవాళ్ళు గాంభీర్యం, ఆత్మనిగ్రహం, నమ్మకం, దీక్ష, కలిగి నిస్స్వార్ధంతో సత్కార్యాలు చేస్తుంటారు. విశ్వమానవ కల్యాణానికై తమ జీవితాలను అర్పించి, స్వార్థత్యాగం చేసినవాళ్ళు ఊహాతీతమైన మానసిక ప్రశాంతిని పొందుతారు. అదే నిర్వాణం. దాన్ని ప్రతి మానవుడికి లభింప చేయాలనీ, ప్రతివ్యక్తినీ బుద్ధునిగా మార్చాలనీ బౌద్ధం ఆశిస్తుంది, ఇదే ఆ మతంయొక్క ప్రత్యేకత.

బౌద్ధమతం ఇంత విశిష్టమైంది, విలక్షణమైంది కాబట్టే దానిపై ఉన్న ఆదరాభిమానములతో, మళ్ళీ ఇంకోసారి బుద్ధునిఉపదేశాలతో జాతినిజాగృతం చెయ్యాలన్న సత్సంకల్పంతో శ్రీశ్రీశ్రీ హరిబాబు యోగిగారు ఈ బుద్ధగీతను వెలువరించారు. ఇది తెలుగువారి అదృష్టం. ఇంతవరకు ఏ భాషలోనూఇటువంటి అపురూపమైన గ్రంథం వెలువడియుండలేదు. ఈగ్రంథం ఆ యోగిగారి స్వతంత్ర సృష్టి. బౌద్ధమతం యొక్కవాడీ, వేడీ, జీవనాడీ బాగా తెలిసిన వారు కావటంచేత, ఆయన బౌద్ధం మనిషిప్రవర్తన కిచ్చినప్రాధాన్యతను గుర్తించి, నేటి సమాజాన్ని సంస్కరించాలన్న ధ్యేయంతో బుద్ధుడు చెప్పినట్లు ఈ గ్రంథాన్ని వ్రాశారు. ఆయన ఈ గ్రంథంలో బుద్ధునిద్వారా, చెప్పినవిషయాలు మౌలిక బౌద్ధధర్మాలు కావనీ, ఆది శంకరుల ప్రచ్ఛన్న బౌద్ధం తాలూకువనీ మనకు అర్థమౌతాయి. బుద్ధుడుఅక్కడక్కడ చెప్పినట్లు ఉటంకించిన శ్లోకాలు, అక్కడక్కడ యోగిగారు చేసిన వ్యాఖ్యానాలు ఇందుకు నిదర్శనం. అట్లాగని శ్రీహరిబాబు యోగిగారు బౌద్ధమతాన్నీ, ఆ ధర్మసిద్ధాంతాలనూ పూర్తిగా త్రోసిపుచ్చారనికాదు. పెక్కుచోట్ల వాటిని స్పృశిస్తూనే వచ్చారు. నాగార్జునుడి ద్వారా బౌద్ధమతానికి చెందిన అనేక విషయాలనూ, బుద్ధుని జీవితంలోని సంఘటనలనూ వివరించనే వివరించారు. అయితే స్థూలంగా మనకు అని

పించే దేమిటంటే "ఇది పూర్తిగా పూర్వం" బుద్ధుడు చేసిన ధర్మోపదేశం కాదనీ. [illegible]తికవిలువలు నశించిన నేటిమానవసమాజానికి ఇదిఒకమేల్కొల్పుగా వారుదీన్ని రచించారు. అని-ఇప్పటి పరిస్థితులకు ఈగ్రంథం అవసరం ఎంత గానో ఉంది. ఇప్పుడు కనక బుద్ధుడు మళ్ళీ అవతరించి ఉంటే ఇట్లాగే. ఉప దేశించేవాడేమో? ననిపిస్తుంది. అనాటి దేశ వాతావరణంవేరు. ఈనాటి వాతావరణంవేరు. అనాడు యజ్ఞయాగాలకూ, వేదవిహితకర్మ కాండకూ దేశంలో చాలా ప్రాముఖ్యం ఉంది. మండనమిశ్రుడులాంటి పూర్వమీమాంస కులను ఎందరినో ఎదుర్కొని - ప్రచ్ఛన్న బౌద్ధంగా పేరుగాంచిన మాయా వాదంతో-బౌద్ధాన్నిజయించి, శంకరాచార్యులవారు దాన్ని హిందూమతంలో విలీనంచేశారు. ఈనాడుబౌద్ధులుకాని బౌద్ధమతాభిమానులు హిందువుల్లోఉన్నా రంటే దానికికారణంభగవత్ శంకరాచార్యులే! దీన్ని మనం కాదనలేం.

శ్రీ హరిబాబుయోగి వ్రాసిన బుద్ధగీత ప్రతి ఒక్కటే కావటం, అదిచాలా సంవత్సరాల క్రితం వ్రాయబడి, కాగితాలు ముట్టుకుంటే చినిగి పోయేటట్లు ఉండటం, కొట్టివేతలతో, హంసపాదులతో,పునరుక్తాలతో, ఉదాహరణాత్మక మైన అనేక కథలతో ఉండటమేగాక, బుద్ధుని తర్వాత వచ్చిన క్రైస్తవ, ఇస్లాం మతాల చర్చలు కూడా ఉండటం, అన్నింటి కంటేముఖ్యంగా లేఖక దోషాలు ఉండటం ఈ మొదలైనవి గ్రంథ పరిష్కరణకు కొంచెం ఇబ్బంది పెట్టాయి. బౌద్ధనాగార్జునాచార్యులను ప్రవేశ పెట్టించి, ప్రతి అధ్యాయం ముందు బౌద్ధానికి సంబంధించిన కొన్ని విషయాలు ఆయనతో చెప్పిస్తే బౌద్ధాన్నిగూర్చిన కొంతసదవగాహన పాఠకలోకానికి కలుగుతుందన్న తలంపుతో ఈ గ్రంథ పరిష్కర్త శ్రీ శివగుప్త నాగార్జునాచార్యులను ప్రవేశ పెట్టటం జరిగింది.

నాగార్జునాచార్యుల వారి పేరు తెలిసినంతగా, ఆయన కాలాన్ని గురించిగానీ, ఆయన జీవితాన్ని గురించి వాస్తవాలు అంతగా మనకు తెలీవు. చరిత్రకారులలో విభిన్నాభిప్రాయా లున్నాయి. కొందరు ఆయన్ను ఆంధ్రు డంటే కొందరు కాదంటున్నారు. మహాయాన మత స్థాపనాచార్యుడిగా

బౌద్ధంలో ఆయనకు ఒక ప్రత్యేక స్థానముంది. ఆయన మహాయానం టిబెట్టులో చాలా ప్రాచుర్యం పొందింది. బుద్ధుడిమధ్యమమార్గానికి విపులమైన వ్యాఖ్యానం మహాయానం. పూర్వచరిత్రకారులు ఆయన క్రీ. పూ. 4వ శతాబ్దంవాడని పేర్కొంటుంటే ఆధునిక చరిత్రకారులు క్రీ. పూ. రెండవ శతాబ్ది మంటున్నారు. పాహియాన్, హుయాన్‌త్సాంగ్, అల్బరూని వ్రాతలు పట్టి చూస్తే, క్రీ. శ. 7వ శతాబ్దంగా తేలుతున్నది. శ్రీ గణనాథ సేన్ "నాగార్జునాచార్య నామధేయులు ముగ్గురు కనిపిస్తున్నారు. బౌద్ధాచార్యులలో ఒకడైన నాగార్జునుడు, కాశ్మీర్ రాజమంత్రులలో ఒకడైన నాగార్జునుడు, వైద్యాచార్యులలో ఒకడైన నాగార్జునుడు" అని అంటారు. మొదటి ఇద్దరూ వైద్యశాస్త్రంతో సంబంధం లేనివాళ్ళనీ – "సుశ్రుత ప్రతి సంస్కర్త" నాగార్జును"డేననీ, ఆయన ఉత్తర భారతదేశంలో పుట్టాడనీ ఆయన అభిప్రాయం. "History of Hindu Chemistry" (హిస్టరీ ఆఫ్ హిందూ కెమిస్ట్రీ) అనే గ్రంథంలో ఆయన జీవిత చిత్రణ ఒక చిత్రకథగా ఇవ్వబడింది.

విదర్భ దేశంలో ఒక సంపన్న బ్రాహ్మణుడుండేవాడు. అతడు సంతానం లేక బాధపడుతుంటే ఒకరోజు "నూర్గురు బ్రాహ్మణులకు భోజనం పెట్టి సత్కరించి, సంతుష్టులను చేస్తే సంతానం కలుగుతుంది" అని అశరీర వాణి వినిపించిందట! ఆ అశరీర వాణి చెప్పినట్లు అతడు చేశాడు. పుత్రుడు కలిగాడు. జ్యోతిష్కులు ఆ పిల్లవాడి జాతకాన్ని గుణించి వారంరోజులకంటే ఈ శిశువు జీవించ"డని చెప్పారు. "నూర్గురు బౌద్ధ బిక్షువులను అదరించి సంతృప్తి పరిస్తే ఏడేళ్ళవరకూ జీవిస్తాడు. ఆపై మరణం ఆపటానికి ఎవరికీ శక్యం కా"దని శాంతిప్రక్రియగా ఆ జ్యోతిష్కులు సూచిస్తే, అ పిల్లవాడి ముద్దు మురిపాలు కొన్ని సంవత్సరాల పాటైనా చూడవచ్చుగదా, అని అతడు ఆజ్యోతిష్కులు చెప్పినట్లుచేశాడట! ఆపిల్లవానికిఆరేళ్ళుగడిచాయి. తన పిల్లవాడికీ రానున్న మరణాన్ని చూడలేక ఆ తల్లిదండ్రులు ఆ పిల్లవాణ్ణి ఒక మహారణ్యంలో వదలిపెట్టి వచ్చారు. "అవలోకితేశ్వర ఖాతపాణి" అనే ఒక

బోధిసత్త్వుడు ఆ పిల్లవాణ్ణి చూచి. దివ్యదృష్టితో ఆ పిల్లవాడి గండాన్ని తెలుసుకొని "నలంద బౌద్ధవిహారానికి వెళ్ళు! అక్కడ నీవు ఉంటే గండం తప్పుతుంది"అని చెప్పి, ఆ పిల్లవాణ్ణి నలంద విశ్వవిద్యాలయంలో చేర్పించాడు. అక్కడ మఠాధిపతియైన "సరహాభద్రు"నివల్ల బుద్ధుని ప్రబోధం, గాథలువిని బౌద్ధమత దీక్ష స్వీకరించాడు. తర్వాత కొంతకాలానికి ఆ మఠానికి అధిపతియైనాడు. కొన్నేళ్ళు గడిచాయి. దేశంలో కరవుకాటకాలు ప్రబలి బిక్షువులకు బిక్ష దొరకక్క నానాబాధలు పడుతుంటే చూచి, "మఠాధిపతినైన నేను ఈ బాధ నెట్లా నివారించే"దని ఆలోచించసాగాడు. అప్పుడు "మహాసముద్ర మధ్యమునగల ఫలాన ద్వీపంలోని యోగీశ్వర్యుణ్ణి సందర్శిస్తే ఉపాయం దొరుకుతుం"దని ఆయనకు ధ్యానంలో స్ఫురించింది. మంత్రబద్ధములైన రెండు పత్రాలను తీసుకొని, వాటి సహాయంతో సముద్రం దాటి ఆ యోగిని దర్శించాడు. ఆ యోగి రసవిద్యను ఆయనకు బోధించాడు. స్వదేశానికి తిరిగివచ్చి, తాను నేర్చుకొన్న విద్యతో బంగారం తయారుచేసి కరవుబాధనుంచి బిక్షుకులకు విముక్తి కలిగించాడు. ఇదీ కథ! ఈ కథ కాశీ రామేశ్వర మజిలీలను మించిపోయింది. దీన్ని మనం విశ్వసించిననూ, విశ్వసించకపోయిననూ ఒకటిమాత్రం విశ్వసించక తప్పదు. అదేమిటంటే నాగార్జునుడు మొదట బ్రాహ్మణుడు. ఆ తర్వాత బౌద్ధమతాన్ని స్వీకరించాడు. రసశాస్త్ర నిష్ణాతుడు – వైదర్భ (బీహార్) జన్మస్థలం" అన్నది.

పై ముగ్గురు నాగార్జునులేగాక మనకు దత్తాత్రేయ శిష్యులుగా పేర్కొంటున్న నవనాథుల్లో మరొక నాగార్జునుడు కనిపిస్తున్నాడు. ఆయన చరిత్ర కూడా ఉపలభ్యమానం కావటం లేదు. పేరునుబట్టి ఆయనే ఈయన అని పొరబడే అవకాశం లేకపోలేదు – మొత్తానికి నాగార్జునాచార్యుడనంగానే, బౌద్ధం,వైద్యం, తంత్రం, రసవాదం, ఈలక్షణాలన్నీ మూర్తీభవించిన వ్యక్తి మనముందు సాక్షాత్కరిస్తాడు.

నలందనుంచి నాగార్జునుడు దక్షిణ భారతానికి వచ్చి ఆంధ్రదేశంలో స్థిరపడి ఉంటాడనటంలో ఎటువంటి విప్రతిపత్తి లేదు. ఆయన "సారహు"

డనే విద్వాంసుని శిష్యుడనీ "రాహులభద్రు"ని శిష్యుడనీ కొందరు చెబుతారు. ఆయనకు ఆంధ్రదేశీయుడైన "జయప్రభాచార్య"డనే ముఖ్యశిష్యుడున్నాడు. నాగార్జునాచార్యులు "భోజదేవు"డనే రాజును బౌద్ధంలోకి మార్చారు. యజ్ఞశ్రీ శాతవాహనుడి ఆస్థానంలో ఉన్నాడనీ, కనిష్కుని సమకాలికుడని విభిన్న వాదాలున్నాయి.

నాగార్జునుడు 1) లోహశాస్త్రం ("నాగార్జునో మునీంద్రః శశాసయల్లోహ శాస్త్ర మతిగహనమ్" — అని ఆ గ్రంథంలో చెప్పుకొన్నాడు) 2) రసరత్నాకరం (శాతవాహనుడికి నాగార్జునుడికి మధ్య జరిగిన సంవాదాత్మక గ్రంథం) 3) కచ్ఛపుట తంత్రం (22 పటలాలతో ఉన్న తాంత్రిక గ్రంథం ఇది శ్రీ ముక్త్యాల రాజాగారి అర్కరసాయన శాలయొక్క పుస్తక భాండారంలో ఉన్నట్లు తెలుస్తున్నది) అనే మూడు గ్రంథాలు వ్రాసినట్లు తెలుస్తున్నది. ఇవిగాక గర్గమునిచే రచించబడిన, పరీక్షిత్తు కుమారుడైన జనమేజయునకు చెప్పబడిన ఆదిశాస్త్రమునుండి సంగ్రహించబడిన "రతిశాస్త్రం (గద్యలో "ఇతి శ్రీ సిద్ధ నాగార్జున విరచితే రతిరమణాఖ్యో రతి శాస్త్రే) .... ఇత్యాదిగా చెప్పబడింది), "రసేంద్ర మంగళం" (కుమార్తెయైన సుమంగళి నుద్దేశించి వ్రాయబడింది. అసంపూర్ణగ్రంథం. నాలుగుఅధ్యాయాలు మాత్రమే లభించగా ఆయుర్వేద పరిషత్ విజయవాడవారు ముద్రించారు) మొదలైన గ్రంథాలు నాగార్జున కృతమని తెలుస్తున్నవి. ఈ గ్రంథాలు ఏ నాగార్జునాచార్యుడు రచించాడో తెలియదు. బౌద్ధ నాగార్జునుడి పేరనే చెలామణి అవుతున్నాయి. ఇంత ప్రఖ్యాతి వహించిన నాగార్జునాచార్యులవారిని గురించి విశేష పరిశోధన జరుగవలసిన అవశ్యకత ఎంతో ఉన్నది. బౌద్ధనాగార్జునుడు, ఆంధ్రుడే నన్న విషయము అప్పుడు బైటపడగలదు. కృష్ణా తీరంలో ఉన్న శ్రీపర్వతం ఈ సుప్రసిద్ధ బౌద్ధాచార్యుల పేరుమీదనే ఈనాడు నాగార్జున కొండగా పిలువబడుతున్నది. ఆంధ్రదేశంలో బౌద్ధమత వ్యాప్తికీ, విహార నిర్మాణాలకూ ఆయన చేసినకృషి ప్రస్తుత పాత్రమైంది. ఆంధ్రదేశంలో బౌద్ధమతానికి పట్టుగొమ్మగా నిలచిన బౌద్ధనాగార్జునుణ్ణి గ్రంథ ప్రారంభంలోనే కాకుండా, ప్రతి అధ్యాయ ప్రారంభంలోనూ ప్రవేశ పెట్టించి, ఆయనచేతకూడా కొంత

ప్రబోధంచేయుస్తేబావుంటుందని, అట్లాచేసి, శ్రీశివగుప్త గ్రంథానికి మెరుగులు దిద్దటం జరిగింది. కొన్ని పునరుక్తులున్న అంశాలు, ఎక్కువగా ఉన్న ఉదాహరణ కథలు తొలగించటం, అక్కడక్కడా లేఖక దోషాలు సవరించటం, ధ్యానయోగంలో బుద్ధుని ధ్యానపద్ధతి వివరించటం, ధర్మపథంలోని కొన్ని శ్లోకాలు బుద్ధగీతగా ప్రకటించటం, కరుణశ్రీగారి పద్యాలు స్వీకరించటం తుదిపలుకు చేర్చటం, అనేవి ముఖ్యంగా గ్రంథ పరిష్కరణలోని ముఖ్యాంశాలు. వీటివల్ల శ్రీ శివగుప్త గ్రంథానికి మెరుగులు పెట్టినట్లయింది.

దైవ సంపదయోగం, సృష్టి సంభవయోగం.... మొదలైన అధ్యాయాలు ఇరవై అయిదు ఉండేట్లు, శ్రీ హరిబాబు యోగి ఈ గ్రంథాన్ని రచించటం చూస్తే 24 అధ్యాయాలు, 24 ప్రకృతి తత్వాలకు, మిగిలిన అధ్యాయం జీవుడికి సంకేతంగా తీసుకొని ఈ బుద్ధగీత జీవుడికి మోక్షప్రాప్తి (నిర్వాణం) హేతువు కాగలదని భావించి అట్లా ఆయన వ్రాసినట్లు స్ఫురిస్తుంది. 25వ అధ్యాయమైన 'కాలజ్ఞాన యోగం' పాఠకుడిలో ఆలోచన రేకెత్తించేదిగా ఉంది. అందులో 2500 సంవత్సరాల తరువాత మళ్ళీబుద్ధుడు అవతరించి, కృష్ణాతీరంలో స్థూపాన్ని నెలకొల్పుతాడనీ, జనుల్లో సత్ప్రవర్తనను ప్రేరేపించి, మానవ సమైక్యతకు పాటుబడతాడనీ చెప్పిన విషయంచూస్తే అది శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీని గురించేనని మనకు స్ఫురించకమానదు.

ఈ గ్రంథం బుద్ధునకు అంకితం చేయబడింది. బుద్ధుడు అంటే మనం భావిస్తున్న గౌతమ బుద్ధుడు మాత్రమే బుద్ధుడు కాదు. చాలామంది బుద్ధులున్నారు. ఈ గ్రంథం బుద్ధునికి అంకితం ఇవ్వబడిందంటే బుద్ధులైన వాళ్ళకందరికీ ఇది అంకితమివ్వ బడిందన్నమాట. బుద్ధి (జ్ఞానం, నిర్వాణం) ప్రాప్తించిన వాళ్ళంతా బుద్ధులేనన్న బౌద్ధవిశ్వాసాన్ని బట్టిచూస్తే దత్తాత్రేయుడు జ్ఞాన స్వరూపం కాబట్టి ఆయన బుద్ధుడే అవుతాడు. జ్ఞాన స్వరూపులంతా (సద్గురువులందరూ) దత్త స్వరూపులే నన్న దత్తసంప్రదాయంప్రకారం చూస్తే బుద్ధుడు దత్తుడౌతాడు. అంటే బుద్ధత్వాన్ని దత్తంచేసుకున్న వాళ్ళంతా బుద్ధులే. అటువంటప్పుడు బుద్ధుడికీ దత్తుడికీ భేదం ఏముంది! ఇద్దరూ యోగులే! యోగంలో ఆత్మోపాసనే కానీ సగుణోపాసన ఉండదు. యోగం

తోని ధ్యానానికి మనస్సు స్థిరపడాలంటే సత్ప్రవర్తన సాధకుడికి ఎంతో అవసరం. కనుకనే యోగులు ప్రవర్తనకు ప్రాధాన్యమిస్తారు. సమాజాన్నీ, వ్యక్తినీ సంస్కరించి, అర్హత కలిగించాలని తాపత్రయపడతారు. ఈనాడు శ్రీ విశ్వయోగి విశ్వంజీ చేస్తున్నపనికూడా ఇదే! అప్పుడుగాక ఇప్పుడు బుద్ధుడు అవనిపై అవతరించి ఉంటే అచ్చం విశ్వయోగి లాగానే ప్రబోధిస్తూ ఉండేవాడు. సందేహంలేదు. బుద్ధునకు ఈ గ్రంధం అంకితమివ్వాలని శ్రీ హరిబాబు యోగి చెప్పినట్లు ఆయన శిష్యులకు దృష్టాంతమైంది. శ్రీ శివగుప్తకు సమ్యక్ సంబుద్ధుడైన శ్రీ విశ్వయోగి విశ్వంజీకి అంకిత మీయాలనే ప్రేరణ కలిగింది. దాన్ని హరిబాబు మహారాజే కలిగించారనీ, అట్లా చెయ్యడానికే ఈ గ్రంధాన్ని తన దగ్గరకు పంపించారనీ ఆయనకు అనిపించింది. కరుణశీలాగ్ర శ్రీ విశ్వయోగివిశ్వంజీలో బుద్ధుణి సంగర్శించిన మా శివగుప్తను చూస్తుంటే ఆయన అచిరకాలంలోనే శివయోగిగా పరిణామంచెందే సూచనలు నాకు కన్పిస్తునాయి. విశ్వంజీలో బుద్ధుని అంశ ఉందన్నవిషయం కనిపెట్టటం మామూలువిషయం కాదు. జడ్చర్లలో ప్రధమపర్యాయం వారిగురువుగారు ఇంటికివచ్చిన సమయంలో, వారి పాద సన్నిధిలో కూచున్నప్పుడు ఆయన సమాధి స్థితిలోకి పోయారనీ, బుద్ధదర్శనం అయిందనీ 'విశ్వగురుచరిత్ర' లో వెల్లడించబడింది. బుద్ధునిలాగానే ఆయన మనిషి ప్రవర్తనకు ప్రాధాన్యమివ్వటం, ఆయన ఉపన్యాసాల్లో మనం గమనిస్తున్న విషయమే! ఆయన విహారస్థలియైన "విశ్వనగర్" లో స్థూపనిర్మాణం చెయ్యటం, బుద్ధవిగ్రహాన్ని ప్రతిష్ఠించటం ఆయనలోని బుద్ధుని అంశను వ్యక్తీకరిస్తున్నవి. శ్రీ హరిబాబు యోగిగారికి ఈ విషయం తెలుసు కాబట్టి ఆయన శివగుప్తకు ఆ ప్రేరణ కలిగించాడు. అయితే శ్రీహరిబాబు యోగిశిష్యులకోరికమేరకు ఈగ్రంధాన్ని బుద్ధుడికి ఆయన అంకిత మిచ్చాడు. ఆయన దృష్టిలో శ్రీ విశ్వయోగి విశ్వంజీయే సమ్యక్ సంబుద్ధుడు. ఈ గ్రంథం బుద్ధుడికి అంకిత మవ్వట మంటే ఆయన దృష్టిలో ఇది శ్రీ విశ్వయోగి విశ్వంజీకి అంకిత మిచ్చినట్లే! ఇది ఆయన యోగదర్శనానికి పరమ నిదర్శనం. శ్రీహరిబాబుయోగిగారి శిష్యులు తమపై విశ్వాసంతో పెట్టినభారాన్ని,బాధ్యతతోవహించి, అవిశ్రాంతంగా పట్టుదలతో కృషి

చేసి, గ్రంథాన్ని పరిష్కరించి, శ్రీబుద్ధగీతను ధగధగలాడించిన మాశివగుప్తను అభినందిస్తున్నాను.

బౌద్ధమతానికి సంబంధించిన మౌలికాంశాలు కొన్ని పాఠకలోకానికి వెల్లడిస్తే ఈ గ్రంథాన్ని అర్థంచేసుకోవడం సులభతరమౌతుందన్న ఉద్దేశ్యంతో వాటిని ఈ ప్రవేశికలో వివరించటం జరిగింది. అందుకు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టరు పేర్వారం జగన్నాథం సంపాదకత్వంతో వెలువడిన "బుద్ధుడు మరియు అతని ధమ్మం", ఆయుర్వేద విజ్ఞాన భవనం, విజయవాడ వారు 1968 లో ప్రచురించిన ఆయుర్వేద మాస పత్రికల్లోని కీ. శే. వల్లూరు సుబ్బారావుగారి నాగార్జున వ్యాసాలు ఎంతగానో తోడ్పడ్డాయి. ఆయా గ్రంథాల రచయితలకూ, ప్రచురణ కర్తలకూ కృతజ్ఞతలు వెల్లడిస్తున్నాను.

ఆంధ్ర పాఠకలోకం ఈ గ్రంథాన్ని సమాదరించి, బుద్ధుడి గీతామృతాన్ని తుష్టిగా పానంజేసి, 'సత్ప్రవర్తనా శీలమై, కులమతాలకు అతీతంగా. సర్వమత సమ్మతమైన ప్రేమమతమే తన మతంగా, మానవకులమే తనకులంగా, భావిస్తూ, విశ్వకల్యాణానికి స్వాగత గీతులు పలుకగలదని సంభావిస్తున్నాను

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

గుంటూరు
5-5-95

"సరస సాహితీ చరణచారణచక్రవర్తి"
జి. వి. యస్. ఎన్. విద్యాసాగరశర్మ, M.A.,
(రిటైర్డ్ ప్రభుత్వ డిగ్రీకళాశాల ప్రిన్సిపాల్)

# యోగాభినందనలు

పుట్టుకతో బుద్ధత్వం కలిగియున్న శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త గారు శ్రీ హరిబాబు యోగికృత బుద్ధగీతకు పరిష్కరణ కర్తలై ఈ గ్రంథాన్ని వెలువరించడం సముచితంగా ఉన్నది. బుద్ధగీత మామూలు గ్రంథముకాదు. విలక్షణమైన యోగ గ్రంథము. సిద్ధార్థుడు తాను బుద్ధుడగుటతో సంతృప్తి పడక, తాను తెలుసుకొన్న సత్యమును లోకమునకు ఎరుకపరచి, లోకము నంతటిని నిర్వాణస్థితి పొందునట్లు చేయవలయునని ఆకాంక్షించిన మహాత్ముడు. ఇంతటి నిస్వార్థహృదయుడు కనుకనే విశ్వయోగియైనాడు. యోగము నభ్యసించుటకు వలసిన మనః స్థితి సాధించుటకు, సత్ప్రవర్తన ముఖ్యము. ఆ ప్రవర్తనా విధానమంతయు 25 అధ్యాయములుగా ఈ గీతలో ఆయన బోధించుటతో సంతృప్తిపడక, 'ప్రవర్తనా యోగము" రెండు అధ్యాయములలో ఆయన వివరించుట జరిగింది. ఈ గ్రంథము సర్వులు పఠించి, ఉత్తమ స్థితి నందుకొనుటకు ఎంతయో ఉపకరించుచున్నది.

శ్రీ హరిబాబు యోగిగారు ప్రస్తుత ప్రపంచములో ప్రతి ప్రాణి అనుభవించుచున్న మానసిక వత్తుడులను తొలగించగల ఏకైక ఉపకరణమైన ధ్యానమునుగూర్చి ప్రత్యేక అధ్యాయముగా, ఆచరణ యోగ్యముగా రచించినారు. ఆ అధ్యాయమునకు శ్రీ గుప్తగారు మెరుగుపెట్టిన విధము ప్రసంశనీయము. ప్రస్తుత మానవాళిని పీడించుచున్న మానసిక వ్యాధుల నిర్మూలనకు ఈ గ్రంథము వజ్రాయుధముగా పేర్కొనవచ్చును.

సిద్ధార్థుడు, బుద్ధుడుగా మారి మహా శక్తివంతుడగుటకు తోడ్పడినది ఆయన యోగము. ఇంకను వివరించవలయునన్న యోగమునకు హృదయమైన ధ్యానము. బుద్ధునిగూర్చి తెలుసుకోవటమంటే, ఆయన ధ్యానాన్ని గూర్చి తెలుసుకోవటమే. అసలు ధ్యానమంటే ఏమిటో, దాన్ని మనం ఎందుకు చేయాలో తెలుసుకొనవలసి ఉన్నది. అప్పుడుగాని దాని విశిష్టత మనకు అర్థంగాదు. దానిని అభ్యాసంచేయక మనమెంత నష్టపోతున్నది అప్పుడుగాని. తెలియదు.

నిత్యజీవన విధానంలో ప్రతి జీవి ఎన్నో అలజడులు, మానసిక అలసటలు పొందుతుంటాడు. మానసిక అలసటలు అనారోగ్యానికి హేతువు. కొంత విశ్రాంతి ఇస్తే, మెదడు మామూలు స్థితికి వస్తుంది. ఒక ప్రత్యేక చర్య ద్వారా మెదడుకు విశ్రాంతి కల్పించటమే (ఆలోచనల స్పీడు తగ్గించటమే) ధ్యానం. మెదడుకు విశ్రాంతినీయకుండా ఆలోచనలు చేస్తుంటే (సంకల్పాలు చేస్తుంటే) అలసట కలుగుతుంది. శరీరంలోని రోగ నిరోధక వ్యవస్థ చెడిపోతుంది. శరీరంలో మొండివ్యాధులు ప్రవేశిస్తాయి. "మెదడు చర్య పూర్తిగా ఆగిపోవటమే మరణం" అని ఆధునిక శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. కనుక మెదడుకు మన శరీరంలో ఎంత ప్రాధాన్యం ఉన్నదో మనం గ్రహించవచ్చు.

నిత్యము గంటల కొలది కొన్ని సంవత్సరములపాటు ధ్యానము చేసినను ఎట్టి ఫలితమును పొందక, నిరాశా నిస్పృహలకు లోనైనవారు చాలా మంది ఉన్నారు. అట్లగుటకు ఒక కారణమున్నది. అది ఏమిటనగా, ఆ ధ్యానము చేసేవారు ధ్యానసమయంలో సూర్య నాడీవేగాన్ని పెంచుకొంటూ ఉంటారు. మనం సామాన్యంగా, మామూలు పరిస్థితుల్లో – నిమిషానికి 16–20 సార్లు గాలిని పీల్చుకొంటూ ఉంటాము. ధ్యానంలో మనం ఉచ్ఛ్వాస, నిశ్వాసములపై ఎరుక ఉంచటంవలన–పది నిమిషములు దాటిన తరువాత చంద్రనాడి వేగము 12–8 సార్లకు తగ్గుతుంది. అందువలన మెదడు విశ్రాంతి పొందుతుంది. ఈ ధ్యానాన్ని మనం నిత్యం 45 నిమిషాలకు తగ్గకుండా చేస్తూఉండాలి. ఇట్లా రోజుకు రెండుసార్లు చేస్తూ ఉండాలి.

మనం నిద్రించే టప్పుడుకూడా – శాస్త్రజ్ఞులు లెక్కప్రకారం – మెదడు లోపలకీ, బయటకీ ప్రయాణించే సంకేతములు సెకనుకు 50 మిలియన్లు ఉంటాయి. మెదడులోఉన్న లక్షలమిలియన్ల మెదడు కణముల సంకేతముల యొక్క "ట్రాఫిక్" (రాకపోకలు) ఎంత సంక్లిష్టంగా ఉంటాయో దీనివలన మనకు అర్థం అవుతుంది.

మన మొక పెద్ద ఫ్యాక్టరీ నడిపిస్తున్నామనుకోండి. అందులో రోజుకు మూడు "షిఫ్టుల" చొప్పున (రోజుకు 8 గంటల చొప్పున) కార్మికులు పని

చేస్తున్నారనుకొందాం. ఈ ఎనిమిది గంటల పనికాలంలో భోజనాదులకని ఒక గంట విశ్రాంతి ఉంటుంది. వారానికి ఒకరోజు శెలవు ఉంటుంది. పండుగలకు కొన్ని శెలవలుంటాయి. గవర్నమెంటు వాళ్ళు అప్పుడప్పుడు మరి కొన్ని సెలవలు ప్రకటిస్తూ ఉంటారు. ఇవి గాక క్యాజులీవులు, మెడికల్ లీవులు ఉంటాయి. ఎక్కువ పనిచేస్తే "ఓ. టి" ఇస్తారు. సంవత్సరాంతంలో బోనస్ ఇస్తారు. ఇంకా యూనియన్ డిమాండ్సు వాళ్ళకు కొన్ని ఉంటాయి. ఇవన్నీ కార్మికులు అనుభవిస్తూ ఉంటారు. మన మెదడనే ఫ్యాక్టరీలో కార్మికులైన "కణాల"కు ఒక్క క్షణమైనా మనం విశ్రాంతి నివ్వటంలేదు. పైగా ఇంకా వాటి వేగాన్ని పెంచుతున్నాం. ఇట్లా చేస్తుంటే ఆకణాలు ఎంతకాలం పనిచేస్తయ్ ? ఈ విషయం మనం ముఖ్యంగా గమనించాలి.

ధ్యానంలో ఉచ్ఛ్వాస నిశ్వాసముల వేగాన్ని తగ్గించాలనే ఉపాయాన్ని మన మహర్షులు సముద్రాన్ని చూచి నేర్చుకొన్నారేమో ? ననిపిస్తుంది. సముద్రాన్ని చూడండి. అలలు ఒకదాని తర్వాత మరొకటి వస్తుంటాయి. ఆ అలల్లో 12–15 అలల తర్వాత ఒక పెద్ద అలవస్తుంది మొత్తం అన్నీ అలలు పెద్దవిగా ఉండవు. అట్లా ఉంటే సముద్రం అల్లకల్లోలమై భీతావహంగా ఉంటుంది చూడడానికి. ఇల్లానే మన మెదడులోని ఆలోచనా తరవగాల వేగం తగ్గితే మనస్సు ప్రశాంతంగా ఉంటుంది.

మనం నిత్యం కర్మ చేస్తూనే ఉంటాం. మన మెదడులో ముద్రించబడియున్న ఆలోచనలు - ఆలోచనా రూపాన్ని ధరించి, బయటకు వచ్చి, క్రియారూపాన్ని వహించటమే కర్మ "ధ్యానంలో మన మున్నప్పుడు ఆ అలోచనలను క్రియారూపం దాల్చనీయం. కనుక మహర్షులు "ధ్యానంతో కర్మను జయించవచ్చు." అని చెప్పారు ప్రతిజీవి తన కర్మను తానే ఏర్పరచుకొంటూ ఉంటాడు. ఎవరి కర్మను వారే దగ్ధం చేసుకోవాలంటే ధ్యానము వల్లనే అది సాధ్యమౌతుంది.

మానసిక అలజడులను తగ్గించుకోవడానికి, ధ్యానము, ఆసనము, ప్రాణాయామము, మంత్రము మొదలైన కొన్ని విధానములు, సముచితా

హారం, బయోపీడ్ బ్యాక్, కొన్ని ఔషధములు పనికివస్తవి. మనం మానసిక, శారీరక ఆరోగ్యమును పొంది, జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలంటే ధ్యానాన్ని మనం ఆశ్రయించక తప్పదు. అటువంటి ధ్యాన మార్గాన్ని సుగమం చెయ్యడానికి దీక్షాకంకణం ధరించిన శ్రీ శివసుబ్బరాయగుప్తగారిని అభినందించక తప్పదు. ఈ "శ్రీ బుద్ధగీత" ద్వారా బుద్ధుని ధ్యానమార్గాన్ని వారు ధ్యానయోగంలో చక్కగా విశదీకరించారు. విశ్వయోగాన్ని విశ్వవ్యాప్తం గావించడానికి గుప్తాగారు చేస్తున్న జ్ఞాన యజ్ఞ కార్యక్రమము నిర్విరామముగా, నిరాటంకముగా, నిశ్శేషంగా పరిపూర్ణము చేయవలసినదిగా భగవంతుని మనసా, వాచా. కర్మణా కోరుకుంటున్నాను.

ఇట్లు

యోగాభిలాషి

**డా॥ జి. యస్. వి. ప్రసాదరావు**

కుండలినీయోగి, యోగా ఆయుర్వేద షాపు

ట్రంకురోడ్డు, ఏలూరు.



దుర్నిగ్రహస్య లఘునో యత్ర కామనిపాతినః
చిత్తస్య దమనం సాధు చిత్తం దాంతం సుఖావహమ్॥

(ధమ్మపథం)

మనస్సును ఆధీనంలో ఉంచుకోవడం చాలాకష్టం. అది వాంఛిత విషయాలమీదకు వేగంగా పోతుంది. చిత్తాన్ని అదుపులోకి తేవడం మంచిది. అదుపులో ఉన్న చిత్తం సుఖాన్ని కలిగిస్తుంది.

సుదుర్దృశం! సునిపుణం యత్ర కామనిపాతినమ్
చిత్తం రక్షేత్ మేధావీ చిత్తం గుప్తం సుఖావహమ్॥

(ధమ్మపథం)

పరిశీలించి పట్టుకోవడానికి కష్టతరమైనటువంటిది, సూక్ష్మాతిసూక్ష్మమైనటువంటిది తనకు ఇష్టమైన విషయాలమీదకు ఛప్పున పోయి వాలేటువంటిది అయిన చిత్తమును బుద్ధిమంతుడు విశ్వయోగముద్వారా సన్మార్గములో పెట్టి సంరక్షించుకోవాలి. అట్లా రక్షించబడిన చిత్తము బ్రహ్మానందాన్ని కలిగిస్తుంది.



# ఆత్మనివేదనం

మానవుడు అనాదిగా భవచక్రంలోపడి, తృష్ణకులోనై దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు. కామక్రోధాది అరిషడ్వర్గానికి చిక్కి, మృత్యువే గమ్యంగా ప్రస్థానం చేస్తున్నాడు. అజ్ఞానపంకంలో కూరుకొనిపోయి బయటకు రాలేక పోతున్నాడు. ప్రతియుగంలోనూ, ప్రతి ప్రదేశంలోనూ ఎందరో మహాత్ములు జన్మించి ప్రబోధాలు చేస్తునే ఉన్నారు. ప్రతిసారి మానవుడు ఆ ప్రబోధాలకు ఒక్కసారి తల విదిల్చి, మత్తువదలి, వాళ్ళుచెబుతున్న మాటలను ఈ చెవితో విని, ఆ చెవితో వదలి, మళ్ళీమత్తులోకి జారుకొంటున్నాడు. విషయలోలుడై యధాప్రకారం మనుగడ సాగిస్తునే ఉన్నాడు. విసుగు అనేది లేకుండా భగవంతుడు అనాది కాలంనుంచి వివిధ గురుస్వరూపాలుగా, వివిధ కాలాల్లో అవతరించాడు. అవతరిస్తున్నాడు. మానవులను అప్పటి పరిస్థితుల కనుగుణంగా ప్రబోధిస్తునే ఉన్నాడు. ఇట్లా మానవ జాతిని ప్రతియుగంలోనూ మేల్కొల్పటం సిద్ధులు, అవతార పురుషులు, యోగుల లక్షణమైతే పురాణ వైరాగ్యంతో ప్రవర్తించటం సామాన్య మానవుల లక్షణంగా కనిపిస్తుంది. మానవుల్లోని ఈబలహీనత తెలుసుకొన్నవాడు కాబట్టే భగవంతుడు విసుగనేది లేకుండా కరుణాసింధువై ఈనాటివరకు ఈభూమిమీద అనేకమహాత్ములుగా, గురుస్వరూపాలుగా అవతరిస్తునే ఉన్నాడు. ప్రేమను వర్షిస్తునే ఉన్నాడు.

ఇప్పటికి 2500 సంవత్సరాలకు పూర్వం ప్రపంచంలోని దుఃఖాన్ని తొలగించి, ప్రపంచాన్ని నందనవనంగా మార్చాలని గౌతమ బుద్ధుడు శ్రీకారం చుట్టాడు. ఆమహానుభావుడు దేవుడి కంటే మనిషి ప్రవర్తనకు ప్రాముఖ్యం ఇచ్చాడు. కార్యకారణ సిద్ధాంతంతో కర్మను అన్వయించాడు. ఆత్మను ఉపేక్షించి పునర్జన్మ సిద్ధాంతాన్ని స్థాపించాడు. దుఃఖానికి కారణం "తృష్ణే" నని గ్రహించి" దాన్ని విసర్జించటమే మోక్షం (నిర్వాణం) అని చెప్పాడు. నిర్వాణం సాధించడానికి అష్టాంగ మార్గం, అష్టాంగ మార్గాన్ని సుగమం చెయ్యడానికి పంచశీల, దశపారమితలు ఉద్బోధించాడు. మనిషిలోనిశక్తి అనంతమని గుర్తించి, దానిని పెంపొందించడానికి "విపశ్యన". అనే ధ్యాన

యోగం ప్రసాదించాడు. బుద్ధుని బోధలకు ఆనాడు వేదమతం కంపించి పోయింది. ఆ తర్వాత ఐదువందల సంవత్సరాల పాటు బౌద్ధానికి దేశంలో అడ్డమాకలు లేక పోయింది. విదేశాలకూ వ్యాపించింది. ఆ తరుణంలో ఆదిశంకరులు అవతరించి, వైదిక కర్మకాండలకు వ్యతిరేకమైన పద్ధతిలో "ప్రచ్ఛన్న బౌద్ధం' మని పేరుగాంచిన మాయావాదాన్ని ప్రబోధించి, బౌద్ధ మతాన్ని వాదనలో ఓడించి, హిందూమతంలో సంవిలీనం చేశాడు. అయినా మనదేశంలోనూ, విదేశాల్లోనూ బౌద్ధం తన ఉనికిని కోల్పోలేదు. తన ప్రత్యే కతను తాను ఈనాటి వరకూ నిలుపుకొంటూనే వస్తున్నది. దానిజీవశక్తి అటు వంటిది.

పుణ్య సముపార్జనకూ, కొన్ని శక్తులు పొందడానికైతే సగుణోపాసన పనికి వస్తుంది. కాని మోక్షం సాధించాలంటేమాత్రం అది నిర్గుణోపాసనగా మారాల్సిందే. గత్యంతరం లేదు. "నిర్గుణోపాసన" అంటే మాటలుగాదు. అందరికీ అది సాధ్యమయ్యేపని కాదు. ఎందుకంటే అందుభాగమైన ధ్యానం, యోగాభ్యాసం కష్టతరమైనవి. మనస్సును స్వాధీనంచేసుకొంటేనేగాని ధ్యానం కుదరదు. మనస్సును స్వాధీనం చేసుకోవాలంటే ప్రాణాయామం చెయ్యాలి. అంటే యోగాన్ని ఆశ్రయించాలి. అందుకు సత్ప్రవర్తన, సజ్జనసాంగత్యం చాలా అవసరం. ఈ నిర్గుణోపాసన అలవడితేనే జ్ఞానం సిద్ధించినట్లు. జ్ఞానం అంటే "అహంబ్రహ్మాస్మి. స్థితి"ని అందు కోవటమేకదా! తానేభగవంతుడై నప్పుడు ఇంకా వేరేభగవంతు డెక్కడున్నాడు? ఒక విధంగా చూస్తే వేదాతీత స్థితి (లేదా జ్ఞానాతీతస్థితి) పొందిన సాధకుడు నాస్తికుడే అవుతాడు. ఈ దృష్టితో చూచినప్పుడు తథాగతుడూ నాస్తికుడే! కాని యథార్థానికి ఆయన నాస్తికుడుగాదు. ఆయన దేవతలున్నారని చెప్పాడు. స్వర్గనరకాలున్న వన్నాడు. పునర్జన్మ తప్పదన్నాడు. మంచిచేస్తే మంచి, చెడుచేస్తేచెడు ఎప్పుడో ఒకప్పుడు అనుభవించక తప్పదన్నాడు. ఆయన ప్రవచించిన సిద్ధాంతాల్లో చాలావరకు ఆయనకు ముందున్న వేదఋషుల నుంచి స్వీకరించి న సనాతన ధర్మాలే. అయితే ఆయన కొన్నింటిని యథాతథంగా, కొన్నిం టిని స్వల్పమార్పులతో స్వీకరించాడు. ఆయనప్రత్యేకత ఏమిటంటే దేవుడొక

డున్నాడని, ఆయనపై ఆధారపడకుండా సత్ప్రవర్తనతో స్వశక్తిని పెంచుకోమని ప్రబోధించటం, మనిషికీ దేవుడికీ మధ్య సంబంధంకంటే మనిషికీ మనిషికీ మధ్య ఉండవలసిన సత్ సంబంధంగూర్చి ఆలోచించమనటం. ఉద్ధరేదాత్మనాత్మానం" అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పింది కూడ ఇదే! చెప్పటంలో భేదం ఉండవచ్చు. ఆచరణలోమాత్రం భేదం ఉండదు. గమ్యం మటుకు ఒక్కటే!

భగవంతుని అవతారాలను మనం పరిశీలిస్తే ఆయన హింసతోనే (ఆయుధంతోనే) ధర్మస్థాపన చేసినట్లు మనకు స్పష్టమౌతుంది కానీ బుద్ధావతారంలో మాత్రం అహింసతోనే ధర్మ స్థాపన జరిగింది. దుష్టశిక్షణ కంటే మనిషిలోని దౌష్ట్యాన్ని నిర్మూలించడమే బుద్ధుడుతనకర్తవ్యంగా భావించాడు. ధ్యేయంగా పెట్టుకొన్నాడు. ఇది యోగులు సద్గురువులు చేసేపని.

మనిషి ప్రవర్తనకు బుద్ధుడు ఇచ్చినంత ప్రాధాన్యం ఏ ప్రవక్తా, ఏ ఆచార్యుడు ఇవ్వలేదేమోనని పిస్తుంది. ప్రతివాడు దేవుణ్ణిచూపిస్తూ నయానో, భయానో మనిషిని మార్చాలని ప్రయత్నించాడేగాని, దేవుడివిషయం వదలి మనిషిని ఊహాలోకాల్లో విహరించనీయకుండా మనిషి ప్రవర్తకు ప్రాధాన్యమిచ్చి మనిషికీ మనిషికీ మధ్య సమ్యక్ భావం నెలకొనేటట్లు చేయలేదు. అట్లాచేసింది బుద్ధయోగం ఒక్కటే! ఆ యోగం టిబెట్టు చైనాలాంటి దేశాల్లో ప్రాధాన్యం సంతరించుకొన్నట్లు, మనదేశంలో ప్రాధాన్యం చెందలేదు. ఈ నాడు విశ్వంలో బొత్తిగా నైతిక విలువలు దిగజారాయి. మానవత్వం నశించింది. కులాలు, మతాలు పేరిట ప్రపంచం ఒక అగ్ని గుండమైపోయింది. దానవత్వం కరాళ జిహ్వాలు సాచి, వికటాట్టహాసం చేస్తూ ఈ శతాబ్దాంతంలో రాబోయే మహాప్రళయానికి స్వాగత గీతికలాలపిస్తున్నది. ఇటువంటి భయానక తరుణంలో "మళ్ళీ బుద్ధుడు అవతరిస్తే బావుండును. మళ్ళీ జనజాగరణ చేస్తే బావుండును" అనే ఆకాంక్ష బౌద్ధాభిమానులకు కలగటంలో వింతలేదు. ఆ సమ్యక్ స్ఫూర్తితోనే శ్రీశ్రీశ్రీ హరిబాబు యోగిగారు ఈ బుద్ధగీతను విరచించి, ఈనాడు లోకానికి అందిస్తున్నారు. ఇది ప్రస్తుతించదగిన విషయం.

శ్రీశ్రీశ్రీ హరిబాబు మహరాజ్ స్వాములవారు తిరుపతి వాస్తవ్యులు. పూర్వాశ్రమంలో వారి స్వగ్రామం భద్రాచలం దగ్గరున్న "తొంటిపాక". భద్రాచలంలో ఆయన "గీతాప్రెస్"ను నెలకొల్పి దాన్ని అభివృద్ధి పరిచారు. ఆయన గృహస్థుగా ఉన్న ఆ రోజుల్లో ఒక నాటిరాత్రి "నామాలస్వామి" స్వప్నంలో కనుపించి "నా కొండకురా!" "అని ఆయన్ను పిలిచారట!" ఏదో కలగదా" అని ఆయన మెదలకుండా ఊరుకుంటే వరుసగా మూడు రోజులు స్వామి వారు కనిపించి అట్లాగే పిలవటం జరిగిందట! వెంటనే ఆయన తిరుమల వెళ్ళి, గోగర్భం చేరారట! పూర్వం శ్రీమలయాళ స్వాములవారుతపస్సు చేసిన పరమపావనమైన ఆ గోగర్భ క్షేత్రంలో, పాలు, పండ్లు ఆహారంగా తీసుకొంటూ, చాలా సంవత్సరాలు తీవ్రంగా తపస్సు చేశారట! ఒక రోజు ఆయన ధ్యానంలో ఉన్నప్పుడు" గీతా ప్రచారం చెయ్యి! చిత్రపటాలద్వారా ప్రతి అధ్యాయాన్ని బోధించు! ఇది నీ కర్తవ్యం. లే! లేచి ఉద్యమించు!" అనే దివ్యవాణి వినిపించిందట! వెంటనే ఆయన అక్కడి నుంచి బయలు దేరి హరిద్వార్, హృషీకేశ్, కేదార్‌నాథ్ బదరీ మొదలైన క్షేత్రాలు సందర్శించి, అక్కడి మహాత్ములను కలిసి, తానువిన్న ఆదేశాన్ని తెలిపి, ప్రచారానికి అనుమతిని అర్థిస్తే వాళ్ళు తమ ఆమోదాన్ని వెలిబుచ్చి ఆశీస్సులిచ్చారట! అప్పటి నుండి ఆయన దేశం నలుమూలలు పర్యటించి, చిత్రపటాలద్వారా గీతా ప్రచారం ప్రారంభించారట!

ఒకసారి ఆయన కలకత్తాలో గీతా ప్రచారం చేస్తుంటే, కొందరు విదేశీయులు ఆయన దగ్గరకివచ్చి, "చాలాకాలం క్రితం స్వామి వివేకానంద "కొన్ని సంవత్సరాలకు ఒక మహాత్ముడు వచ్చి చిత్రపటాలద్వారా గీతా ప్రచారం చేస్తాడు. ఆయన ఆకారంలోనూ, వస్త్రధారణలోనూ అచ్చం నాలాగానే ఉంటాడు, ఆయన బుద్ధగీత వ్రాస్తాడు" అని చెప్పి, మిమ్మల్ని గుర్తుపట్టటానికి కొన్ని విషయాలు చెప్పారు. వాటిమూలంగా "మీరే వా"రని తెలుసుకొన్నాం" అని చెప్పారట ! ఈ విషయం చాలా గొప్పగా ఉంది. ఈ విషయం మనం వింటుంటే అప్పుడు అమెరికాలో వివేకానందస్వామిని ఒక వ్యక్తి కలుసుకొని నమస్కరించి "మీరే నా గురువులు" అనగా, ఆయన

అతడు చెప్పినదాన్ని త్రోసిపుచ్చుతూ "నేనుగాదు, నీగురువు వేరేఉన్నారు. కొన్ని సంవత్సరాల తర్వాత ఆయనే నిన్ను వెదుక్కొంటూ నీ దగ్గరికి వస్తాడు" అని ఆయన్ను గుర్తుపట్టడానికి కొన్ని రహస్యాలు చెప్పిన విషయం, ఆ గురువు "పరమహంస శ్రీయోగానంద" కావటం మనకు గుర్తుకువచ్చి, "శ్రీహరిబాబుయోగిగారుకూడా ఆ కోవకు చెందిన మహానుభావుడే"నని సిస్తుంది – మనకు.

ఏదన్నా ఒకవిషయాన్ని గురించి శ్రీహరిబాబు యోగిగారు వ్రాయాలని కలంపట్టుకొని కూచుంటే, ఎవరో ఆయనకు వ్రాయబోయే విషయాలన్నీ ముందుగా చెబుతున్నట్లు వినిపించేవట ! తన శరీరంలో, షట్ చక్రాలు శిష్యులకు చూపించి ఆయన ఆశ్చర్యపరిచారట ! "అత్యద్భుత శక్తులు కలిగినవా"రని ఆయన్నుగూర్చి శిష్యులుగొప్పగా చెబుతారు. భగవద్గీత ఆయనకు కొట్టిన పిండి. అటువంటి ఆయనకు బౌద్ధంపట్ల ఇంతటి అభిమానం ఎట్లా కలిగిందో తెలీదు. జపాన్, టిబెట్, చైనా, మలేషియా మొదలైన దేశాలు ఆయన తిరిగి వచ్చారు. అక్కడి బౌద్ధ సన్యాసులను కలిసి, యోగరహస్యాల నెన్నింటినో తెలుసుకొన్నారు. నర్సరావుపేట, తిరుపతి, సికిందరాబాదు, ఢిల్లీ, అంతర్వేదులలో గీతాశ్రమాలు స్థాపించారు. శిష్యులెందరికో యోగ రహస్యాలు నేర్పారు. "ప్రజలంతా నా కన్నబిడ్డలు. వాళ్ళ యోగ క్షేమాలు విచారించటమే నాపని" అని పలుసార్లు ఆయన ప్రస్తావిస్తూ ఉండేవారట ! ఆయన తమ జీవిత చరమదశలో – ఎన్నడో తాము వ్రాసిన "శ్రీ బుద్ధగీత" దగ్గరున్న శిష్యుల కిచ్చి, ఈ గ్రంథాన్ని గుంటూరు తీసుకవెళ్ళి, గుప్తాగారికి ఇవ్వండి ! ఆయన దీన్ని పరిష్కరించి అచ్చువేయిస్తా"రని చెబితే, 1991లో శ్రీ హరిబాబు యోగిగారు మహాసమాధి చెందిన తర్వాత శ్రీమతి గుండా అనసూయమ్మ మున్నగు శ్రీ హరిబాబు మహారాజ్ శిష్యులు 1994 లో ఆ గ్రంథాన్ని నాదగ్గరకు తీసుకొనివచ్చి, విషయమంతా చెప్పి, ముద్రణా భారం నాపై మోపారు.

ఇంతకు పూర్వం నా విశ్వయోగం ప్రథమ ద్వితీయ భాగాలు అచ్చు వేయించేటప్పుడు చేదోడువాదోడుగా ఉండి,సముచితసలహాలనిచ్చి, ప్రూఫులు

దిద్దేపనికూడా తామే వహించి, ఎన్నోవిధాలుగా నాకు సహాయ సహకారాల సంపత్తు లందించిన పూజ్యులు, సరససాహితీ చరణ చారణ చక్రవర్తులు, సుప్రసిద్ధకవులు పండితులు, విమర్శకులు, విశ్రాంత ప్రభుత్వ డిగ్రీ కళాశాల ప్రాచార్యులు శ్రీ జి. వి. యల్. యన్. విద్యాసాగరశర్మగారు కొండలా అండగా ఉంటే గ్రంథ పరిష్కరణ విషయంలో అనుమానించవలసిన పని లేదన్న ఆత్మవిశ్వాసం కలిగింది. అదేమిటోనాకు శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ వారిని చూచినట్లే ఉంటుంది- వారిఅగ్రజులు విద్యాసాగరశర్మగారినిచూచినా! వారు సాయిదత్తోపాసకులు. నివురుగప్పిననిప్పు." కావాలనేవారు తమశక్తిని లోకానికి ప్రకటించటంలేదేమో"నని అనేక సమయాలలో నాకు అనిపించింది. వారి నిరాండంబరత, నిష్కల్మష ప్రవర్తన నన్నెంతో ముగ్ధుణ్ణి చేసింది. ఆయన్ను విశ్వయోగికి ప్రతిరూపంగా, గురుస్వరూపంగా నిత్యం నేను సంభావిస్తూ ఉంటాను. వారిని రెండు మూడురోజులకొకసారైనా చూడకపోతేనాకు తోచదు. అటువంటిది మాఅనుబంధం. "ఈ బంధం ఈజన్మది కాదు. ఎన్నో జన్మలది. వారితోడ్పాటుతో ఎన్నో గ్రంథాలను నేనువెలువరించవలసి ఉంది. ఇది భగవన్నిర్ణయం"అని చాలాకాలం క్రితమే బోధపడింది. ఆత్మీయులైన విద్యాసాగరశర్మగారి దగ్గరకు వెళ్ళి శ్రీ హరిబాబు యోగిగారి బుద్ధగీతను చూపించాను. వారు దానిని పరిశీలించి "బుద్ధుడు అందరు ప్రవక్తల్లాంటి ప్రవక్తకాదు. విశ్వయోగి. మానవతావాది. ఆ మహానుభావుడిబోధలు ఈ కాలానికి తగినట్లు శ్రీహరిబాబుయోగి ఈ గ్రంథంలో పొందుపరిచాడు. ఇది చాలా విలువైన గ్రంథం విశ్వయోగాన్ని లోకంలో వెలువరించాలని దీక్షా కంకణం కట్టుకొన్న మీదగ్గరికి బుద్ధుడేఈవిశ్వయోగాన్ని పంపించాడు. ఈ గ్రంథం మిమ్మల్ని వెదుక్కొంటూవచ్చింది. శ్రీహరిబాబుయోగి సామాన్యుడుకాదు. సిద్ధసంకల్పుడు. అంతా ఆయన నిర్ణయం ప్రకారమే జరుగుతున్నది. ఆయన ఆశీస్సులు మీకు పుష్కలంగా ఉన్నాయి. ఈ గ్రంథ పరిష్కరణకు అన్ని విధాలా మీరే సమర్థులు. మీ చేతిమీదుగా ఈ గ్రంథం వెలుగు లోనికి రావాలని బుద్ధభగవానుని నిర్ణయం. దాన్నిమనం కాదనలేం. విశ్వయోగం మూడవభాగంగా"శ్రీ బుద్ధగీత"ను అచ్చువేయించండి ''అని ఆదే

శించారు. "బుద్ధుడు విశ్వయోగి" అన్న శర్మగారి మాట నా కళ్ళకు కప్పిన పొరను చీల్చివేసింది. హృదయం ఉప్పొంగింది. కొండంత బలంవచ్చింది. నాచేత నైనంత మేరకు గ్రంథాన్ని పరిష్కరించి ఇట్లా మీ ముందుంచు తున్నాను. రూపశిల్పులై గ్రంథ పరిష్కరణకు నాకు వెన్నుబలంగా నిలవ టమేగాక, ఈగ్రంథానికి విపులమైన "ప్రవేశిక"ను గూడా సంతరించిపెట్టారు- విద్యాసాగరశర్మగారు. ఆసహృదయునకు చేతులుమోడ్చి హృదయపూర్వకంగా ఒక్కనమస్కారం చేస్తున్నాను.

శ్రీ హరిబాబు యోగిగారి వ్రాతప్రతిలోని పునరుక్తాలు, అనవసరమైన ఉదాహరణాత్మక కథలు పరిహరించి, ఇదిశ్రీబుద్ధగీతలా ఉండేటట్లు నా శక్తి కొలది ప్రయత్నించాను. ఏదైనా లోపాలుంటే సహృదయులైన విజ్ఞులు మన్నించి, నాకుతెలియజేస్తేమలిముద్రణలో ఆ లోపాలను సరిదిద్దుకొనగలని సవినయంగా మనవి చేస్తున్నాను, ఈ గ్రంథ పరిష్కారానికి ముఖ్యంగా శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారి "బౌద్ధదర్శనం", తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డాక్టర్ పేర్వారజగన్నాథంగారు ముఖ్యసంపాదకులుగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంవారు వెలువరించిన "బుద్ధుడు మరియు అతని ధమ్మం"అనే గ్రంథం, బోధచైతన్యగారి "ధర్మపథం కథలు" ఎంతగానో సహకరించాయి. ఆ గ్రంథ రచయితలకూ, ప్రచురణ కర్తలకూ కృతజ్ఞతలు వెల్లడిస్తున్నాను.

విశ్వయోగాన్ని సాధన చెయ్యడానికి నాకు దేహాన్ని ప్రసాదించిన నా తల్లిదండ్రులు శ్రీమతి మట్టుపల్లి వెంకటమహాలక్ష్మమ్మ, శ్రీజగన్నాథంగార్లకు నేనెంతయో ఋణపడియున్నాను. యోగం నాకు ప్రాప్తించడానికి వారిచ్చిన శిక్షణే మూలకారణం. నాకు జన్మంటూ ఉంటే వారే నా తల్లిదండ్రులు కావా లని మనఃపూర్వకంగా కోరుకొంటున్నాను. దానశీలురు, జ్ఞాన వైరాగ్య సంప న్నులు, భగవద్భక్తి పరాయణులూ ఐన ఆ పుణ్యదంపతుల దివ్యానుగ్రహ బలంచేతనే ఈనాడు నాకిట్లా యోగ గ్రంథాలు వెలువరించే అదృష్టం కలిగి, జన్మ ధన్యమైందని భావిస్తున్నాను.

బుద్ధుడు విశ్వయోగి కనుక, ఈ గ్రంథాన్ని విశ్వంజీకి అంకిత మిద్దా మనే అభిప్రాయం కలిగింది. దీన్ని శ్రీ హరిబాబుయోగిగారే నాతో కలిగించి ఉంటారని భావించాను. అట్లాగే చేద్దామనుకొన్నాను. ఇంతలో వారి

యలు వచ్చి "ఈ గ్రంథాన్ని బుద్ధుడికి అంకితం చెయ్యండి!" అని మా వుగారు చెప్పినట్లు దృష్టాంతమైంది. ఆట్లాగే ఆయనకు అంకితమివ్వం" చెప్పారు. నా ఉద్దేశ్యం వాళ్ళకు చెప్పి వాళ్ళను సమాధాన పరచి నుకొన్నట్లే చేద్దామనుకొన్నాను. కానీ విద్యాసాగర శర్మగారు శ్రీ బుద్ధుడి కితమిస్తే సమ్యక్ సంబుద్ధుడైన విశ్వయోగికి అంకిత మిచ్చినట్లే నని చెప్పిన నాకు నచ్చింది. శ్రీహరిబాబు యోగిశిష్యులు కోరినట్లే దీన్ని బుద్ధుడికి తం చేస్తున్నాం.

ఈ గ్రంథాన్ని వెలువరించడానికి సమధికోత్సాహంతో నడుంబిగించిన, భక్తి ప్రపూర్ణులైన శ్రీ హరిబాబుయోగి ముఖ్య శిష్యురాలైన శ్రీ గుండా యమ్మగారికీ, గ్రంథ ముద్రణకై విరాళములు యథాశక్తి నొసగి సహక న వదాన్యులకూ, ఈ గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా అచ్చువేసిన యిశర్వాణి ప్రింటింగ్ ప్రెస్సు" అనంతతీర్థ అగ్రహారం, గుంటూరువారికీ నయపూర్వకమైన కృతజ్ఞతలు వెల్లడిస్తున్నాను.

కరుణాతరంగిత హృదయులై ఈ గ్రంథపరిష్కారానినికి తమ అమో వెలిబుచ్చి, దివ్యాశీస్సు లొసగిన సంపూర్ణదత్తావతారులు శ్రీశ్రీశ్రీ విశ్వ విశ్వంజీ సద్గురు మహారాజ్ అరుణారుణచరణకమలాలకు భక్తిప్రపుల్ల యకుసుమాంజలులు సమర్పిస్తున్నాను.

త్వరలో విశ్వయోగం నాలుగవభాగంగా శ్రీసాయీశయోగం వెలువరిం ని ఆశిస్తున్నాను. విశ్వయోగం ప్రథమ, ద్వితీయ భాగములు మాదిరి ఈ తృతీయ భాగంకూడా పాఠకులనలరించి, భక్తిని, యోగాసక్తిని గొందించి, మనశ్శాంతిని కలిగించగలదని నా విశ్వాసము.

సర్వేజనాస్సుఖినోభవంతు!

ఇట్లు

యోగిజన విధేయుడు

మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త

శివాఇంజినీరింగ్ కంపెనీ, గుంటూరు-1.

## గ్రంథముద్రణకై విరాళములు సమర్పించినవారు

సర్వశ్రీ

1) వేల్పుల ఆంజనేయులుగారి కుమారుడు
సత్యనారాయణ 2116/-

2) మట్టుపల్లి జగన్నాథం శ్రీమతి మహాలక్ష్మమ్మ దంపతుల
పుత్రుడు శ్రీ శివసుబ్బరాయగుప్త, గుంటూరు 1516/-

3) వినాయక టెక్స్‌టైల్స్, కొత్తపేట (గుంటూరు) 1500/-

4) మాజేటి శివరామకృష్ణయ్య (గుంటూరు) 1500/-

5) గుండా అనసూయమ్మ
(స్వామివారి శిష్యురాలు, నరసరావుపేట) 1116/-

6) గుండా భాస్కరరావు (నరసరావుపేట) ,,

7) పాల్వాది ఆదినారాయణ
(రైస్‌మిల్లు, నరసరావుపేట)

8) గొడవర్తి సుబ్బారావు
(బంగారపుకొట్టు, నరసరావుపేట) ,,

9) కొప్పురావూరి రంగయ్య (నరసరావుపేట) ,,

10) గుండా హనుమంతరావు (గుత్తికొండ) ,,

11) చిలకల వెంకట కోటయ్య ,,

12) చంద్రపట్ల సుబ్బారావు తాయారమ్మ గార్ల
జ్ఞాపకార్థం వారికుమారులు 1) అప్పారావు
2) రామకృష్ణరావు,
3) దశరథరామాంజనేయులు(గోనెపూడి) ,,

13) శ్రీ గ్రంధి రోశయ్య ,,

14) మానేపల్లి వెంకటసుబ్బయ్య ,,

15) కాకుమాను దుర్గాప్రసాదు ,,
(అర్వపల్లి, ముప్పాళ్ళ)

16) అర్వపల్లి ఆంజనేయులు ,,
(రామా రైస్‌మిల్, నరసరావుపేట)

17) స్వామి కొంజేటి (స్వామిబ్రదర్స్) ,,

18) కొత్త శంకర్రావు (అద్దంకి) ,,

19) పెమ్మసాని మహాలక్ష్మమ్మ (గడ్డంగ్రామం) 1000/-

20) P. V చంద్రపాల్ (సేలం) ,,

21) ఆకుల సాంబశివరావు (నరసరావుపేట) 516/-

22) మురారిశెట్టి వెంకటకోటేశ్వరరావు (నరసరావుపేట) 500/-

23 కాకుమాను సీతరత్నం ,,

24 కటకం సీతామహాలక్ష్మమ్మ, నరసరావుపేట ,,

25 రామాంజనేయులు, నరసరావుపేట ,,

26 ఒకభక్తురాలు ,,

27 గొడపర్తి అప్పారావు బంగారపుకొట్టు, నరసరావుపేట ,,

28 బచ్చు సుబ్రమణ్యం గుంటూరు ,,

29 భృగుమళ్ళ రాధాకృష్ణమూర్తి S/o బాపయ్య 250/-

30 కేతం శ్రీనివాసరెడ్డి, నరసరావుపేట ,,

31 ఆపర్ణశాయి జ్యూయలరీమార్ట్ ,,

32 వెంకటరమణ జ్యూయలరీమార్ట్ ,,

33 రాఘవేంద్ర జ్యూయలరీ కంపెని ,,

34 కొంజేటి వెంకటరత్నం ,,

35 గుండా రంగారావు, విజయవాడ ,,

36 అప్పల సత్యనారాయణ, నరసరావుపేట ,,

37 సుబ్బయ్య నరసరావుపేట
38 కాపు లక్ష్మీనారాయణ
39 చిలకల వెంకటకోటయ్య
40 కాకిశెట్టి వెంకట్రామయ్య
41 నాగశరపు రామమోహనరావు
42 బొమ్మశెట్టి వెంకటపార్థసారధి
43 కల్లం సత్యనారాయణ, త్రివేణి ప్రిన్సిపాల్
44 హనుమంతరావు
45 నాళం మురళీక్రిష్ణ, విజయవాడ
46 నాగశరపు వెంకటనాగరత్నం కాశీవిశ్వనాధం
47 గుండా వాసుదేవరావు
48 పమిడాకుల సుబ్బయ్య
49 గుడిపాటి శ్రీనివాసరావు
50 వల్లేటి శివకోటేశ్వరరావు
51 కొత్తూరి హనుమయ్యగారి ధర్మపత్ని ఆదిలక్ష్మి
52 కనమర్లపూడి రామసత్యనారాయణ
53 తొమ్మెపల్లి రాజ్యలక్ష్మి, జగ్గయ్యపేట
54 అనమోలు వెంకటేశ్వర్లు, నరసరావుపేట

# శుద్ధపత్రిక

(ముందుగా తప్పులను సవరించుకొని ఆ తర్వాత గ్రంథము చదువవలసినదిగా పాఠకులకు విజ్ఞప్తి చేస్తున్నాం.)

| పేజీ నెం. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 15 | 4 | జన్మించునో | జన్మించడో |
| 19 | 21 | ఆకర్షణ ర_క్తి | ఆకర్షణ శ_క్తి |
| 20 | 25 | సంపర్క సృష్టియే సృష్టి | సంపర్క సృష్టియే |
| 22 | 7 | ఉదిలు అవతారాలున్నవని | పది అవతారాలున్నవని |
| 22 | 18 | వ లైనులో "అది కౌమారావస్థ" అనే వాక్యం తరువాత కామం ఉద్భవించే అవస్థ "యౌవనావస్థ" అనే వాక్యం చేర్చాలి. | |
| 24 | 26 | తత్యములు | తత్వములు |
| 24 | 26 | ముఖమైనవి | ముఖ్యమైనవి |
| 46 | 23 | ఆయత | ఆయన |
| 31 | 16 | నౌకరీ | నౌకరు |
| 33 | 10 | సృషి | సృష్టి |
| 33 | 13 | సృషి | సృష్టి |
| 33 | 14 | వృది | వృద్ధి |
| 33 | 20 | శ్రద | శ్రద్ధ |
| 38 | 19 | సమ్మక్ | సమ్యక్ |
| 42 | 1 | దేవునిహింసించకుండా | హింసిస్తూ |
| 88 | 12 | దింగర | దిగంబర |
| 93 | 24 | తృష | తృష్ణ |
| 100 | 13 | స్రవణ | శ్రవణ |
| 109 | చివరిలైను | వయస్సుతువకు | వయస్సువకు |

| | | | |
|---|---|---|---|
| 111 | 2 | గుణనీర్గుణయోగము | గుణ నిర్గుణ యోగము |
| 113 | 4 | సచ్చిందానందము | సచ్చిదానందము |
| 137 | 22 | పరివరన | పరివర్తన |
| 142 | 26 | శ్రవణమన | శ్రవణమనన |
| 156 | 19 | వేత్రంపైన | నేత్రమైన |
| 158 | 25 | పరినిర్యాణమార్గము | పరినిర్వాణమార్గము |
| 163 | 18 | మడుజన్మ | మరుజన్మ |
| 165 | 7వ లైనులో "బ్రహ్మచర్యము" తరువాత "మద్యపాన నిషేధము" అనుపదం చేర్చాలి. | | |
| 170 | 10వ లైను తర్వాత "పరంజ్యోతి (పరమాత్మ) అని పేర్కొంటున్నాం. అని 11వలైనుగా చేర్చాలి. | | |
| 193 | 16 | మోక్షప్రాపికి | మోక్షప్రాప్తికి |
| 200 | 20 | జీవప్రసారము | జీవప్రసాదము |
| 203 | 14 | ఉద్ధంచుకోవాలి | ఉద్ధరించుకోవాలి |
| 222 | 23 | నిలువకుంమ | నిలువకుండ |
| 227 | చివరిలైను | కూర్చొనకు | కూర్చొనక |
| 234 | 9వ లైనులో "అసత్యానికి సంబంధించింది" అనే దాని తర్వాత "ఐదోది మత్తుపానీయాలకుసంబంధించింది" అని చదువుకోవాలి. | | |
| 234 | 18 | అస్థిని | అస్థితిని |
| 238 | 20 | వస్త్రిములు | వస్త్రములు |
| 239 | 21 | మనతో | మనలో |
| 240 | 11 | మరికాస | మరికాస్త |
| 240 | 23 | నిస్సార్ధంగా | నిస్స్వార్ధంగా |
| 241 | 18 | చెప్పబడుచున్నవి | చెప్పబడుచున్నది |
| 243 | 5 | శరీధములు | శరీరములు |
| 247 | 5 | అచల (అచల) | చల (అచల) |

| | | | |
|---|---|---|---|
| 247 | 13 | యంత్రలు | యంత్రాలు |
| 248 | 20 | పంచబూతము | పంచభూతము |
| 251 | 10 | ఏర్పడి తరువాత | ఏర్పడిన తరువాత |
| 254 | 3 | అరిషడ్యర్గములు | అరిషడ్వర్గములు |
| 254 | 26 | పంచభక్ష్య | పంచభక్ష్యములు |
| 256 | 1 | వేయుదురు | చేయుదురు |
| 256 | 21 | తన దుఃఖ | తమ దుఃఖ |
| 256 | 22 | కోరుచున్నాడో | కోరుచున్నారో |
| 256 | 26 | ఆదరభిమానములు | ఆదరాభిమానములు |
| 258 | 2 | మైత్రభావము | మైత్రీభావం |
| 264 | 16 | వశిషుడు | వశిష్ఠుడు |
| 281 | 11 | రోగులతో | రోగాలలో |
| 284 | 9 | ఉండి | ఉండండి |
| 291 | 22 | వాజ్నయమం | వాఙ్మయమం |
| 284 | 9 | ఉండి | ఉండండి ! |
| 291 | 22 | వాజ్నయమం | వాఙ్మయమం |
| 296 | 25 | వానిని | వానికి |
| 303 | 26 | కలహిసారు | కలహిస్తారు |
| 308 | 12 | మానవ విశ్వ | విశ్వమానవ |
| 312 | 8 | ప్రవాహమ్మ | ప్రవాహమ్ము |
| 312 | 15 | మంచి ప్రయత్నందు | మంచిప్రయత్నంబు |
| 313 | 6 | చేపటిన | చేపట్టిన |

పునరాహ్వానము–3వ పద్యం–1వలైను–హింసాశక్తుల్–హింసాశక్తులు

# విషయసూచిక

గ్రంథ పరిష్కర్త జననీజనకులు



శ్రీ మట్టుపల్లి జగన్నాథంగారు
వారి ధర్మపత్ని శ్రీమతి మహాలక్ష్మమ్మ గారు

# శ్రీ బుద్ధగీత

## మొదటి అధ్యాయము

### (దైవసంపద యోగము)

అది వైశాఖ పౌర్ణమి. శ్రీపర్వతం దగ్గరఉన్న బౌద్ధరామంలో ఆనాడు కోలాహలంగా ఉంది. తథాగతునిపూజలు, స్తోత్రాలు వైభవోపేతంగా జరుగుతున్నవి. "బుద్ధం శరణం గచ్ఛామి. ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శర్ణం గచ్ఛామి" అనే శబ్దాలు బౌద్ధబిక్షుల ముఖం నుండి వెలువడుతూ పరిసరాలను పునీతం చేస్తున్నవి. ఆ అరామంలో ఒకప్రక్కన నిలువెత్తు బుద్ధుని ప్రతిమ—ఆ ప్రక్కనే ఒక వేదిక ఉన్నవి. ఆవేదికపై శ్రీ నాగార్జునాచార్యులవారు అగ్రాసనాన్ని అధిష్ఠించారు. బౌద్ధధర్మపరిషత్ మహాసభ ప్రారంభమైంది. శ్రీ నాగార్జునాచార్యులవారు లేచి, మేఘగంభీర స్వనంతో ఇట్లాపలికారు.

"పరిషత్‌సభకు నా నమోవాకాలు. మా ఆహ్వానాన్ని మన్నించి సుదూరప్రాంతాల నుండి విచ్చేసిన పరివ్రాజకులకు హృదయపూర్వకంగా స్వాగతంపలుకుతున్నాను. ఈరోజు బౌద్ధధర్మస్థాపకులైన తథాగతులు జన్మించిన పర్వదినం. తథాగతులు బౌద్ధధర్మప్రచారం చేస్తూ, పూర్వం ఒక పర్యాయం ఈ శ్రీపర్వతం దగ్గరకు వచ్చారు. వారివెంట ఆనందాది ముఖ్య శిష్యబృందం ఉన్నది. ఈ కృష్ణవేణీనదీతీరప్రాంతం, ఈ గిరి సౌందర్యం వారిని అమితంగా ఆకర్షించింది. ఇచ్చటి ప్రకృతి ప్రశాంతదృశ్యాలను తనివితీరా సందర్శిస్తూ కొంతకాలం ఈ ప్రదేశంలోనే వారు నివసించారు.

ఈ ప్రదేశము ధర్మక్షేత్రము. దీనికి "సాగరక్షేత్ర"మని మరియొక పేరు గూడా ఉంది. జ్ఞానసాగరమైన శ్రీ బుద్ధగీతను తథాగతులవారు ఆనంద భిక్షువుకు ఉపదేశించిన ఈ ప్రదేశానికి "సాగర"మనే పేరు సార్థకమైంది. ఈ సాగరక్షేత్రము భవిష్యత్తులో "నాగార్జునసాగర"మనే పేర విశ్వవిఖ్యాతము కాంచనున్నది. భగవానులు ప్రబోధించిన సత్యం, ప్రేమ, శాంతి, సహనం.

అహింస అనే పంచసూత్రాలు ఈక్షేత్రం నుంచే వెలువడి విశ్వకళ్యాణం గావించాయి. నిజమైన బౌద్ధభిక్షువు ఎట్లా ఉంటాడో ? ప్రవర్తనలో మహా నిర్వాణపథం ఎట్లా ప్రాప్తిస్తుందో ? చక్కగా మీకు బోధపడడానికి బుద్ధభగవానులు జేతవనంలో ఉన్నప్పుడు జరిగిన ఒక సంఘటన మీకు వివరిస్తాను. సావధానులై ఆలకించండి !

## నిర్వాణపథం :—

"సాధన, అనుష్ఠానాలు తీర్ధక్షేత్రాలలో త్వరగా ఫలవంతాలౌతాయి. మరియూ అక్షయమైన ఫలితాలు లభిస్తాయి." అని భావించి సాధుబాహియ్ సుప్పారక్ తీర్ధక్షేత్రాలలో నివసించటం మొదలుపెట్టాడు.

బాహియ్‌యొక్క జీవనం అత్యంత సరళమైంది. సాత్వికమైంది. ఆయన మనస్సులో ఏజీవిపట్లనూ వైరభావం ఉండేది కాదు. ఆయన తన సాధనలో ఏకాగ్రచిత్తుడై ఉండేవాడు. ఆయన తేజస్సుతో బాటు పేరు ప్రతిష్టలుకూడా లోకంలో వ్యాపించసాగాయి.

దగ్గరివారేకాక దూరప్రాంతాల నుండి కూడ ఆయన సన్నిధికి జనులు రాసాగారు. పాద స్పర్శ చేయసాగారు. అందరూ ఆయన్ను భగవంతుడిగా భావించి పూజించసాగారు. ఆర్తులకు అక్కడ ఎంతో సంతుష్టిగా ఉండేది. రోగాలు పోయేవి. భోజన సదుపాయాలు కూడా దొరుకుతూ ఉండేవి.

"ఈప్రపంచంలో జ్ఞానమార్గావలంబీకులలో నేనూ ఒకణ్ణి" అనిబాహియ్ భావించసాగాడు. "బాహియ్ నాకత్యంత ప్రీతిపాత్రమైనవాడు. సన్మార్గంలో ప్రయాణించటానికి ప్రయత్నిస్తున్నాడు. ఇతనికి ముక్తిసాధించాలనే కోరిక ప్రబలంగా ఉన్నది. కనుక ఇతణ్ణి సావధానచిత్తుణ్ణి చేయా"లని అతని కుల దేవత యోచించింది.

"బాహియ్ ! నువ్వుజ్ఞానివికి కాదు" అని కులదేవత అతని ముందు సాక్షాత్కరించి అంది. "జ్ఞానమార్గావలంబకుడివికూడా కాదు. కనీసం నీవా

మార్గం కూడా చూడలేదు. నీవింకా అభిమానాన్ని విడవలేదు. అభిమానం (అహంకారం) ముక్తిమార్గానికి అన్నిటికంటే పెద్ద ఆటంకము" అని అంది.

"ధన్యోస్మి, కృపామయీ" ! అని కృతజ్ఞతాభరితమైన దృష్టితో చాలా వినయంగా ఆయన ఆమెకునమస్కరించి "అమ్మా? ఈప్రపంచంలో జ్ఞానులు, లేదా జ్ఞానమార్గంలో పయనిస్తున్నవారు ఇప్పుడెవరో ? ఎక్కడున్నారో? దయచేసిచెప్పు!" అని అడిగాడు. "ఓ బాహియ్ ! ఈ ఆర్యభూమిపై శ్రావస్తీ అనే పుణ్యనగరం ఉంది. అక్కడ ఇప్పుడు, బుద్ధభగవానులు ఉన్నారు. వారు సాక్షాత్తు తథాగతులు. ఈ జగత్తుకు జ్ఞానం ఉపదేశించటం కోసం అవతరించిన దైవస్వరూపులు వారు ! ఆయన యొక్క పవిత్ర ధర్మోప దేశంచేత జీవులు భవబంధాలను తొలగించుకొని ముక్తులవుతున్నారు." అని పలికి అ కులదేవత అదృశ్యమైంది.

బాహీయ్ బుద్ధదర్శనార్థం వెంటనే బయలుదేరాడు.

బాహియ్ ఎక్కడా విశ్రమించకుండా సరాసరి జేత్‌వన్ చేరుకొన్నాడు. అతడికళ్ళల్లో బుద్ధుడే కన్పించసాగాడు. జేతవనంలోని పవిత్రప్రశాంతవాతా వరణం జూడంగానే అతని మనస్సు ప్రఫుల్లమయింది. అంతలో అచటికి బిక్షువులు రాసాగారు. బాహియ్ వారిని చూచి వినయంగా "ఓ బిక్షుకులారా! నేను సుప్పారకుడనే వాణ్ణి. జ్ఞానభిక్షార్థం బుద్ధభగవానుని కడకు వచ్చాను. వారెచటయున్నారో చెప్పవలసింది" అని అడిగాడు. అభిక్షువు లతనితో "మీరు కొంచెంసేపు వేచి ఉండండి. భగవానులు ఇప్పుడు గ్రామంలోకి బిక్షకు వెళ్ళారు" అన్నారు.

"నేను భగవానుని దర్శించకుండా ఒక్కక్షణం కూడా ఆగలేను" అని బిక్షువులకు సమాధానమిచ్చి, వాళ్ళుచూపిన దిశకేసి పరిగెత్తుకొంటూ వెళ్ళాడు. బుద్ధభగవానుడు ఒక సాధారణ గృహం ముందు నిలబడి భిక్ష యాచించడం అతడు చూచాడు. బుద్ధభగవానుని ముగ్ధమోహనరూపాన్ని చూడంగానే మైమరచి భక్తిభావావేశంతో ఆనందబాష్పాలు రాల్చాడు.

భగవానుని చరణకమలములపైబడి ధర్మోపదేశం చెయ్యమని భక్తి భావంతో ప్రార్థించాడు. "ఓ బాహియ్ ! నేనిప్పుడు బిక్షార్థం వచ్చాను. కను

అహింస అనే పంచసూత్రాలు ఈక్షేత్రం నుంచే వెలువడి విశ్వకళ్యాణం గావించాయి. నిజమైన బౌద్ధభిక్షువు ఎట్లా ఉంటాడో ? ప్రవర్తనలో మహా నిర్వాణపథం ఎట్లా ప్రాప్తిస్తుందో ? చక్కగా మీకు బోధపడడానికి బుద్ధభగవానులు జేతవనంలో ఉన్నప్పుడు జరిగిన ఒక సంఘటన మీకు వివరిస్తాను. సావధానులై ఆలకించండి !

## నిర్వాణపథం :—

"సాధన, అనుష్ఠానాలు తీర్థక్షేత్రాలలో త్వరగా ఫలవంతాలౌతాయి. మరియూ అక్షయమైన ఫలితాలు లభిస్తాయి." అని భావించి సాధుబాహియ్ సుప్పారక్ తీర్థక్షేత్రాలలో నివసించటం మొదలు పెట్టాడు.

బాహియ్‌యొక్క జీవనం అత్యంత సరళమైంది. సాత్వికమైంది. ఆయన మనస్సులో ఏజీవిపట్లనూ వైరభావం ఉండేది కాదు. ఆయన తన సాధనలో ఏకాగ్రచిత్తుడై ఉండేవాడు. ఆయన తేజస్సుతో బాటు పేరు ప్రతిష్టలుకూడా లోకంలో వ్యాపించసాగాయి.

దగ్గరివారేకాక దూరప్రాంతాల నుండి కూడ ఆయన సన్నిధికి జనులు రాసాగారు. పాద స్పర్శ చేయసాగారు. అందరూ ఆయన్ను భగవంతుడిగా భావించి పూజించసాగారు. ఆర్తులకు అక్కడ ఎంతో సంతుష్టిగా ఉండేది. రోగాలు పోయేవి. భోజన సదుపాయాలు కూడా దొరుకుతూ ఉండేవి.

"ఈప్రపంచంలో జ్ఞానమార్గావలంబీకులలో నేనూ ఒకణ్ణి" అనిబాహియ్ భావించసాగాడు. "బాహియ్ నాకత్యంత ప్రీతిపాత్రమైనవాడు. సన్మార్గంలో ప్రయాణించటానికి ప్రయత్నిస్తున్నాడు. ఇతనికి ముక్తిసాధించాలనే కోరిక ప్రబలంగా ఉన్నది. కనుక ఇతణ్ణి సావధానచిత్తుణ్ణి చేయా"లని అతని కుల దేవత యోచించింది.

"బాహియ్ ! నువ్వుజ్ఞానివికి కావు" అని కులదేవత అతని ముందు సాక్షాత్కరించి అంది. "జ్ఞానమార్గావలంబకుడివికూడా కాదు. కనీసం నీవా

మార్గం కూడా చూడలేదు. నీవింకా అభిమానాన్ని విడవలేదు. అభిమానం (అహంకారం) ముక్తిమార్గానికి అన్నిటికంటే పెద్ద ఆటంకము" అని అంది.

"ధన్యోస్మి, కృపామయీ" ! అని కృతజ్ఞతాభరితమైన దృష్టితో చాలా వినయంగా ఆయన ఆమెకునమస్కరించి "అమ్మా? ఈప్రపంచంలో జ్ఞానులు, లేదా జ్ఞానమార్గంలో పయనిస్తున్నవారు ఇప్పుడెవరో ? ఎక్కడున్నారో? దయచేసిచెప్పు!" అని అడిగాడు. "ఓ బాహియ్ ! ఈ ఆర్యభూమిపై శ్రావస్తి అనే పుణ్యనగరం ఉంది. అక్కడ ఇప్పుడు, బుద్ధభగవానులు ఉన్నారు. వారు సాక్షాత్తు తథాగతులు. ఈ జగత్తుకు జ్ఞానం ఉపదేశించటం కోసం అవతరించిన దైవస్వరూపులు వారు ! ఆయన యొక్క పవిత్ర ధర్మోప దేశంచేత జీవులు భవబంధాలను తొలగించుకొని ముక్తులవుతున్నారు." అని పలికి అ కులదేవత అదృశ్యమైంది.

బాహీయ్ బుద్ధదర్శనార్ధం వెంటనే బయలుదేరాడు.

బాహియ్ ఎక్కడా విశ్రమించకుండా సరాసరి జేత్‌వన్ చేరుకొన్నాడు. అతడికళ్ళల్లో బుద్ధుడే కన్పించసాగాడు. జేతవనంలోని పవిత్రప్రశాంతవాతావరణం జూడంగానే అతని మనస్సు ప్రఫుల్లమయింది. అంతలో అచటికి భిక్షువులు రాసాగారు. బాహియ్ వారిని చూచి వినయంగా "ఓ భిక్షుకులారా! నేను సుప్పారకుడనే వాణ్ణి. జ్ఞానభిక్షార్ధం బుద్ధభగవానుని కడకు వచ్చాను. వారెచటయున్నారో చెప్పవలసింది" అని అడిగాడు. ఆభిక్షువు లతనితో "మీరు కొంచెంసేపు వేచి ఉండండి. భగవానులు ఇప్పుడు గ్రామంలోకి భిక్షకు వెళ్ళారు", అన్నారు.

"నేను భగవానుని దర్శించకుండా ఒక్కక్షణం కూడా ఆగలేను" అని భిక్షువులకు సమాధానమిచ్చి, వాళ్ళుచూపిన దిశకేసి పరిగెత్తుకొంటూ వెళ్ళాడు. బుద్ధభగవానుడు ఒక సాధారణ గృహం ముందు నిలబడి భిక్ష యాచించడం అతడు చూచాడు. బుద్ధభగవానుని ముగ్ధమోహనరూపాన్ని చూడంగానే మైమరచి భక్తిభావావేశంతో ఆనందబాష్పాలు రాల్చాడు.

భగవానుని చరణకమలములపైబడి ధర్మోపదేశం చెయ్యమని భక్తి భావంతో ప్రార్థించాడు. "ఓ బాహియ్ ! నేనిప్పుడు భిక్షార్ధం వచ్చాను. కను

ఇది ధర్మోపదేశం చెయ్యడానికి తగిన సమయం కాదు" అని తథాగతులు పలికారు.

"ఈ జీవితం అస్థిరమైనది భగవాన్ ! ఈ క్షణాన ఉన్న నేను మరు క్షణాన బ్రతికి ఉంటానో లేదో ! కనుక వెంటనే ముక్తిమార్గమైన ధర్మోపదేశం చెయ్యండి."! అన్నాడు బాహియ్.

అప్పుడు తథాగతులు రెండవసారి శాంతంగా "ఓ బాహియ్ ! ఇప్పుడు నేను బిక్షార్థం ఒక గృహస్థుడి ఇంటిముందున్నాను. కనుక ఇది ధర్మోపదేశానికి ఉచితసమయం కాదు" అన్నారు. బాహియ్ మూడవసారి "హే భగవాన్ ! జీవనం అస్థిరమైంది. నేను ఈ క్షణంలో ఉన్నాను. కానీ ఇది శాశ్వతం కాదు. మరుక్షణంలో అస్థిత్వానికి ఠికాణాలేదు. మీరు నాపై దయ ఉంచి శాశ్వతసౌఖ్యాలను ప్రసాదించగల ధర్మోపదేశం చెయ్యండి! "అని కాళ్ళమీద పడ్డాడు.

అప్పుడు తథాగతుడు ప్రసన్నులై అతణ్ణిచూచి, ఆక్షణమే రిక్తభిక్షాపాత్రను తీసుకొని నిలబడి, ఈలా ఉపదేశం చెయ్యనారంభించారు.

"నువ్వు ఏ పని చేస్తున్నా దాన్నే చూస్తూ, దానిలోనే లీనమవ్వటాన్ని అభ్యసించాలి—అంటే— 1) చూచేటప్పుడు కేవలం చూడవలసిన దాన్నే చూడాలి. 2) స్పర్శించేటప్పుడు కేవలం స్పరించేదాన్నేస్పర్శించాలి. 3) వాసన చూచేటప్పుడు కేవలం వాసననే చూడాలి. 4) రుచిచూచే సమయంలో కేవలం రుచినే చూడాలి. 5) తెలుసుకొనేటప్పుడు కేవలం తెలుసుకోవలసినదాన్నే తెలుసుకోవాలి. దీన్నే ఏకాగ్రత అంటారు. "కర్మసు కౌశలం యోగం" అంటే ఇదే ! ఇలా చేస్తూకూడా అలక్షణాలు నీలో ప్రతిబింబించకపోతే, కోరిక నిన్నంటకపోతే అన్నిదుఃఖాలు పటాపంచలై పోతాయి. ప్రాపంచిక అపక్తియే జీవుడికి బంధనం. దాన్ని తెంచుకోవడమే నిర్వాణము. అనగా విష్కామకర్మను నువ్వు ఆచరించాలి."

భగవంతుని ఉపదేశంమాత్రంచేత బాహీయ్‌కు ప్రాపంచికవిషయాసక్తి నశించింది. బుద్ధయోగం అర్థమైంది. అత డీవిధంగా అన్నాడు. "భగవాన్ !

మీకు నే నెప్పుడూ ఋణపడి ఉంటాను. మీరు నాకు ముక్తియొక్క మూల తత్వాన్ని సాక్షాత్కరింపచేశారు." మధురమైన కృపాపూరితమైన, మందస్మిత చంద్రికలను బాహీయ్‌పై ప్రసరించి, అనుగ్రహించి, ఉపదేశమిచ్చి బుద్ధ భగవాన్ భిక్షకై ముందుకు సాగారు. బాహీయ్ అచ్చటనుండి యథేచ్ఛగా వెళ్ళిపోయాడు.

ఒకఅరగంట గడిచిందో లేదో ఒక భిక్షువు పరిగెత్తుకుంటూ భిక్షనుండి తిరిగివస్తున్న భగవానుని దగ్గరకువచ్చి "బాహీయ్ అచేతనంగా పడిపోయాడు, ఒకఎద్దు తనకొమ్ములతో ఎత్తి అతణ్ణి అవతల పడేసింది. అతని ఐహిక జీవితం పరిసమాప్తమైంది." అని చెప్పాడు- విచారంతో. తథాగతులు వెంటనే పరిగెత్తుకుంటూ బాహీయ్ శవం దగ్గరకు వెళ్ళి తన శిష్యులతో "ఓ భిక్షువు లారా ! ఇతడు మీ సబ్రహ్మచారి. ఇతని దేహానికి మీరు సంస్కారంచేసి దానిపై స్థూపం నెలకొల్పండి" ! అని ఆజ్ఞాపించారు.

ఆ ప్రకారంగానే భిక్షువులు గురు ఆజ్ఞను నిర్వర్తించారు.

ఒక భిక్షువు తథాగతులవారిని చూచి "ఈ బాహీయ్‌కి ఏలోకం ప్రాప్తిస్తుంది భగవాన్"? అని ప్రశ్నించాడు.

ప్రశాంత గంభీరవదనంతో బుద్ధభగవానులు "బాహీయ్ నాయొక్క బోధలను సరిగ్గా అర్థం చేసుకున్నాడు. అతడికి జ్ఞానికి లభించే రూపరహిత మైన, సుఖదుఃఖాతీతమైన మోక్షము (నిర్వాణం) లభించింది." అని శెల విచ్చారు.

భిక్షువులందరూ అదివిని సంతోషాంతరంగులైనారు. బుద్ధభగవానులు మౌనం దాల్చారు. శీతలసమీరం భగవానుని చరణస్పర్శచేసి ప్రసన్నంగా నృత్యం చెయ్యసాగింది.

**నిజమైన బౌద్ధభిక్షువు జ్ఞానసంపాదన విషయంలో ఒక్కక్షణాన్ని కూడా వ్యర్థం చేయడు. నిరంతరం బుద్ధబోధనలలోనే మునిగితేలుతూ మహానిర్వాణ పథాన్ని అన్వేషిస్తుంటాడు. ఇక మీకు తథాగతులు అపందాది భిక్షువులకు**

బోధించిన బుద్ధగీతను వివరిస్తాను. దాన్ని శ్రద్ధగా విని, ఆచరణలో పెట్టి నిర్వాణాన్ని సాధించండి" అని ఈలా శ్రీ బుద్ధగీతను ప్రవచించటం మొదలు పెట్టాడు.

నాగార్జున ఉవాచ :-

ధరక్షేత్రే సాగరక్షేత్రే కృష్ణవేణీ నదీతటే ।
ఆంధ్రభూమి మధ్యభాగే బుద్ధగీత ప్రబోధితం" ॥

ధర్మక్షేత్రము, పుణ్యక్షేత్రమైన సాగరక్షేత్రమున కృష్ణవేణినదీతీరమున, ఆంధ్రభూమి మధ్య ప్రదేశమున జ్ఞానసాగరమైన శ్రీ బుద్ధగీత స్వయముగా శ్రీ బుద్ధభగవానునిచే బోధింపబడినది. సాగరమువంటి బుద్ధధర్మములను ఇచ్చట బోధించుటవలన ఈ భూమికి "సాగర్" అను నామధేయము సార్థకమైంది.

తత్సభా సజ్జనాః శిలాప్రతిమారూపతిష్ఠతి ।
సక్రమశిక్షణాబద్ధా హ్యచంచలమతిస్థిరాః ॥

ఆ సభయందు సజ్జనులూ, ప్రభువులూ, భక్తులూ, యోగులూ, యోగినులూ, రాతివిగ్రహమువలె కదలక మెదలక క్రమశిక్షణాబద్ధముగా వరుసలుదీర్చి విశ్శబ్దముగా, ఏకాగ్రచిత్తము గలవారై ఆసీనులయి ఉన్నారు. అట్లాకూర్చోవటం జ్ఞాన సభాలక్షణం. జ్ఞానసభలందు గుంపులు గుంపులుగాకూర్చుండరాదు. ప్రక్కవారి భుజమునకు తన భుజము సరిగా చూచుకొని అడుగున్నర స్థలమును వదలి వరుసగా ఆసీనులు కావాలి. విశ్శబ్దముగా, ఏకాగ్రచిత్తముతో ప్రబోధములోని ప్రతి అక్షరమునూ గ్రహిస్తూ ఉండాలి. గ్రహించిన భావమును మననము చేసుకోటానికి ప్రయత్నించాలి. గోవు తాను తినిన మేతను ఎట్లా తిరిగి నెమరువేసుకొని జీర్ణము చేసుకొంటూ ఉంటుందో అదేవిధముగాజ్ఞానులు ధర్మప్రబోధమునువిని, మననము చేసుకొని, బుద్ధియందు భద్రపరచుకొంటారు. వారు అధ్యాసతోనేఉండి, ద్వైవస్మృతి కలిగి ఉంటారు. ఇదీజ్ఞానసభాధర్మము. తిన్నంతువలనకడుపునిండిందనీ, చూచినందువలనపుణ్యము లభించిందనీ, ఇక చాలనీ తృప్తిపడుట పురాణశ్రవణధర్మము.

అదిజ్ఞాన సభాధర్మము కాదు. మానవులు ఈ ధర్మములను తెలుసుకొని ఆత్మ జ్ఞానము ప్రసాదించు జ్ఞానసభాధర్మమునే అనుసరించాలి.

"ఇక్ష్వాకు విహారవాసి సర్వజన సముద్ధారి ।
ప్రసన్నమనసోవాచ బుద్ధగీతా మహోదధి ॥

బుద్ధభగవానుడు తన అరువదవ సంవత్సరమున, కృష్ణవేణీనదీతీరమున, ఆంధ్రభూమియందు ఇక్ష్వాకుభవనమున విహరించాడు. అప్పుడు తన శిష్యులైన ఆనందాదులు ప్రార్థింపగా "శ్రీ బుద్ధగీత"ను ప్రబోధించాడు. 'శ్రీబుద్ధగీత', 'బుద్ధచరిత్ర', 'ధర్మపథ' బౌద్ధమతంలో ముఖ్యమైన పవిత్రగ్రంథములు. బుద్ధమతమునందు బౌద్ధులు తప్పకుండా వీటిని పఠించాలి, అధ్యయనం చేయాలి. పై గ్రంథములలో 'శ్రీ బుద్ధగీత' ప్రధానమైంది.

ఒకరోజు బుద్ధభగవానుని గాంచి ఆయన ప్రియశిష్యుడయిన ఆనందుడు "హే ప్రభూ ! మీధర్మ ప్రబోధములను కొన్నింటిని మాత్రమే శ్రవణము చేయగలిగితిమి. మేము తెలుసుకొనవలసిన జ్ఞానవిజ్ఞానములతోకూడిన పరిపూర్ణ బోధను, మహాపరినిర్వాణమును పొందు ఆత్మతత్వస్వరూపజ్ఞానామృతమును పసాదించవలసింది." అని ప్రార్థించాడు.

అప్పుడు బుద్ధుడు ప్రసన్నవదనంతో "ఆనందా ! నీవు ఇంతవరకు నానావిధములైన అర్థనాదస్వరూపమయిన వేదములను వినటమే పుణ్యమనే భ్రాంతిలోనున్నావు. పురాణములను సరిగా అర్థం చేసుకోకపోవటం వల్ల నీ బుద్ధి వక్రించింది. పురాణాలను ఊరికే వినటంవల్లా, చదవటం వల్లా ప్రయోజనం లేదు. "ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థప్రకాశ్యతే" అని చెప్పినట్లు పురాణాల్లో ప్రతిపాదితమైన వేదాతీతమైన ఆత్మతత్వాన్ని మానవుడు గ్రహించాలి. అంతేకానీ మూఢనమ్మకాల్లో, మూఢాచారాల్లో మునిగిఉన్నంతవరకు నీకు ఆత్మతత్వస్వరూపజ్ఞానం కలుగదు".

ఆమాటలువిని ఆనందభిక్షువు "మహానుభావా! మీ పరిపూర్ణానుగ్రహం వల్ల నాకు జ్ఞానోదయమైంది. అజ్ఞానతమస్సు వీడిపోయింది. సంశయాలన్నీ తొలగిపోయాయి. నేనిప్పుడు స్థిరచిత్తుడనై ఉన్నాను. ఇంతకాలం నేను మరచి

పోయిన ఆత్మసాక్షాత్కార స్వరూపజ్ఞానం స్మృతికి వచ్చింది. భగవాన్ ! త్రికరణశుద్ధిగా మీ ఆజ్ఞను పాటిస్తాను. శాస్త్రాన్నే విశ్వసిస్తాను. ధర్మాన్నే ఆశ్రయిస్తాను. ఏదిచెయ్యాలో, ఏదిచెయ్యగూడదో అన్నఅనుమానం కలిగి నప్పుడు శాస్త్రప్రమాణాన్నే అనుసరిస్తాను. ఇకమీదట తాము ప్రబోధించబోయే "శ్రీ బుద్ధగీతాధర్మాలనే శిరసావహిస్తాను" అని అన్నాడు.

అప్పుడు బుద్ధభగవానుడు ఆయనకు ఇలా బోధించాడు. "వత్సా ! ఆనందా ! బుద్ధమతము స్వచ్ఛమైంది మరియు సత్యస్వరూపమైంది. ధృఢ విశ్వాసంతో, అసూయారహితతత్వంతో, తదేకదీక్షతో ఎవ్వరైతే ఈబుద్ధగీతను బాగుగా మననం చేసుకొని బుద్ధమతాన్ని అనుసరిస్తారో వాళ్ళు సకలపాపాల నుండి విముక్తులౌతారు. మోక్షార్హులౌతారు. ఎవ్వరైతే అజ్ఞానులై, అధర్మ ప్రవర్తకులై, అసూయాగ్రస్తులై ఈ బుద్ధగీతను తిరస్కరించి, విమర్శిస్తారో వాళ్ళు అధోగతిపాలౌతారు. బుద్ధమతావలంబులకు ఈ బుద్ధగీతను శరణు వేడటంకన్నా గత్యంతరంలేదు. బుద్ధమతం అంటే ఏమిటో తెలుసుకోవాలంటే ఈ బుద్ధగీతను హృదయస్థంకావించుకోవలసి ఉంటుంది. నేను నీకిప్పుడు ఆ బుద్ధగీతాధర్మాలను వివరిస్తున్నాను. సావధానంగా విని ఆచరణలోపెట్టు!"

బుద్ధమతం నాలుగు ప్రధానాంశాంతో కూడి ఉంది. 1) బుద్ధమతం భూమి వంటిది, భూమికి ఎవరేమి అపకారం చేసిననూ, అవమానం చేసిననూ అపవిత్రం చేసిననూ, క్షమించి దయతో వాళ్ళందరికి ఆహారమిస్తున్నది. ఈ విధంగానే బుద్ధమతము తనకు ఎవరేమి అపకారము చేసిననూ, అవమానించి ననూ, వాళ్ళనందరినీ క్షమించి దయావాత్సల్యాలతో జ్ఞానమార్గాన్ని చూపు తున్నది.

2) అది నీరు లాంటిది. నీరు ఎటువంటి మురికినీ దుర్వాసనలనూ, మాయామలినములనూ పోగొట్టుతుందో అవిధంగానే అపవిత్రతనూ, విషయ వాసనలనూ, మాయామలినములనూ. ఆనాడు ఆమ్రపాలికి తొలగించినట్లుగా తొలగించి, ఆత్మతత్వస్వరూపజ్ఞానాన్ని ప్రసాదించి మోక్షార్హతను కలిగి స్తుంది.

3) బుద్ధమతము అగ్నిలాంటిది. అగ్ని ఎటువంటి పదార్థములనైననుకాల్చి వేస్తుంది. ఎట్టి కట్టెలరాశినైనను దగ్ధము చేస్తుంది. అదేవిధముగ జన్మ

జన్మార్జితపాపరాశిని జ్ఞానము అనెడి అగ్ని దగ్ధముచేస్తుంది. "జ్ఞానాగ్నిదగ్ధ కర్మాణాం". అంగుళీమాలుడు ఎన్నో దుర్మార్గకృత్యములుచేసి, ఎంతోపాప మును మూటగట్టుకొన్నాడు. బుద్ధమతము వానిపాపమునంతయు జ్ఞానాగ్నిచేత దగ్ధముచేసి, ఒకమహాయోగిగా, మోక్షార్హునిగా జేసింది. అందువలన బుద్ధ మతము అగ్నిలాంటిదని చెప్పబడుతున్నది.

4) బుద్ధమతము సముద్రములాంటిది. అనేకములైన నదులను తనలో చేర్చుకొని "సాగరం" అనే ఒక్క పేరుతోనే అది పరిగణింపబడుతున్నది. అదేవిధముగా బుద్ధమతము అనేక కులములవారిని, అనేక సంఘముల వారిని తన మతమునందు చేర్చుకొని కుల, మత భేదములులేక "సంఘము" అనేఒక్క పేరుతోనే పరిగణింపబడుతున్నది. సముద్రము నదులు తెచ్చెడి ఆకులనూ, కొమ్మలనూ, చెత్తనూ బయటకుత్రోసివేసి పరిశుద్ధజలమును తనయందు ఉంచు కుంటుంది. అట్లాగే బుద్ధమతము సంఘమునందలి ఇంద్రియవిషయవాసన లనూ, దుష్టసంకల్పములనూ, దురభ్యాసాలనూ బయటకు త్రోసివేసి, జనులను పరిశుద్ధబుద్ధి గలవారిగానూ, మోక్షార్హులుగానూ చేస్తుంది. బుద్ధమతంలో చక్రవర్తి బింబిసారుడు, చాకలిచెన్నుడు, చెప్పులుకుట్టే వత్సలుడూ అందరూ తరించారు. శ్రీ బుద్ధగీతను ఎవరు శ్రద్ధగా చదువుతారో వారునూ, శ్రద్ధగా వినెడివారునూ సకల పాపములనుండి విముక్తులవుతారు. ఎవరు పరిపూర్ణ విశ్వాసంతో చదివి, ఆచరించి, ఇతరులకు బోధిస్తారో వాళ్ళు శ్రేష్ఠులు. వాళ్ళు పడవను నిర్మించుకొని, అనేకమందిని తమతో కూర్చుండబెట్టుకొని నదిని దాటించు నావికులుతో సమానము. తాను చదివి ఆచరించక ఇతరులకు చెప్పేవాడు గుడ్డివాని చేతి దివిటీలాంటివాడు. గ్రుడ్డివాని దివిటీ వానికి ఉపయో గించక ఇతరులకు ఉపయోగపడుతుంది. ఈ ఉపకారము చేయుటవలన గుడ్డి వానికి కించిత్ పుణ్యమూ లభిస్తుంది. అట్లే అక్షరాభ్యాసశూన్యుడైనవాడు శ్రీ బుద్ధగీతను ఇతరులకు పంచిపెట్టినాకూడా పుణ్యమును పొందగలడు.

యజ్ఞము చేయుటవలనను, తీర్థయాత్రలు చేసి నదులయందు స్నానము చేయుటవలనను ఎంత పుణ్యము లభిస్తుందని పండితులు చెప్పుచున్నారో

అంతటి పుణ్యము తనఇంటిలోనే ఉండి, డబ్బుతో అవసరములేక, తన స్వ ధర్మమునూ, తన వృత్తినీ తాను నిర్వహించుచూ, నియమిత కాలములందు ఆచారయుక్తమగు పరిశుద్ధ అంతఃకరణతో, నిశ్చయాత్మకమైన బుద్ధితో, శ్రీబుద్ధగీతను పఠించిన పైనుదహరించిన పుణ్యఫలము లభిస్తుంది. అదియును గాక కొందరు పుణ్యమును ఆపేక్షించి వివిధములైన దానములు చేస్తుంటారు. భూదానము, గోదానము, సువర్ణదానము, అన్నదానము మొదలగు దానములు చేయుటవలన లభించు పుణ్యము, శ్రీ బుద్ధగీత పఠించుటవలన లభిస్తుంది. బుద్ధమతమునందు ప్రధానమైన ధర్మము అహింస. "అహింసా పరమోధర్మః, అహింసా పరమం తపఃన్నిబుద్ధార్హత విధానోక్తం. ధర్మం అతిరమ్యవత్" బుద్ధి అర్హతననుసరించి ధర్మమును అనుసరించటం శ్రేష్ఠమైన ధర్మము. ఎదుటవాని బుద్ధిఅర్హత ననుసరించి గౌరవించాలి.

ఆనందా! ప్రకృతిప్రపంచము ప్రతిమానవుడు తెలిసికొంటున్నాడు. దేవుడు లేడని నాస్తికులు అంటున్నారు. "దేవుడు ఒక్కడే. అతడు మానవాకారుడు" అని కొందరు అంటున్నారు. మరికొందరు ముఖ్యమైన దేవుళ్ళు ముగ్గురు. వాళ్ళు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. వారికీ భార్యలున్నారు. మహావిష్ణువు ఒక్క భారతదేశములోనే అనేక అవతారాలెత్తినాడు. తల్లిగర్భాన జన్మించి, మరణించాడు. ఆయనకు భార్యలు, సంతానము కలరు. అనేకమంది దేవుళ్ళున్నారు. వారికీ భార్యలున్నారు. వాళ్ల సంతానాన్నీ కూడా ఆరాధించటం కలదు. దేవుడు సృష్టిస్థితిలయములనూ అనేక కార్యములనూ చేస్తున్నట్లూ, దేవునికి శత్రువులు, మిత్రులు ఉన్నట్లూ పండితులు చెప్పుతున్నారు. నేను శాస్త్ర ప్రమాణము చెప్పుచున్నాను. వినుము.

**అణోరణీయా మవ్యక్తం అక్షర మచలం ధ్రువం**
**పఠ్యాధారమయం సత్యం స్వయంజ్యోతిర్ పరాత్పరం ॥**

దేవుడు దివ్యతేజోమయుడు. సూక్ష్మాతిసూక్ష్ముడు. అక్షరుడు (నశించువాడు కాదు.) అచింత్యరూపుడు (చింతించనలవికాని రూపములు గలవాడు.) ఆయన సత్యము. లోకమునందు కనిపించెడి పదార్థములన్నియుఅసత్పదార్థము. అచలుడు (కదలువాడు కాదు.) ధ్రువం (చాలఎత్తునగల ప్రకృతి

తత్వము. దేవుడు సత్‌పదార్థము. ఆకాశమునకు అవల కనిపించెడిది.) భగవంతుడు సర్వమునకు అధారముగా దివ్యతేజోమయ, పరమాణువుగా నున్నాడు. అనేక దివ్యశక్తులుగల తేజోమయ రూపుడు. పరమాఅణువుకంటే సూక్ష్మమైనవాడు. సత్యస్వరూపుడు.

దైవం పరతరం నాన్యత్కించిదస్తి సనాతనం
దైవం సర్వమిదం ప్రోతం సూత్రమణిగణాయివ ॥

దైవత్వము వ్యక్తమునకూ అవ్యక్తమునకూ ఆధారముగా నున్నది. నాస్తికులు దేవుడులేడు అంటున్నారు. దేవుడులేనిదే ఏదియునూలేదు. అది యందు దేవుడు (సత్తా) తప్ప మరొక్కటేదియునూ లేదు. దేవుని దివ్యతేజశ్శక్తి వలననే సూర్యచంద్రులు ప్రకాశించుచున్నారు. దేవుని దివ్యాకర్షణ శక్తి వలననే సూర్యుడు, చంద్రుడు, సముద్రములు, హారమునందు మణులవలె కూర్చబడియున్నారు. మణుల హారమునందు లోపల యున్నదారము కనుపించుటలేదు. దారములేనిదే హారము నిలువదు. అదేవిధముగ సకలలోకములను దేవుడు దివ్యాకర్షణధారణశక్తిచేత నిలిపి, జగన్నియామకుడుగా సర్వమును ధరించి, సర్వమునకు ఆధారముగా ఉన్నాడు. నాస్తికులు తమ కంటికి కనపడని దానిని లేదు అనుచున్నారు. బుద్ధి అవ్యక్తం. కనిపించుటలేదు. కనుక బుద్ధిలేదు అనిన ఒప్పుకొనెదరా ? కనుపించనంతమాత్రాన అది లేదు అనటం అజ్ఞానము. మూర్ఖత్వము. కనుక కంటికి కనుపించనంతమాత్రాన దైవములేడని చెప్పుట భావ్యముకాదు—

**మూఢాః అవజనాంతి మాం మానుషీం తనుమాశ్రితం**
**పరంభావేన జానాంతి దైవం భూతాంతరస్థితం॥**

మానవుల్లో కొందరు దేవుడు మానవాకారుడని చెప్పుతున్నారు. ఇది సత్యముకాదు. పంచభూతములు, ఇంద్రియములు, మనస్సుతో కూడియున్న ప్రకృతిస్వరూపము దేహము. దేవుడు ప్రకృతికి అతీతమైనవాడు. సకల భూతములకు ఆధారభూతుడు. అట్టివాడు ఒకభూతముగా ఎట్లుండగలడు ? "సూర్యుడు మానవాకారుడు "అని చెప్పదగునా ? మరి సూర్యునకు తేజస్సు" నిచ్చు దేవుడు మానవాకారుడు ఎట్లు కాగలడు ? దైవశక్తి కలిగిన దేవతలను

అజ్ఞానముచేత దేవుడని భ్రమపడుచున్నాము. మానవాకారముననున్నవారు మానవులు. దైవాంశభూతులు, మహానుభావులు, గురువులు. పరలోకమం దుండువారు దేవతలు. అంతేకాని మానవాకారములో నుండువాడెవ్వడును దేవుడుకాడు. దేవుడు దివ్యతేజోమయుడు.

దైవంసత్ జన్మరహితా సర్వలోక పరాత్పరః
వివేకనిధిమర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥

కొందరు దేవుడు భూలోకమున స్త్రీలగర్భమున జన్మించుచున్నాడని చెప్పుచున్నారు. సర్వలోకములకు ఆధారభూతుడైన పరమాత్మ గర్భనరకము ననుభవించునా ? "దేవుడు పుట్టుకలేనివాడు. స్త్రీగర్భమున జన్మించువాడు కాదు" అని ఏమానవుడు తెలిసికొనుచున్నాడో అట్టివాడు ఆత్మతత్త్వము నెరిగినవాడు. సకలపాపములనుండి అట్టివాడు విముక్తుడగును. దేవుడు స్త్రీ గర్భమున జన్మించుననువాడు మహాపాపము మూటగట్టుకొని దైవమునకు దూరమగును.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ॥

దేవుడు అస్త్రముచేత, శస్త్రముచేత, ధనుర్బాణాది ఆయుధములచేత ఛేదింప బడువాడు కాదు. గాలివలన శుష్కింపబడువాడు కాదు. అందువలన ఎవరైనను తాను దేవుడనని చెప్పిన అట్టివానిని వెంటనే ఖడ్గముచే నరుకవలయును, బాణముతో కొట్టవలెను. అప్పటికి అతడు చావక బ్రతికియున్నచో అతనిని దేవుడనవచ్చును. అగ్నిలో కాల్చిన కాలకయుండిన దేవు డనవలయును. అగ్నిలో, భూమిలో పాతిపెట్టినను అతడు బ్రతికియున్నచో దేవు డనవలెను. దేవుడు ప్రకృతికి అతీతుడు.

సద్భావం సర్వభూతేషు నమేద్వేషోస్తి నప్రియః
యదాప్రకాశయత్యేకః కృత్స్నంలోక మిమంరవి ॥

దేవునకు సకలభూతములందును సమానమైన సద్భావన యున్నది. ఎవరియందునూ ద్వేషములేదు. అప్రియము లేదు. తన దివ్యశక్తిని సకల

ప్రాణులకు సమముగా ప్రసాదించుచున్నాడు. సూర్యునకు పక్షపాతములేదు. శత్రువులు, మిత్రులు అను బేధములేకయే తన తేజస్సును, వేడిని అందరికి సమముగా ప్రసాదించుచున్నాడు.

**పరమాత్మదివ్యతేజః ఆత్మరూపేణ తిష్టతి**
**సర్వభూత సముద్ధర్తా తదాంతర్జ్యోతి రనయః ॥**

పరమాత్మయొక్క దివ్యతేజస్సు సకలప్రాణుల హృదయములందునూ ఆత్మరూపమున తిష్ఠవేసికొనియున్నది. అదియే అంతర్జ్యోతి. ప్రాణులకు సకలరక్షణ ఇచ్చునది అదియే అయివున్నది. "ఉద్ధరేదాత్మనాత్మానం". "మానవులను ఉద్ధరించునది రక్షించునది, తన, అంతర్జ్యోతిస్వరూపమైనది ఆత్మయే!" అను సత్యమును మానవులు తెలిసికొనవలెను. దేవుడు శరీరమునకు వెలుపల పరలోకమునుండియో, లేక పుణ్యక్షేత్రములనుండియో, వచ్చిరక్షించునని కొందరి ధృఢవిశ్వాసము. శరీరమును రక్షించునది తన ఆత్మయే యనుసత్యమును మానవుడు తెలిసికొనవలెను.

"మానవులకు వరములిచ్చునది కోర్కెలు తీర్చునది పరిశుద్ధ ఆత్మయే" అనుసత్యమును మానవులు తెలిసికొనవలెను. తనకోరికలు నెరవేరుటకు కూడ నాలుగు కారణములు గలవు. జన్మాంతరసంస్కారము, సంకల్ప ప్రభావము, కాలశక్తి నక్షత్రబలము కలసినపుడు, ఆత్మశక్తివలన మానవునికోర్కెలు నెరవేరుతాయి. ఈ తత్వము తెలియనివారు తాను ఉపాసించిన దేవుడు ప్రసాదించాడని భ్రమపడతారు. వరములిచ్చునది తన ఆత్మయే! మూఢ నమ్మకములతో నున్నప్పుడు దాని ప్రభావముచేత మనస్సు ఆత్మశక్తిని పెడ దారిని పట్టిస్తుంది. దేవుడు వరములిచ్చుట సత్యమే అయిన లోకమున బీదవారు, వ్యాధిగ్రస్తులు, వికలాంగులు ఎందుకుండవలెను ? దేవుని దగ్గర వరముతెచ్చుకొని అందరు శ్రీమంతులుగానూ, ఆరోగ్యవంతులుగాను ఐశ్వర్యవంతులుగాను ఉండవచ్చును గదా ! కనుక దేవుడు వరము లిచ్చుచున్నాడనుట అసత్యము. మానవులు ఆత్మవిశ్వాసము కలిగి తమను తాము ఆత్మచేతనే ఉద్ధరించుకోవాలి!

సర్వభూతస్థితందేవం బహిరాంతర చరాచరం
సూక్ష్మాత్ క్షిప్రమహాజ్ఞేయం దూరస్థ చాంతికేచతత్ ॥

పరమాత్మ దివ్యశక్తి సర్వవ్యాపకముగానున్నది. శరీరముల వెలుపలనూ లోపలనూ నిండియున్నది. ఆత్మగా శరీరమునకు అంతర్భాగమున దగ్గరగా నున్నది. ఆత్మతత్వ జ్ఞానముగలవారికి అతిసమీపముగానూ, ఆత్మతత్వంతో జ్ఞానములేని మూఢనమ్మకముగలవానికి అతిదూరముగాను దేవుడున్నాడు. అతి సూక్ష్మముగానున్నాడు. అనంతముగను, విత్తనమువలెనుఉన్నాడు. మర్రి విత్తనము అతి సూక్ష్మముగ ఉంటుంది. దాని నుండి వెలువడిన చెట్టు బ్రహ్మాండముగా నుండును కదా! అటులనే దైవతత్త్వము సూక్ష్మముగాను, విశాలముగాను ఉన్నది.

జ్యోతిర్జ్యోతిః పరంజ్యోతిః కూటస్థమచలంధృవం
అంతర్జ్యోతిస్స్వరూపాయ సాజ్యోతిః పరముచ్యతే ॥

పరంజ్యోతి సూర్యచంద్ర నక్షత్రాగ్నులుల యందుండి ఏ వెలుగుతో లోకములను ప్రకాశింపజేయుచున్నదో ఆ వెలుగు దేవునిదిగా తెలిసికొనుము. ప్రతిప్రాణియందును అంతర్జ్యోతి ఉన్నది. మిణుగురు పురుగు "ఓమానవులారా! నాలోని అంతర్జ్యోతిని నేను చూచితిని దానిని వెలుపలకు తీసి మీకు చూపు చున్నాను. చూడుడు. తెలిసికొనుడు. మీలోని అంతర్జ్యోతిని దర్శింపుడు. తరించుడు "అని చెప్పుచున్నది. మానవుల శరీర అంతర్భాగములందు అంతర్జ్యోతి ఉన్నది. కాని మనము గుర్తించటంలేదు. మానవులు నిద్రించు నప్పుడు కన్నులనుమూసికొని వెలుపలి ఏ వెలుతురును చూచుటలేదు. కలలో ఏదో వెలుగులో అనేక విషయములనూ, దృశ్యములనూ చూచు చున్నాము. ఏ వెలుగులో చూచుచున్నామో ఆ వెలుగే అంతర్జ్యోతి. ఏ నేత్ర ముతో చూచుచున్నామో అదియే జ్ఞాననేత్రము! మానవులారా! స్మృతికి తెచ్చు కొనుడు. మీలో అంతర్జ్యోతి ఉన్నది. బయట చూచునేత్రములుగాక జ్ఞాననేత్ర మున్నది. సామాన్యులు ప్రకృతి తత్వభ్రాంతిలో పడి విషయాసక్తులగుచు న్నారు. ఆత్మతత్వ స్వరూప జ్ఞానముగలయోగులు ఎప్పుడూ అంతర్జ్యోతిని చూచుచు ఆత్మానందము ననుభవించుచున్నారు.

పరమాత్మన్ పరంధామం పరంజ్యోతిం పరాత్పరం
పరమం పావనం సత్య మాదిదేవ మజం విభుమ్॥

ఏ స్థానమును సూర్యుడు, చంద్రుడు, అగ్ని ప్రకాశింపచేయలేవో, అట్టి దివ్యతేజోమయస్థానమే పరంధామము. ఏ స్థానమును పొంది జీవుడు తిరిగిజన్మించునో అట్టి అమృతత్వముగల స్థానమే పరంధామము. మోక్షస్థానమునుపొంది సచ్చిదానందమును పరమశాంతిని పొందెదరో అట్టి సచ్చిదానంద పరమ శాంతిస్థానమే పరంధామము. జీవుడు అట్టి పరమ పవిత్రమైన స్థానమును (పరంధామమును) చేరుటే మోక్షము. కొందరు జీవుడు దేవునియందైక్యమై పోవుటయే మోక్షమని చెబుతారు. అది అశాస్త్రీయము. అపార్థము. మరి కొందరు "దేవుడే జీవుడు. మాయతోకూడియున్నపుడు జీవుడు. మాయా రహితుడు దేవుడు" అని చెప్పుచున్నారు. అది సరిగాదు. సత్యముకాదు. దేవుడు అచలుడు. జీవుడు దేవునియందు కలిసిన చలనము ఏర్పడును కదా? అచలతత్వమునకు భంగము కలుగును కదా? అందువలన అది సత్యముకాదు. మాయాతీతుడు దేవుడు. దేవునకు మాయ ఆవరించుట ఎట్లు? సూర్యునికి చీకటి పట్టగలదా? సూర్యుని తేజస్సునకు చీకటి పటాపంచలైపోతుంది కదా? అటులనే దేవుని దివ్యశక్తికి మాయ పటాపంచలైపోతుంది. దేవుని మాయ ఎటుల ఆవరించగలదు? దేవుని అంశమైన అక్షరతత్త్వము కలిగి పరంధామమునందు ఉద్భవించినవాడు జీవుడు. అతడు తన జన్మస్థానమైన పరంధామమునుచేరుటయే మోక్షము. దేవునియందు లీనమగుట కాదు. పరంధామమునందు ఉద్భవించిన జీవుడు మనసుతోకూడిన ఆరింద్రియములచేత ఆకర్షింపబడి శరీరములందు కర్మబద్ధుడై బంధింపబడి, ప్రవృత్తిమార్గమున బడి జననమరణ, చక్రమునబడి తిరుగుచున్నాడు. ఆపరమాత్మను ఆపరంజ్యోతిని ఆపరాత్పరుని ఆశ్రయించి ఆత్మతత్త్వ స్వరూప జ్ఞానమునుపొంది యోగసాధన చేసి పరంధామము చేరి, జన్మరాహిత్యమొనరించుకొని జీవుని ఉద్ధరించుకోవాలి. అదియే మానవులుగ జన్మించినందుకు చేయవలసిన కర్తవ్యము. లేకున్న మానవులు-జంతువులు పక్షులు, మృగములతో సమానమౌతారు. తిరుగుట, తినుట, నిద్రపోవుట, సంతానోత్పత్తి చేయుట, భయపడుట మొదలైనవి మానవధర్మములుకావు. అవిజంతువుల ధర్మము. మానవుడు ఈజన్మయందే ఆత్మతత్త్వ

స్వరూప జ్ఞానమునుపొంది మోక్షార్హతను పొంది, పరంధామను చేరుటయే మాన వులుగా జన్మించినందులకు, మనం చేయవలసిన పురుషార్ధము. జన్మ సార్ధకము. దేవుని గురించి విశేషించి తెలిసికొనన నవసరములేదు. జీవుని గురించి తెలిసికొని జన్మరాహిత్యము చేసికొనవలెను.

బుద్ధుని చంపుటకు నాలుగుమారులు హత్యాయత్నములు జరిగిన్నవి. అంగులీమాలుడు హత్యచేయుటకై వచ్చి పాదాక్రాంతుడైనాడు. మదపుటేనుగు చంపుటకువచ్చి పాదాలపై బడినది. దేవదత్తుడు చంపుటకు దొరలించిన పెద్దరాతిబండ ప్రక్కనబడి ముక్కలైనది. ఇది బుద్ధుడు ఆత్మశక్తి ప్రభావము. తన్ను తాను రక్షించుకొని లోకాన్ని తథాగతులుఉద్ధరించారు. ఎవరినీ చంపలేదు. ఎవరిచేత దెబ్బలు తినలేదు. ఎవరిని కొట్టలేదు. ఇది జ్ఞాని లక్షణము.

జ్ఞానంతే హంస విజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః
జ్ఞాన విజ్ఞాన సహితం యజ్ఞాత్వా మోక్షసే శుభాత్ ॥

జ్ఞానవిజ్ఞానములను శేషములేకుండా తెలిసికొనినవాడు, జ్ఞానవిజ్ఞానములు రెండింటిని తెలిసి ఆచరణలో పెట్టేవాడు మోక్షార్హుడు. అదే కొరత లేని జ్ఞానతత్వము. జ్ఞానమనగా అక్షరమైన దైవతత్వమును తెలిసికొనుట. విజ్ఞానమనగా నశించే పదార్ధ వస్తుతత్వమునుగురించి తెలిసికొనుట. దానినే పదార్ధ విజ్ఞానము అంటారు. అది సత్యమైనది. దివ్యమైనది. నీకు అనుబం ధముగాఉండే దైవతత్వమే సత్యమైనది. దానినే మనము పొందవలసి ఉన్నది.

# రెండవ అధ్యాయము
## (సృష్టి సంభవయోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :-

బుద్ధ ధర్మములోత్యాగమునకు మహోన్నతస్థానమున్నది. ఈ సృష్టిలోని ప్రతి ప్రాణియు పరోపకారబుద్ధి కలిగే ప్రవర్తిస్తున్నది. చీమలూ, కాకులూ మొదలైన క్రిమికీటక పశుపక్ష్యాదులేకాక క్రూరమృగములు సైతము తమ జాతి మృగములయెడ పరోపకారభావంతో మెలగుతున్నవి. కానీ మానవుడు మాత్రము తోటి మానవుణ్ణే ద్వేషిస్తున్నాడు. ప్రేమించటం లేదు. ఒకవేళ ప్రేమిస్తున్నట్లు కనిపిస్తున్నా అది స్వార్థంతోనే కాని పరోపకారబుద్ధితోగాదు. ఈసత్యాన్ని మానవుడు గమనించి త్యాగబుద్ధితో నిత్యము ప్రవర్తిస్తూ ఉంటేనే కాని నిర్వాణపథాన్ని చేరుకోలేడు. ఈ విషయం మీకు బోధపడటానికి ఒక కథ చెబుతాను. వినండి !

బోధిసత్త్వుడు ఒకసారి అరిష్టపురమహారాజుకు పుత్రుడై పుట్టి, శిబి అనే పేరుతో రాజ్యాన్ని న్యాయమార్గంలో పరిపాలించాడు. ఆయన తన రాజ్యంలో ఎక్కడా క్రూరకర్మలు జరుగరాదని శాసించాడు. ప్రజలను కన్నబిడ్డలవలె చూచుకొనేవాడు. ఆరు పెద్ద అనాథశరణాలయాలు తనరాజ్యంలో కట్టించి, అవి ఎట్లా నిర్వహించబడుచున్నవో-ప్రతినెలా-అక్కడికిపోయి వాటిని తనిఖీ చేస్తూ వస్తూండేవాడు. తన రాబడిలో ఎక్కువభాగాన్ని దానధర్మాలకై వినియోగిస్తూండేవాడు. ఎవరైనా నిజంగా కావాలని కోరుకుంటే తన మాంసాన్నిగానీ, కన్నులను గానీ దానం చేయాలని ఒకరోజు ఆయన అనుకొన్నాడు.

ఆవిషయం ఇంద్రుడు తెలుసుకొని. ఆయన్ను పరీక్షించాలని, ఒక గ్రుడ్డి బిచ్చగాడిరూపంతో ఆయన దగ్గరికివచ్చి, మొదట ఒకకన్నును యాచించాడు. బోధిసత్త్వుడు తన భార్యా, సంతానమూ, పరివారమూ అట్లా ఇవ్వవద్దని ఎంత ప్రాధేయపడి, దుఃఖిస్తున్నా లెక్కపెట్టక, బాధను ఓర్చుకొని, కన్ను పీకిఇచ్చాడు. ఇంద్రుడు రెండోకన్నుగూడా అడిగితే ఆ కన్నుకూడా పెరికి ఇంద్రుడికి ఇచ్చివేశాడు.

కొన్నిరోజులకు బోధిసత్త్వుడు తాను తాపసికాదలచి, అరణ్యానికి పోదలచి, తన నిర్ణయాన్ని సభాసదులకు తెలియజేశాడు. ఆయన తన నిర్ణయాన్ని మార్చుకొనేవాడుకాదని అందరికీ తెలియటంచేత-ఒకప్రక్క విచారిస్తూనే-వాళ్ళు ఆయన్ని ఒక బంగారు పల్లకీలో కూచోపెట్టి, అరణ్యంలోకి తీసుకుపోయి, ఒకసరోవరతీరమున వదలిపెట్టారు. ఇంద్రు డతని త్యాగాన్ని ప్రశంసిస్తూ "ఓ శిబిప్రభూ ! నీవు చేసిన త్యాగంవల్ల నీకు అమరదృషికలిగింది. నీకుకలిగినదృష్టివల్ల శతయోజనపర్యంతం ఏ అడ్డులేకుండా నీకు చూచేశక్తి కలుగుతుంది. భూతభవిష్యత్ వర్తమానాల జ్ఞానం నీకు కరతలామలకమౌతుంది." అని జ్ఞాననేత్రాన్ని ప్రసాదించాడు.

మహారాజ్ బోధిసత్వునికి కలిగిన జ్ఞానదృష్టి విషయం అందరికీ తెలిసిపోయింది. అందరూ తనను కీర్తిస్తుంటే అది చూచి బోధిసత్వుడు "ఓ ప్రజ్ఞలారా ! మీ కందరికీ నా జ్ఞానదృష్టి ఎట్లావచ్చిందో అర్థమైందికదా ! కనుక ఇతరులకు ఇవ్వకుండా ఇకమీదట మీరు మీ ఆహారాన్ని తీసుకోవద్దు. ఆత్మత్యాగానికి మించిన ధర్మం మరొకటి లేదు" అని బోధించాడు. జనులు ఆయన బోధించిన ధర్మమార్గాన్ని అనుసరించి జ్ఞాను లయ్యారు.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

ప్రబుద్ధులారా! ప్రపంచంలో సృష్టిరహస్య మొకటున్నది. ఈ సమస్త లోకములను, ప్రాణులను ఎవరుసృష్టించారు? వివిధమతములు, పురాణములు మొదలగునవి భగవంతుడు సృష్టించినట్లు వర్ణించాయి. నాస్తికులు భగవంతుడు లేడని, ప్రకృతివల్లనే సృష్టి ఏర్పడిందని అంటారు. కాని భగవంతుడు సృష్టించటంలేదు. దైవశక్తి ఆధారముతో ప్రకృతిజీవుల కలయికవలన (స్త్రీ పురుషాదుల కలయికవలన) ప్రాణులు ఉద్భవిస్తున్నవి. ఆదియందు పరమాత్మ దివ్యశక్తి సత్తాగా అంతటా వ్యాపించి ఉన్నది. అదితప్ప అన్యము లేదు. పరమాత్మతత్వము నాలుగు దివ్యాంశలు కలిగి ఉన్నది. 1) దివ్యతేజస్సు 2) ధృవాకర్షణ శక్తి 3) సచ్చిదానందము 4) అక్షరత్వము. దివ్య తేజం నుండి వెలువడిన కిరణములవలన పరంధామం ఏర్పడింది.

దీనినే "త్రిపాదస్యామృతందివి" అని కీర్తిస్తారు. అది స్వయంప్రకాశం. అనంతసూర్యులకంటే ప్రకాశవంతంగా అది ఉంటుంది. అసంఖ్యాక చంద్రులకంటే అది అమృతమయంగా ఉంటుంది. తేజోమయకిరణజన్యక్రియ వలన జీవులు ఉద్భవించారు. వీరు పరమాత్మసదృశులు. అక్షరులు. సచ్చిదానంద స్వరూపులు. పరమాత్మ దివ్యతేజస్సునుండి పరంధామము ఏర్పడుట వలన కొంతభాగము మూడవస్థానంగా ఏర్పడింది. అదియే ప్రకృతిస్వరూప మాయ. అది భ్రాంతి భ్రమలను కల్పిస్తుంది. అదికూడా పరమాత్మశక్తివలన ఏర్పడినదే ! అయినసూ దాని తత్వములు మాత్రము వేరయినవి. ఈ మూల ప్రకృతి విచ్ఛిన్నమై ఎనిమిది భాగములయినది. 1) భూమి 2) అగ్ని 3) అగ్ని 4) వాయువు 5) ఆకాశము 6) మనస్సు 7) బుద్ధి 8) అహంకారము ఈ భిన్న ప్రకృతులవలన అనేక సూర్యులు (నక్షత్రములు) ఏర్పడినవి. పంచభూతములందు విరుద్ధమైన తత్వములుండుటవలన నక్షత్రములలో కూడా విరుద్ధలక్షణములు ఏర్పడినవి. సూర్యుడు అగ్నితత్వమైన భూతము నుండి ఏర్పడుటవలన వేడి, వెలుతురు లక్షణములుగా కలిగియున్నాడు. భూమినుండి నీటిని తపింపజేసి, సూక్ష్మమైన ఆవిరిరూపమున పైకితీసుకొనుచున్నాడు. చంద్రుడు జలతత్వమున ఉద్భవించుటవలన భూమికి చల్లదనమునూ, రసతత్వమునూ ఇస్తున్నాడు. ఈ విరుద్ధ లక్షణముల వలన సకల ప్రాణి సముదాయము ప్రకృతిజీవుల కలయికవలన ఎర్పడింది. కానీ వాటిని దేవుడు సృష్టించటంలేదు. భూమిమీద ఉద్భవించిన ప్రాణులన్నీ నక్షత్రములనుండి వెలువడు ప్రకృతికి లోబడి ఉంటున్నవి.

మనస్సుతోకూడిన ఆరు ఇంద్రియముల ఆకర్షణశక్తి వలన జీవుడు ఆకర్షింపబడి, తన స్వస్థానమైన పరంధామమును వదలి శరీరములో బంధింపబడుచున్నాడు. ప్రజాపతి నక్షత్ర సముదాయమునుండి వెలువడిన ప్రకృతి, పురుషనక్షత్రమును దాటి జీవుని కలయికవలన పురుషుడుగా ఏర్పడుతున్నది. ప్రజాపతి నక్షత్రసముదాయమునుండి వెలువడిన ప్రకృతి కన్యానక్షత్రం (రాశి)గుండా ప్రయాణించి జీవుని కలయికవలన స్త్రీగా ఉద్భవిస్తున్నది. ఈ ప్రకారంగా స్త్రీ పురుష లింగబేధము ఏర్పడుటకు కారణము పురుష, కన్యా నక్షత్రములు.

సింహరాశి అగ్నితత్త్వంవల్ల ఏర్పడింది. అందువలన దానికి క్రూరత్వ మున్నది. వృషభరాశి జలతత్త్వంతో ఏర్పడింది. అందువల్ల దానిలో సాత్త్వికత్వం ఉన్నది. సింహరాశి అగ్నితత్త్వం, వృషభరాశి జలతత్త్వం కావటం వల్ల ఆ నక్షత్రాలనుండి వెలువడిన ప్రకృతిజీవుల కలయిక వలన ఏర్పడిన ప్రాణులకు పరస్పరం విరోధం కలుగుతున్నది. ఈ కారణం చేతనే సింహం ఎద్దును చంపుతున్నది. నక్షత్రములనుండి వెలువడిన ప్రకృతి కారణంగా ప్రాణులమధ్యశత్రుత్వంఏర్పడుతున్నది. అంతేకాని ప్రాణులమధ్య శత్రుత్వాన్ని దేవుడు సృష్టించటంలేదు. సకలప్రాణులకు ప్రభువైన దేవుడు ప్రాణులమధ్య శత్రుత్వాన్ని సృష్టించుచున్నాడనుట నమ్మదగిన విషయం కాదు. ఆయనకు సకలభూతములయెడ సమదృష్టి ఉన్నది. ఆయన ఏ ప్రాణినీ ద్వేషించడు. ఏప్రాణిని ప్రేమించడు. నక్షత్రములనుండి వెలువడిన ప్రకృతికారణంగా ప్రాణులమధ్య శత్రుత్వ మేర్పడుచున్నది. అంతేకాని ప్రాణులమధ్య శత్రుత్వానికి భగవంతుడు కారణంకాదన్నసత్యాన్ని మనం గుర్తించవలెను. మేషరాశినుండి వెలువడిన ప్రకృతి జీవులకలయికవలన మేకగా ఏర్పడింది. భూమిమీద ఎన్నిరకాలయిన ప్రాణులున్నవో వానికి సంబంధమైన నక్షత్రములన్నియూ అంతరిక్షమున నున్నవి. ఆ నక్షత్రముల ప్రభావం ప్రాణుల జీవితములందు ప్రతిఫలించటంవల్లనే కష్టసుఖములు, రాగ ద్వేషములు కలుగుచున్నవి.

మనస్సుయొక్క సంకల్పప్రభావం వలన ఆదిలో సృష్టి ఏర్పడింది. అందువల్లనే దానికి సంకల్పసృష్టి అని పేరు వచ్చింది. మనస్సుయొక్క ప్రభావం వల్లనే దేవతలు, మానవులు, దానవులు సృష్టింపబడ్డారు. ఆతర్వాత కొంతకాలానికి మిధునరాశి ప్రాదుర్భవించింది. ఆరాశి ప్రభావంవల్ల స్త్రీ, పురుష ప్రాణులయందు కామోద్రేకం కలిగి పరస్పర సంపర్కం మొదలయింది. అప్పటినుండి సంకల్పసృష్టిమారి సంపర్కసృష్టి ప్రారంభమైంది. ఇప్పుడు సృష్టిఅంతయూ సంపర్కసృష్టియేస్సృష్టి. అనగా స్త్రీ, పురుషులవలననే ప్రాణులయందు కామోద్రేకం కలిగి పరస్పర సంపర్కము మొదలయింది. అప్పటి నుండి సంపర్క సృష్టి ప్రారంభమైంది. ఇప్పుడు సృష్టి అంతయూ సంపర్కసృష్టియేఅనగా స్త్రీ, పురుషుల వలననే సృష్టికలుగుచున్నది. అంతే

కాని దేవుడు సృష్టించుటలేదు. "నకర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః" ప్రభువైనదేవునకు కర్మలతోగాని, సృష్టితోగాని సంబంధంలేదు. ఆయన సర్వమునకూ ఆధారము, సాక్షీభూతుడు మాత్రమే. సూర్యుని వలన సంపర్కసృష్టిపరివర్తన చెందుతున్నదేకానీ దేవునివల్లకాదు. సూర్యకిరణజన్య సంయోగ క్రియవలన మేఘములేర్పడి వర్షము కురియుచున్నది. ఈ వర్షము వలన పంటలు పండుచున్నవి. ఆ పంటలను మానవులు ఆహారముగా తీసుకొనుచున్నారు. ఆ ఆహారము రక్తముగా మారుచున్నది. ఆ రక్తము నుండి శుక్రము, స్త్రీలకు శోణితము ఉత్పత్తి అగుచున్నది. స్త్రీ పురుష సంపర్కము వలన శుక్రశోణితములు కలసినపుడు జీవుడు ఆకర్షింపబడి ప్రాణిగా ఏర్పడుచున్నాడు. స్త్రీ పురుషులు ఆరోగ్యవంతులుగా నున్నచో వారి సంతతి ఆరోగ్యవంతంగా ఉంటుంది. కనుక తమ పిల్లలు ఆరోగ్య వంతులుగా ఉండవలెనన్నచో ముందు తల్లిదండ్రులు ఆరోగ్యవంతులుగా ఉండాలి. అట్లుగాక వారు వ్యాధిగ్రస్తులైనచో ఆ వ్యాధులన్నియూ సంతానమునకు సంక్రమిస్తాయి. ఆరోగ్యమే మహాభాగ్యమని తల్లిదండ్రులు పరిపూర్ణమైన దైహిక, మానసికారోగ్యము కలిగిఉండుటకై వ్యాయామము, ప్రాణాయామము, ధ్యానము నిత్యమూ అభ్యాసం చేస్తూండాలి.

మానవులను దేవుడే సృష్టించినచో తల్లిదండ్రుల వ్యాధులు, పోలికలు వాళ్ళబిడ్డల కెందుకువస్తున్నవి ? స్త్రీ పురుష సంపర్కము వలన జీవోత్పత్తి కలుగుచున్నదే కానీ దేవునివలన కలుగుటలేదు. స్త్రీలకు ప్రతినెల రక్తస్రావ మౌతుంది. అప్పుడు వాళ్ళగర్భకోశం వికసిస్తుంది. ఋతుకాలమున పురుష సంపర్కమువలన శుక్రశోణితములు కలసి గర్భమేర్పడుతున్నది. గర్భకోశము వికసించనిదే, శుక్రశోణితములు కలవనిదే గర్భమేర్పడదు. సంతానము కలుగదు. సంతానము కలుగకపోవుట అన్నది పురుషుని నిగ్రహశక్తిమీద ఆధారపడియున్నది. స్త్రీ పురుషులిద్దరూ బ్రహ్మచర్యమనుసరించినచో దానిని గృహస్థబ్రహ్మచర్యమంటారు. ఈ బ్రహ్మచర్యము నాలుగు విధములు. 1) అస్ఖలిత బ్రహ్మచర్యము :- అనగా పుట్టినది మొదలు స్త్రీ సంపర్కము లేక వైరాగ్యవృత్తిలో ఉండటం 2) సన్యాసబ్రహ్మచర్యము :- అనగా పెండ్లి చేసుకొని గాని లేక ఒక స్త్రీని ప్రేమించిగానీ, కొంతకాలంపాటు స్త్రీ సుఖము

ననుభవించి ఆ తరువాత విరక్తుడై, విషయవాంఛలను విడచి, బ్రహ్మచర్యముతో చరించటం 3) గృహస్థబ్రహ్మచర్యము-అనగా వివాహముచేసికొని సంతానము పొందిన తరువాత భార్యతో సంపర్కము పెట్టుకొనక జీవనం చేస్తూ ఉండటం 4) వానప్రస్థ బ్రహ్మచర్యము :- అనగా వివాహము చేసుకొని, సంతానం పొంది, సంసార బాధ్యతలను తన సంతానమున కప్పగించి భార్యాభర్తలిద్దరు కలసిగానీ లేక భర్త ఒక్కడేకానీ అడవికిపోయి బ్రహ్మచర్యాన్ని అవలంబించడం. దేవుడికి పదిలుఅవతారాలున్నవని పండితులుచెప్పుచున్నారేగానీ జీవుడికిగల పదిఅవస్థలను గురించి చెప్పటంలేదు. జీవుడికి పది అవస్థలున్నవి. శుక్రశోణితముల మిశ్రమము వలన మొట్టమొదట మానవుని అకారము గర్భకోశములో ఏర్పడుతుంది. అది ద్రవరూపంలో ఉంటుంది. అందువలనజీవుడికి 'బింద్వ్యావస్థ' కలిగింది. ఆద్రవం ఘనీభవించి "బీజం" లాగా ఒకచిన్న మాంసఖండంగా ఏర్పడుతుంది. అది "బీజావస్థ". తరువాత చెట్టు ఎలాగైతే వేళ్ళనుండి నీళ్ళనూ, ఆకులనుండి గాలినీ పీల్చుకుంటుందో అట్లా నాభినుండి ఆహారాన్నీ, శిరస్సుపైభాగంనుండి గాలినీ జీవుడు తీసుకుంటాడు. అది "వృక్షావస్థ." గర్భమునుండి వెలువడినతర్వాత, శుచి, శుభ్రము తెలియక మలమూత్రాలలో పడి జంతువులాగా సంచరిస్తాడు. అది "జంతుఅవస్థ". అటుపిమ్మట బుద్ధి వికసించి విద్యాభ్యాసం చేస్తాడు. అది "బాల్యావస్థ". తర్వాత బాధ్యత తెలుసుకుంటాడు. అది "కౌమారావస్థ". "యౌవనావస్థ"లో సంతానం కలుగుతుంది. అది "పితావస్థ." తర్వాత మనుమలు కలుగు అవస్థ "పితామహావస్థ." అటుపైని శరీరం పటుత్వం తగ్గిపోయి వృద్ధావస్థ ఏర్పడుతుంది. ఈవిధంగా జీవుడికి పదిఅవస్థలున్నాయి

మనస్సుకు సంకల్ప ప్రభావమున్నది. అదియందు సృష్టికి సంకల్పమే ఆధారము. ఇప్పుడుకూడా కొంత సంకల్పప్రభావము జీవునకు అన్వయించుచున్నది. దాంపత్యసమయమునందలి సంకల్పప్రభావము జన్మించబోవు బిడ్డ జీవితముపై ప్రభావము చూపిస్తున్నది. గర్భవతియైన స్త్రీ అనుభవించే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ సంకల్పాలు గర్భములో నున్నబిడ్డకు కూడా అందుతూ ఉంటవి. అందువల్ల గర్భవతులైన స్త్రీలు సద్గ్రంథములు పఠించాలి. సత్‌శ్రవణం చెయ్యాలి. సద్భావన, సత్‌సంకల్పములు చేస్తూఉండాలి.

రాగద్వేషములు మనసునందుండరాదు. భయాందోళనలను, కోపోద్రేకములను కలిగించు పుస్తకములను చదువరాదు. ఉద్రేకము కలిగించు దృశ్యములు చూడరాదు. అటువంటి మాటలు పలుకరాదు. లేనిచో ఆరాగద్వేషములు మొదలైన వన్నియు గర్భములోనున్న బిడ్డపై తన ప్రభావం చూపిస్తాయి.

జీవుడు తనశరీరాన్ని విడచిపెట్టి మరొకశరీరములోకి ప్రవేశించటానికీ, అతని మనసులోని భావనకూ సంబంధముంది. జీవుడు శరీరాన్ని విడిచేటప్పుడు అతని మనస్సులో ఏభావన ఉంటుందో ఆ జీవుడు ఆ స్వరూపాన్ని గ్రహించి తిరిగి జన్మిస్తాడు. దీనికి ఉదాహరణముగా మీకొక కథ చెబుతాను. ఒకప్పుడు ఒకమహారణ్యంలో ఒకముని ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చేసుకొంటూ ఉండేవాడు. ఒకరోజు ఆయన స్నానార్థం నదీతీరానికి వెళ్ళాడు. ఆసమయంలో ఒకపెద్దపులి ఒకజింకను తరుముకుంటూ వచ్చింది. జింక భయంతో పరుగెత్తుకుంటూవచ్చి నదిలోకి దూకింది. దాని గర్భంలో ఉన్న పిల్ల ఒడ్డుమీదపడింది. తల్లిజింక పారిపోయింది. జింకపిల్లపై జాలిపడి దానిని తీసుకొని ముని ఆశ్రమానికి వచ్చాడు. ఆ జింకపిల్లను కన్నబిడ్డలాగా ప్రేమిస్తూ పెంచసాగాడు. కొంతకాలం గడచింది. ఆమునికి మరణసమయం ఆసన్నమైంది. ఆ సమయంలో ఆయన మనస్సు జింకపిల్లపై లగ్నమైంది. ఆకారణం వల్ల ఆముని మరుజన్మలో జింకయై జన్మించాడు. పూర్వం ఒకచక్రవర్తి ఉండేవాడు. ఆయన ఎల్లప్పుడు అంతఃపురములోనేఉంటూ భోగాల్లో విలాసాల్లో తేలిపోతూ ఉండేవాడు. అంతఃపురాన్ని విడచి ఎప్పుడూ బయటకూ వచ్చేవాడుకాదు. తన అంతఃపురాన్ని ఒకసుందరమైన ప్రపంచంగా శిల్పులచే తయారుచేయించుకొని, ఆ దృశ్యాలుచూస్తూ, ఆనందిస్తూ ఉండేవాడు. ఆయన అంత్యకాలంలోకూడా ఆ అంతఃపురంపైగల వ్యామోహం తగ్గలేదు. జీవుడు ఆశరీరాన్ని విడిచి ఇల్లు తన నెత్తిపై పెట్టుకొని తిరిగే నత్తగుల్లగా పుట్టాడు. చూచితిరా ! దేవుడు మానవుని జింకగా పుట్టించాడా? నత్తగుల్లలాగా పుట్టించాడా? దేవునిచేతిలో సృష్టిలేదు. మానవుని సంకల్పములోనే సృష్టి ఉన్నది.

"మానవసృష్టి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అని నాలుగు విధములుగా ఉన్న"దని పండితులు చెబుతున్నారు. అది సరికాదు. అదే

సత్యమైనచో ప్రపంచమందున్న అన్ని దేశములలో ఈ నాలుగువర్ణముల వారు ఉండాలి. కాని అట్లుండలేదు. భారతదేశమునతప్ప మరేదేశములోనూ ఈ వర్ణములు లేవు. సృష్టి నాలుగువిధములుగా అనగా 1) పిండోత్పత్తి, 2) అండోత్పత్తి 3) బీజోత్పత్తి 4) జీవోత్పత్తి అనువిధములుగా ఉన్నది. ఈ విధానము ప్రపంచమందన్నిదేశములయందునూ కలదు. పిండోత్పత్తి అనగా తల్లిగర్భములోనే పూర్తిగా శరీరమేర్పడి ఆ తర్వాత జన్మించుట. అండోత్పత్తి అనగా తల్లిగర్భమున గుడ్డుగా ఏర్పడి బయటకువచ్చి తన అసలు స్వరూపం పొందటం. బీజోత్పత్తి అనగా విత్తనములు భూమిమీద పడిమొలకెత్తుట. జీవోత్పత్తి అనగా అంతకుపూర్వము ఏవిధమైన రూపమూ లేక, ప్రకృతి జీవుడు కలుసుకొని ప్రాణిగా ఏర్పడుట. ఈ జీవులు సూక్ష్మాకారములో ఉంటవి. మానవుని శరీరముపై కురుపులేచినపుడు అందులోనుండి పురుగులు పుడతాయి. మలమూత్రాలనుండి కూడా పురుగులు పుడతాయి. చెట్లకు పట్టుచీడపురుగులు, మనకడుపులోనున్న నులిపురుగులు మొదలైనవన్నియూ ఉ జీవోత్పత్తికి సంబంధించినవే. ఇదే సరియైన సృష్టి విధానము. అంతేకాని బ్రాహ్మణాది జాతులుకావు.

మానవుల శరీరం 24 తత్వాలతో ఏర్పడింది. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అవినే పంచభూతములు. ఈ పంచభూతములనుండి పంచతన్మాత్రలు ఏర్పడ్డవి. భూమినుంచి వాసన, నీటి నుంచి రుచి, అగ్నినుంచి రూపం, వాయువునుంచి స్పర్శ, ఆకాశంనుంచి శబ్దం కలుగుచున్నవి. పంచతన్మాత్రలను తెలుసుకొనేకన్ను, చెవి, నాలుక, చర్మము, ముక్కు అనే జ్ఞానేంద్రియములు ఐదు, కాళ్ళు, చేతులు, నోరు, పాయువు, ఉపస్థ అనే కర్మేంద్రియములు ఐదు, అంతఃకరణము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, సత్వరజస్తమోగుణములు, కామక్రోధాదులైన అరిషడ్వర్గము, శమదమాది షట్కసంపత్తి, ధైర్యము, త్యాగము, తృప్తి, శ్రద్ధ, ధర్మం జ్ఞానం, శాంతి, విగ్రహం, అనే అష్టాంగ సూత్రములు కలసి మొత్తము 96 తత్యములు శరీరములో నున్నవి. అందులో 36 ముఖ్యమైనవి.

పంచభూతములు నిత్యము పరిణామం చెందుతుంటాయి. భూమి శరీరమున మాంసముగా, ఎముకలుగా, గోళ్ళుగా, నరములుగా మారుతున్నది. జలము రక్తముగా, శుక్లముగా, ఉమ్మిగా, చెమటగా మారుతున్నది. అగ్ని పంచాగ్నులుగా మారుచున్నది. క్రోధాగ్నియై కోపాన్ని కలిగిస్తున్నది. జఠరాగ్నియై ఆకలిని కలిగిస్తున్నది. జ్ఞానాగ్నియై పాపాలను నాశనంచేస్తున్నది. రూపాగ్నియై చిత్రవిచిత్రవస్తువులను చూచునట్లు చేస్తున్నది. కామాగ్నియై కోరికలు పుట్టిస్తున్నది. ఇక మన శరీరంలో పంచవాయువులున్నవి. ప్రాణ వాయువు రక్తమును శుద్ధిచేస్తున్నది. అపానవాయువు మలమును వెలుపలికి త్రోసివేస్తున్నది. వ్యానవాయువు మంచిరక్తమును సర్వభాగములకు అందిస్తున్నది. ఉదానవాయువు చెడురక్తమును గుండెకు చేరుస్తున్నది. సమాన వాయువు శరీరమునకు శక్తినిస్తున్నది. ఆకాశం ఐదువిధముల శబ్దములను కలిగిస్తున్నది. భక్తిరసము, దుఃఖరసము, రౌద్రరసము, హాస్యరసము అనేవి శరీరమున పరివర్తన చెందుతుంటాయి. మనము తినే ఘనపదార్థమైన ఆహారము జీర్ణమై ద్రవపదార్థమైన రక్తముగా మారుచున్నది. ఇది శరీర పరివర్తనతత్వం. త్రిగుణములవల్లనే జగత్తంతయూ పరివర్తన చెందుతున్నది. భ్రాంతి, మమకారములు దీనివల్లనే కలుగుచున్నవి. మానవులు చేయు ప్రతిపని త్రిగుణములలో దేనికో ఒకదానికి సంబంధించిందిగా ఉంటుంది. వాతావరణ ప్రభావమువలన ఒకగుణము మరియొకగుణముగా మారుటకూడా కలదు. ఈ గుణములనుబట్టి కర్మలుకూడా మూడువిధములుగా ఉంటవి. భక్తి, జ్ఞానం, ధర్మములు కలిగి స్వార్థరహితమై చేయుకర్మలు సాత్వికకర్మలు. స్వార్థముతో ఫలమాశించి చేయుకర్మలురాజసకర్మలు. ధర్మవిరుద్ధముగా, శాస్త్రవిరుదముగా నిర్దయుడై చేయుకర్మలు తామస సకర్మలు. ఈగుణములను ఆశ్రయించి చేసేకర్మలే భవిష్యత్తులో కలుగు ఉత్తమ, మధ్యమ, అధమ జన్మలకు కారణమౌతాయి. కాబట్టి మానవులు తాముచేయుపని ఏగుణమునకు సంబంధించినదో, దానివలన ఏవిధమైన జన్మ సంప్రాప్తిస్తుందో, జాగ్రత్తగా గమనిస్తూ కర్మలు చేస్తుండాలి. మోక్షమార్గాన్నికోరేవారు త్రిగుణాతీతంగా కర్మలుచేస్తూండాలి. లేదా సత్వగుణసంపన్నులై ఉండాలి. సత్వగుణము నలవరచుకొన్నచో మరు జన్మలో ఉత్తమవంశమున జన్మించి, ఉత్తమసంస్కారము కలిగి, ప్రశాంత హృదయముతో మోక్షసంపాదనకు వీలవుతుంది. లేనిచో నికృష్టజన్మలుకలిగి దుఃఖభాజనులౌటం సంభవిస్తుంది.

మానవదేహము ప్రకృతితో ఏర్పడింది. దాని అంతర్భాగమున దైవాంశసంభూతుడైన జీవుడున్నాడు. ఈరెండు పదార్థములకూ ఆధారముగా ఆత్మ ఉన్నది. శరీరముచేయు కార్యములలో కొన్ని జీవునివలన మరికొన్ని ఆత్మశక్తివలన నిర్వహింపబడుతున్నాయి. మనశరీరమునందు ఐదుస్థానము లలో ప్రాణముండి ఐదువిధములైన కార్యములను నిర్వహిస్తున్నది. ప్రాణ ముండు ఈఐదుస్థానములకు కోశములు అని పేరు. ఇవి 1) అన్నమయ కోశము 2) ప్రాణామయకోశము3) శబ్దమయకోశము 4) మనోమయకోశము 5)భోక్తమయకోశము. అన్నమయకోశములోని ప్రాణము గర్భము నుండి మల మూత్రములను విసర్జిస్తుంది. సంతానోత్పత్తి చేస్తుంది. ప్రాణమయ కోశము నందలిప్రాణం హృదయమందుండి శరీరంచేత పనులు చేయిస్తుంది. శబ్దమయ కోశమనగా కంఠము. అక్కడఉన్న ప్రాణం శబ్దములను పలికిస్తుంది. మాట లాడిస్తుంది. మనోమయకోశమున ముఖస్థానమందున్న ప్రాణము సంకల్ప వికల్పాలను కలిగిస్తుంది. భోక్తమయకోశము తలవెనుకభాగంలో ఉంది. ఇంద్రియములద్వారా కలుగు (శబ్ద, స్పర్శ, రూప, రస గంధాదులవలన కలుగు) సుఖదుఃఖములను అనుభవించి, లిఖించి, భద్రపరచి, ఈ శరీరమును వీడి మరొక శరీరములోకి ప్రవేశించునపుడు లోగడ తాను భద్రపరచి కొనియున్న విషయవాసనలను తీసుకొని ఈ ప్రాణముపోతుంది. అదే తలవ్రాత.

"దేవుడు తలవ్రాత వ్రాస్తున్నాడు. ఆయన వ్రాసినట్లే మానవజీవితాలు జరుగుతుంటవి. ఆరాతకు అనుగుణంగానే మనం కష్టసుఖా లనుభవిస్తూ ఉంటాము" అని కొంతమంది వేదాంతులు చెబుతుంటారు. అదిదైవతత్వం తెలియని అజ్ఞానులు చెప్పెడిమాట. అది యదార్థముకాదు. దేవుడు తలవ్రాత వ్రాయుటలేదు. అదేయథార్థమైతే ఆయత కొంతమందిని నిర్భాగ్యులుగా ఉండేటట్లు ఎందుకు వ్రాయాలి ? దేవుడైనవానికి ఈ పక్షపాతమెందుకు ? దేవునకు అందరునూ బిడ్డలేకదా ? "సర్వేజనాఃసుఖినోభవంతు"అని ఆయన కోరడా ? కనుక జగత్పిత అయిన దేవుడు తలవ్రాతవ్రాయుటలేదు. పంచ ప్రాణములయందు గల ఒకప్రాణమే మానవులుచేయు కర్మస్వరూపములను చిత్రించి, భద్రపరుస్తూ ఉంటుంది. మానవుడు తమచేతులతోచేయు పని, తన నోటితోచెప్పుమాట, తనచెవితో వినేశబ్దము, తనకంటితో చూచేచూపు, తన

నాలుకతో చూచేరుచి, తన మనస్సులోని సంకల్పము తనకు తలరాతగా ఏర్పడుతున్నవి. మానవుడే తన కర్మలద్వారా తన తలరాతను తానే వ్రాసుకొంటున్నాడు. అంతేకానీ ఏదేవుడూ తలవ్రాతవ్రాయుటలేదు. ఇదే సృష్టి రహస్యము. మానవుడు కర్మలవలననే తనకష్టసుఖములను తాను సృష్టించుకొంటున్నాడు. మానవుడు జాగ్రదావస్థలో చేయు కర్మలన్నియూ పంచప్రాణములచేతనే నిర్వహించబడుతున్నాయి,నిద్రావస్థయందు జరుగుకర్మలన్నీ ఆత్మ వల్లనే జరుగుతున్నాయి. అన్నము తినుట జీవుని వలన జరుగుతున్నది. శ్వాస నడచుట, గుండె కొట్టుకొనుట, రక్తప్రసరణము, స్మృతి,జ్ఞానము మున్నగునవి ఆత్మవలన జరుగుతున్నవి. శరీరము నిర్వహించు మొత్తము పనులలో కొన్ని జీవునివలన, కొన్ని ఆత్మవలన నిర్వహింపబడుతున్నవని మనం తెలుసుకోవాలి. మానవులకు బాహ్యనేత్రములు రెండేకాక ముఖాంతర్భాగమున జ్ఞాన నేత్రమున్నది. మానవశరీరము వెలుపల ప్రకాశించు బహిర్జ్యోతులు సూర్యుడు, చంద్రుడు, అగ్ని. శరీరములోపల ప్రకాశించు అంతర్జ్యోతి మరొకటి యున్నది రెండు ముక్కురంధ్రములగుండా నడచు రెండు శ్వాసలు (ఇడ, పింగళ) కాక సుషుమ్నాఅనే పేరుతో మరియొక మూడవశ్వాస ఉన్నది. అది అంతర్జ్యోతి (జ్ఞాననేత్రము). ఈ సుషుమ్నాశ్వాసయే జ్ఞానము. ఆత్మశక్తి వలన ఈ శ్వాస జ్ఞానంగా పరివర్తన చెందుతున్నది. సారాంశమేమనగా మానవశరీరం నిర్వహించు కార్యములలో కొన్ని జీవునివలన, కొన్ని ఆత్మవలన నిర్వహించబడుతున్నవని మనం గ్రహించాలి. మానవశరీరమందు జీవుడు పంచప్రాణములుగా ఐదుస్థానములలో ఉన్నాడని ఇంతకుముందే మనం చెప్పుకొన్నాము. ఆస్థానములు తప్పించి, ఇతరశరీరభాగములందు కొట్టినసూ, నరికినసూ మానవుడు మరణించడు. చెట్లకు ఇంద్రియములు లేవు. జీవుడు శరీరమందంట వ్యాపించిఉంటాడు. అందువలన మనము కొమ్మలు నరికినప్పటికీ మరలా చిగిర్చి యథావిధిగా చెట్టు ఆకారాన్ని పొందుతాయి. మరికొన్ని చెట్లకొమ్మలను భూమిలోపాతిపెట్టిననూ అవి పెరిగి చెట్లుఅవుతాయి. మరికొన్ని చెట్లు ఇతర చెట్లతో సంస్కారమును పొంది, ఆచెట్టు గుణమును గ్రహించి క్రొత్త గుణము నిచ్చుమరియొకచెట్టుగామారుతుంది. దీనినే చెట్టునకు 'అంటుకట్టుట' అంటారు. మరికొన్ని చెట్ల కొమ్మలు వేళ్ళను దించి, భూమిలోనికి చొచ్చుకొనిపోయి, తల్లి చెట్టును వదలి అదేచెట్టురూపాన్ని పొందుతాయి. కొమ్మలులేనికొబ్బరి, తాటి

మొదలగు చెట్లు తలనరికితే వచ్చిపోతాయి. కొన్ని పైరులు అది పుట్టిన చోటును మార్చి మరొకచోటున నాటితే ఏపుగా పెరుగుతాయి. కొన్నిభూమి తోన పంటనిస్తాయి. చెట్లకు, భూమికి సన్నిహితసంబంధమున్నది. ఒక్కొక్క భూమియందు ఒక్కొక్కజాతిచెట్లు పుష్కలంగా పంటనిస్తాయి. అదేవిధముగా నీటికీ చెట్లకూ సంబంధమున్నది. ఉప్పునీరు చెట్లకు చెరుపు చేస్తుంది. మంచి నీరు మేలుచేస్తుంది. ఒక్కొక్క భూమికి ఒక్కొక్కజాతిచెట్లు పటిష్ఠముగా ఉంటి ఎక్కువపంట నిస్తాయి. ఒకవిత్తనము ఒకచోట యెంతో రుచిని ఇస్తున్నది. అదేవిత్తనము మరొకచోట రుచిని ఇచ్చుటలేదుఒక్కొక్క భూమికి, ఒక్కొక్క ప్రత్యేకత ఉన్నది. గంగానది గంగ్రోతి దగ్గర హిమాలయా పర్వతములందు పుట్టి తూర్పుసముద్రమునందు కలియుచున్నది. గంగానదికి ఋషికేశ్, హరిద్వార్, ప్రయాగ, కాశీ దగ్గర ప్రత్యేకతయున్నది ఆ ప్రదేశము లందు గంగానది నీటిని పవిత్రతీర్థముగా భావించుచున్నారు. ఎందుచేత ? భూమిలో ఒక్కొక్కచోట ఒక్కొక్కవిధమైన లోహములు, ఖనిజములు, వజ్రములు ఉన్నవి. వాటి ప్రభావము వలన పంటలకు రుచి కలుగుతున్నది. అంతేగాని దేవుడు రుచిని కలిగించుటలేదు.

పుణ్యక్షేత్రములందు వజ్రములు, మణులు మాణిక్యములు, వైఢూర్య ములు ఉన్నవి. వాటి ప్రభావమువలన చెట్లకురుచికలుగుచునట్లు మానవులకూ మేలు కలుగుచున్నది. అది క్షేత్రప్రభావమేగాని దేవుని మహత్యముకాదు. ఆ వజ్రములు భూమిలో క్రిందకి పైకి తిరుగుతూఉంటాయి. క్రిందకిపోయినపుడు దానిప్రభావము తగ్గుతుంది. ఈ వజ్రములు భారతదేశమునందు వివిధప్రాంత ములందు ఎక్కువగా ఉన్నవి. అందువలన భారతదేశమున పుణ్యక్షేత్ర ములు ఎక్కువగాఉన్నవి. ఈ వజ్రములు ఎక్కడఉన్నవో అక్కడ మేలు కలుగుతుంది. అందువలన చక్రవర్తులు, శ్రీమంతులు వజ్రములను భద్రపరచు కొంటూఉంటారు. కొందరు ఈ వజ్రములతో రత్నములతో ముత్యములతో యజ్ఞములుచేస్తారు. వాటి ప్రభావము వలన వారికి మేలు కలుగునని వారి నమ్మకము. ఇది ప్రకృతి స్వభావము. సృష్టి విధానము.

ప్రకృతి స్వభావమునసుసరించి మానవులఆకారములు రంగుకూడమారు తున్నవి. ఒకప్రాంతపుమానవులు పొట్టిగనూ, తెల్లగనూ, కండ్లు చిన్నవిగా

ఉంటారు. మరొకప్రాంతంవారు నల్లగనూ, అందవిహీనముగా ఉంటారు. ఒకప్రాంతమువారికి దేహపటుత్వం బాగా ఉంటుంది. ఒకప్రాంతము తక్కువగా ఉంటుంది. దేవుడే సృష్టించియుండిన మానవులందరూ ఒకే మున, ఒకేస్వభావమున, ఒకేవిధమైన ఆహారవిహారములు కలిగిఉండాలి ఇన్నివిధములుగా ఎందుకుఉన్నారు ? కనుక మానవులను దేవుడు : చుటలేదు. ప్రకృతి జీవుడు కలయిక వలననే సృష్టి ఏర్పడుతున్నది. యందలి లోహతత్వమును, ఖనిజతత్వము ననుసరించి ఆప్రాంత మానవులకు గుణతత్త్వము లేర్పడుతున్నాయి.

ఒకప్రాంతమందున్న ఖనిజముల లోహతత్త్వము ననుసరించి స ప్రధానులుగా, ధర్మబుద్ధి కలిగి, సంఘమును సంస్కరించుకొని, మిత్ర కరుణ కలిగి ప్రజలు అన్యోన్యముగా హాయిగా జీవిస్తూఉంటారు. ప్రాంతపుమానవులుఅచ్చట భూమిలోఉన్న ఖనిజలోహప్రభావమునను తమోగుణప్రధానులై, స్వార్థబుద్ధిచేత తమ భార్యాబిడ్డలయందు వ మమకారముకలిగి, వారిసుఖమునూ సంతోషమునూ మాత్రమేకోరి, పర బుద్ధిలేక, ప్రతిఫలమును కోరుతుంటారు. మరికొన్ని ప్రాంతవ భూమిలోనున్న ఖనిజలోహప్రభావముననుసరించి తమోగుణప్రధాను భార్యాబిడ్డలయందు మాత్రమే మమకారము కలిగి వారి సుఖమును : మును మాత్రమే కోరి పరోపకారబుద్ధిలేక ప్రతిఫలము కోరుతుంటా కొన్ని ప్రాంతములందు భూమిలోనున్న ఖనిజప్రభావమువలన త ప్రభావముగలవారై క్రోధము, రాగద్వేషములు కలిగి యింటివారి యిరుగుపొరుగు వారితోనూ శత్రుత్వం కల్పించుకొని అనేక : గురిఅవుతుంటారు.

కొన్నిప్రాంతములందు భూమిలో గంధకము లాంటి ఖని ఎక్కువగా ఉన్నచో అగ్ని ప్రజ్వలించి భూకంపములు సంభవిస్తూ కొన్నిప్రాంతములందు, జలతత్త్వము, వాయుతత్వము, ప్రజ్వలించి, గాలి విజృంభించి వరదలు తుఫానులు, వాయుగుండములు ఏర్పడి ( లకు గ్రామాలు కొట్టుకొనిపోయి, ప్రాణులకు హాని, పంటలకు

కలుగుతుంటాయి. కొన్ని ప్రాంతములందు జలతత్త్వము పూర్తిగా తగ్గిపోయి వర్షముపడక మానవులకూ, ప్రాణులకూ, పంటలకూ నీరులేక భరించరాని కష్టాలకు గురియౌతుంటారు. దేవుడు ప్రాణుల సృష్టించినచో ఇటువంటి కష్టములు ఎందుకు కల్పిస్తాడు ? ప్రాణులు బాధపడుటవలన దేవుడుపొందెడి లాభమేమి ? ఈ అరిష్టములు ప్రకృతివల్లనే సంభవిస్తున్నవికాని దేవుడు కల్పించటంలేదు.

మానవులకూ, వృక్షములకూ సన్నిహితసంబంధమున్నది. మానవులకు సర్వకాలములయందునూ సహకరించునవి, ఉపకరించునవి, పోషించునవి వృక్షములే ! సృష్టియందు ఒకప్రాణికి మరొకప్రాణి రక్షణగా, ఆధారముగా ఉంటున్నది. పక్షులకుచెట్లురక్షణ ఇచ్చుచున్నవి. పక్షులనివాసమునకూ, ఆహారమునకూ చెట్లే ఆధారముగా మన్నవి. మానవులకు కలిగే అనేకవిధములైన వ్యాధులను ఎక్కువగా చెట్లే నివారిస్తున్నవి. కొంతవరకు లోహములు, ఖనిజములు నివారణ చేస్తున్నవి. అంతేకాని దేవుడు వాటిని నివారణచేయుటలేదు. మానవులు తమ ఆహారమును చెట్లనుండే పొందుతున్నారు. ప్రాణులునివాసమునకూ, వ్యాధులను నివారణ చేసుకొనుటకూ, అంతిమకాలమున శరీరమును దహనముచేయుటకూ వృక్షములు సహకరిస్తున్నాయి. ఈ మానవుడికి కావలసిన పాణవాయువు చెట్లద్వారానే లభిస్తున్నది. ఈవిధముగ ప్రకృతి యందలి ప్రాణులకు చెట్లు సహాయపడుతున్నవి. ఆవులు గేదెలు వాటి సంతతి కూడా మానవులకు జీవనాధారముగ నున్నవి. ఆవులు, గేదెలు వాటి పాలు వాటి సంతతికి ఇవ్వక మానవులకూ, మానవ సంతతికీ ఇచ్చుచున్నవి. శిశుఅవస్థయందు ఆవు గేదెపాలతోనే మానవులు జీవిస్తున్నారు. మానవులతల్లి శిశువునకు పాలుఇవ్వలేకున్న ఆవులు, గేదెలు తమ పాలిచ్చి తల్లివలె పోషించుచున్నవి.

జీవుడు ఒకశరీరమును విడచి మరొకశరీరమున ప్రవేశించునపుడు వారి మనస్సునందు ఏరూపము, ఏభావన ధృఢముగా నుండునో ఆరూపమునుపొంది అతడు జన్మిస్తుంటాడు. గుఱ్ఱముల సంతానోత్పత్తియందు ఈ సూత్రము నిరూపింపబడుతున్నది. ఆడగుఱ్ఱమునకు ఋతుసమయమునందు మేలిజాతి గుఱ్ఱమును దానికన్నుల కెదురుగా కట్టిఉంచి, మామూలు గుఱ్ఱముచేత

సంపర్కము చేయించినపుడు ఆడగుఱ్ఱము తానుచూస్తున్న మేలిమిజాతిగుఱ్ఱము ఆకారముగల సంతానమునే కనుచుండుట మనం చూస్తున్నాం. ఇది జీవుని శ్రద్ధాస్వరూపమేగాని దేవుడుసృష్టించిన స్వరూపముకాదు. ప్రకృతి శుక్లశోణిత స్వరూపముకాదు. అదికేవలం మనస్సంకల్ప ప్రభావము వలన ఏర్పడిన స్వరూపము.

మానవులందు కొంతమంది స్త్రీలకు తల్లిదండ్రుల పోలికలులేని వేరు పోలికలతో సంతానము కలుగుచున్నది. తల్లిదండ్రులు అంత అందముగా లేకపోయిననూ, నల్లగా ఉన్ననూ బంగారురంగుగలచక్కనిబిడ్డ పుట్టుచున్నాడు. తల్లిదండ్రులు అందముగానూ, రంగుకలిగిఉన్నప్పటికీ వారికి అందవిహీనమైన బిడ్డ పుట్టుచున్నాడు. ఇదిజీవుడు శ్రద్ధాస్వరూపుడు అను సూత్రముననుసరించిన విధానము. ఒక సంపన్న గృహంలో వికారస్వరూపంగల నౌకరుఒకడుండేవాడు. వాడు తనపని తాను సక్రమముగా చేయకపోవటంచేత ఆయింటి యజమానురాలికి వాడిపై విపరీతమైన కోపంవచ్చింది. కోపంతోపాటు వాని రూపంకూడా మనసులో ధృఢంగా నిలచిపోయింది. ఆనాటిరాత్రి భర్తసమా గమంవల్ల ఆమెకు గర్భధారణ జరిగింది. జీవుడు ఆమెమనస్సులోఉన్న నౌకరీరూపాన్ని పొంది గర్భంలోన ప్రవేశించాడు. నౌకరీరూపంగల సంతా నము ఆమెకు కలిగింది. ఆఇంటి యజమానికి తన భార్యపై అనుమానం కలిగింది. భార్య శీలాన్ని అనుమానించాడు. ఒకశాస్త్రవేత్తనుకలిసి తన అనుమానాన్ని వెల్లడించాడు. ఆ శాస్త్రవేత్త సంతానోత్పత్తిసూత్రములనన్నిం టిని అతనికి బోధించి శ్రీమంతుని సందేహాన్ని తొలగించాడు. అందువలన స్త్రీలు సంతానసమయమున మంచి భావనతో మంచి సంకల్పముతో ఉండాలి.

అండోత్పత్తిసూత్రమునందు కొన్నిప్రాణులు ఆడపక్షి గ్రుడ్లమీద పరుండినందువలన పిల్లలు రూపముపొంది గ్రుడ్లను పగులగొట్టుకొని బయటికి వచ్చుచున్నవి. మరికొన్నిప్రాణులు భూమిమీదగానీ, నీటిలోగానీ గ్రుడ్లను పెట్టి వదిలివేయుచున్నవి. చేపలు తదితర జలచరములు నీటిలో గ్రుడ్లులను పెట్టి వదిలివేయుచున్నవి. అవి నీటిశక్తివలననే పిల్లలగుచున్నవి. వాటిని తల్లి పెంచటంలేదు. వాటిని అవే పోషించుకొని పెరుగుచున్నవి. కొన్ని

పక్షులు ఆకాశమున ఎగురుచున్నవి. కొన్ని జంతువులవలె భూమిమీద, చెట్లమీద పాకుచున్నవి. పాము, బల్లి, తొండ మొదలగు ప్రాణులు ఈ జాతికి చెందినవి. చీమలు సంఘజీవులు. వరుసగా, వరుసగా నడచుట, అన్నికలసి సంపాదించుట, అన్నీ కలసి తినున్న కొంత భద్రపరచుకొని వర్షాకాలము సామూహికముగ తినుట మొదలగు పనులుచేయుటవలన ఇవి "సంఘజీవులు" అనబడుచున్నవి.

సంఘమునకు సంస్కారమునూ, స్వభావమునూ మార్చేడి శక్తి ఉన్నది. సింహమునకు ఆవును చంపితినెడి స్వభావమున్నది. గారడీవాడు సింహమును పెంచి దానిస్వభావమును మార్చి దాన్నిని ఆవుపైనఎక్కించి త్రిప్పుచున్నాడు. సింహము ఆవుపై తనశత్రుత్వముమాని ప్రవర్తించుచున్నది ఆవు సింహమునుచూచి భయపడెడి స్వభావమును మార్చుకొని మిత్రభావమున ప్రవర్తించుచున్నది. ఇది సంఘసంస్కారము. అంగుళీమాలుడు దుర్మార్గుడై హంతకుడిగా ప్రవర్తించెడివాడు. భిక్షుసంగములోచేరి బుద్ధిమంతుడై మోక్షార్హుడాయెను. ఒక సంఘము సంస్కరిస్తూఉంటుంది. ఒకసంఘం దోషము కలిగిస్తూ ఉంటుంది. "నిర్మాణమోహసంజనిత సంఘదోషః" మానవులు సంఘదోషపాలను తొలగించుకొని, సంఘసంస్కారాన్ని కల్పించుకొంటూ ఉండాలి. "సత్సంగత్వేనిస్సంగత్వ నిస్సంగత్వే నిర్మోహత్వం నిర్మోహ త్వే నిశ్చలతత్వం నిశ్చలతత్వే జీవన్ముక్తిః" మంచి సంఘం మనస్సుకు నిర్మలతత్వాన్ని కలిగించి. జీవన్ముక్తిని కలిగిస్తుంది. కనుక మానవులు సత్సంగంలోచేరి జీవన్ముక్తులగుటకు ప్రయత్నించాలి.

ఆదియందు సృష్టి సంకల్పసృష్టిగా యుండెడిది. జీవుడు శ్రద్ధాస్వరూపుడుగనుక మనసునందు ఏవిధమైన శ్రద్ధయుండిన ఆవిధమైన స్వరూపమును జీవుడూ ప్రకృతి కలసికొని పొందుచుండేవారు. మిధునరాశి ఉద్భవించిన తరువాత ప్రాణులందు కామోద్రేకంవలన ప్రాణులలో సంపర్కము ప్రారంభమైంది. అదిమొదలు సంకల్పసృష్టిమారి సంపర్కసృష్టిగా పరిణామంచెందింది. సంపర్కసృష్టియందుకూడా, సంతానోత్పత్తి సమయమందున్న స్త్రీ గర్భవతిగా వున్నప్పుడూ, మరణావస్థలో జీవుడు తన శరీరమును విడచి మరొక శరీర

కమును స్వీకరించబోవు సమయంలోనూ, మనసునందలి ధృఢమైన భావన జీవునియొక్క భవిష్యత్ స్వరూపమునకు కారణమౌతున్నది. సంతానోత్పత్తి సమయమున స్త్రీలమనస్సులలోని ధృఢసంకల్పము జీవుల స్వరూపములకు కారణమౌతున్నది. గర్భవతిగాయున్న స్త్రీ అనుభవించు శబ్ద స్పర్శరూప రస గంధ సంకల్పాలు, గర్భమందలి బిడ్డ స్వభావమునకూ, ప్రవర్తనకూ కారణ మౌతున్నవి. ఈ విధముగ ప్రాణుల సృష్టి ఏర్పడుచున్నదేగాని దేవుడు సృష్టించుటలేదు. వివిధరూపములు, వివిధ స్వభావములు, వివిధ గుణములు, వివిధ ఆహార విధానములు, వివిధ ప్రవర్తనలు, ప్రకృతివలననే కలుగు చున్నవి గాని దేవుడివలన కాదు. "నకర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః". ఈ సృష్టిని గురించి ప్రభువైన దేవునకు కర్తృత్వముగాని, చేసే కర్మగాని లేదు. దేవుడు సృష్టించుటలేదు. సౌకర్యమును కల్పించుటలేదు. సర్వమునకు ఆధారభూతమైనది సంకల్పమే.

సృష్టియందు ఒకవిచిత్రమైన సృష్టి కలదు. దీనిని భ్రమరకీటకన్యాయము అంటారు. కందిరీగ తన వంశమునూ, తన జాతినీ వృద్ధిచేయుటకు పిండో త్పత్తి, అండోత్పత్తి విధానముగాక ఎక్కడనుంచో ఒక ఆకుపురుగునుతెచ్చి తనగూటియందుంచి, ఆ పురుగుచుట్టూ తిరుగుతూ జుంజుం అని శబ్దము చేస్తూ ఉంటుంది. ఆ ఆకుపురుగు లోని జీవుడు ఆ కందిరీగచేసే శబ్దమును వింటూ దానియందు శ్రద్ధవహిస్తూ ఉంటాడు "శ్రద్ధామయోయం పురుషః" అను సూత్రము ననుసరించి, జీవుడు శ్రద్ధాస్వరూపుడు. కనుక కందిరీగ శబ్దము నందు శ్రద్ధగలవాడై కందిరీగగా రూపమును పొందుతున్నాడు. అతనిపూర్వ విహార, ఆహారలక్షణములు కూడా మారుతున్నవి. ఆకును పట్టుకునిప్రాకు లాడెడిపురుగు, ఆకాశమున ఎగురుతూ సంచరించుచున్నది. అది మరియొక ఆకుపురుగును కందిరీగగా మార్చగలుగుతున్నది. ఈ విధముగా సృష్టి ప్రకృతి ప్రాణులమధ్య పరివర్తన చెందుచున్నదేగాని దేవుడు సృష్టించుటలేదు. మానవులు కందిరీగలలాగా దైవశబ్దమును ఏకాగ్రతతో వింటూ దైవస్వరూ పమును పొందాలి.

సీతాకోకచిలుక మరొక ఆశ్చర్యకరమైన సృష్టివిధానమున ఏర్పడు చున్నది. జీవుడు తనకుతానే శ్రద్ధవహించి మరొకప్రాణి ప్రోత్సాహముగాని, కృషిగాని లేక తనకుతానే శ్రద్ధవహించి స్వరూపమును మార్చుకొను చున్నాడు. కంబళిపురుగు గూడు నిర్మించుకొని కొంతకాలము గూటియందుండి, ఆహారమును మాని, దీక్షతో తీవ్రమైన కృషిచేసి, రోమములను రాల్చివేస్తుంది. తరువాతదశను మార్చుకుని, రెక్కలను ఏర్పరచుకొని, రంగు రంగుల రెక్కలు గలిగి, భూమిమీద ప్రాకెడిపురుగు, ఆకాశమున చెట్లుపైన సంచరించెడి ప్రాణిగా ఏర్పడుతున్నది. ఇది విచిత్రముగా తనకుతానే జీవుని శ్రద్ధవలన, ప్రకృతి మార్పువలన, స్వరూపములను మార్చుకొనుచున్నవి. ఈ స్వరూపములను దేవుడు కల్పించుటలేదు. దాని రెక్కలు ఎంతో అందముగా అనేకరంగులు కలిగి ఉంటాయి. ఇదంతయూ జీవుని కృషియే.

నెమలి ఆశ్చర్యముగా సంతానోత్పత్తి చేయుచున్నది. నెమలి అష్ఠ తిత బ్రహచర్యమును అనుచరించుచున్నది. సంపర్కము, స్త్రీపక్షిసుఖము అనిన మగనెమలికి అసహ్యము. అది సూర్యునిప్రకాశమునుచూచి, ఫించమును విప్పి ఆడుచూ, ఆనందమును అనుభవిస్తూ ఉంటుంది. దాని ఆనందా వస్థలో కంటినుంచి ఆనందబాష్పములు రాలుతుంటాయి. ఆడనెమలి ఆ ఆనంద బాష్పములు మ్రింగి గుడ్డుపెడుతుంది. ఆతర్వాత ఆగ్రుడ్డుపై కూర్చొని పొదిగి పిల్లలను చేస్తుంది. దానికి సంతానభ్రాంతి, మమకారము లేదు. సూర్యుని వేడికి ఆ గ్రుడ్డుపగిలి, పిల్లగా ఏర్పడి పెరుగుతున్నది. ఆతపక్షి పెంచదు. ఆడనెమలికి సంతానముపై భ్రాంతి గానీ మమకారముగానీ లేదు మగనెమలికి స్త్రీకామము, మోహము లేదు. ఇవి ఇంద్రియాతీతపక్షులు. పక్షులే ఇట్టి నిగ్రహం కలిగిఉంటే మానవజాతి ఇంద్రియ నీచ సుఖములన పేక్షిస్తూ శ్రేష్ఠమైన మానవజన్మకు కళంకితంగావిస్తున్నది. నెమలి పక్షిజాతికి చెందినది. స్త్రీసుఖమును బహిష్కరించి సూర్యునిచూచి ఆనందమనుభవిం చుచున్నది. మానవులు కామాంధులుగాక స్త్రీసుఖమును నిగ్రహించి నెమలివలె ఆనందమనుభవిస్తూఉండాలి. సృష్టియందు పట్టుపురుగు మానవులకు మహోపకారముచేయు ఉత్తమప్రాణిగా పరిగణింపబడుతున్నది. ప్రారంభమున ఇది

ఒక చిన్న పురుగుగా పట్టునిచ్చు ఆకులను తిని పెరుగుతుటుంది. కొంత పెద్దదయిన తర్వాత, ఆపురుగులోని జీవునకుగల శ్రద్ధాస్వభావమువలన తన ఆహారమునుండి పట్టుపోగును తయారుచేస్తుంది. తన శ్రద్ధానుగుణ్యముగ నిద్ర, ఆహారము, విశ్రాంతి లేక కొన్నిరోజులలో పట్టుకాయను తయారుచేసి, తన పురుగురూపమును తానే మార్చుకొని రెక్కలుగల ప్రాణిగా స్వరూపమును పొంది గాలిలోకి ఎగిరిపోయి, చెట్టుమీద నివసిస్తూ రెక్కలపురుగుగా మారుతుంటుంది. మొదట పరోపకారం చేసి, తర్వాత సామాన్యకీటక జీవితమును అది గడుపుతున్నది. ఇట్లే మానవులు కూడా తన సామాన్య జీవితమును గడుపుటకు ముందు సంఘమునకు మహోపకారముచేస్తూ ఉండాలి. అనునిత్యము ఆవువలె పరోపకారం చేస్తూ ఉండటం ఉత్తమ ధర్మము. మానవులకు ఆహారము, వస్త్రములు, నిత్యజీవితావసరవస్తువులు, ఆహారమును భూమి, పైరులు, పంటలు ఇస్తున్నవి. వస్త్రములను పత్తిచెట్టు, పట్టుపురుగు, ఉల్లుగొర్రెలు, మేకలు ఇస్తూన్నవి. మానవసంఘమునకు మహోపకారము చేస్తున్నవి. పట్టుపురుగు శరీరము ఎంతో పవిత్రమైంది. అది తాను తినిన ఆహారమును మలమూత్రములుగా మార్చుకొనక పవిత్రమైన పట్టుపోగుగా మారుస్తున్నది. దేవతారాధన సమయమందు ప్రత్యేకించి ఆ పట్టువస్త్రములను మానవులు ధరిస్తున్నారు.

సర్పము ఒకవిలక్షణమైన ప్రాణి. ఇది రెండు విధములైన ఆశ్చర్యకరములైన కర్తృత్వములను నిర్వహించుచున్నది, మానవుడు వస్త్రములను మార్చిన విధముగా సర్పము దానిపైనుండు చర్మమును నెలకొకసారి మార్చుకొంటుంది. నూతన చర్మమును సిద్ధముచేసికొని పాత చర్మమును విడచి వేయుచున్నది. ఇంతేకాక తనయందున్న అంతర్జ్యోతి తేజశ్శక్తిని తన శరీరమునందలి పృథ్వీతత్వమునకు జతపరచి ప్రకాశించు మణిగా ఉత్పత్తిచేసికొని దానిని తననోటితో పట్టుకొని ఆ ప్రకాశములో అది తిరుగుతుంటుంది. దానిని నాగమణి అంటారు. తనలోని తేజస్సును పదార్థరూపమున అది అనుభవించి ఆ చర్యను మానవులకు చూపుతున్నది. మానవులు తమలోని అంతర్జ్యోతి తేజస్సును గుర్తించలేకపోతున్నారు. దీక్షతో యోగసాధనచేస్తే దానిని తప్పక

దర్శించగలరు. నాగసర్పములను కొందరు నాగదేవతలుగా ఆరాధించి వరములు పొందుతున్నామనుకొంటున్నారు. అది వారి మూఢనమ్మకము నిజముగా వరములిచ్చేది తనఆత్మ అనే సత్యాన్ని తెలిసికోవాలి. ధర్మమునూ సంఘమునూ ఎన్నడూ మరువరాదు.

సారాంశమేమనగా సృష్టిని గురించి ఇతర మతములన్నియూ చెప్పుచూ దేవుడు సృష్టించుచున్నాడని చెప్పుతున్నవి. బుద్ధమతము దేవుడుసృష్టించినట్లు చెప్పదు. "ప్రకృతి జీవునికలయిక వలన సృష్టియేర్పడుచున్న" దని చెప్పుచున్నవి. హిందూమతమున బ్రహ్మసృష్టికర్త యనియు విష్ణువు పోషణకర్త యనియు ఈశ్వరుడులయకర్త యనియు చెప్పబడింది. బ్రహ్మసృష్టించినదో తల్లిదండ్రుల వ్యాధులూ, తల్లి దండ్రుల రూపములు సంతతికి ఎందుకు వచ్చుచున్నవి? మానవులు శస్త్రవైద్యముతో సంతానమును నిలిపి సృష్టిని ఆపివేయుచున్నారే మరి బ్రహ్మయేమి చేయుచున్నాడు? విష్ణువు పోషణకర్త అంటున్నారు. అన్నము లేక అనేకమంది పస్తులతో బాధలు పడుతున్నారు. కనీసము త్రాగుటకు గుక్కెడు నీళ్ళుకూడాలేక బాధలుపడుతున్నారు. విష్ణువు ఏమి చేయుచున్నాడు? ఈశ్వరుడు లయకర్త అంటున్నారు. మసూచి, కలరా తదితర వ్యాధులు వచ్చి ఒక గ్రామమున వందలాది ప్రజలు మరణిస్తుండగా మరొక గ్రామమున మందులూ తీసుకొనుటవలన ఒక్కరూ కూడా మరణించకుండా ఉంటున్నారు. ఈశ్వరుడు ఏమిచేయుచున్నాడు? ఇదంతయు పుక్కిటిపురాణములు బ్రహ్మ సృష్టించుటలేదు. విష్ణు పోషించుటలేడు. ఈశ్వరుడులయపరచుటలేదు. హిందూమతమునగల మరొక పురాణము. మహా విష్ణువువిరాట్ పురుషుడు. ఆయన పరుండియుండగా ముఖమునుండి బ్రాహ్మణులు, బాహువులమునుంచిక్షత్రియులు, ఊరువులనుంచి వైశ్యులు, పాదములనుంచి శూద్రులు ఉద్భవించారు. అవే చాతుర్వర్ణములు" అనిచెబుతుంది. మరొక పురాణము "కశ్యప ప్రజాపతికి ఏడుగురుభార్మలు, ఒక భార్యకు పాములూ, మరొక భార్యకు పక్షులు, ఈ విధముగా ఆ ఏడుగురు భార్యలకూ యేడురకాలైన ప్రాణులుపుట్టిన" వనిచెప్పుతున్నది. దేవీ భాగవతము బ్రహ్మ విష్ణు మహేశ్వరులనుకూడా దేవియే సృష్టించినట్లు చెప్పుచున్నవి. ఏ దేవుడుగాని సృష్టిచేసియుండలేదు. సృష్టి ప్రకృతి ధర్మము.

# పంచాదశ అధ్యాయము

## (శ్రీ ధర్మచక్ర ప్రవర్తన యోగము)

**శ్రీ నాగార్జున ఉవాచ :**

బుద్ధ భగవానుడు శ్రీధర్మచక్ర ప్రవర్తన యోగమును మొట్టమొదట కొండన్న (కౌండిన్యుడు) అను ఆంధ్రునకు సార్‌నాథ్‌లో ఉపదేశించాడు. ధర్మబోధను చక్రరూపమున వర్ణించాడు. చక్రమునకు పైన గుండ్రముగా ఉన్న పట్టి ఆత్మజ్ఞానమునకు ప్రతీక. "జ్ఞానే పరిసమాప్యతే" సర్వము ఆత్మ జ్ఞానముతో పరిసమాప్తి అవుతుంది. "మానవులు ఆచరించి అనుసరించవలసిన యోగమే చక్రము మధ్యలో ఉన్న "కుండ" అని తెలిసికోవాలి. చక్రము నందలి ఆకులూ, ధర్మములూ పరిపూర్ణ ఆత్మజ్ఞానము. ధర్మ సూత్రము ననుసరించి మనం నడచి, పరిపూర్ణత్వమును పొందాలి. చక్రము మధ్యలో ఉన్న "కుండ", యందు గల గుండ్రని రంధ్రము "పరిపూర్ణము". అనగా గుణ రహితమూ తేజోమయమూ అగు పరమాత్మ తత్త్వజ్ఞాన స్వరూపమైన సచ్చిదానందము. ఈ మార్గమే దుఃఖరహితము. సత్యమును తెలిసికొన్న పిమ్మట ఆ సత్యమునే బుద్ధ భగవానుడు ధర్మచక్ర రూపమున బోధించాడు.

బుద్ధుడు సమ్యక్‌సంబుద్ధుడైన తర్వాత వారణాసిచేరి "ఇసిపటన" మందలి మృగనామాంకితమైన ఉద్యానవనానికి వెళ్ళాడు. ఆయన్ను చూడగానే అక్కడ ఉన్న అయిదుగురు మునులూ ఆయన్ను ఆహ్వానించారు. వాళ్ళు మొదట బుద్ధుడు శరీర కష్టానికి ఓర్చుకోలేక ఉపవాసాది కఠినవ్రతాలుమాని మామూలుగా ఆహారం తీసుకోవటంచూచి "ఇటువంటివాడికేమి జ్ఞానోదయమవుతుంది?" అని అనుకొన్నవాళ్ళే. ఆ శిష్యులు కొండన్న, వప్ప భద్దియ, మహానామ, అస్సజీ అనేవాళ్ళు. వారికి బుద్ధుడు తాను అర్హతుడు. తథాగతుడు, జ్ఞానినై తినని చెప్పి తొలిసారి వాళ్ళకు బుద్ధధర్మాన్ని ఉపదేశించాడు.

బుద్ధుని ఉపన్యాసం ముగియగానే కొండన్నకు "పుట్టిన ప్రతి వస్తువు కూడా నాశనమొందుతుందనే జ్ఞానం కలిగింది. అప్పటినుండి అతడు "అన్నత కొండన్న" (జ్ఞానముకలిగిన కొండన్న) అని పిలువబడ్డాడు వెంటనే అతణ్ణి "పబ్బజ్జ"నూ, "ఉపసంపద"నూ తీసుకోవలసిందిగా బుద్ధుడు కోరాడు. పబ్బజ్జ అనగా ప్రపంచమును పరిత్యజించుటకు చేయవలసిన కర్మ. "ఉప సంపద" అంటే బౌద్ధ భిక్షువునకు నియమించబడే సంస్కారం. ఈ రెండు దీక్షలు అతనికి ఇవ్వబడ్డాయి. అప్పుడు బుద్ధుడు అతణ్ణి "ఏహి భిక్షు" (భిక్షుకా! ఇటురమ్ము) అని పిలిచాడు. "ప్రపంచమునందలి దుఃఖములను పూర్తిగా నిర్మూలించడానికి ధార్మిక జీవనం గడుపుము" అతనిని ఆదేశించాడు. ఈధర్మ చక్రప్రవర్తనం సర్వమానవాళికి శిరోధార్యం.

శ్రీ బుద్ధ భగవాన్ ఉవాచ :-

మానవుడు అనుసరించవలసిన ధర్మములు ఎన్నో ఉన్నవి. మానవులు దక్క తదితర యోనులకు ధర్మములు లేవు. మానవులు ధర్మములు తెలిసి కొని ఆచరించాలి. ధర్మచక్రములో ఇరువది నాలుగు అకులు ఉన్నవి. వానిలో త్రిసూత్రములు : (1. సత్యము. 2. ధర్మము. 3. సంఘము) పంచశీలములు (1. అహింస. 2. సత్యము. 3. అస్తేయము. 4. బ్రహ్మ చర్యము. 5. వ్యసనత్యాజ్యము.) అష్టాంగము : (1. సమ్యక్‌దృష్టి 2. సమ్యక్ సంకల్పం. . సమ్యక్ కర్మం. 4. సమ్యక్ జీవనము. 5. సమ్యక్ వాక్కు. 6. సమ్మక్ వ్యాయమము. 7. సమ్యక్ స్మృతి. 8. సమ్యక్ సమాధి.) ఆష్టాంగ ధర్మములు : (1. జ్ఞానము. 2. త్యాగము. 3. ధైర్యము. 4. వైరాగ్యము. 5. కీర్తి. 6. దీక్ష. 7. తృప్తి. 8. ప్రజ్ఞ.) అనే ఇరువది నాలుగు ధర్మములను మానవులు తెలుసుకొని ఆచరించాలి. అప్పుడే మానవ జన్మ సార్థకమవుతుంది.

1. సత్యము :

సత్యమును తెలిసికోవాలి. సత్యమంటే ఆత్మనాత్మ వివేక జ్ఞానము నిత్యానిత్య వస్తు తత్త్వము. మన శరీరము నందు మూడు పదార్థములున్నవి.

1. బాహ్యశరీరము. నిత్యము నశించే స్వభావము కలదియగు ఈ శరీరము క్షర మనబడుతుంది. 2. అక్షరుడైన జీవుడు. ఇతడే సత్ పదార్థము. ఇతని గమ్యము పరంధామము. ఈ జీవుడు ఒక శరీరమునువదలి మరియొక శరీర మును చేరుకుంటూ ఉంటాడు. 3. పరమాత్మ : అచలుడు (కదలువాడు కాడు). అక్షరుడు (నశించువాడు కాడు). సర్వమునకు సాక్షి భూతుడు. ఆధార భూతుడు. అ పరమాత్మ తత్త్వమును మనం తెలుసుకోవాలి. అదే సత్యమును తెలిసికొనుట అవుతుంది. అప్పుడు జీవునకు సచ్చిదానంద పరమశాంతి కలుగుతుంది.

దేవుడు సత్యము. జగము మిథ్య. జన్మించినవాదు మరణించుట సత్యము. మరణించినవాడు మరల పుట్టుట సత్యము. ధర్మ చక్రసాధకుడు మహా పరి నిర్వాణము పొందుటకు "సత్యము. దేవుడు అక్షరుడు, నిత్యుడు, సత్యస్వరూపుడు." అనే ఈ నాలుగు సత్యములను మానవుడు తెలుసుకోవాలి.

2. ధర్మము :

ధర్మము నాలుగు విధములు. 1. శాస్త్ర ధర్మము. 2. స్వధర్మము. 3. సంఘ ధర్మము. 4. కాలధర్మము. ఏ పనిచేయాలి. ఏ పనిచేయకూడదు అను సంశయము కలిగినపుడు శాస్త్రములందు చెప్పబడిన ధర్మము అనుసరించాలి. తన బుద్ధికి తోచిన ధర్మము కాని ఇతరుల బుద్ధికి తోచిన ధర్మము కానీ అనుసరించరాదు. స్వధర్మమును (తాను చేయవలసిన పనిని) సక్రమము చేయాలి. అవి దోషముతో కూడియున్నదైనను తప్పక చేయాలి. అది పాపము కాదు. ఉదాహరణకు ఒక సైనికుడున్నాడు యుద్ధములో శత్రువులను సంహరించాలి అది వాని ధర్మము. అట్లు కాకుండా అహింసా పరమో ధర్మః అని మెదలకుండా కూర్చోనరాదు. అట్లా ఉంటే మరణము ప్రాప్తిస్తుంది. వాడు దేశద్రోహము చేసిన పాపమునకు గూడా గురిఅవుతాడు. కనుక శాస్త్ర ధర్మము కంటే స్వధర్మమే శ్రేష్ఠము.

## 3. సంఘ ధర్మము :

గురుముఖంగా కానీ, దైవాంశ సంభూతల ముఖంగా కానీ ఏర్పరచిన ఆచారములను ఒక సంఘము పాటిస్తూ ఉంటుంది. అవియే సంఘ ధర్మము లనీ, మత ధర్మములనీ అంటారు. ఈ మత ధర్మములు ఆయా ప్రాంతముల ననుసరించి, వాతావరణము ననుసరించి, తినే ఆహారాన్ని అనుసరించి ఏర్పాటుచేయబడ్డాయి. ఈ సంఘ ధర్మములను అనుసరించి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అను వర్ణాశ్రమ ధర్మములు ఏర్పడినవి ఒక్కొక్క మతానికి ఈ ధర్మములు ఒక్కొక్క విధంగా ఉంటాయి. ఇవి మానవ కల్పిత ములు.

## 4. కాలధర్మము :-

కాలమునకు కూడా ధర్మము ఉన్నది. రాత్రి, పగలు, వేసవికాలము, శీతాకాలము, వర్షాకాలము మున్నగునవి కాలధర్మములు. ఈ కాలధర్మము లను అనుసరించి మానవుడు తన వృత్తినీ ఆహారాన్నీ ఏర్పరుచుకోవాలి. కష్టపడి పనిచేయాలి. రైతు వర్షాకాలములో పైరులు పెట్టి వానిని పోషించి పంటలను పండించాలి. ఆహారాన్ని సకాలానికి తీసుకోవాలి. సకాలమునకు నిద్ర లేవాలి. సకాలములో దైవధ్యానము చేయాలి. మానవుడు అన్ని కర్మలు సకాలంలో జేయాలి. ఈ శరీరానికి ఆహారం ఎంత అవసరమో, యోగము ధ్యానముకూడ అంతే అవసరము. కాలోచిత ధర్మములను అనుస రించవలసి ఉంటుంది.

మానవులకు సంఘము ఉన్నది. ఈ సంఘము ఎట్లా ఏర్పడినదో ఎప్పటినుంచి ఏర్పడినదో తెలుసుకోవాలి. మానవ జన్మ తల్లితండ్రుల సమా గమ ఫలితముగా ఏర్పడుతుంది. తల్లి తండ్రి ఆరోగ్యవంతులు ఉన్నయెడల బిడ్డ ఆరోగ్యవంతుడుగా జన్మిస్తాడు. అట్లు లేనిచో వారి అనారోగ్యము గాబిడ్డ లకు సంక్రమిస్తుంది. సంఘ దోషము అక్కడనుండి ప్రారంభమవుతుంది. బిడ్డతల్లి గర్భములో ఉన్నపుడు ఆ తల్లి ఉన్న సంఘము, తల్లి ప్రవర్తన, తల్లి భావాలు, బిడకు చెందుతాయి. గర్భము ధరించినప్పుడు తల్లి పవిత్రమైన

భావముతో సత్ గ్రంథ పఠనము, శ్రవణము, దైవచింతన కలిగి ఉన్నచో దైవభక్తి కలిగిన సంతానము కలుగుతుంది. అట్లు కాక దుష్ట సంకల్పము, విషయ వాసనా స్వరూప మయిన ప్రవర్తనతో ఉన్నట్లయితే ఆ సంతానము దుర్మార్గులుగా పుట్టే ప్రమాదము ఉన్నది. పుట్టిన తరువాత తల్లి ఆహారమే ఆ బిడ్డలకు చెందుతుంది. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకుని తల్లి మంచి కోరికలు, మంచి అభిరుచులు, సమతుల్యమైన మంచి ఆహారమును తీసు కుంటూ ఉండాలి. లేకున్న బిడ్డ వ్యాధిగ్రస్తుడై సంఘ దోషమునకు బద్ధుడవు తాడు బాల్యమున బిడ్డను గురించి తల్లి తండ్రులు బాధ్యత తీసుకుని క్రమ శిక్షణా బద్ధంగా పెంచాలి. అట్లు కాకుంటే వారు సంఘద్రోహులు అవుతారు. బాల్యమున యవ్వనమున స్నేహితులు సంఘమవుతారు. కావున సత్సంగ మున చేరి, దురభ్యాసములు లేక, దైవచింతన కలిగి యున్నచో సంఘ సంస్కార సంపన్నులవుతారు. తరువాత భార్య సంఘమవుతుంది. భార్య అనుకూలవతిగా తన స్వధర్మమును పాలించుచూ ప్రవర్తించినచో సంఘ ములో వారికి సుఖము శాంతి లభిస్తాయి. లేకున్నచో సుఖము శాంతి లభిం చవు. తరువాత సంతానము. సంఘమవుతుంది. సంతానాన్ని మంచి మార్గంలో తల్లిదండ్రులే ప్రవేశపెట్టాలి. సత్సాంగత్యం కలిగేటట్లు చూడాలి. వారికి కావలసిన సహకారములిచ్చి సంతోషమును, సుఖమును కల్పించాలి. తమ సంతానమును మిత్రులుగా భావించి వారిని మంచి మార్గములో ప్రవేశింప జేయాలి.

సంఘమునకు సహకరించాలి, గౌరవించాలి, ఆదరించాలి, కలిసి అందరూ హాయిగా సుఖజీవనం సాగించాలి. సంఘమును ఆశ్రయించి మాన వుడు హాయిగా బ్రతకాలి. ఈ కులములు దుష్ట మానవుల కల్పితములు. మానవులందరిదీ ఒకే సంఘమని భావించాలి.

**పంచశీలములు :** 1. జీవహింస చేయకుండుట.

జీవ హింస అంటే పరప్రాణులను హింసించుట అని అనుభవమం

తున్నది. కాని జీవహింస అంటే తన జీవుని హింసించకుండా ఉండటం. దుష్టకర్మలను చేసి మానవుడు తన జీవునికి నీచ జన్మ కలుగునట్లు చేసి తనజీవుని తానే హింసించుకుంటున్నాడు. ముందు ఇట్లా తన జీవుని హింసించకుండా ఉత్తమ జన్మగాని, జన్మరాహిత్యము గానీ జీవునకు కల్పించాలి. కర్మలను చేయునది దేహేంద్రియములు మాత్రమే కానీ కర్మ ఫలము అను అనుభవించుచున్నది జీవుడని తెలుసుకోవాలి. ఈ సత్యమును తెలుసుకొని (శరీరము చేయు కర్మలు జీవుని హింసించునని తెలిసికొని) వాటిని సక్రమముగా ఆచరించాలి. కర్మలు జీవుని ఉద్ధరించేవిగా ఉండాలి. తనకు సుఖము ఏవిధంగా కలుగుతుందో సకల ప్రాణులకు సుఖము ఆ విధముగా కలిగేటట్లు చూడాలి. తనకు దుఃఖము ఏవిధంగా కలుగునో సకల ప్రాణులకు దుఃఖము అదేవిధంగా కలుగుతుందని తెలుసుకోవాలి. ఇతర ప్రాణులకు ఎట్టి బాధ కలిగించరాదు. తన ప్రాణంమీద తనకు ఎంత ఆశ ఉన్నదో ప్రతి ప్రాణికి దాని ప్రాణము మీద అంత ఆశ ఉంటుంది. అందువలన ఏ ప్రాణికి బాధను కలుగనీయక అన్ని ప్రాణులు తన వంటివే అని భావించాలి.

## 2. సత్యము :

మానవులకు త్రికరణములు ఉంటాయి. అవియే శరీరము, మనస్సు, వాక్కు. జీవహింసను శరీరము చేస్తుంది. సత్యమును వాక్కు పలుకుతుంది. శరీరము చేయు హింసకంటే ప్రమాదమైనది వాక్కు. న్యాయ విచారణ యందు మాటలే ప్రాణములను తీస్తున్నవి. మాటలే ప్రాణాలను కాపాడుతున్నవి. మాటలే సంపదను కాపాడుతున్నవి. సత్యము దైవ స్వరూపము. ఒక ప్రాణిని రక్షించుటకై సత్యమును దాచినను దోషము లేదు. ఒక ముని ఆశ్రమమునకు ఒక వేటగాడు జింకను చంపుటకై తరుముకుంటూ వచ్చాడు. ఆ జింక ఆశ్రమములో చొరబడినది. వేటగాడు "స్వామీ ! జింక ఎటు పోయింది ?" అని అయన్ను అడిగాడు. ఆ మహర్షి "నాయనా ! చెప్పునది చూడదు, చూచినది చెప్పదు" అని అన్నాడు. "నీ మాటలు నాకు అర్థము కాలే"దని వేటగాడు వెనుదిరిగి పోయాడు. అట్లా ఆజింక ప్రాణము రక్షింపబడినది. ఆ ముని చెప్పిన మాటలకు అర్థమేమనగా, "చూసే కన్నులు చెప్పవు.

చెప్పే నోరు చూడకు" అని. ఈ విధంగా ప్రాణ రక్షణార్థము సత్యమును దాచవచ్చును. కానీ అసత్యమును పలుకరాదు. అబద్ధములు, చాడీలు, చెప్పరాదు. నిందలు మోపరాదు.

## 3. అస్తేయము :

ఇతరుల సొత్తును మోసము చేసిగాని, దొంగతనము చేసి గాని, దౌర్జన్యము చేసి గాని అపహరించరాదు. దీనినే అస్తేయము అంటారు. సాటి మానవులు శ్రమపడి తమ కొరకు, తమ బిడ్డల కొరకు సంపాదించిన ధనమును వాళ్ళను అనుభవించ నీయక అపహరించుట మహా ద్రోహము.

## 4. బ్రహ్మచర్యము :

బ్రహ్మచర్యము 1. అస్ఖలిత బ్రహ్మచర్యము. 2. గృహస్థ బ్రహ్మచర్యము. 3. సన్యాస బ్రహ్మచర్యము. 4. వానప్రస్త బ్రహ్మచర్యము అని నాల్గు విధములు. అస్ఖలిత బ్రహ్మచర్య మనగా. స్త్రీ పరిచయము లేక, స్త్రీలపై కోరిక లేక ఆత్మానుభవము కలిగి వైరాగ్యముతో దైవ ధ్యానముతో జీవితమును సాగించుట. గృహస్థ బ్రహ్మచర్యమనగా: వివాహము చేసుకొని కామాంధులై మనస్సు చలించకుండా, నియమితముగా సంభోగించుచు, ఒకరి కష్టసుఖములను మరొకరు పాలుపంచుకొనుచు సత్సంతానము పొందటం, జీవితాన్ని నియమ నిష్టలతో గడపటం, నిగ్రహ శక్తితో దాంపత్యము చేయటం, ఏకపత్నీవ్రతము, ఏకభర్తృవ్రతము ఆచరించటం. పవిత్ర జీవితం గడపటం. సన్యాస బ్రహ్మచర్య మనగా: వివాహము కొంతకాలముపాటు చేసుకుని, స్త్రీ సుఖము అనుభవించి, వైరాగ్యము చెంది జితేంద్రియుడై, స్త్రీ సుఖము వదలివేయుట. దైవచింతన కలవారై తపస్సు, ప్రాణాయామము, ధ్యానము చేస్తూ ఆత్మానుభవమునూ, పరమ శాంతినీ పొందుట.

వానప్రస్థ బ్రహ్మచర్యం : అనగా వివాహం చేసుకొని, కొంతకాలము స్త్రీ సుఖము అనుభవించి, సంతానము కలిగిన తరువాత గృహనిర్వహణ బాధ్యతను సంతానమునకు అప్పగించిన తరువాత భార్యాభర్త లిద్దరూ వైరాగ్యము కలిగి దైవభావన కలిగి ఉండటము.

5. వ్యసనత్యాజము :

వ్యసనములు ఎనిమిది **కలవు.** 1. స్త్రీ వ్యసనము 2. మత్తు పదార్థములు సేవించటం. 3. జూదమా**డటం.** 4. జంతువును వేటాడటం. 5. కఠిన ముగా మాట్లాడటము **6. అశ్లీ**లముగా మాట్లాడటం, 7. పెద్దలను, గురువులను అవమానం **చేయ**టం. 8. ధనమును వ్యర్థముగా వ్యయపర చుటం, కాలమును సో**మరితనంతో** వ్యర్థపరచటం. ఈ ఎనిమిది వ్యసన ములు లేకుండా మానవుడు **జీవిం**చాలి. పరస్త్రీ వ్యామోహం లేకుండా ఉండాలి, నిత్యం పరస్త్రీలను తన తల్లిగా, తన బిడ్డగా, తన సోదరిగా, భావించాలి. వ్యభిచారము తన శరీరమున వ్యాధులకు కారణమగును, తన జీవశక్తిని వ్యర్థము చేయును. మద్యము త్రాగుట వలన, మత్తుపదార్థము సేవించుట వలన మన శరీరమునందు ఉన్మాదం కలుగుతుంది. మద్యపానము ఇంద్రి యములను రెచ్చగొట్టి సభ్యతను పోగొడుతుంది. ఆరోగ్యము చెడగొడు తుంది. అందుచేత మత్తుపదార్థములు వాడరాదు. మత్తుపదార్థసేవనము వలన ఉన్మాదం కలిగి, స్మృతి చెడి, బుద్ధి నశించి, తానేమి చేయుచున్నాడో తనకు తెలియకుండా మానవుడు ప్రవర్తిస్తాడు. జూదము అరిష్టదాయకము. జూదమాడరాదు. వేట పేరుతో ఇతర ప్రాణులను హింసించరాదు. "అద్వేష్టా సర్వభూతానాం" అనుపట్లు సకల ప్రాణులయెడ ద్వేషము లేక మిత్రత్వము, కరుణ కలిగి ప్రవర్తించాలి.

వాక్పారుష్యము. పనికిరాదు, మాటలు సున్నితముగా గౌరవముగా మాట్లాడాలి. మాటే బంధువు. మాటవలననే ఆదరాభిమానములు లభిస్తాయి. మాటఒక్కటే. అర్థము వేరువేరుగా ఉంటుంది. మీతండ్రిగారన్నను, మీ అమ్మ మొగుడు అన్నను అర్థమొక్కటే గాని శబ్దమునందు గౌరవము, సభ్యత

వేరువేరుగా ఉంటుంది. మధురంగా మాట్లాడటం నేర్చుకోవాలి. మాటల వలననే విరోధము కలుగుతాయి. మాటలవలననే విరోధులు కూడా సన్నిహితులు అవుతారు. మాట్లాడిన మాట సత్యముగాను, మేలు చేసేదిగాను, నీతిని బోధించేదిగాను ఉండాలి. అసత్యము ఆడరాదు. ఇతరుల గురించి చెడుగా మాట్లాడరాదు. ఇంటిగుట్టు బహిర్గతము చేయరాదు. చిన్న పిల్లలకు మర్యాదగా మాట్లాడుట నేర్పించాలి. సంఘమునందు ఒకరితో ఒకరు అన్యోన్యంగా, మిత్రభావముతో, కరుణ కలిగి మెలగుతూ జీవించాలి. శబ్దమే దివ్యమంత్రము.

మానవుడు కష్టార్జితము వ్యర్థముగా వ్యయపరచరాదు. సంపాదనను నాలుగు భాగాలుగా విభజించాలి. ఒక భాగమును కుటుంబ పోషణార్థము ఖర్చుపెట్టాలి. మరియొక భాగమును దాన ధర్మములకు, పరోపకారానికి ఖర్చుపెట్టాలి. పరోపకారమే మానవుని మరుజన్మకి ఆధారము. మరియొక భాగాన్ని వ్యాధులు కలిగినపుడు అవసరమునకై ఉంచుకోవాలి. నాల్గవభాగం దైవారాధనకు అనగా యోగసాధనకై వ్యయం చేయాలి. దైవమును, గురువులను, తల్లి తండ్రులను, పెద్దలను, తిరస్కరించరాదు.

**అష్టాంగ మార్గము :**

1. సమ్యగ్విశ్వాసము. 2. సమ్యగా కాంక్ష 3. సమ్యగ్వాక్కు 4. సమ్యగ్ కార్యము. 5. సమ్యగ్జీవనము 6. సమ్యగ్ ప్రయత్నము. 7. సమ్యక్సంబుద్ధి 8. సమ్యకేకాగ్రత. వీటిని ఇంకోవిధంగా కూడా చెప్పవచ్చు. 1. సమ్యక్ దృష్టి 2. సమ్యక్ సంకల్పము. 3. సమ్యక్ కర్మ 4. సమ్యక్ వాక్కు. 5. సమ్యక్ జీవనము 6. సమ్యక్ వ్యాయామము 7. సమ్యక్ స్మృతి 8. సమ్యక్ సమాధి.

## 1. సమ్యక్ దృష్టి :

సమ్యక్ దృష్టి. అనగా పవిత్రమైన దృష్టి. మానవుడు సంసారమనెడు బురదలో జన్మించినను, నిత్యసాధనతో ఈ బురదను దాటి దివ్య తేజస్సును

చూడాలి. తామర పుష్పము చూడండి. అది బురదలో జన్మిస్తుంది. ఆ బుర దను, నీటిని దాటి, సూర్యుని తేజస్సును ఆశ్రయిస్తుంది. అట్లే మానవుడు తన మూడవ నేత్రముతో (జ్ఞాన నేత్రముతో) ఈ సంసారము అతిక్రమించి ఆత్మస్వరూపుడ్ని చూడాలి. అదియే సమ్యక్ దృష్టి. మన కళ్ళు ప్రకృతి కార్యముతో కూడిన ప్రకృతి వస్తు తత్వమును మాత్రము చూడగలవు. అంతేగాని దైవశక్తి తత్త్వమును చూడలేవు. మూడవ నేత్రముతోనే ఆ దివ్య తత్త్వమును మనం చూడగలము.

## 2. సమ్యక్ సంకల్పము :

సమ్యక్సంకల్పమనగా పవిత్ర సంకల్పము. మానవుల సంకల్పము పవిత్రముగా ఉండాలి. పరోపకారముగా ఉండాలి. పరోపకారులు సజ్జనులు. ఇతరులకేమాత్రము ఉపకారము చేయనివారు సామాన్యులు. తమ స్వార్థం కొరకు ఇతరుల కపకారము చేసేవారు అధములు.

## 3. సమ్యక్ కర్మ ;

కర్మ 4 విధములు, 1. సకర్మ. 2. స్వకర్మ. 3. అకర్మ 4. వికర్మ సమ్యక్ కర్మ అనగా పవిత్రమైన కర్మ. సకర్మ అనగా తమ స్వధర్మమును నెర వేర్చుకుంటూ దైవ ధ్యానమును, పరోపకారమును సంఘ సేవను చేస్తూ ఉండటము. ఒక గుడ్డివాడు దివిటి పట్టుకుని రాత్రి సమయమునందు ఒక గుంట పక్కన కూర్చున్నాడు. తనకు కళ్ళుకనిపించకపోయినను కళ్ళున్నవాళ్ళు గుంటలో పడతారని అట్లా కూర్చున్నాడు. ఒక కుంటివాడు దారిలో ఉన్న ముళ్ళను, రాళ్ళను ఏరుతున్నాడు. ఇతరులకోసం వారు ఆకర్మను చేస్తు న్నారు. అదే పవిత్ర కర్మ. స్వకర్మ అనగా తన పని తాను చేసుకుని ఇతరు లకు ఉపకారము చేస్తూ అపకారమేదియు చేయకుండుట. తాను కష్టపడ కుండా పరుల కష్టంమీద ఆధారపడి సోమరిపోతుగా జీవించువాని జీవితము వృథా. పనిచేయక తిన్నవాడు పాపాత్ముడు అవుతాడు. కావున మనము సత్ కర్మను చేయాలి.

### 4. సమ్యక్ వాక్కు :

సమ్యక్ వాక్కు అనగా ఆత్మ తత్త్వ స్వరూప జ్ఞానము చెప్పుట. గురువులు దైవాంశ సంభూతులు చెప్పిన ధర్మములను ఇతరులకు బోధించుట.

### 5. సమ్యక్ జీవనము :

సమ్యక్ జీవనము అనగా పవిత్రమైన జీవితమును గడపాలి. తను సంసారమందు ఉన్నను, తనలో సంసారమును ఉంచుకోరాదు. తామరాకు నీటిలో ఉంటుంది కాని దానికి నీరు అంటదు. అదేవిధముగా మానవుడు వైరాగ్యముతో జీవించాలి. తేనెటీగవలె జీవించాలి. తేనెటీగ తన ఆహారాన్ని మకరందాన్ని తీసుకునేటప్పుడు చెట్టునకుగాని, ఆకునకు గాని, పుష్పమునకున గాని, ఏవిధమైన అపకారము కలుగనీయక మళ్ళీ పుష్పము కలుగుటకు ఉప కారమే చేస్తుంది. అట్లాగే మానవుడు సంసారమునందుండి సంసారము నంటక వైరాగ్యమనెడు ఆయుధం చేత మాయను ఖండించి ఆత్మజ్ఞాన స్వరూపము పొందుతాడు. పరమ శాంతిని పొందుతాడు.

### 6. సమ్యక్ వ్యాయామము :

ఈ వ్యాయామము రెండు విధములుగా ఉంటుంది. 1. శరీర వ్యాయామము 2. అంతఃకరణ వ్యాయామము. శరీరవ్యాయాము మనమందరము ఎరుగుదుము. యమ నియమాలతో అతఃకరణ వ్యాయామము చేయాలి. చంచ లమగు మనస్సును ఏకాగ్రం చేసుకోవాలి. నిశ్చలమైన మనస్సే దైవ సాక్షా త్కారము పొందగలదు బుద్ధం శరణంగచ్ఛామి. బుద్ధుని ఆశ్రయించి, మన స్సును నిగ్రహించి, దానిని సద్వినియోగపరచి అహంకారమునకు, ఆత్మభావం కల్పించాలి. ఈ అభ్యాసాన్ని అంతః కరణ వ్యాయామము అని అంటారు.

### 7. సమ్యక్ స్మృతి :

సమ్యక్ స్మృతి అనగా పవిత్ర భావమును జ్ఞాపకం తెచ్చుకోవటం.

నిరంతరం మనం దైవాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటూ ఉండాలి. మనం చేసే ప్రతి కార్యం ప్రారంభంలో "ఓంసత్" అని స్మరించాలి. విషయ వ్యామోహములను తొలగించుకొంటూ ఇట్లా దైవభావంతో మనం ఉండటం అభ్యాసం చేస్తే విషయ వాసనలన్నీ మనలోనుంచి క్రమంగా అదృశ్యమై పోతాయి. పరిశుద్ధ తత్వం ఏర్పడుతుంది.

## 8. సమ్యక్సమాధి :

సాధనా విధానము పరిపూర్ణముగా అభ్యాసం చేయువారిలో నాల్గు తరగతులున్నవి. 1. సాంఖ్యము 2. తారకము 3. అమనస్కము 4. పరిపూర్ణము. గురుముఖంగా కాని, శాస్త్రము ద్వారాగాని, స్వానుభవమున కాని ఆత్మ తత్త్వాన్ని తెలుసుకోవటమే సాంఖ్యము. తారకమనగా తారతమ్యము తెలుసుకోవటము. నిత్యానిత్య వివేకము. అమనస్కమనగా మనస్సు లయమగుట (సంకల్ప వికల్పములు లేకుండుట) మనస్సును హృదయమునందు నిరోధించి జ్ఞాన నేత్రముతో దివ్య తేజస్సు దర్శిస్తు ఆ మనస్సును, అంటే శ్వాసము సుషుమ్న నాడీలో నడుపుచు, సహస్రారముచేర్చి స్మృతిలో బుద్ధికి పైన యుండు పరమ శాంతిని (సచ్చిదానందమును) అనుభవించుటయే పరిపూర్ణము (సమ్యక్సమాధి) అనబడుతుంది. వెలుపలఉండు శబ్ద స్పర్శరూప రస గంధములతో సంబంధము అప్పుడు జీవునకుండదు. దివ్య తేజస్సు ఒక్కటే కనిపిస్తూ ఉంటుంది. మంత్రజపము అమనస్కము గాదు. అమనస్కములో పరిపూర్ణత లేదు. పుణ్య కర్మలు, సత్‌గ్రంధ పఠనము. యజ్ఞములు మొదలగునవి చేయుటవలన పుణ్యము లభించునే కానీ మోక్షార్హత కలుగదు. శారీరక శ్రమ, ప్రాణాయామము, ధ్యానము కలిపి యోగమనబడుతుంది. ఈ యోగము వీటన్నింటిని అతిక్రమించి పరమ శాంతి ప్రదము, అమృత స్వరూపమునైన, సచ్చిదానంద జ్యోతి స్వరూపమును దర్శింపచేసి మోక్షము నిస్తుంది. కనుక మానవులు తప్పక విశ్వయోగమును ఆచరించి, సాధనచేసి, సమాధి స్థితిని పొంది మోక్షార్హులు కావలెను.

**అష్టాంగ ధర్మ మార్గములు :**

మానవుడు ఆచరించవలసిన ధర్మమార్గములు ఎనిమిదిగలవు. 1. జ్ఞానము 2. త్యాగము 3. ధైర్యము 4. వైరాగ్యము 5. తృప్తి 6. కీర్తి 7. ప్రజ్ఞ 8. దీక్ష.

జ్ఞానము నాల్గు విధములు. 1. ఆత్మజ్ఞానము 2. శాస్త్ర జ్ఞానము 3. విజ్ఞానము (అనగా ప్రకృతి వస్తు తత్త్వ జ్ఞానము) 4. అనుభవ జ్ఞానము. ఆత్మ జ్ఞానమనగా ఆత్మనాత్మ తత్త్వములను తెలిసికొని, అనాత్మ అనిత్యమని ఆత్మ సత్యమని తెలిసికొని, అంతర్నేత్రమును ఆశ్రయించి, యోగముచే ఆత్మ సాక్షాత్కారమును సాధన చేయుట. శాస్త్ర జ్ఞానమనగా శాస్త్రములలో చెప్పిన ధర్మము అనుభవంలోకి తెచ్చుకోకుండా తెలుసుకోవటము. విజ్ఞానమనగా వస్తు తత్త్వ జ్ఞానమును తెలుసుకొనటం. విజ్ఞానాన్ని పరోపకారం కోసం వినియోగించటం అనుభవ జ్ఞానమంటే శాస్త్రజ్ఞానము లేకపోయినను, విజ్ఞానము లేకపోయినచో కేవలం యోగ సాధన ద్వారా వాటి సారాంశాన్నంతటి తెలుసుకుని ఆత్మ సాక్షాత్కారం పొందటం. ఇదియే శ్రేష్ఠమైన విధానము. అనుభవ జ్ఞానమనబడుతుంది. అనుభవ జ్ఞానాన్ని ఇతరులకు బోధించాలి.

**త్యాగము :**

"త్యాగోహి పురుష వ్యాఘ్రః" త్యాగముచేయు వాడే పురుష సింహుడనబడుతాడు. పరోపకారం చేయకుండా నత్తగుల్లలా జీవితాన్ని గడపటం వ్యర్థము. నత్తగుల్ల ప్రాణితో కలవదు. తన జాతివాతితో గూడ కలవదు. ఎవరిని నమ్మదు. తన ఇంటిని తనపై పెట్టుకుని తిరుగుతూ ఉంటుంది. మానవుడు అట్లా జీవించాలి. గోవులాగ జీవించవలెను. ఒక వైశ్యుల అమ్మాయి ఉండేది. ఆ అమ్మాయికి అందమైన శిరోజాలు ఉండేవి. ఆ కాలంలో అనేకమంది స్త్రీలు ఆ వెంట్రుకలను ఖరీదుకు ఇవ్వవలసినదిగా

ఆమెను కోరేవారు. ఆమె "నా ప్రాణమైన ఇస్తాను గాని, వెంట్రుకలను మాత్రం ఇవ్వను" అని సమాధానం చెప్పేది. తలవని తలంపుగా ఒకరోజున ఒక బౌద్ధ భిక్షువు ఆగ్రామానికి వచ్చాడు. ఆమె ఆభిక్షువును భిక్షకు పిలిచింది. ఆమె కడు పేదరాలు. వంటచేయుటకు ఏమియూ లేదు. ఆమె వెంటనే తన వెంట్రుకలను అమ్మి వచ్చిన డబ్బుతో వంటచేసి, ఆ భిక్షువుకు తృప్తిగా భోజనము పెట్టింది. ఆమె చేసిన త్యాగాన్ని చూసి బౌద్ధ భిక్షువు ఆమెను మనస్ఫూర్తిగా ఆశీర్వదించాడు. ఆమె జ్ఞానాన్ని పొంది మోక్షార్హురాలైంది. ఇట్లా పరోకారార్థమై తన ప్రియాతిప్రియమైన వస్తువును సహితం త్యాగం చేయాలి. త్యాగము వ్యర్థము కాదు. అఖండ ఫలితము నిస్తుంది.

**ధైర్యము :**

మానవుడు తప్పుచేసినప్పుడు భయపడతాడు. తప్పులు చేయరాదు. దేనికి భయపడరాదు. హృదయ దౌర్బల్యంతో, పిరికితనంతో ఉండరాదు. మోక్షప్రాప్తి మనకు సాధ్యము కాదని భయపడరాదు. ప్రయత్నము వలన, అభ్యాసం వలన కార్యసిద్ధి కలుగుతుంది.

**కీర్తి :**

శరీరముతో ఉన్నప్పుడు, శరీరము విడిచిన తరువాత శాశ్వతముగా ఉండేది కీర్తి. మానవుడు సత్‌కీర్తివంతుడుగా జీవించాలి.

**వైరాగ్యము :**

ఇంద్రియములను తన వశమందుంచుకొనుటయే వైరాగ్యము. మనస్సు నిగ్రహించి, విచారమును వికారమును పొందకుండా, చలింపనీయకుండా ఉంచుట వైరాగ్యము. నెమలి వైరాగ్య జీవితాన్ని గడుపుతూ ఉంటుంది. ఆడనెమలి పక్కన ఉన్ననూ కూడ అది చలింపదు. విషయ సుఖమును కోరదు. ప్రసన్నమైన ప్రకృతిని గాంచి పురివిప్పి ఆనందంతో నాట్యం చేస్తుంది. దాని కంటినుండి ఆనంద బాష్పాలు రాలుతాయి. ఆ కంటి బిందువులను లోనికి తీసుకుని ఆడనెమలి, గర్భము ధరించి సంతానోత్పత్తి గావిస్తుంది.

తృప్తి :

మానవుడు తనకు లభించిన దానితో తృప్తి పడాలి. "యదృచ్ఛా లాభ సంతుష్టా" తృప్తి లేనివారికి ఎన్నో భోగభాగ్యములున్నను సుఖసంతోషాలు ఉండవు. ఆశ లోకములో నిన్ను బంధిస్తుంది. ఆశ ప్రాణాన్ని తీస్తుంది. ఉన్నదానితో తృప్తిపడి ఉండటమే సుఖాన్నిస్తుంది.

శ్రద్ధ, దీక్ష :

ఏపని చేసినను శ్రద్ధతో చేయాలి. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" శ్రద్ధతోనే జ్ఞానసిద్ధి కలుగుతుంది. శ్రద్ధ లేనివాడు ఏపని చేయలేడు. ఏ కార్యము సాధించలేడు. ఒకవేళ కార్యము సిద్ధించనిచో మరలా మరలా ప్రయత్నం చేసి కార్యసిద్ధిని పొందాలి.

ఉదాహరణకు విద్యార్థులు ఉన్నారు. తమ పాఠము ఒకటి, రెండు పర్యాయములు చదివి, రాదని విరమించరాదు. శ్రద్ధతో కంఠస్థం అయ్యే వరకు చదవాలి. శ్రద్ధగా తన కార్యమును సాలెపురుగు సాధించుకుంటుంది. తన గూడుకట్టుకొనుట యందు ఎన్నియో మార్లు అది జారి క్రింద పడిపోతూ ఉంటుంది. తన ప్రయత్నం మాత్రం విడవదు. శ్రద్ధతో, దీక్షతో సాధించి తన గూటిని అది నిర్మించుకుంటుంది. అదేవిధంగా మానవుడు యోగసాధనను దీక్షతో, శ్రద్ధతో చేస్తూ ఉండాలి. సాధనలో భంగము కల్గినప్పటికి దానిని విడువరాదు. మరలా మరలా ప్రయత్నించాలి. కార్యసిద్ధిని పొందాలి.

ఆరోగ్యము :

ఆరోగ్యమే మహాభాగ్యము. మన ఆరోగ్యమును మనమే కాపాడుకోవాలి. జన్మాంతర సంస్కారము వలన మానవుని ఆరోగ్యం పాడవుతూ వుంటుంది. "పూర్వజన్మ కృతం పాపం వ్యాధి రూపేన పీడితం". తల్లి దండ్రులు చేసిన తప్పులు బిడ్డలకు కూడా వ్యాధుల రూపంలో సంక్రమిస్తాయి

ఆహార విహారములను సక్రమంగా పాటించనందువల్ల కూడా ఆరోగ్యం చెడుతుంది. శరీరమునకు ఆహారము, విశ్రాంతి, నిద్ర ఎంత అవసరమో, వ్యాయామము కూడా అంత అవసరమే. నిత్యమూ వ్యాయామం చేయకుంటే రక్త ప్రసరణ సక్రమంగా జరుగక, శరీరములో క్రొవ్వు పెరిగి, ఊబ శరీరమై, గుండెజబ్బులు, నరముల జబ్బులు కలుగుతాయి. మనము చేసెడి చెడు తలంపులు, చెడు పనులుకూడా మన ఆరోగ్యాన్ని పాడుచేస్తాయి. ధర్మ చక్రములో చెప్పబడిన ఇరువది నాలుగు ధర్మములను మానవుడు తప్పకుండా ఆచరించాలి.

శాస్త్ర ధర్మములు మూడు విధములుగా నున్నవి. అవియే మనోవాక్కాయ ధర్మములు. మానవులు మొదట తాను ఏ ఆశ్రమమునకు సంబంధించిన వాడో తెలుకోవాలి. బ్రహ్మచర్యము, గృహస్థు, వానప్రస్థము, సన్యాసము అనెడి నాలుగు ఆశ్రమములు ఉన్నాయి. ఆయా ఆశ్రమములో ఉన్నపుడు ఆయా కర్మములను. ఆచరిస్తూ ఉండాలి. తన స్వధర్మాన్ని అనగా ఆత్మ ధర్మాన్ని ఆచరిస్తూ ఉండాలి. పరధర్మమయిన ఇంద్రియ ధర్మము మనకు కీడు చేస్తుంది. కనుక దానిని విడిచి సత్ప్రవర్తన కలిగి ఉండాలి.

# నాల్గవ అధ్యాయము

## (సూత్రత్రయ యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షులారా ! విద్యార్థులారా ! బుద్ధభగవానుడు మనకు మన మనస్సునెట్లా అదుపులో ఉంచుకోవాలో, ఎట్లా ఆలోచించాలో, ఇంద్రియ నిగ్రహాన్ని ఎట్లా సంపాదించాలో, మనంతట మనం మానసికంగా ఎట్లా అభివృద్ధి పరచుకొని ఉన్నత శిఖరాన్ని అందుకోవాలో, జ్ఞానోదయాన్ని ఎట్లా పొందాలో, తద్వారా మోక్షాన్ని ఎట్లా పొందాలో చక్కగా బోధించాడు. దుఃఖము, దుఃఖ హేతువులు, దుఃఖ నిరోధము, నిరోధనోపాయములు – ఈ నాలుగు బుద్ధునిచే బోధించబడిన ఆర్య సత్యములు.

జీవితం దుఃఖమయం గాబట్టి దుఃఖతరణోపాయాన్ని ఆలోచిస్తే అదే మోక్షమార్గాన్ని చూపుతుందని బుద్ధుడు గట్టిగా నమ్మాడు. బుద్ధ భిక్షువులు సత్యం, ధర్మం, సంఘాలను శరణు వేడాలి. మనోవాక్కాయ కర్మల శుద్ధిని సాధించాలి. సంచయేచ్ఛతో ఉండరాదు. బుద్ధ భగవానుడు తాను ఆచరించిన సత్యాన్నే సంఘానికి బోధించాడు. దానిని సంబంధించిన సంఘటన మీకిప్పుడు వివరిస్తాను. వినండి.

అది హేమంత ఋతువు. సూర్యుడు అస్తాద్రి చాటుగా అదృశ్యమవబోతున్నాడు. ప్రకృతి అంతా ప్రశాంతంగా ఉంది. బుద్ధభగవానుడు తన పర్యటను ముగించి, వైశాలి నగరానికి ప్రయాణమై పోతున్నాడు. ఆయన వెంట చాలామంది భిక్షువులున్నారు. వాళ్ళలో కొంతమంది తలపైన గుడ్డల మూట పెట్టుకుని ప్రయాణం చేస్తున్నారు. మరికొంతమంది గుడ్డల మూటను చేతులతో పట్టుకుని ప్రయాణం చేస్తున్నారు. భిక్షు సంఘముయొక్క ఆ సంగ్రహ ప్రవృత్తిని చూచి తథాగతుడు ఆశ్చర్యం చెందాడు.

"ప్రజల సమక్షంలో భిక్షువులు తీవ్ర వైరాగ్యమే ఆదర్శమని ప్రబో

ధించిన మరుక్షణంలోనే తాము చెప్పినదంతా మరచిపోయి వస్తు సంగ్రహ ముపై ఆసక్తి చూపిస్తున్నారు. ఈ నడవడీ మాన్పటం ఎట్లా ?" అని తథా గతుడు చింతించసాగాడు. భగవానుడు వైశాలి చేరుకుని, గౌతమీ చైత్య ములో ప్రవేశించాడు. భిక్షువులంతా ఆయన ముఖంలోని నిరుత్సాహాన్ని గమ నించినా దానినంత విశేషంగా పట్టించుకోకుండా పాదనమస్కారం చేస్ల ఎవరిదారిన వాళ్ళు విశ్రమించటానికి వెళ్ళారు. "ఈ సంఘముయొక్క సంచ యేచ్ఛను ఏవిధంగా నివారించాలి ?" అని భగవానుడు తీవ్రంగా ఆలో చించి "భిక్షువులు ఉపయోగించే వస్త్రాలను పరిమితం చేయా"లని నిశ్చ యించుకున్నాడు. మునుముందు తనకు తానే ఆ కఠిన నియమాన్ని ఆచర ణలో పెట్టాలనుకొని, గౌతమీ చైత్యము నుండి బయటకు వచ్చి, శాటీ పరచుకొని పడుకొన్నాడు. చలి కొద్దిగా వేయటం మొదలు పెట్టింది. ఒక దుప్పటితీసి కప్పుకున్నాడు. రెండు ఝాములు గడిచాయి. చలి మరింత ఎక్కువ కావటం మొదలుపెట్టింది. ఇంకో దుప్పటి తీసి కప్పుకున్నాడు. మూడవ ఝాములో చలి మరింత తీవ్రమయినప్పుడు మూడవ దుప్పటి కప్పు కున్నాడు. ఇంతలో బ్రహ్మ ముహూర్త మయ్యింది.

"ప్రతి భిక్షువుకూ తన అవసరాలకు మూడు దుప్పట్లు సరిపోతవి. ఇంతకన్నా ఎక్కువ సంగ్రహిస్తే పాపమవుతుంది. సంఘము నియమరహితమై శిథిలమవుతుంది," అని తథాగతుడు గ్రహించి, భిక్షువు లొక్కొక్కరి మూడు దుప్పట్లకంటే ఎక్కువ వస్త్రాలు ఉండటం కూడదని శాసించాడు. శరీరాన్ని దాచుకోవటానికి 1. అంతర్వస్త్రం (నడుమునుంచి క్రిందిభాగం రక్షణకోసం) 2. ఉత్తర సంగ్ (అంగవస్త్రం) 3. సంఘటి (దుప్పటి) ఈ మూడు భిక్షకు లకు చాలునని ఆయన గ్రహించాడు. సంఘం యొక్క వైరాగ్య భావనకు కళంకం రాకుండా శాస్త (బుద్ధ భగవానుడు) ఇట్లా సంఘాన్ని రక్షిం చాడు. తన జీవితంలో పొందిన త్యాగమయమయిన అనుభవ సారాన్ని ఆయన భిక్షువుల హితం కోసం వినియోగించాడు. కనుక మానవుడు తన జీవితావసరాలకు సరిపోయేంతవరకే ఏ వస్తువునైనా సంగ్రహం చేయాలి.

మితిమీరితే అది అనర్ధదాయకమౌతుంది. ఇక బుద్ధభగవానుడు త్రిసూత్ర యోగాన్ని ఏట్లా బోధించాడో మనం తెలుసుకొందాం.

**శ్రీ బుద్ధ భగవాన్ ఉవాచ :**

బుద్ధ ధర్మమందు సత్యము, ధర్మము, సంఘము, అను త్రిసూత్రములు చాలా ప్రధానమైనవి. మొదట మనము సత్యమనగా ఏమో తెలుసుకోవాలి. సత్యాన్ని అలంబనం చేసుకొని ధర్మాన్ని అనుసరించాలి. సత్య ధర్మ పూరితుడయి సంఘాన్ని ప్రేమించాలి. సత్యమనగా నిత్యా నిత్య వస్తు తత్త్వ జ్ఞానము. ఈ లోకంలో కనిపించే జీవరాశులూ, సకల వస్తు సముదాయమూ అనిత్యమనీ, జీవుడు, దేవుడూ సత్పదార్థము అనీ గ్రహించాలి. జీవుడు దైవాంశమయిన అక్షర తత్త్వము కలవాడు. కానీ చలన స్వభావము చేత అతడు పరిపరి విధాల మార్పు చెందుతున్నాడు. ఈ శరీరమును వీడి మరొక శరీరము పొందుతున్నాడు. చంచల ప్రాణమే జీవుడు. పరమాత్మ అచలుడు (కదలువాడు కాడు). అక్షరుడు (నశించువాడు కాదు). తేజోమయుడు, సర్వ సాక్షి, శక్తిమయుడు, సకలమునకు ఆధారభూతుడు, మణిహారమునందు సూత్రమువలె సర్వమునకు ఆధారభూతుడుగా నుండేవాడు.

ఆత్మ, 1. పరమాత్మ, 2. జీవాత్మ, 3. అంతరాత్మ అని మూడు విధములు. పరమాత్మ తేజస్సు (శక్తి) శరీరమునందు అంతర్జ్యోతిగా నున్నది. తన యందలి అంతర్ జ్యోతిని తెలుసుకొని. మానవుడు ఆత్మ జ్ఞానమును కలిగి జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషములకు అతీతుడు కావాలి. వీటన్నింటికి అతీతమైన స్థానము ఉన్నది. అ పరమ పదం యోగం చేత, జ్ఞానంచేత లభిస్తుంది. ఈ పదాన్ని పొందినవారికి అమృతత్త్వము లభిస్తుంది. వారికి పునర్జన్మ ఉండదు. వారు పరమశాంతిని పొందుతారు. సచ్చిదానందమును అనుభవిస్తూ ఉంటారు. ఆత్మజ్ఞానము పొందటము అంటే సత్యాన్ని తెలుసుకోవటమే ! అన్ని దుఃఖాలు – నివృత్తి మార్గంలో, మనం పయనిస్తుంటే – వాటంతటవే అవే తొలగిపోతవి.

మానవుడు అనుసరించు మార్గములు మూడున్నవి. 1. దుఃఖ నివృ మార్గము అనగా సత్యాన్ని తెలుసుకోవటం 2. ప్రవృత్తి మార్గము అన అహంకార మమకారములకు బద్ధులై, ఇంద్రియ విషయ వాంఛాలోలులై రాగ ద్వేషాలను, కామ, క్రోధ, మోహ, లోభ, మదమాత్సర్యాలనూ కలిగి శరీర సుఖములు అనుభవిస్తూ ఉండటం. ఈ మార్గము జీవునకు బంధ హేతువు. జీవుని బంధమునుండి విముక్తి చేయు మార్గమే నివృత్తి మార్గము. అదియే సత్యమార్గము. 3. కృషిమార్గము అనగా ప్రతి మానవుడు కష్టపడి తనను తాను పోషించుకుంటూ నివృత్తి మార్గమును అవలంభించటం.

ధర్మము నాలుగు విధములు :

1. స్వధర్మము 2. శాస్త్ర ధర్మము 3. సంఘ ధర్మము 4. కాల ధర్మము. ఇందు స్వధర్మమే శ్రేష్టమైనది. స్వధర్మమనగా ఆత్మ ధర్మము. స్వధర్మ మనగా తన ఆశ్రమ మేదో తనకు నిర్దేశించబడిన తరువాత, శాస్త్ర ప్రమాణము తీసుకొని ఏ పని చేయాలో, ఏ పని చేయకూడదో బాగుగా విచారించి, తెలుసుకొని ఆచరించటం. అంతేగాని ఎవరి బుద్ధికి తోచినట్లు వాళ్ళు చేయరాదు. మానవునకు కేవలం జీవించటమే పురుషార్థం కాదు. తనను తాను తరింప చేసుకుని ఇతరులను తరింప చేయటమే పురుషార్థము.

జీవుడు అనగా పురుషుడు పురుషోత్తమ ప్రాప్తిని పొందాలి. ఇదియే శాస్త్ర ధర్మము. సంఘ ధర్మము. కొంతమంది పెద్దలూ, గురువులూ కలసి నిర్ణయించిన ధర్మములను సంఘ ధర్మము లంటారు. ఒక్కొక్క ప్రాంతాన్నీ, ఒక్కొక్క వాతావారణాన్నీ అనుసరించి సంఘధర్మాలు వేరువేరుగా ఉంటాయి. దైవారాధనలు, పెండ్లి, అంత్యక్రియలు మొదలైనవి సంఘ ధర్మాలు – ఒక్కొక్క ప్రాంతంలో – ఒక్కొక్క సమాజంలో ఈ ధర్మాలు భిన్న భిన్నంగా ఉంటూ ఉంటాయి.

త్రికరణములు అనగా మనస్సు, వాక్కు, శరీరము. మనము ఏ పని చేసినా త్రికరణ శుద్ధిగా చేయాలి. మనసులోని సంకల్పం, నోటిమాట, శరీరంతో చేయవలసిన పని, ఒకటిగా ఉండాలి. దైవభక్తి, పెద్దలయందు గౌరవము, బ్రహ్మచర్యము, పంచశీలము, సత్ప్రవర్తన కలిగి ఉండాలి. శమ దమాదులు కలిగి సత్వగుణ సంపదకలిగి, ఆరోగ్యం కలిగి, వైరాగ్యము కలిగి జీవించాలి. సంఘమును ప్రేమించాలి.

మనం మాట్లాడే మాటలు సత్యముగాను, ప్రియముగాను, ప్రాణులకు మేలు చేయునవిగాను ఉండాలి. ఎవరితో ఎట్లా మాట్లాడాలో అట్లా మర్యాదగా మాట్లాడాలి. ఇతరులకు దైవతత్వాన్ని బోధించాలి. అదియే వాక్కు యొక్క పవిత్రత. "అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియం హితం చయత్" అనునదే పవిత్ర వాక్యం. ఉద్వేగరహితంగా, సత్యముగా, ప్రియంగా, మేలు చేసే విధంగా మన వాక్కు ఉండాలి. పరిశుద్ధ సంకల్పం కలిగి, ప్రసన్నమైన మవస్సుతో మాట్లాడటం మానవులకు ఒక దివ్యాభరణం.

మానవులకు స్థూల సూక్ష్మ కారణ శరీరాలు మూడున్నట్లే, సత్వరజస్తమో గుణాలూ, మూడు అవస్థలూ ఉన్నాయి. అవియే జాగ్రదావస్థ, నిద్రావస్థ, సుషుప్త్యావస్థ. వీటికంటే అతీతమైన తురీయావస్థ అనేది మరొకటుంది. మానవుడు దాన్ని చేరుకోవాలి. అందుకు యోగసాధన అత్యంతావశ్యకము. జ్యోతులు మూడు. ఈ జ్యోతులకు జ్యోతి అయినటి పరంజ్యోతి. అదే పరమాత్మ. సూర్యచంద్ర అగ్నిహోత్రములు నేత్రములకు ప్రకాశాన్నిస్తాయి. చూడవదయిన అంతర్జ్యోతి జ్ఞానప్రకాశాన్నిస్తుంది. ఈ జ్యోతి శరీరము అంతర్భాగాన ఉంటుంది.

"యేతస్సుఖాంతరామః తథా అంతర్జ్యోతి రేవచ" మానవులు అంతర్జ్యోతి

యందే విశ్రాంతి తీసుకోవాలి. దాన్నే జ్ఞానావస్థ అని అంటారు. కానీ మానవులలో చాలామంది ఇంద్రియాలలో విశ్రాంతిని తీసుకుంటూ ఉంటారు. ఇంద్రియ సుఖాలకు ఆకర్షితులవుతుంటారు. వాళ్ళు జనన మరణ చక్రములలో పడి తిరుగుతుంటారు. మానవులు ఆత్మయందు విశ్రాంతి తీసుకుని ముక్తులు కావాలి. మన శరీరం లోపల ఉన్న అంతర్జ్యోతిని మనం ధర్శించలేక పోతున్నాం. కానీ అది ఇస్తున్న ఫలితాన్ని మాత్రం అనుభవిస్తున్నాం. నిద్రించేటప్పుడు వెలుపలి వెలుతురును మనం చూడటం లేదు. కానీ కలలు వస్తూ ఉంటాయి. కలలో సూర్యచంద్రులనీ, నక్షత్రాల్నీ, రూపాల్నీ, ప్రకృతినీ చూస్తూనే ఉన్నాం. అట్లా ఏదైతే చూస్తున్నదో ఆ నేత్రము అంతర్జ్యోతి. దాన్నే జ్ఞాననేత్రమని అంటాం. మానవులకు కుడి, ఎడమ శ్వాసలు మాత్రమే తెలుసు. ఈ రెండు శ్వాసల మార్గము కాక సుషుమ్నా అనే మూడవ శ్వాస మార్గం మరొకటున్నది. శిశువు తల్లి గర్భంలో ఉన్నపుడు ఈమార్గము తోనే శ్వాస జరుపుతూ ఉంటాడు. అప్పుడు ఆ శిశువు ఊపిరితిత్తులు పని చేయవు. సుషుమ్నా నాడీ అనేది మన శరీరంలో మూలాధారమునుండి సహస్రారము వరకు వ్యాపించి ఉన్నది. మానవునకు బుద్ధికి (మెదడుకు) పై భాగమున శాంతిమయ కోశమున్నది. దానినే ఆనందమయ కోశమంటారు. అదే బ్రహ్మ రంధ్రము. మనం శాంతిని పొందాలంటే సుషుమ్నా శ్వాస ద్వారానే పొందాలి. అదియే యోగమనబడుతుంది. యోగమంటే ఇంద్రియము లతో గానీ, వస్తు పదార్థములతో గానీ, సంబంధం లేకుండా, పరిపూర్ణమైన ఎరుకతో సుషుమ్నలో శ్వాసచేస్తూ, జ్ఞాన నేత్రముతో అంతర్జ్యోతిని చూస్తూ నిత్యానందాన్ని అనుభవించటమే! ఇదియే మోక్షమార్గం. శబ్ద, స్పర్శ, రూప, రస గంధములతో ఇంద్రియ భోగములననుభవించటం, జీవులకు బంధమవుతుంది. ఈ కార్యం వర్తమానంలో మనం చేయవలసిన ముఖ్యమైన కార్యము.

భూతకాలం గురించి విచారించవలసిన అవసరం లేదు. అది గడిచి

పోయిన కాలం. "మేము పాపులము, మాకు మోక్షార్హత లేదు". అని ఎవ్వరూ విచారించనక్కర్లేదు. స్థిరచిత్తులై మానవులు యోగసాధన ద్వారా పరిపూర్ణ జ్ఞానాన్ని పొందాలి. ఆమ్రపాలి ఒకవేశ్య. అంగుళీమాలుడు ఒక హంతకుడు. ఆమ్రపాలి ఎన్నియో పాపములు చేసినది. కానీ బుద్ధయోగమును ఆశ్రయించి పరమపవిత్రురాలిగా మారిపోయింది. అంగుళీమాలుడు కూడా యోగము నాశ్రయించి ధన్యుడైనాడు. అందువలన మానవులు సత్సాంగత్యముతో, యోగమార్గములో పయనిస్తూ, జ్ఞానాన్ని పొంది, వర్తమానకాలంలోనే జన్మ రాహిత్యాన్ని పొందాలి.

మానవులు తీసుకొనే ఆహారము మూడు విధములుగా ఉన్నది. మాంసాహారము, శాఖాహారము. అమృతాహారము. మాంసాహారము కొరకై మనం జీవహింస చేయవలసి ఉంటుంది. అది మహా పాపము. ఆకులు, కాయలు, ధాన్యము, పండ్లు ఫలములు మొదలైనవి శాఖాహారములు. ఇది హింసా స్వరూపమైన ఆహారము కాదు. ఒక చెట్టులోని ప్రాణము ఆ చెట్టునంతా వ్యాపించి ఉంటుంది. ఒక కాయ కోస్తే మళ్ళీ కాయ కాస్తుంది. ఆకులు కోస్తే మళ్ళీ ఆకులు పుడుతాయి. కావున ఈ ఆహారము హింసాహారము కాదు. మాంసాహారములో ఒక ప్రాణిని కోస్తే మళ్ళీ అది ఉత్పత్తి కాదు. చెట్టును మొదలు నరికినప్పటికీ మళ్ళీ చిగురిస్తుంది. అందువలన శాఖాహారము పాప భూయిష్టం కాదు.

అమృతాహారము బ్రహ్మరంధ్రము నుండి అమృతరూపంలో స్రవిస్తుంది. దీనిని ఖేచరీ ముద్రద్వారా యోగమార్గములోనే సేవించాలి. ఈ ఆహారాన్ని సేవించే యోగులకు మరే ఇతర ఆహారములతో పనిలేదు. ఇట్టి ఆహారం తీసుకునేవాళ్ళనే ఊర్ధ్వరేతస్కులు అని అంటారు. తమ ప్రాణాన్ని సుషుమ్నా మార్గంలో ప్రవేశపెట్టి, పైకి నడిపి, నిశ్చలం చేసుకుని, బ్రహ్మ

రంధ్రంలో స్థితం చేసుకుని, అక్కడ అమృతపానం చేస్తూ, పరమానందాన్ని అనుభవిస్తూ, తమ క్రింద ఉన్న మనస్సునూ, ఇంద్రియములనూ, చూస్తూ ఉంటారు.

సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ కర్మ, సమ్యగ్జీవనం, సమ్యక్ వాక్కు, సమ్యక్ స్మృతి, సమ్యక్ వ్యాయామం, సమ్యక్ సమాధి, అనెడి అష్టాంగ మార్గములను ఆశ్రయించి జన్మను సార్ధకం చేసుకోవాలి, అష్టాంగ సూత్రములను, సత్యమూ, ధర్మమూ, సంఘమూ, అనే త్రిసూత్రములనూ, ఆత్మ, జీవుడు, ప్రకృతి అనే మూడు నిత్య పదార్థములనూ, మనస్సు, వాక్కు, శరీరమనే త్రికరణములనూ, సత్త్వరజస్తమో గుణములనూ, భూర్ భువః స్వః అనే త్రిలోకములనూ, భూత, భవిష్యత్, వర్తమానాలనూ, స్థూల సూక్ష్మ కారణ శరీరములనూ బాగుగా తెలుసుకొని మానవులు ఈ జన్మలోనే యోగసాధన చేసి జీవన్ముక్తులు కావాలి. ఇదే సూత్రత్రయ యోగము.



# ఐదవ అధ్యాయము
## (మధ్యేమార్గ యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షువులారా! మానవులు ఈ భూమిపై జన్మించి సుఖదుఃఖాలు అనుభవిస్తూ తమ జీవితాలను సాగిస్తున్నారు. మరణించినవారు మరలా జన్మిస్తున్నారు. ఈజన్మలకు ఇంద్రియానందాన్ని మనం కోరుకుంటూ ఉండటమే కారణం. సద్గుణ సంపన్నుడైన మానవుడికే సుఖం లభిస్తుంది. ఈ విషయం మీకు అర్థంకావటానికి ఒక కథచెబుతాను వినండి.

ఒకప్పుడు బోధిసత్వుడు ఉపోషధరాజుకు కొడుకుగా పుట్టాడు. ఉపోషధునికి తలపై ఒక కణితి ఉండేది. ఆ కణితినుండి పిల్లవాడు పుట్టాడు. అందువల్ల అతనిని అంతా మూర్ధజు డని పిలిచారు. ఉపోషధునికి ఎనిమిదివేల మంది భార్యలు. వాళ్ళు ఈపిల్లవాణ్ణి చూడటంతోనే అంతా "మాం ధాయతు" (ఇతడు నా స్తన్యం పానంచేయుగాక !) అని అరిచారు. అందువల్ల అతనికి "మాంధాత" అనే పేరు వచ్చింది. మాంధాతకు యుక్తవయస్సు రాగానే తండ్రి మరణించాడు. అతడు రాజైనాడు. రాజత్వంతోబాటు అతనికి సంక్రమించవలసిన "సప్త రత్నాలు" (చక్రం, గజం, అశ్వం, మణి, భార్య, గృహయజమాని, మంత్రి) అతణ్ణి అనుసరించి నీడవలె ఉండేవి వేయి మంది వీరులు, సుందరులైన రాజపుత్రులుకూడా అతని సేవకులైనారు. ఈ వైభవం మూలకంగా అతడి గర్వం పెరిగింది. ఒకరోజు మాంధాత తన రాజ ప్రాసాదంలో రత్నవర్షం కురియవలెననీ, అందులోని ఒక్క రత్నం కూడా తన భవనం వెలుపల కురియకూడదనీ కోరుకున్నాడు. అలాగే వర్షం కురిసింది. దాంతో అతని గర్వం మరింత ఎక్కువైంది. జంబూ ద్వీపానికంతటికీ సార్వభౌముడయ్యాడు. దివౌకసుడనే యక్షుడొకడు ఆ రాజుకు సహాయపడుతుండేవాడు. ఆ యక్షుని సహాయంతో ఆ రాజు పూర్వ విదేహ ద్వీపం, అపర గోదనియ ద్వీపం, ఉత్తర కురుద్వీపం అనే మూడు ద్వీపాలను వశ

పరచుకొన్నాడు. ముప్పదిమూడు దేవతల (త్రయస్త్రింశత్) స్వర్గాన్నికూడ జయించాలనుకొన్నాడు. దేవలోకం మీదకు దండెత్తి వెళ్ళగా, ఇంద్రుడు ఆయనతో స్నేహంచేసుకొని తన అర్ధ సింహాసనాన్ని ఆయనకిచ్చాడు.

ముప్పది ఆరుమంది ఇంద్రులు మారినప్పటికీ మాంధాత ఇంద్రుని అర్ధ సింహాసనాన్ని అధిష్ఠించే ఉన్నాడు. ఇంద్రులు మారినా మాంధాత స్థానం మాత్రం మారకుండా అట్లాగే ఉంది.

ఒకసారి మాంధాత రాక్షసులతో యుద్ధంచేసి వాళ్ళను జయించాడు. తాను ముప్పదిముగ్గురు దేవతలకన్నా, దేవేంద్రునికన్నా గొప్పవాణ్ణని భావించి, అర్ద సింహాసనంతో తృప్తిపడక, ఇంద్రుణ్ణి ఓడించి పూర్తిగా సింహాసనాన్ని ఆక్రమించుకోవాలనుకున్నాడు. ఈ దురుద్దేశమే అతని పతనానికి కారణమైంది. ఇంద్రుణ్ణి అతడు చంపలేకపోయాడు. అతనిలోగల దుష్ట సంకల్పంవల్ల మానవుడైనాడు మానవుడైనవాడు స్వర్గంలో ఉండటానికి వీలు లేదుగనుక స్వర్గంనుండి సరాసరి తన రాజధానిలోని ఉద్యానవనంలో తల క్రిందుగా పడిపోయాడు. గాయాలవల్ల మరణబాధ అనుభవించటం మొదలు పెట్టాడు. మరణం సమీపించింది. అప్పుడు మంత్రులూ, అధికార్లూ, బంధువులూ, పేద జనులూ అంతా ఆయన చుట్టూ చేరి, "అంతిమ సందేశం ఇవ్వవలసిం"దని కోరగా అతడిట్లా చెప్పాడు.

"మాంధాత రాజు సప్త రత్నాలు కలిగి, రాజ్యాన్ని పాలిస్తూ, నాల్గు ద్వీపాలకు ప్రభువై, ముప్పది ముగ్గురు దేవతలున్న స్వర్గాన్ని చేరి, ఇంద్రుని అర్ధ సింహాసనంపై కూర్చుండే మహాభాగ్యం పొందినా పంచేంద్రియానందం కోరటంవల్ల అసంతృప్తితో మరణించాడు."

కాబట్టి భిక్షువులారా ! బంగారం వాన కురిసినా మనుష్యుని ఆశకు అంతం ఉండదు. జ్ఞానియైనవాడు "కోరికలవలన కలుగు సంతోషం కన్నా దుఃఖమే మిన్న" అని తెలుసుకుంటాడు. భోగాలకు దూరంగా ఉంటాడు. ధనంవల్ల దుఃఖం కలుగుతుంది అని తెలుసుకొన్నవాడు సుఖాలను అనుభ

వించాలని కోరుకోడు. మానవుడు భవిష్యత్తును విశాలమైనదిగా, జీవితాన్ని అల్పమైనదిగా భావించాలి. అప్పుడే అతడు పుణ్యాన్ని సంపాదించగలుగుతాడు మానవుడు సద్గుణ సంపన్నుడు కానప్పుడే దుఃఖాలు అతనికి కలుగుతాయి. పుణ్యాన్ని కోరే మానవుడు త్యాగశీలియై తగినవిధంగా దానాలు చెయ్యాలి. ఇట్టి మానవుడే సుఖాన్ని పొందుతాడు. బుద్ధభగవానుని సూత్రము మజ్ఝిమమార్గమును బోధిస్తుంది. ఒకవైపున విషయ వాంఛను తీర్చుటకై కేవలము ప్రాపంచిక దృష్టిగలవాళ్ళు బొత్తిగా లాభంలేని, యోగ్యంకాని తుచ్ఛ ప్రయత్నాలు చేస్తూఉండటం, మరొకవైపు సాధకులు ఉపవాసాలతో దేహాన్ని కృశింపజేసుకొంటూ బాధాకరమైన తపస్సును చేస్తూఉండటం చూస్తున్నాం. ఇట్లాగాక, ఈరెండు అతివాద మార్గాలను త్రోసిపుచ్చి మధ్యమ మార్గంలో పయనిస్తే అది నిర్వాణాన్ని చూపుతుంది కాబట్టి మనం ఆమార్గాన్నే అనుసరించవలసి ఉంటుంది.

**శ్రీ బుద్ధ భగవాన్ ఉవాచ :**

ప్రబుద్ధులారా ! మానవుడు నిర్యాణమును పొందుటకు మాధ్యమిక మార్గముకన్న వేరు మార్గము లేదు. ఈ మధ్యేమార్గమునకు మార్గములు ఏనిమిది కలవు. అవియే అష్టాంగ మార్గములు.

**1. సమ్యక్ దృష్టి (పవిత్రమైన దృష్టి) :**

నీ బాగును, నీ సుఖాన్ని, నీ ఆనందాన్నీ, నీ వేవిధంగాచూచు కొనుచున్నావో సకల ప్రాణుల సుఖమును అదేవిధంగా నీవు చూడాలి. నీ కష్టములను ఎట్లా తొలగించుకోవాలని తలస్తున్నావో జీవుల కష్టము లనుగూడా అట్లాగే తొలగించటానికి ప్రయత్నం చేయాలి. తామర పుష్పం బురదలో పుట్టినప్పటికీ ఆ బురదలోపడి మరణించక, బురదను దాటి, నీటిలో చేరుకుంటున్నది. ఆ నీటిలో ఉండకుండా, నీటిని అంటనీయక, నీటి పైకి వచ్చి సూర్యుని చూస్తున్నది. కాని మానవులు సంసారమను బురదలో పుట్టి, ఆ బురదలోనే మరణిస్తున్నారు. అట్లుకాక వాళ్ళు పరంధామమును చేరుకోవాలి. ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలి. అంతర్జ్యోతిని దర్శించటమే సమ్యక్ దృష్టి.

## 2. సమ్యక్ సంకల్పం :

మానవుల ఔన్నత్యమునకూ, అధోగతికీ వాళ్ళ సంకల్పములే ఆధారం. సత్సంకల్పము ఔన్నత్యమునకు దారితీస్తుంది. దుష్ట సంకల్పము అధోగతికి కారణమౌతుంది. మానవజన్మ ఇతరులకు మేలుచేయడానికే మనకు కల్గింది. ఇతర ప్రాణుల మేలును కోరుకోవడమే సమ్యక్ సంకల్పం. దుష్ట సంకల్పములు నీచ జన్మనకు కారణమవుతాయి.

## 3. సమ్యక్ వాక్కు :

మాట్లాడే మాటలయందు అభిమానము, ప్రేమ, కరుణ, సత్యము, పవిత్రత, నిష్కపటము ఉండాలి. లోకోపకార శబ్దములను మానవుడు ప్రయోగించాలి. ఎవ్వరినీ దూషించరాదు. అబద్ధము లాడరాదు. ఇతరులు బాధపడేటట్లు కఠినముగా మాట్లాడరాదు. ఓంకారాన్ని, వీలైనన్ని పర్యాయాలు స్మరిస్తూ ఉండాలి.

## 4. సమ్యక్ జీవనము :

మానవులు ఒకరిమీద ఆధారపడకుండా పవిత్ర జీవితాన్ని గడపటం అభ్యాసం చెయ్యాలి. కష్టించి పనిచేయాలి. ఇతరులకు అపకారం జరుగకుండా జీవించాలి. తేనెటీగ పుష్పమునుండి మకరందాన్ని తీసుకుంటున్నప్పుడు వృక్షమునకు గాని, పుష్పమునకు గాని బాధ కలుగకుండా తీసుకుంటుంది. తరువాత పుప్పొడిద్వారా మరలా పుష్పాలను వికసింపచేస్తుంది. మానవుడు ధర్మాన్ని అనుసరిస్తూ, ఇతరులను నొప్పించకుండా పవిత్ర జీవితాన్ని గడపాలి.

## 5. సమ్యక్ కర్మ :

కర్మలనేవి మనం మన శరీరంతో చేసేవి. చెడుచేసినా, మంచి చేసినా మనం శరీరంతోనే చేస్తాము. జీవుని ఉద్ధరించే యోగభ్యాసంకూడా ఈ శరీరంతోనే మనం చేయాలి. గురువులనూ, పెద్దలనూ, మహాత్ములను

సేవించటం, గౌరవించటం, సత్కరించటం మొదలైనవి సమ్యక్ కర్మలన బడతాయి. తనవలన మరి ఒకరికి ఏవిధమైన అపకారము బాధ కలుగకుండా ప్రవర్తించటం, బ్రహ్మచర్యాన్ని పాటించటం, సర్వజీవుల పట్లా అహింసా, కరుణ, మైత్రీభావంతో ఉండటం ఇత్యాదులు సమ్యక్ కర్మ లనబడతాయి.

6. **సమ్యక్ వ్యాయామం :** ఈ శరీరమునకు భోగభాగ్య ఐశ్వర్యాదులు ప్రధానంకావు. అవి అన్నీ ఇంద్రియ సుఖానికి ఉపకరిస్తాయి. శరీరానికి ఆరోగ్యమే మహాభాగ్యము. అందువలన మనం వ్యాయామం చేస్తూ శరీరారోగ్యాన్ని కాపాడుకుంటూ ఉండాలి. ప్రాణాయామం చేస్తూ శరీరాన్నీ, మనస్సునూ కూడా శక్తివంత చేసుకుంటుండాలి. ధ్యాన్యం చేస్తూ మన బుద్ధిని పరిశుద్ధం చేసుకోవాలి. **భూతములను శాంతింప చేయాలి.** "ఓం భూమిః శాంతిర్భవతు, ఓం ఆపో శాంతిర్భవతు, ఓం అగ్నిర్ శాంతిర్భవతు, ఓం వాయుర్ శాంతిర్భవతు, ఓం అంతరిక్షః శాంతిర్భవతు" అంటూ పంచభూతాలను శాంతింపచేయాలి. శరీరంతో చేసే వ్యాయామం, మనస్సుతో చేసే అంతర్ ప్రాణాయామం ఈ రెండూ కలిసి సమ్యక్ వ్యాయామం అవుతుంది.

7. **సమ్యక్ స్మృతి :** స్మృతి అనగా మరచిన దానిని మరలా జ్ఞాపకానికి తెచ్చుకోవటం. మనమందరం తల్లిగర్భంలో, గాలితో సంబంధం లేకుండా, కేవలం ప్రాణంతో తపస్సు చేసినవాళ్ళమే. కానీ మనం ఇంద్రియాలకు వశమై, బాహ్యవాయువు సంబంధంతో అపవిత్ర కర్మను మరచిపోయాం. దాన్ని మరలా జ్ఞాపకానికి తెచ్చుకొని, సాధన చేసి, ఆత్మ సాక్షాత్కారం పొందటమే "సమ్యక్ స్మృతి" అనబడుతుంది. ఏకర్మ చేసినా "ఓం సత్" అని దైవమునూ, సత్యమునూ మనం జ్ఞాపకానికి తెచ్చుకోవాలి. లేకపోతే ఆకర్మలన్నీ మనల్ను ప్రవృతి మార్గమున ప్రవేశపెడతాయి. ఈ సమ్యక్ స్మృతి మనల్ని నివృత్తి మార్గమున ప్రవేశపెడుతుంది. మధ్యేమార్గమంటే ఇదే !

8. **సమ్యక్ సమాధి :** పరమ పవిత్రమైన ఆత్మ సాక్షాత్కారమైన ధ్యానమందుగల దీక్ష సమ్యక్ సమాధి అనబడుతుంది. దీక్ష లేనిదే

మానవుడు ఏపని చేయలేడు. నేటి మానవులు పుణ్య కార్యాలను విస్మరిం పాపకార్యాలు చేయటంలో తీవ్రమైన దీక్షను చూపుతున్నారు. మనవ పట్టుదలతో, దీక్షతో వ్యాయామము, ప్రాణాయామం, ధ్యానము, చేయాలి ఈ జీవితంలోనే మనం జీవన్ముక్తినీ, పరమశాంతినీ, ఆనందాన్నీ, అమృతత్త్వాన్నీ సాధించాలి. అందుకు సమ్యక్ దీక్షా సమాధి అత్యంత అవసరం. ఈ సమాధిద్వారా మనం సుఖదుఃఖాలు కాక ఆనందమనే మధ్యేమార్గాన్ని సాధించాలి.

బుద్ధ ధర్మములందు ఈ మధ్యేమార్గము విలక్షణమైనది, అత్యంత ప్రధానమైనది. "దేవుడు లేడు. ప్రకృతి వల్లనే సత్వమూ సంభవిస్తున్న"దని కొందరంటారు. మధ్యేమార్గము "దేవుడున్నా"డని చెబుతుంది. "దేవుడు లే"డనుట అజ్ఞానము, "జీవుడు కనుపించుట లేదు కనుక జీవుడు లే"డనవచ్చునా ! "కనిపించని పదార్థం లే"దనుట శాస్త్ర సమ్మతం కాదు.

దేవుడు మానవకారుడు అనువారు అజ్ఞానులు. "అవజానాంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితం" అని భగవానుడే చెప్పిఉన్నాడు. దేవుడు పక్షపాతం లేనివాడు. సాక్షిస్వరూపుడు. రక్షించువాడు కాదు, శిక్షించువాడుకాదు. మానవుడు తాము చేస్తున్న పాప పుణ్య కర్మల ఫలితమునే అనుభవిస్తుంటారు. దేవుడు దివ్యశక్తి సర్వ వ్యాపకమైన సత్తాగా ఉన్నది. ఆ దివ్యశక్తిని ఎవరెట్లా వినియోగించుకొంటే తదనుగుణ్యంగా ఫలితాన్ని ఇస్తూ ఉంటుంది. "దేవుడు పాపాల్ని తొలగిస్తా"డని కొందరు చెబుతూ ఉంటారు. కానీ ఆయన పాపాల్ని చేయించేవాడూ కాదు, తొలగించేవాడూ కాదు. మానవుల శరీరమునందు ఐదు అగ్నులు కలవు. 1. క్రోధాగ్ని, 2. జఠరాగ్ని 3. రూపాగ్ని, 4. కామాగ్ని అనే నాలుగు అగ్నులు మనస్సును ప్రేరేపించి పాపములను చేయిస్తుంటవి. ఐదవది అయిన జ్ఞానాగ్ని సకలపాపములన్నూ పోగొట్టి మానవులను పరమ పునీతులను చేస్తుంది.

జీవుడు దైవాంశ సంభూతుడు. అక్షరుడు. ఒక దేహమునుండి మరో దేహానికి మారుతూ ఉంటాడు. మనస్సుతోకూడి, ఇంద్రియముల చేత ఆక

ర్షింపబడి, ఈ శరీరమును అంటిపెట్టుకుని, కర్మబద్ధుడై, సుఖదుఃఖాలను అనుభవిస్తూ ఉంటాడు. మానవుడు జీవన్ముక్తిని సాధించటమే మధ్యేమార్గము. వేదాలలో చెప్పిన యజ్ఞముల వలన ప్రకృతి పవిత్రమవుతుంది. యజ్ఞాలతో జీవహింస చేయమని వేదాల్లో ఎక్కడా చెప్పలేదు. మానవుడు అంతర్యజ్ఞ మును తప్పక చేయాలని వేదాలు చెప్పుతున్నాయి. అంతర్‌ప్రాణాయామం ద్వారా ప్రాణాన్ని, సుషుమ్నానాడీలో ప్రవేశింపచేసి, జ్ఞాననేత్రమునుపొంది, ఆత్మజ్యోతిని ఆరాధించటమే మధ్యేమార్గము. పుణ్యకార్యములూ, తపస్సు మొదలైనవి పుణ్యాన్నిస్తవే కాని మోక్షాన్ని ప్రసాదించలేవు. జీవన్ముక్తిని సాధించటానికి నివృత్తి మార్గమే మనకు శరణ్యం. ఇరువది నాల్గుప్రకృతి తత్త్వము లను అధిగమించి, ఆత్మ తత్త్వాన్ని పొందటమే మధ్యేమార్గము. దీన్ని మనం సాధించాలంటే సుషుమ్నలో ప్రాణాన్ని నిలపడమే, ఆత్మ సాక్షాత్కారాన్ని పొందటమే మనం చేయవలసిన కర్తవ్యం.

**శ్రీ నాగార్జున ఉవాచ**

బుద్ధుడు బోధించిన ఈ మధ్యే మార్గములోని విశేషములైన, విశిష్ట సూత్రములు. స్వప్రమాణములైనవి. ఇంతవరకూ ఏ మహాత్ములునూ, ఎచ్చటనూ వీటిని ప్రవచించి ఉండలేదు. మహాపరి నిర్వాణము ప్రతిఒక్కరూ పొందవలయునన్న సమ్యక్ సంకల్పముతో తథాగతులే స్వయంగా ఈ మార్గాన్ని ప్రవచించారు. మధ్యే మార్గమనగా ఉన్నతమైన అష్టాంగమార్గము. ఈ మార్గము మానవునకు ఆత్మ విద్యనూ, దూరదృష్టినీ, శాంతినీ, పవిత్రమైన బుద్ధినీ, జ్ఞానమునూ, తుదకు మహానిర్వాణమునూ ప్రసాదిస్తుంది. ప్రపంచము దుఃఖమయము. జన్మము దుఃఖము, రోగము దుఃఖము. మరణము దుఃఖము ఇష్టములేని వస్తువులతోడి సంబంధము దుఃఖము. ప్రియమైనవానితో వియోగముదుఃఖము కోరినది లభించకపోవటమే దుఃఖము. **రూపము, వేదన, సన్న (సంజ్ఞ), సంఖర (సంసారం), విణ్ణామము (విజ్ఞానం) లనెడు అయిదు ఉపాదాన** విషయముల వలననే దుఃఖము కల్గుచున్నది. ఈ దుఃఖ నివారణోపాయమే అష్టాంగ మార్గము. అదే మధ్యేమార్గము. సమ్యక్ దర్శనం, సమ్యగాశయం, సమ్యగ్వాక్కు, సమ్యగాచరణం, సమ్యగ్జీవనోపాధి, సమ్యక్ ప్రయత్నం, సమ్యగ్బుద్ధి, సమ్యక్ సమాధులన్నవి అష్టాంగ మార్గములు.

తథాగతులు కనుగొన్న మధ్యేమార్గం ఇదే. ఇది మానవులకు విద్యనూ, దూర దృష్టినీ, శాంతినీ, ఉన్నతమైన బుద్ధినీ, జ్ఞానాన్నీ, నిర్వాణమునూ ప్రసాదిస్తుంది. కాబట్టి మనం సరియగు వానినే చూడాలి. వానినే కోరాలి. తదను గుణంగా సరసప్రలాపాలు చేయాలి. కార్యరూపంలో సరియైనదాన్నే పెట్టాలి. అటువంటి జీవనాన్నే నడపాలి. మనంచేసే యత్నాలన్నింటిలోనూ అట్లాంటి ధీరత్వాన్నే చూపాలి. మంచి ఏకాగ్రతను అలవరచుకొని సమ్యక్ సమాధిని పొందాలి.

ఓ భిక్షువులారా ! సంసారాన్ని, సంసారహిత జీవనాన్ని గడపా లనుకొనేవాళ్ళు, నీచములు, ప్రాపంచికములు, హానికరములు, అయోగ్య ములు, అసభ్యములునైన విషయ వాంఛలకు లోనవటం, అట్లాగే బాధా కరం, అయోగ్యం, హానికరం అయిన దేహాన్ని కృశింపజేసుకోవటం (తపస్సు చేయటం) అనే రెండు మార్గాలనువదలి, ఆనాడు తథాగతుడు మధ్యేమార్గాన్ని అవలంభించినందువల్ల దీనికి మజ్ఝిమ(మధ్యమ) మార్గం అనే పేరువచ్చింది. ఇది నాల్గు ఆర్య సత్యాలను ప్రతిపాదిస్తున్నది. 1. ప్రపంచ దుఃఖమయం 2. దుఃఖం కోరికలవలన కలుగుతున్నది. 3. కోరికలు నశిస్తే జన్మరాహిత్యం కలుగుతుంది. ఇదే నిర్వాణం 4. మానవులు మనోవాక్కాయ కర్మలయందు పరిశుద్ధులై, పది మహోన్నతములైన ఆజ్ఞలను శిరసావహించి, అష్టాంగ మార్గాన్ని అవలంబిస్తే కోరికలు నశిస్తాయి. 1. అహింస 2. సత్యం 3. దొంగతనం చేయకుండటం 4. వ్యభిచారం చేయకుండటం 5. ఇతరు లను ?పరించి చెడుగా మాట్లాడకుండా ఉండటం 6. తప్పులు పట్టకుండా ఉండటం 7. అసభ్యంగా మాట్లాడకుండా ఉండటం 8. దురాశ లేక పోవటం 9. ఇతరులను ద్వేషించకుండా ఉండటం 10. అజ్ఞానాన్ని నిర్మూ లింపచేయటం, అనేవి పది ఆజ్ఞలు. తథాగతుడు చూపిన ఈ మధ్యేమార్గాన్ని అవలంభిస్తే నిర్వాణం సులభంగా మనకు సిద్ధిస్తుంది.



# ఆరవ అధ్యాయము

## (అర్హతా యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

సకల మానవులకు మోక్షార్హత ఉన్నది. జీవుడు అక్షరుడు. దైవాంశ సంభవుడు. మోక్షార్హుడు. ఆవరణమైన ప్రకృతి ఉపాధులవలన భిన్న భిన్న లక్షణములతో అనుభూతులను పొందుతున్నాడు. అది శరీర సంఘ దోషమే కాని జీవుని అనర్హత కాదు. కులము, వృత్తి, అంతస్తు, సిరిసంపదలు, వయస్సు, విద్యావిద్యలు మొదలగునవి కారణములు కావు. ఎలాంటి మానవుని కైనను మోక్షార్హత ఉన్నది. కేవలము ఒక కులము వారికే మోక్షార్హత కలదనుట అజ్ఞానము. బుద్ధమతమునందు కులమునకు, మతమునకు, మహత్వము లేదు. సర్వమానవులది ఒకే కులము. బుద్ధమతము సముద్రము లాటిది. నదులు అనేకము ప్రవహిస్తూ ఉంటవి. అవన్నీ చివరకు సముద్రమ్మును చేరుకొని అందులో కలిసిపోతాయి. బుద్ధమతమునందు వర్ణాశ్రమము లన్నీ పూర్తిగా కలసిపోతాయి. స్త్రీలకు కూడా మోక్షార్హత ఉన్నది. మొదట బుద్ధుడు స్త్రీలను పరివ్రాజికలుగా చేర్చుకొనుటకు సమ్మతించకపోయినను ఆ తర్వాత ఆనందుని బలవంతముచే ఒప్పుకొని, వాళ్ళకు కొన్ని కట్టుబాట్లు చేశాడు. 17 సంIIలు ఇంద్రియములను నిగ్రహించి వాటిని జయించి యోగ సాధనచేసి ఆత్మ సాక్షాత్కారం పొందిన సాధ్వి శిరోమణి విశాఖ. రథసారథి చెన్నుడు, ఉపాల్మి అను మంగలి, చెప్పులు కుట్టుకునే మంధరుడు మొదలగు వాళ్ళు సంఘములో యోగసాధన ద్వారా మోక్షాన్ని పొందారు. మోక్షార్హతకు తక్కువ కులమువారు ఎక్కువ కులమువారు అనే తేడాలేదు. వాళ్ళు చేయు యోగసాధనయే ముఖ్యము శాస్త్రములన్నీ స్త్రీలకు సహితము మోక్షార్హత కలదని నొక్కివక్కాణిస్తున్నాయి. జ్ఞాని అయినవాడు మొదట తన తల్లికీ, భార్యకూ జ్ఞానప్రాప్తిని కల్గించాలి. ఈ విషయం తెలిసినవాడు కనుకనే తథాగతుడు తనతల్లియైన గౌతమీదేవికి జ్ఞానాన్ని బోధించాడు. నిండుసభలో తనను అవమానించిన వైశ్య స్త్రీకి కూడా జ్ఞాన భిక్షను ఒసంగినాడు. వేశ్యావృత్తిలో ఉన్న ఆమ్రపాలిని ఆదరించి జ్ఞాన భిక్ష నొసంగి బుద్ధ యోగినిగా మార్చాడు. ఎంతటి మహాపాపి అయినను ఆపాప చింతనవదలి నిర్మలచిత్తము కలవాడై

యోగసాధన చేస్తే మోక్షార్హుడవుతాడు. ఇందుకు అంగుళీమాలుడే ప్రబల నిదర్శనం.

**అంగుళీమాలుని కథ :**

అంగుళీమాలుడు ఒక బందిపోటు దొంగ. ఎంతమందిని అతడు హత్య చేశాడో లెక్కలేదు. తాను హత్యకావించిన వాళ్ళ చేతివ్రేళ్ళను హారముగా గుచ్చుకొని, మెడలో వేసుకొని తిరుగుతూ ఉండేవాడు. అందువల్ల అతడికి "అంగుళీమాలు"డనే పేరు వచ్చింది. అటువంటి క్రూరుణ్ణి బుద్ధభగవానుడు తన అపార కరుణా మహిమచేత సన్మార్గుడిగా మార్చి బౌద్ధుడిగా చేశాడు. ఒకసారి కోసలేశ్వరుడైన "పాసెనది" బుద్ధుణ్ణి సందర్శించడానికి వచ్చాడు. అప్పుడు బుద్ధుడు ఆయనకు అంగుళీమాలుని గురించి చెప్పగా, ఆయన బుద్ధుణ్ణి "మీరు క్రూర మృగాలను మచ్చిక చేసేవాళ్ళు" అని పొగిడాడు. దుర్గుణాలనూ, క్రౌర్యాన్ని మానుకొని సన్మార్గగామియైన అంగుళీమాలుడికి ఆ మహారాజు తాను స్వయంగా కాషాయాంబరాలనూ, సన్యాసికి కావలసిన ఇతర వస్తువులనూ ఇస్తానని చెప్పాడు. కానీ అంగుళీమాలుడు తనకుగల మూడు వస్త్రములతోనే తృప్తిపడి, రాజు ఇస్తానన్న వస్తువుల్ని తిరస్కరించాడు. అంగుళీమాలుడు బుద్ధుని బోధనలతో నిబమైన భిక్షువుగా మారాడు. ప్రేమ, దయలను వర్షిస్తూ అనేకులకు సహాయం చేస్తుండేవాడు. ఒకప్పుడు ప్రసవవేదన పడుతున్న ఒక స్త్రీని చూచి "నేను ఈ ఉత్తమ జన్మ మెత్తినప్పటినుండి (బౌద్ధ భిక్షువుగా మారినప్పటినుండి) ఏ జీవికికూడా నాకు తెలిసి అపకారం చేయలేదు. అక్కా! నా ఈ సత్యవాక్కు యొక్క బలముచే నీకూ, నీకు పుట్టబోయే శిశువుకూ ఆరోగ్యం కలుగుగాక!" అని – తన సత్య బలముచే ఆమెను రక్షించాడు.

మానవులందరికీ శ్వాస ఎట్లా సమానమో మోక్షార్హతకూడా అట్లే సమానము. మోక్షసాధనలో వ్యత్యాసములు లేవు. ప్రభువైననూ, మంగలియైననూ, చెప్పులుకుట్టే వ్యక్తి అయిననూ ఒకేవిధంగా మోక్ష స్థానమును పొందగలుగుతాడు. ఈ అసమానతలనేవి ప్రకృతి చిత్త భ్రాంతి జనకాలు. అహంకార స్వరూపాలు. ధనవంతులు మరుజన్మలో నిర్ధనులు కావచ్చు. నిర్ధనులు ధనవంతులు కావచ్చు.

చాకలి చెన్నుడు తక్కువ కులంవాడు, బీదవాడు. గురూపదేశమందు పరిపూర్ణమైన శ్రద్ధకలిగి యోగసాధన ద్వారా కామ, క్రోధ, మద, మాత్సర్యములను నిర్మూలనం చేసుకుని నిర్వాణాన్ని పొందాడు. మోక్షమునకు వయస్సు కారణం కాదు. "చిన్న వయసులోనే యోగమెందుకు ? జ్ఞానమెందు?"కని కొందరు దానిపట్ల ఉపేక్ష వహిస్తూ ఉంటుంటారు. కాని అది సరికాదు. మనం చిన్నతనం నుండి యోగసాధన చేస్తూ ఉండాలి. లేకపోతే శరీరము పటుత్వము తప్పి నిరుత్సాహ నిలయమౌతుంది. మనం మన వృద్ధాప్యం వచ్చినప్పుడుకూడా జ్ఞానసాధనమైన ప్రవృత్తిమార్గమున పయనిస్తూ, యోగసాధనను అభ్యాసం చేస్తూ నిర్వాణమును పొందవచ్చు. శుద్ధోదన మహారాజు 90 సం॥ల వయసులో సాధనచేసి జ్ఞానసిద్ధి పొందగలిగాడు. రాహులుడు ఏడేండ్లకే జ్ఞానసిద్ధిని పొందాడు. కావున మోక్షార్హతకు అన్ని వయస్సుల వాళ్ళు అర్హులే.

శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :

ప్రాపంచిక విద్యలకూ, మోక్షార్హతకూ సంబంధం లేదు. నాలుగు వేదములను కంఠస్థం చేసిన పండితుడు సైతము మోక్షార్హుడు కాడు. ప్రకృతి విద్య, ఆత్మవిద్య అని విద్య రెండువిధములు. ప్రకృతివిద్యలు ఎన్ని చదివినను చావు పుట్టుకలు తప్పవు. మనము చావు పుట్టుకలు లేని చదువు చదువుకోవాలి. అదియే ఆత్మవిద్య. మామూలు విద్యలు బొత్తిగా తెలియనివాడైనను ఆత్మవిద్యను అభ్యసించగలడు. మనలను ఉద్ధరించునది ఆత్మ తప్ప మరియొకటి లేదు. అన్యదేవతోపాసన చేసేవాళ్ళు ఆ దేవత వరాలిస్తుందనీ, ఆపదలు తొలగిస్తుందనీ భ్రమపడుతూ ఉంటారు. ఆపదలనుండి తొలగించునది మన మనస్సు, మన సంకల్ప ప్రభావమే, కానీ దేవతలు కారు. మనస్సు రూపమును కల్పిస్తుంది. దానివలననే వివిధములగు దేవతలున్నట్లు స్ఫురిస్తారు. ఆత్మజ్ఞానికి అటువంటి చిత్రభ్రాంతులు ఉండవు. ఆత్మజ్ఞాని ఈ సంసార సాగరంలో ఉన్న జ్ఞానమనే పడవను ఆధారం చేసుకుని ఈ సాగరమును సులభముగా తరిస్తాడు. మనస్సునకు అధికారము నీయక ఆత్మానుసంధానము చేసికొని పరమ శాంతిని పొందుతాడు. మనస్సు ఆత్మసంఘమున

ఉన్నది. కనుక జీవునిలో విషయ వాసనలు చేరవు. వేదములు చదువుట, యజ్ఞములు చేయుట, తపస్సు చేయుట, దానధర్మములు చేయుట, మొదలైన వాటివలన పుణ్యము ప్రాప్తిస్తుంది. పుణ్యమువలన భోగములూ, సిరి సంపదలూ ప్రాప్తిస్తాయి. అంతేకాని మోక్షార్హత లభించదు. ఈ ఇంద్రియ భోగముల వలన దుష్టసంకల్పాలు కలిగి మనలను నీచ జన్మలకు గురి చేస్తాయి. పూర్వము నహుషుడనే చక్రవర్తి నూరు అశ్వమేధ యాగములు చేసి ఇంద్రపదవి నధిష్ఠించినాకూడా మనోవికార సంకల్పములను విడిచి పెట్టక, అజగరమై భూపతనం కావటం సంభవించింది. చతురాశ్రమముల వారునూ మోక్షార్హులే. కానీ, వారి వారి సంస్కార ప్రభావముల ననుసరించి, వారి వారి శరీర తత్త్వముల ననుసరించి, వారి వారి సంఘ పరిస్థితుల ననుసరించి ఆయా వ్యక్తులకు ప్రవృత్తి మార్గము, నివృత్తి మార్గము లభిస్తూ ఉంటాయి. యోగసాధన చేత ఆత్మజ్ఞానము లభిస్తుందే గాని, ఉపన్యాసము లిచ్చినంత మాత్రాన, గ్రంథములు కంఠతా పెట్టినంత మాత్రాన లభించదు. శాంతచిత్తుడే, భయమునూ, ద్వేషమునూ జయించినవాడే, స్థితప్రజ్ఞుడే, జ్ఞాని అనబడతాడు.



## మాధ్యమిక వాదం



బౌద్ధమతములోని ప్రధాన శాఖలగు హీనయాన, మహాయానములకంటే పూర్వం "థేరవాద, మహాసాంఘిక, సర్వాస్తివాద, సమ్మతీయము"లనే నాలుగు ప్రధాన శాఖలు బౌద్ధమతంలో ఉండేవని తెలుస్తున్నది. నాగార్జునాచార్యుడు మాధ్యమిక వాదాన్ని స్థాపించాడు. బౌద్ధమతంలో ఈ వాదం చాలా ప్రాశస్త్యం వహించింది.

# ఏడవ అధ్యాయం

## ( ప్రవర్తనా యోగము )

**శ్రీ నాగార్జున ఉవాచ :**

మనస్సు మానసిక ప్రవృత్తులపై అధికారం వహిస్తూ ఉంటుంది. మనుష్యుని యొక్క ప్రవృత్తులన్నీ మనస్సుచేతనే కల్పించబడుతున్నాయి. మానవుడి మనస్సు కలుషితమైతే అటువంటి మనస్సుతో మాట్లాడినా, పనిచేసినా చాలా కష్టాలు కలుగుతుంటాయి. మానవుని అవయవములలో మనస్సే ప్రధానమైంది. ఇతరావయవాలు చేసే పనులన్నీ ఈ మనస్సుపైనే ఆధారపడి ఉంటాయి. ఇతరులమీద కోపంతో, ఇతరులనుగురించి వ్యతిరేకంగా ఆలోచించేవాడు తన పగను ఎన్నటికీ అణచుకోలేడు. పగను పగతో మనం ఎన్నటికీ అణచుకోలేము. ప్రేమతో పగను జయించగలం. బుద్ధుడిమీద అకారణ ద్వేషాన్ని పెంచుకొన్న దేవదత్తుడు చివరికేమైనాడో గమనించండి.

దేవదత్తుడు బుద్ధునిపై ద్వేషం పెంచుకొని, ఆయన కెట్లైనా అపకారం చెయ్యాలనీ, వీలైతే చంపాలనీ భావించి తగిన సమయంకోసం నిరీక్షించ సాగాడు. అతనికి చిన్నతనం నుంచి బుద్ధుడంటే అసూయకలిగి శతృత్వంతో ఉండేవాడు. జీవితాంతం వరకూ ఆ పగ అట్లానే ఉండిపోయింది. బాల్యంలో ఒకసారి అతడొక హంసను బాణంతో కొట్టాడు. బుద్ధుడా హంసను రక్షిస్తే ఆయనతో కలహించాడు. తాను నేర్చుకొన్న ఇంద్రజాలాన్ని ప్రయోగించి అజాతశత్రు మహారాజు ప్రేమకుపాత్రుడై, బుద్ధుని తొలగించి, ఆయన స్థానమున తాను సంఘనాయకుడు కాదలిచాడు. అది ఫలించకపోయేసరికి విలుకాండ్రను పురికొల్పి బుద్ధుని చంపించాలని చూచాడు. కాని ఆ హంతకులు బుద్ధుని ప్రేమకు లోబడి, తాము తలపెట్టిన దుష్కృత్యాన్ని వెల్లడించి, పశ్చాత్తాపంచెంది బౌద్ధమతంలో చేరారు. కానీ దేవదత్తుడి బుద్ధిమాత్రం మారలేదు. చివరికి తానే స్వయంగా బుద్ధుణ్ణి చంపాలని "గిజ్ఝకూట పర్వతం ప్రక్కనుండి బుద్ధుడు ఒకసారి పోతుంటే ఆయనమీదకు ఒక పెద్ద బండరాయిని దొర్లిం

చాడు. ఆ రాయి బుద్ధుని ప్రక్కన పడి ముక్కలు ముక్కలైంది. ప్రాణాపాయం తప్పింది కాని బుద్ధుని పాదాలకు తగిలి రక్తం స్రవించింది. అప్పుడు సన్యాసులంతా బుద్ధభగవానునికోసం ఒక రక్షకుణ్ణి నియమించాలనుకొంటే దానికి బుద్ధుడు సమ్మతించక తమ నిర్యాణం మామూలుగానే జరుగుతుందనీ, తన ప్రాణం తీయటానికి ఎవరికీ శక్యం కాదనీ చెప్పాడు. చివరకు దేవదత్తుడు గజపాలకులను ప్రోత్సహించి, వారిచేత బుద్ధుడు వచ్చే మార్గంలో "నలగిరి" అనే ఒక భయంకరమైన ఏనుగును వదలిపెట్టించాడు. ఆ నలగిరి బుద్ధునిమీదకు భీకరంగా ఘీంకరిస్తూ వచ్చి, ఆయన ప్రేమకు వశ్యమై సాధువుగా మారిపోయింది. అంతటితో దేవదత్తుడు తన ప్రయత్నాన్నీ మానకోక బుద్ధ సంఘంలో అంతఃకలహాలను పుట్టించాలని, బుద్ధుని దగ్గరికి ముగ్గురు సన్యాసులతోపోయి "సంఘరామంలో,ధర్మంలో ఐదునిబంధనలుంచవలసిం" దనికోరాడు. ఆనిబంధనలన్నీ అనవసరములై,కఠినములై,సన్యాసులకు బాధ కలిగించేటట్లు ఉండటంచేత బుద్ధుడు అవి తప్పనిసరిగా ఉంచనవసరంలేదని పలికాడు. ఆ సమాధానాన్ని ఆసరాగా చేసుకొని దేవదత్తుడు "బుద్ధుడు విషయలోలుడయ్యాడు. ఆయనకు ధనాశ రేకెత్తింది" అని ఆయనపై అపనిందలు మోపాడు. ఇంతచేసినా అతనిపై బుద్ధుడు దయనే చూపిస్తూ వచ్చాడు. చివరకు దేవదత్తుడు తన పాప ఫలాన్ని అనుభవించవలసి వచ్చింది. తొమ్మిది నెలలు వ్యాధిగ్రస్తుడై మహా బాధపడ్డాడు. చాలా కృశించిపోయాడు. ఆ స్థితిలో అతడి మనస్సుమారింది. బుద్ధుణ్ణి చూడాలనుకొన్నాడు. ఒక పల్లకీలో ఎక్కి జేతవనంలో ఉన్న బుద్ధుడి దగ్గరకు వెళ్ళాడు. కానీ బుద్ధుణ్ణి చూడలేకపోయాడు. దారిలోనే మరణించాడు.

క్రోధంకన్నా పరమ నికృష్టమైన శత్రువు మరొకటి కనిపించదు. క్రోధంవల్ల బుద్ధి నశిస్తుంది. చివరకు పతన హేతువౌతుంది. ఆ క్రోధానికి తల్లి కామం. అంటే కోరిక. దీనికి అక్క అసూయ. కాబట్టి, నిర్వాణపథాన్ని ఆశ్రయించాలనుకొనేవాళ్ళు తన ప్రవర్తనను సరిదిద్దుకొని ఈ భయంకర క్రోధమనే శత్రువును దూరంగా ఉంచాలి.

శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :

ప్రబుద్ధులారా ! లోకములో మనం గమనించవలసిన విషయ మొకటి ఉన్నది. మానవులు పాపకృత్యములు చేస్తున్నారు. అట్లెందుకు వాళ్ళు చేస్తున్నారో మనం గ్రహించాలి. "దొంగతనం చేయటం పాపం" అని తెలిసి కూడా దొంగతనం చేస్తున్నారు ఇట్లా ఎందుకు జరుగుతున్నది ? మన శరీరంలో 1. క్రోధాగ్ని 2. జఠరాగ్ని 3. జ్ఞానాగ్ని 4. రూపాగ్ని 5. కామాగ్ని అనే పంచాగ్నులున్నాయి. శరీరమునందు క్రోధాగ్ని ప్రజ్వలించినప్పుడు బుద్ధి స్తంభించిపోతుంది. అప్పుడు తనకు తెలియకుండానే ఇతరులను తిట్టటం, కొట్టడం, జరుగుతూ ఉంటుంది. ఇట్లా చెయ్యటం శబ్ద స్పర్శ రూప రసగంధములవలన జరుగుతూ ఉంటుంది. ఎవరిమీదనన్నా కోపంవస్తే "నా వళ్ళు మండిపోతున్నది." అని అంటుంటారు. మండటం అనేది అగ్ని లక్షణం. శరీరంలోని క్రోధాగ్నివల్ల ఈ మండటం అనే పని జరుగుతూ ఉంటుంది. క్రోధాగ్ని జ్వలించేటప్పుడు, మనస్మృతి భ్రమలో పడుతుంది. అప్పుడు బుద్ధి నశిస్తుంది. బుద్ధి నశించటంవల్ల ఉన్మాదం కలిగి, తానేం చేస్తున్నాడో తెలియకుండానే మానవుడు అనుచిత కార్యాలు చేస్తుంటాడు. తన కోరికలు నెరవేరకపోతే కూడా కోపం ప్రజ్వలించటం సంభవిస్తూ, ఆ కోపంతో దుష్టకర్మలు చేయటం జరుగుతూ ఉంటుంది. క్రోధమంతటి దుష్టకర్మ మరొకటి లేదు.

జఠరాగ్ని గర్భంలో ఉండి, తిన్న ఆహారాన్ని జీర్ణంచేస్తూ ఉంటుంది. ఈ జీర్ణ క్రియ అనేది ఆత్మ శక్తివలన జరిగే కార్యం. మన శరీరంలో ప్రాణ శక్తి చేత కొన్ని కర్మలూ, ఆత్మశక్తి చేత మరికొన్ని కర్మలూ జరుగుతూ ఉంటాయి. జాగ్రదావస్థలో ఇంద్రియ శక్తిచేత కార్యములు జరుగుతుంటవి. నిద్రావస్థలో జీవుడు ఏపనీ చేయలేడు. కానీ గుండె కొట్టుకోవటం, ఉచ్ఛ్వాస నిశ్వాసలు జరగటం ఉంటుంది. ఇవి ప్రాణ శక్తి చేయు కార్యములు. మనం తిన్న ఆహారం కడుపులోకి పోయి జీర్ణం కావటం, రక్తంగామారి శరీరంలో ప్రసరించటం అనేది ఆత్మ శక్తివలన జరిగే కార్యాలు. అందువల్ల పరిశుద్ధమైన, పవిత్రమైన ఆహారాన్ని, ధర్మయుక్తంగా సంపాదించిన ఆహారాన్ని

మనం తీసుకోవాలి. అప్పుడు ఆత్మ పరిశుద్ధమై పవిత్ర కార్యాలు చేయాలనే తలంపు కలుగుతుంది. ఎన్నో పాప కార్యములు సలిపి, సంపాదించిన ఆహారాన్ని తిన్నచో పాపకృత్యములు చేయాలనే ఆలోచనలే వస్తాయి. కనుక మనం పవిత్రాహారమును మాత్రమే నిత్యం స్వీకరించాలి.

జ్ఞానాగ్ని హృదయ స్థానంలో ఉన్నది. "మానవులు చేసే పాపాలన్నింటిని దేవుడు పోగొట్టుతా"డని కొందరు చెబుతారు. మరికొందరు "పుణ్యకర్మలవల్ల పాప కర్మల ఫలితం తొలిగిపోతుంది" అని చెబుతారు. ఇవి వాస్తవాలు కావు. దేవుడు కేవలం సాక్షీభూతుడుగా మాత్రమే ఉంటాడు. ఎవరు చేసుకొన్న పాప, పుణ్య ఫలితాలను వారనుభవించేటట్లు చేస్తాడే గాని – ఆ కర్మల ఫలితాన్ని అనుభవించకుండా చేయలేడు. తన వెలుతురునూ, వేడినీ సూర్యుడు లోకములో అందరికీ సమానముగా పంచుతున్నాడు. ఆ వెలుతురునూ, వేడినీ ఎవరికివారు, వారికిచేతనైన విధముగా అనుభవిస్తున్నారు. అదేవిధముగా దేవుడుకూడా వారి వారి కర్మల కనుగుణంగా సుఖదుఃఖాలను ప్రసాదిస్తున్నాడు. ఆయనకు ఎవరిపట్లా పక్షపాతం లేదు. ఆయనకు మనస్సు లేదు. ఇంద్రియములు లేవు. రాగద్వేషములులేవు. ఆయన ప్రకృతికి అతీతమైనవాడు. ఆయనకు ఎవరి పాపపుణ్యములతోనూ సంబంధములేదు. దేవుడు పాపాలనూ, కష్టాలనూ పోగొట్టడు. జ్ఞానమే అగ్నిలాగా, పడవలాగా, ఖడ్గంలాగా. నేత్రంలాగా సహకరిసూ ఉంటుంది. మానవులకు గల జ్ఞానమే (జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం) పాపములనూ పోగొడుతుంది. అది పడవవలె సంసార సాగారాన్ని తరింపజేస్తుంది, ఖడ్గధారవలె సంకల్ప వికల్పాలను ఖండించివేస్తుంది. అది నేత్రమై, పరమాత్మ దివ్య తేజస్సును సందర్శింపజేస్తుంది. కనుక పాప పుణ్యములనేవి మానవ శరీరంలోని అగ్నులవల్ల పరివర్తన చెందుతున్నవేగాని దేవునివలన కాదని మనం తెలుసుకోవాలి.

మానవులు జ్ఞానమును ఆశ్రయించి, యోగాభ్యాసముచేసి, పతితపావనులై, మోక్షమును సాధించాలి. ఎంతటి పాపాత్ములైననూ, జ్ఞాన సంపన్ను

లైనచో పశ్చాత్తాప చిత్తులై పాపాలనుంచి విముక్తులౌతారు. పరంధామను చేరుకుంటారు. అంగుళీమాలుడు ఎన్నో హత్యలుచేసాడు. పాపాత్ముడై, కుష్ఠ వ్యాధిగ్రస్తుడుగా ఎన్నో నీచజన్మలెత్తి తన పాప ఫలితాన్ని అనుభవింపవలసి ఉన్నది. కాని వాడు జ్ఞానాన్ని ఆశ్రయించి, యోగము నభ్యసించి, ఈ జన్మ లోనే మోక్షార్హత సంపాదించుకొన్నాడు. మహారాజాధిరాజుల సన్మానాన్ని పొంది కీర్తివంతుడైనాడు. ఆమ్రపాలి వేశ్య. అనేక పాపాలు చేసింది. చివ రకు జ్ఞానాన్ని ఆశ్రయించి పవిత్రురాలై మోక్షార్హత పొందింది. పాపకార్య ములు చేసినవాళ్ళు "అయ్యో ! మాకు మోక్షార్హత లేకపోయిందే"నని బాధ పడనవసరం లేదు. ఎంతటి పాపాత్ములైననూ, బుద్ధ ధర్మాన్ని ఆశ్రయించి, జ్ఞానులై మోక్షార్హులౌతారు. పాపాత్ములుగా ఎవరూ మరణించరాదు. జ్ఞాను లుగా మరణించాలి. ఇదే జన్మసార్థకత.

ఈ రూపాగ్ని సాత్వికము, రాజసము, తామసము అని మూడు విధాలు, పరోపకార బుద్ధితో, నిస్వార్థంగా ఇతరుల కష్టాలను పోగొట్టడం, వస్త్రదానం చెయ్యటం, విద్యాదానం చెయ్యటం, అన్నదానం చెయ్యటం మొదలైన పనులు, దయ, జాలి, ప్రేమ, త్యాగాలవల్ల జరుగుతూ ఉంటవి. సర్వ భూతములపట్ల అహింసా భావం కలిగి ఉండటం సాత్విక రూపాగ్ని అన బడుతుంది. స్వార్థంతో, తన పేరు ప్రతిష్ఠలకోసం చేసే కార్యాలన్నీ రాజస రూపాగ్ని అనబడుతుంది. ఇతరులను పీడిస్తూ, ఇతరులను నాశనం చేస్తూ, ఆచరించే కార్యాలన్నీ తామసరూపాగ్ని అనబడుతుంది. ఇది పరమస్వార్థంతో, దయారహితంగా, పరమ కర్కోటకంగా మానవుడు చేసే కార్యాలు. ఈ కార్యాలవల్ల సంఘం బాధ చెందుతుంది. ఈ తామస రూపాగ్ని తమలో లేకుండా చేసుకోవడం మానవులందరి ప్రథమ కర్తవ్యం. లేకపోతే వాళ్ళకు ఎన్ని జన్మలెత్తినా మోక్షార్హత రాదు.

ఇక కామాగ్ని, మానవుల మనస్సుల్లో కోర్కెలను పుట్టిస్తుంది. ఆ కోర్కెలు కష్టాలకూ, దుఃఖాలకూ మూలమౌతాయి. సుఖాలు కావాలని కోరు కొనేవాళ్ళు, ఈ కామాగ్నికి దూరంగా ఉండాలి. ఈ అగ్నిని లేకుండా చేసు

కోవటం మానవుల ప్రధాన తక్షణ కర్తవ్యం. ఈ కామాగ్ని లేనివాడే నిజమైన పరివ్రాజకుడనిపించుకొంటాడు. నిర్వాణ పథాన్ని చేరుకొంటాడు.

పనిచేయని వాడు (అనగా సోమరి అయినవాడు) పాపము చేసినవాడవుతాడు. ప్రతి మానవుడు తన నియమిత కర్మను చేసిన తరువాతనే ఆహారం తీసుకోవాలి. "అతి సర్వత్రా వర్జయేత్" అతి అనునది ఏ విషయంలోను పనికిరాదు. పనిచేయకుండా పరుల కష్టమును భోజనరూపంగా తినువాడు, పాపాన్నే భోంచేస్తుంటాడు. ఇది సంఘద్రోహము, దేశద్రోహ మనబడుతుంది. రైతు తన స్వధర్మమైన వ్యవసాయము (తన నియమిత కర్మ) చేసి పంటను పండింపకున్న లోకమున ఆహారము లభించదు. స్వకర్మ చేయకపోవటం తనకేగాక, సంఘానికికూడా కష్టనష్టాలు కలిగిస్తుంది. కనుక ఎవరి కర్మలు వాళ్ళు నిత్యం చేస్తూ ఉండాలి. ఈ కర్మ అయిదు విధములుగా ఉన్నది. 1. సుకర్మ 2. కర్మ 3. అకర్మ 4. వికర్మ 5 మిశ్రమ కర్మ. సుకర్మ అనగా మంచి పనులు చేయుట, సంఘమునకు సేవచేయుట, పరోపకారం చేయుట యోగానందంతో పరమాత్మను సేవించుట, మొదలగునవి. కర్మ అనగా పని. పాప పుణ్యముల చింతన లేక, తాను చేయవలసిన పని సక్రమంగా చేస్తూ, ఇతరులకు ఉపకారము గాని, అపకారము గాని, చేయకుండా తటస్థంగా ఉండటం. అకర్మ అనగా తాను చేయవలసిన కర్మను చేయకుండా ఉండటం. వికర్మ అనగా ధర్మ విరుద్ధమైన పనులు చేయటం అనగా జీవహింస చేయటం, అసత్యం పలకటం, దొంగతనం చేయటం, దౌర్జన్యం చేయటం మొదలగునవి. మిశ్రమ కర్మ అనగా పాప పుణ్య కర్మలు రెండు చేయటం. వ్యాపారస్థులు తమ వ్యాపారం జరుగుటకు అనేక అబద్ధములు చెప్పుతుంటారు. ఇది పాపకార్యము. వస్తువులందు కల్తీ చేస్తుంటారు. తక్కువ కొలతలు కొలుస్తుంటారు. ఈ పాప కర్మలకు పరిష్కారముగా ధర్మశాలలు, వైద్యశాలలు, పాఠశాలలు కట్టిస్తుంటారు. దాన ధర్మాలు చేస్తుంటారు. ఇట్లా పాప, పుణ్యములు రెండు చేస్తూ ఉండటం మిశ్రమ కర్మ అనబడుతుంది.

మానవులకు ఉద్రేకము పనికిరాదు. ఉద్రేకములో విచక్షణా జ్ఞానము నశిస్తుంది. కావున జనులు శాంతితో పరస్పరము సహకరించుకొనుచూ జీవించాలి. మూర్ఖత్వంతో కొందరు పాపం చేస్తారు. మానవులు చేసే కర్మలలో దోషములు. పొరపాట్లు ఉండటం సహజం. విజ్ఞానవంతులు ఆ పొరపాట్లను సవరించుకోవాలి. ఇతర ప్రాణులకు హానికల్గించే కర్మలు చేస్తూ ఉండటం మానవుడు వర్జించాలి. మూర్ఖత్వంతో దుర్యోధనుడు మహాభారత యుద్ధంలో ఎందరి మరణానికో కారణమయ్యాడు. వృత్తిపేరుతో కొందరు అమాయకులె అనేక పాపాలుచేస్తూ ఉంటారు. తాము చేసే కార్యము పాపం అని తెలుసుకోలేక కసాయి వారు అనేక జంతువులను చంపి, మాంసమును విక్రయిస్తున్నారు. "అహింసా పరమో ధర్మః" అని వారు తెలుసుకోలేక పోవటంవల్ల అట్లా అనుచితకార్యం చేస్తున్నారు. వాళ్ళకు సముచిత బోధ చేస్తే వాళ్ళు జ్ఞానవంతులౌతారు. సత్కర్మలు చేయటానికి పూనుకొంటారు.

మానవుడు మంచి ప్రవర్తనతో జీవించాలి. అసూయ, ద్వేషము, జీవహింస, మొదలగు వాటిని విడిచివేసి అహింసా, సత్యమూ, ప్రేమ, కరుణ, త్యాగం, పరోపకారము మొదలగు దివ్య గుణాలు కలిగి తనను తాను ఉద్ధరించు కోవాలి.

మనస్సు ప్రవర్తనపై ఆధికారాన్ని వహిస్తుంది. మానవుడు కలుషితాంతఃకరణుడైనచో అట్టి మనస్సుతో మాట్లాడినను పనిచేసినను పెక్కు ఇక్కట్లకు లోనవక తప్పదు. మనస్సు మానవుల కున్న ఇంద్రియములలో ప్రధానమైనది. ఎందుకంటే ఇతర ఇంద్రియములు నిర్వర్తించు పనులన్నీ మనస్సుపైనే ఆధారపడి ఉంటాయి. మానవుడు పరిశుద్ధాంత రంగముతో ప్రవర్తిస్తే, అతణ్ణి సుఖము నీడవలె అనుసరిస్తుంది. "ఇతడు నన్ను నిందించాడు, కొట్టాడు, ఓడించాడు, ఇతడు నానుండి ధనాన్ని దొంగిలించాడు" అని ఈ విధంగా ఎల్లప్పుడూ అలోచించువాడు తన మనస్సులోని క్రోధమును, పగను, ఎప్పటికిని అణచుకోలేడు. ద్వేషము నెన్నటికిని ద్వేషముచే అణచలేము. ప్రేమతో, క్షమతో ద్వేషమును జయించగలము. పుట్టినవారందరును

గిట్టుట తప్పదని తెలిసికొని ఉన్నప్పటికీ చాలామంది అజ్ఞానముచే మోహితులై ఇతరులతో శత్రుత్వమును పెంచుకుంటూ ఉంటారు. ఈ సత్యమును తెలుసుకున్న జ్ఞానులకు శత్రువులుండరు. పై కప్పునందు రంధ్రములున్న ఇంటిలో వర్షము ధారాళంగా పడినట్లే ధర్మం ఆచరించని మనుష్యుని మనస్సులో వాంఛలు విపరీతంగా ప్రవేశిస్తాయి. ధర్మము గురించి ఉపన్యాసములిస్తూ ఆ ధర్మాన్ని ఆచరణలో పెట్టనివాళ్ళు ఇతరుల మందలోని ఆవులను లెక్కించు గోపాలకుని వంటివాళ్ళు ఇట్టివాళ్ళ. జీవితము ఎన్నిటికిని పవిత్రం కాజాలదు.



## క్షమాగుణం

క్షమాగుణంతో సమానమైంది మరేదీలేదు. కొద్ది శ్రమతో క్షమాగుణము వలవరచుకొన్నవాడు ఎటువంటి కష్టాలనైనా ఓర్చుకొనే శక్తి కలిగిన వాడౌతాడు. దురాలోచన వల్ల బహు జన్మల్లో చేసిన దాన ధర్మములూ, భగవత్ పూజలూ అన్నీ క్షణంలో నశించిపోతవి. ద్వేషంతో సమానమైన పాపంగాని, పశ్చాత్తాపంతో సమానమైన శిక్షగాని లేదు. కాబట్టి మానవుడు సర్వదా క్షమాగుణాన్ని అలవరచుకోవాలి.

# ఎనిమిదవ అధ్యాయము

## (మనోమయ యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షులారా ! తథాగతుడు జీవితములోని దుఃఖమునుచూచి, దుఃఖించు వారితో తానునూ దుఃఖించి, దానిని నివారించు ప్రయత్నములో సఫలీకృతుడైనాడు. ఆయన ఈ ప్రపంచమందలి సర్వ వస్తురూపములను పరీక్షించి "అనిచ్ఛ, దుఃఖము, అనాత్మ" అను మూడింటి స్వరూపగలది ప్రపంచ"మని నిరూపించాడు· "జీవితమంతా బాధామయం, అసంతృప్తిమయం, రోగమయం కావటంవల్ల సంతోషం పొందలేక మానవుడు దుఃఖపడుతున్నాడు. ఆ దుఃఖానికి స్వార్థంతో కూడిన అతడి కోరికే కారణం. ఈ కారణాన్ని నశింపజేస్తే దుఃఖంకూడా నశిస్తుం"దని చెప్పాడు. ఈలక్ష్యసిద్ధికి ప్రధానమైంది బుద్ధుడుపదేశించిన మధ్యమమార్గం. ఆమార్గాన్ని అవలంబించి పవిత్ర జీవనం గడపటం చేత మానవుడు లక్ష్యసిద్ధి సాధించగలుగుతాడు. ఇంద్రియ సంఘాన్ని అదుపులో పెట్టి, మనుస్సును స్థిరం చేసుకొంటే శాంతి లభిస్తుంది.

మనం నిర్వర్తించే క్రియలన్నింటికీ మనస్సేకారణం. మనపై అధిపత్యం వహించేది మనస్సే. అన్ని పరిణామాలకూ అదే కారణం. మన మనస్సులో చెడు ఆలోచనలు కలిగినట్లయితే మన మాటలూ, చర్యలుగూడా దోషభూయిష్ఠాలుగా ఉంటాయి. మనస్సే మనలను నడిపిస్తుంది. ఒక్క చెడుతలంపు మూలంగా జీవితం నాశనం కావటమేకాదు. భావి జీవితంగూడా నాశనమవుతుంది. దీనికి ఉదాహరణంగా ఒక చిన్న కథ మీకు చెబుతాను.

పూర్వం సౌభాగ్యవర్మ అనే ఒకరాజు ఉండేవాడు. అతని భోగభాగ్యాలకు కొదవలేదు. అతనికి చాలామంది భార్యలు–ఎప్పుడూ నృత్యగాన విలాసాల్లో తేలిపోతూఉండేవాడు. ఒకరోజు అతడు అడవికి వేటకు వెళ్ళాడు. సాయం

కాలంవరకు వేటాడి అలసిపోయాడు. ఆ అడవిలో ఉన్న ఒక ముని ఆయన్ని చూచి, జాలిపడి తన ఆతిథ్యం స్వీకరించవలసిందిగా కోరాడు. రాజు సమ్మతించి, ఆ మునీశ్వరుని ఆశ్రమానికి వెళ్ళాడు. మునీశ్వరుడి భార్య అతడికి కనిపించింది. ఆమెపై అతడికి మోహం కలిగింది. ఆరోజు రాత్రి అంతా శయనించిన తర్వాత ఉద్రేకం పట్టలేక, ఆ రాజు మెల్లిగా ముని భార్య పడుకున్న చోటుకుపోయి ఆమెను బలాత్కరించబోయాడు. ఆమె భయపడి కేకలు వేసింది. అంతా మేల్కొన్నారు. మహర్షికి ఆ రాజుపై అమితంగా కోపం వచ్చి "జంతువులాగ ప్రవర్తించావు కాబట్టి కోతివై పొ"మ్మని శాపం పెట్టాడు. ఆ రాజు కోతిగా మారిపోయాడు. క్షణిక సుఖం ఒక జన్మనే అధోగతి పాలు చేసింది. జీవుణ్ణి భ్రష్టుణ్ణి చేసింది. కనుక ఇంద్రియాలను నిగ్రహించి మనస్సులో మనం సత్సంకల్పాలను చేస్తూ, సత్కర్మలను ఆచరిస్తూ ఉండాలి.

## శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :

సృష్టియందు మనస్సుకు చాలాప్రాధాన్యముంది. మనస్సుతోకూడిన ఆరు ఇంద్రియములు జీవుని ఆకర్షించుట వలన, ప్రకృతిజీవుల కలయికవలన సృష్టి ఏర్పడుతున్నది. ప్రాణులు ఉద్భవిస్తున్నవి. మనస్సు ఇంద్రియములకు ప్రభువు లాంటిది. మనస్సునకు ఆత్మ గురువులాంటిది. సద్గురువును ఆశ్రయించి ప్రభువు ఏవిధంగా మోక్షార్హుడౌతున్నాడో, ఆదేవిధంగా ఆత్మను ఆశ్రయించిన మనస్సు పరమ శాంతిని పొందుతుంది. మనస్సుకు రెండు సంఘములున్నవి. అవి 1. ఇంద్రియ సంఘము 2. ఆత్మ సంఘము. మనస్సు ఇంద్రియ సంఘముతో చేరినట్లయితే అది విషయవాసనా స్వరూపమైన అనిత్యసుఖముల ననుభవించి జీవుని కర్మ బద్ధునిగా చేస్తూ ఉంటుంది. ఆ కర్మలవలన జీవుడు నీచ జన్మలకు గురిఅవుతున్నాడు. ఇంద్రియ సుఖములు త్రిగుణాత్మకమై ఉన్నవి. అవి 1. సాత్త్విక సుఖము 2. రాజస సుఖము 3. తామస సుఖము. మనస్సు సత్త్వగుణమును ఆశ్రయించిన ధర్మ సమ్మతము అవుతుంది. శాస్త్రమును ఆశ్రయించిన అది సుఖాన్ని అనుభవిస్తుంది. రజోగుణము నాశ్రయించిన స్వార్థస్వరూపములైన సుఖాలను పొందుతుంది. తమోగుణము నాశ్రయించిన

ధర్మవిరుద్ధము, పాపభూయిష్ఠమైన, సుఖములను అనుభవిస్తుంది. జీవుని నికృష్ట జన్మలకు గురిచేస్తుంది.

మనస్సు ఆత్మ సంఘముతో చేరినట్లయితే గుణాతీత తత్త్వాన్నీ పొంది ఇంద్రియ విషయవాసనా రహితమై, ఆత్మయందు స్థిరపడుతుంది. ఇంద్రియాది విషయములను జీవునకు చేరనీయక అత్మానందానుభూతికి భంగము కలిగించక, ఆత్మాను సంధానము కలిగిస్తుంది. ఇంద్రియములు శరీరమునకు వెలుపల ఉన్నవి. అవియే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. జీవుడు శరీరము లోపల ఉన్నాడు. శరీరమునకు వెలుపలి విషయములను లోపల ఉన్న జీవునకు మనస్సు అందజేస్తున్నది పంచప్రాణాలలో ఒక ప్రాణము మనస్సులో సంచరిస్తున్నది. అందువలన మనస్సు జడపదార్థమైనప్పటికి చలన శక్తి కలిగి, శరీరమును శిఖస్థానమునయున్న ప్రాణమునకు ఈ విషయములను అందిస్తున్నది. ఆ ప్రాణము, ఆ విషయములను అనుభవించి, చిత్రించి భద్రపరుస్తున్నది. దీనినే తలవ్రాత అని అంటున్నారు. తలవ్రాతను దేవుడు వ్రాయుచున్నాడని కొందరు చెబుతూ ఉంటారు. ఇది శాస్త్ర సమ్మతముకాదు. శరీర తత్త్వజ్ఞాన సమ్మతము కాదు. ఇంద్రియములందు విషయ వాసనలు రేకెత్తుచున్నవి. చెవియందు శబ్దము వినపడుతుంది. ఆ శబ్దమును మనస్సు తీసుకుని పోయి తలవెనుక భాగమునందు ప్రాణమునకు అందిస్తున్నది. శబ్దమును వినవలెనని సంకల్పించునది మనస్సు. మనో సంకల్పం వలన శబ్దమును మనం వింటున్నాము. కావున మనో సంకల్పములవలన ఇంద్రియములయందు విషయములు పుడుతున్నవి. విషయ వాసనలకు కారణము మనస్సు.

జీవుని జన్మకు మొదటి కారణము మనస్సు. జీవునకూ, మనస్సునకూ సన్నిహిత సంబంధం ఉన్నది. జీవుడు శ్రద్ధా స్వరూపుడు "శ్రద్ధా మయోఽయం పురుషః". శ్రద్ధను కల్పించునది మనస్సు. అందువలన మనస్సునందు ఏ విధమైన శ్రద్ధ కలిగితే జీవునకు ఆ విధమైన స్వరూపము రాగలదు. మనస్సు సంకల్పానుగుణంగా శరీరము కర్మలు చేస్తూ ఉంటుంది. పాప పుణ్య కర్మ

లకు మనస్సే కారణం. ఈ రహస్యమును మానవులు తెలుసుకుని మనస్సును సత్సంకల్పములకు నిలయమగునట్లు చేసుకోవాలి. మానవజీవితములోని ఒడి దుడుకులకు మనస్సు, ఇంద్రియములే కారణములు గాని దేవుడు కారణము కాదు. మనస్సులోని సంకల్పములకు 1. జన్మాంతర సంస్కారం 2. సంఘము 3. కాలప్రభావం 4. ఇంద్రియ భోగములపై భ్రమ 5. పరి స్థితి అను ఐదుకారణములు ఉన్నవి. ఈ ఐదు కారణముల వలన మనస్సులో సంకల్పములు కలుగుతుంటవి. వాని వలన కర్మలు చేస్తూ ఉంటాము. కర్మల వలన జన్మలు కలుగుతుంటవి. జీవునకు జన్మలకు ఎట్టి సంబంధం లేదు. మానవుడు మరణించునప్పుడు ఎట్టి సంకల్పాన్ని చేస్తాడో, దేనిని భావిస్తాడో ఆ భావన స్వరూపాన్ని మరుజన్మలో పొందుతాడు. ఒక ఋషి ఉండేవాడు ఆయన ఒక ఆవును పెంచాడు. దాన్ని అమితంగా ప్రేమించాడు. మరణ సమయమందు ఆ ఆవునే భావించాడు. స్మరించాడు. మరుజన్మలో ఆవుగా పుట్టాడు. చూచారా! మనస్సుయొక్క ప్రభావం. మానవుడైన ఆ ఋషిని ఒక జంతువుగా (ఆవుగా) సృష్టించినదెవరు? మనస్సే అతని జంతు జన్మకు కారణమైనది. కావున మనస్సునందలి సంకల్పమునకు, జీవులు పొందు జన్మలకు సన్నిహిత సంబంధమున్నది. జీవునకు ఎట్టి సంబంధం లేదు. దేవుడు సత్యమునకు ఆధారభూతమైన సాక్షీస్వరూపుడు.

సూర్యుడు మనకు వెలుతురును, వేడినిఇస్తున్నాడు. ఆవెలుతురును వేడిని ఎవరు ఎట్లా ఉపయోగించుకొంటారో దానికి తగిన కర్మ ఫలితాన్నే వారు పొందుతుంటారు. వారు చేయు కర్మలకునూ, వారు అనుభవించు ఫలితముల కునూ, సూర్యునికినీ ఏవిధమైన సంబంధలేదు. సూర్యుడు ఉదయిస్తాడు. వెలు తురు వ్యాపిస్తుంది. ఆ వెలుగులో ఒకడు బుద్ధిమంతుడు శాస్త్ర పఠనము చేసి జ్ఞానాన్ని పొందుతాడు. మరియొకడు ఆ వెలుతులో దొంగతనము చేస్తాడు. అతణ్ణి రక్షకభటులు పట్టుకొని, కొట్టి, చిత్రహింసలకు గురి చేస్తారు. దొంగ వాడు తిన్న దెబ్బలకు సూర్యుడు బాధ్యుడౌవుతాడా? సూర్యుని తేజస్సు లేక పోతే ఇవి ఏవియూ జరిగి యుండేవి కావు. అటేవిధంగా దేవుని దివ్యశక్తి

లేక లోకములో ఏదియూ జరుగదు. జరుగుతున్న వాటికి దేవునకూ ఎట్టి సంబంధము లేదు.

మనస్సు సంకల్పమునకు జన్మాంతర సంస్కారములు ఒక కారణము. పూర్వజన్మ సంస్కార ప్రభావము బలవంతంగా వాళ్ళను దైవము సన్నిధికి ఆకర్షిస్తూ ఉంటుంది. బీదకుటుంబంలోని ఒక బాలుడు ఒకరైతువద్ద పశువుల కాపరిగా చేరాడు. పూర్వజన్మ సంస్కారము వలన అతడు మేపుచున్న పశువులను వదలి, మనస్సు ఏకాగ్ర మొనర్చి, యోగస్థితిని పొంది, బాల్యము లోనే యోగసిద్ధిని పొందాడు. ఆ బాలుని అంతా బాలయోగి అని పిలిచేవారు.

మన సంస్కారమును మార్చెడి ప్రభావము సంఘమునకు ఉంది! సంఘమందలి తత్త్వమునకు మనస్సు బద్ధమై పవిత్రతను కలిగించవచ్చును. లేదా పాడుచేయవచ్చును. సత్సాంగత్యము వలన మరచిపోయిన పరమాత్మ తత్త్వజ్ఞానము వెంటనే జ్ఞాపకంవచ్చి మోక్షార్హులు కావచ్చును. ఆమ్రపాలి అనే వేశ్య పాపభూయిష్టమైన వ్యభిచార వృత్తిలో జీవితము గడుపుతూ ఉండేది. బుద్ధి సంఘములో చేరినంతనే ఆమె మనస్సు పవిత్రమై ఆత్మసంఘ మున చేరింది. మోక్షార్హురాలైంది. జీవుడికి అనుభూతి రెండు విధాలుగా అందుతున్నది. ఇంద్రియవిషయవాసనానుభూతిని మనస్సు అందిస్తుంటే, ఆత్మ సాక్షాత్కార జ్ఞానాన్ని ఆత్మ అందిస్తుంది. మొదటిది ప్రవృత్తి మార్గం. రెండోది నివృత్తి మార్గం. నివృత్తి మార్గములో అడ్డు తొలగినప్పుడే ఆత్మ జ్ఞానము లభిస్తుంది. సామాన్యులను మాయాస్వరూపమైన మనస్సు అడ్డంకులు కల్గిస్తుంది. వేలామందిలో ఎవరికో ఒకరికి మనస్సు అడ్డు తొలగుతుంది. మనకు అడ్డుపడేటువంటి మనస్సును నిగ్రహించ లేకపోతే ఈసంసారంలో మునిగిపోతాము. సంస్కార ప్రభావమున జ్ఞానాన్ని పొందినవాళ్లు కూడా సంఘ ప్రభావమున దుష్ట సంకల్పములు ఉదయించినప్పుడు ఇంద్రియ సంఘములో చేరి పతనమై పోతూ ఉంటారు. పూర్వజన్మ సంస్కారంవలన జ్ఞానాన్ని పొందినవారు కూడా సంఘప్రభావమువలన జ్ఞాన హీనులవుతారు. సంఘమునకు, సంస్కారమును కూడా మార్చెడి శక్తి ఉన్నది. చెన్నుడు

సామాన్య సిపాయిగా జీవినితము గడుపుతూ ఉండేవాడు. ఉపాలి అనే మంగలి తన వృత్తిని చేస్తూ ఉండేవాడు. వాళ్ళు బుద్ధి సంఘమున చేరి, సంస్కరింపబడి జ్ఞాన సిద్ధి పొందారు. కావున మనము సత్సాంగత్యముతో దృష్ట సంకల్పమును తొలగించుకొని. మంచి సంకల్పాలను కలిగించు కోవాలి. ధ్యాన యోగము చేసినచో ప్రతి ఒక్కరూ మోక్షార్హులవుతారు. మనస్సే పాపమును మనచేత చేయించుతుందనే సత్యము మనము తెలుసుకోవాలి. మనస్సుయొక్క ప్రమాదమును తొలగించుకొనుటకు బుద్ధుని ధర్మమును మనము ఆశ్రయించాలి. బుద్ధం, శరణం గచ్ఛామి. ధర్మ శరణం గచ్ఛామి. మనస్సునందు సంకల్పము కలిగిన వెంటనే ధర్మాన్ని ఆశ్రయించాలి. ఈ సంకల్పము ధర్మసమ్మతమైన దేనా ? అని బుద్ధితో విమర్శన చేసుకోవాలి. ధర్మ సమ్మతమైనదని నిశ్చయించినప్పుడే ఆ పని చేయాలి. లేకపోతే చేయకూడదు. విషయ వాసనలను తొలగించుకున్నపుడు మనస్సు ఇంద్రియ సంఘమును వీడి ఆత్మ సంఘమును చేడుతుంది. జీవునకు విషయ వాసనలు అందించునది మనస్సు కావున అది ఆత్మను చేరునది కనుక శాశ్వత సుఖాన్ని అందజేస్తుంది. ఈ విషయమును గ్రహించి మనస్సు ప్రమాదములను తొలగించుకొని ఆత్మానుభూతిని పొందాలి.

సంఘములకు ప్రాణుల స్వభావమును మార్చెడి ప్రభావమున్నది. పెద్ద పులికి ఆవును చంపి తినెడి స్వభాామున్నది. ఆవుకు పెద్ద పులిని చూచి భయపడి పారిపోయే స్వభావమున్నది. ఇది ప్రకృతి సహజము. గారడివాడు పెద్ద పులిని ఆవును ఒక చోటకు చేర్చి వాటికి శిక్షణఇస్తాడు. అవి వాటి స్వభావములను విడిచి, గారడివాడు చెప్పినట్లు నడుచుకొంటవి. ఆవుపైన పెద్దపులిని ఎక్కించి సర్కస్‌లో తిప్పుచున్నారు. అప్పుడు పెద్ద పులి ఆవును చంపుట లేదు. ఆవు భయపడుట లేదు. రెండునూ మైత్రీ స్వభావమును అనుసరించుచున్నవి. అందువలన సంఘం శరణం గచ్ఛామి అని చెప్పబడుచున్నది. మానవుడు బుద్ధి సంఘమున చేరిన, ఆ సంఘము వాని దోషములను తొలగించి, సంస్కరించి మోక్షార్హునిగా చేస్తుంది.

కాల ప్రభావము మనస్సులో సంకల్పములను కల్పిస్తుంది. శివవు

అవస్థయందు ఏవిధమైన సంకల్పములుండవు. మాటలు వచ్చుసరికి మనస్సు సంకల్పములను ప్రారంభించి కోరికలు కల్గిస్తుంది. బాలురు తినే వస్తువులనూ, ఇతరుల వస్తువులనూ కోరి దెబ్బలు తింటూ ఉంటారు. యవ్వన కాలము ప్రవేశించిన తర్వాత మనస్సునందు స్త్రీ సంగమ సంకల్పములు ప్రారంభిస్తవి. మానవులు ధర్మమును ఆశ్రయించి, మనస్సును నిగ్రహించి బుద్ధిమంతులుగా జీవించాలి. యవ్వన కాలము మనస్సును అనేక విధముల భ్రమింప చేస్తూ ఉంటుంది. అనేక అలంకారములనూ, ఐశ్వర్యములనూ, అనుభవములనూ, మనస్సు సంకల్పిస్తుంది. వానిని నిగ్రహించి, నియమ నిష్ఠలతో కీర్తివంతులుగా జీవించాలి. మనో సంకల్పమునకు బానిసలై కోరికల భ్రమలోపడి అనుచితముగా ప్రవర్తించిన అపకీర్తి పాలవకూడదు. యవ్వన కాలము ప్రవేశించగానే మనస్సును ధర్మబద్ధం చేసుకోవాలి. అనాలోచితముగా ఏ పని చేయరాదు. అపకీర్తితో జీవించుటకంటే మరణించుట శ్రేష్ఠము. అందువలన కాలప్రభావమును గ్రహించి యవ్వన ఉద్రేకము నిగ్రహించి మనశ్శుద్ధితో సత్ప్రవర్తనతో, దైవభక్తితో, జ్ఞానయుక్తముగా జీవించాలి.

పితృత్వకాలము ప్రవేశించినపుడు మనస్సు తన సుఖములూ, ఐశ్వర్యములూ గాక, భార్య, సంతతికి సంబంధించిన సుఖైశ్వర్య భ్రాంతులయందు ప్రవేశిస్తుంది. తన కొడుకును శ్రీమతుని చేయాలి, తన కుమార్తెను ఐశ్వర్యవంతురాలిగా చేయాలని సంకల్పములు బయలుదేరుతవి. ఆకాలమున మానవులు పరిపూర్ణముగా విశ్వసించవలసిన ధర్మము ప్రాప్తము. మానవులకు జన్మాంతర సంస్కారము ననుసరించి, ప్రాప్త మనునది లభిస్తుంది. తాను చేయవలసిన స్వధర్మమును సక్రమంగా తాను చేస్తూ ఉండాలి. ఫలితమును ప్రాప్తములకు అప్పగించి సంతృప్తిగా ఉండాలి. తండ్రికోరిన విధముగా కొడుకు జీవితమున జరగదు. ఆ కొడుకుయొక్క ప్రాప్తము కొలది అది జరుగుతుంది. పూర్వం సుధాకరుడనే రాజు ఒకడు ఉండేవాడు. ఆయన తన కుమార్తెను ఒక మహారాజునకు ఇచ్చి పరిణయము చేయవలెనని సంకల్పించాడు. కానీ ఆమె ఒక సిపాయికి భార్య అయింది. పేదరికంతో జీవితం గడిపింది. అది ఆమె ప్రాప్తము.

వివాహ కాలమందు మనస్సు ఎన్నో కోరికలు కోరుతుంది. కోరిక లన్నియూ నెరవేరి వివాహమైననూ, ప్రాప్తము లేకున్న దాంపత్యము భంగ మౌతుంది. పూర్ణవర్ధనుడను వాడు తాను కోరిన లక్షణములున్న స్త్రీ దొరికే వరకు వివాహమాడనని ప్రతిజ్ఞచేశాడు. తనకు కాబోయే భార్యకు పొడుగాటి శిరోజములు, తామర రేకులవంటి నేత్రములు, పరిపక్వ బింబ ఫలమువంటి అధరోష్టములు, మల్లెమొగ్గవంటిపళ్ళు, చక్కటి శరీర ఛాయ కలిగి ఉండాలనీ, సకల విద్యా ప్రవీణయై ఉండాలనీ, అగర్భ శ్రీమంతురాలై సకల గుణ సంపన్నురాలై, యవ్వనవతై ఉండాలని అతని ఆకాంక్ష. ఈ లక్షణము లన్నియూ కల్గిన విశాఖ అను కన్య "సావత్థి నగరంతో" అతనికి కనిపించింది. ఆమెను వివాహం చేసుకొన్నాడు. కానీ వివాహమైన మూడు నెలలకే ఆమె బౌద్ధ భిక్షువైంది. పూర్ణవర్ధనుడికి తండ్రి మిగరుడు. అతడు నిగంతువుల (అజీవకులనే దింగర సన్యాసులకు) భక్తుడు. విశాఖ తన యింటి రాగానే ఆయన నిగంతువులను తన యింటికి ఆహ్వానించి, ఆమెను వారికి శుశ్రూష చేయమన్నాడు. దిగంబరులకు సేవ చేయడానికి ఆమె నిరాకరించింది. నిగంతువులకు కోపం వచ్చి, ఇంటినుండి ఆమెను పంపివేయమని మిగరునితో చెప్పారు. మిగరుడు ఆగ్రహించి ఆమెను ఇంటినుండి వెళ్ళగొడుతానని బెద రించాడు. కాని ఆమె భయపడలేదు. ఆమె మొదటినుండియు బుద్ధుని మతమనిన శ్రద్ధా భక్తులు గలది. బుద్ధునిపై తనకు గల విశ్వాసమును తన ఇంటిలో అందరికి కలుగునట్లు ఆమెచేసింది. మిగరుడు బుద్ధ ధర్మాన్ని స్వీకరించాడు. తనలోని మార్పుకు కారణమైన విశాఖను తల్లిగా భావించి తల్లికివ్వవలసిన గౌరవాలన్నీ ఆమెకు ఇస్తూ "మిగరుని తల్లి" అని ఆమెను పిలుస్తూ ఉండే వాడు.

విశాఖ ఎన్నో విరాళాలను ఇచ్చింది. ఒకసారి ఆమె నా దగ్గరకువస్తూ, తాను ధరించిన నగలన్నింటినీ మూటగట్టి నాకు సమర్పించాలనుకొని, నా ఆదేశానుసారం సావత్థి నగరంలో, పుబ్బారామానికి తూర్పువైపున, సన్యాసుల నివాసంకోసం ఒక సంఘారామాన్ని నిర్మింప జేసింది. సావత్థి (శ్రావస్తి) నగరంలోని సన్యాసులకు ఎన్నో దానాలు చేసింది. ఆమె చేసిన ఎమిది

రకాల దానాలకు ఫలితంగా సంతోషం, ఆనందం, మనశ్శాంతి, సుఖం, ధర్మంపై హృదయాన్ని లగ్నం చేయటం, తనకుగల శక్తిని సన్మార్గము నందు వినియోగించటం, జ్ఞానానికి కావలసిన శక్తి, సంఘ సేవకు కావలసిన అవయపుష్టి అనే ఎనిమిది వరాలను నావద్దనుంచి పొందింది. ఏడేళ్ళ వయస్సులోనే తన తాత మెండకునికి తన కోర్కె చెప్పి, నా దర్శనార్థం వచ్చి, బౌద్ధ ధర్మ ఉపాసిని అయింది. పదిహేడు వత్సరాలప్రాయంలోనే తన దగ్గరున్న బంగారు వస్తువుల్నీ, ధనాన్నీ, సంఘ సేవకు అర్పించి ధన్యోస్మి అనుకొంది. దాంపత్య సుఖంకంటే బౌద్ధ భిక్షుకిగా, సంఘసేవ చేయటమే ఆనంద దాయకమని ఆమె భావించింది. తృప్తికి మించిన ధనం మరొకటి లేదు. త్యాగంవల్లనే శాంతి, సౌఖ్యం, ఆనందం కలుగుతవన్న విషయం ఆమె తన ప్రవర్తనద్వారా లోకానికి తెలిపింది. దానిని మనం మరచిపోరాదు.

ప్రాప్తం లేనిది ఎంత ప్రయత్నించినసనూ ఏదీ లభించదు. సుఖము అనునది ధనమునందూ, బంగారమునందూ, భవనమునందూ, రాజ్యమునందూ, భార్యా సంతానమునందూ లేదు. ఆ సుఖము మన మనస్సులోనే ఉన్నది. అదే సంతృప్తి. ప్రతి ఒక్కరూ సుఖసంతోషములను పొందవచ్చు. సంతోషానికీ, మనస్సునకూ సన్నిహిత సంబంధమున్నది. మనస్సులోని ఆశయే దుఃఖమునకు కారణము. ఆశగలవాడే దరిద్రుడు. ఆశలేనివాడు బీదవాడైనను అతడు ధనవంతుడే !

ముసలితనము వచ్చుసరికి మనస్సులోని కోరికల నన్నింటిని నిగ్రహించుకొని పాత జీవితమును మనస్సులోకి రానీయకుండా జీవించటం నేర్వాలి. అందరి ఆదరాభిమానములు పొందేటట్లుగా ప్రవర్తిస్తూ ఉండాలి. తీయని మాటలు పలకటం నేర్వాలి. పాప సంకల్పములు చేయకుండా పవిత్ర భావన కలిగి ధ్యాన యోగము చేస్తూ, వైరాగ్యముతో సత్సాంగత్యము చేస్తూ

ఉండాలి. ఇంద్రియ సంఘమును వీడి ఆత్మ సంఘమును చేరి, ఆత్మ తత్త్వ స్వరూప జ్ఞానమును పొంది, జన్మరాహిత్యానికి ప్రయత్నం చేయాలి.

ఇంద్రియ సుఖములు అనిత్యములు. దుఃఖకారణములు. విషయవాసనల వలన మనస్సు ప్రభావమున పడిపోయి భ్రష్టులౌతారు. గొప్ప తపస్సంపన్నులు కూడా ఇంద్రియ భోగములను కోరి స్త్రీ వ్యామోహమున పతితులగుచున్నారు. శరీరముతో పాపము చేయకున్నను మనస్సునందు పాప సంకల్పములు వచ్చినచో ఆ పాపానికి బద్ధులౌతారు. పూర్వము ఒక మహా పతివ్రత ఉండెడిది. ఆమె ఒక మహర్షి భార్య. ఆమె ప్రతి రోజు నదికిపోయి స్నానము చేసి, తన సంకల్ప శక్తితో, ఇసుకతో, బిందె చేసి, నీరు తీసుకొని వచ్చేది. ఒకరోజు అట్లా ఆమె నీళ్లుతీసుకొని తన ఆశ్రమమునకు వస్తూ ఉండగా ఒక గంధర్వుడు ఆ నదీతీరమున సంచరిస్తూ ఉండటచూచింది. ఆమె మనస్సు చెదిరింది. దాని వలన ఆమె ప్రాతివత్యమునకు భంగం కలిగింది. అప్పుడు ఆమెకు ఇసుకతో బిందెచేసే శక్తి నశించింది. నీరు తేకుండా ఇల్లు చేరింది. భర్త ఆమె పరిస్థితిని చూచి, తన దివ్యదృష్టితో ఆమె మనస్సునందు దుస్సంకల్పమును గ్రహించి, ఆమెకు శిరచ్ఛేదము చేయవలసిందిగా ఆజ్ఞ ఇచ్చాడు. ఆమె చేసిన ఒక దుష్ట సంకల్పము ఆమెకు ఒక జన్మను మార్చింది. కావున మానవులకు ఎన్ని దుష్ట సంకల్పములుండునో అన్ని జన్మలు మారుతూ ఉంటవి. మానవులుఎప్పుడూ సత్ సంకల్పముతో ఉండాలి.

ఎట్టి పరిస్థితిలో కూడా దుష్ట సంకల్పములు కలుగరాదు. వైరాగ్యాన్ని ఆశ్రయించాలి. జీవుని ఉద్ధరించుటకు గానీ, పతనం చేయుటకు గానీ, మనస్సునందలి సంకల్పములే కారణము. సత్ సంకల్పము వలన దైవ భావన కలిగి, సత్సాంగత్యము చేసి, యోగసాధన చేసి, ఆత్మ సాక్షాత్కార స్వరూప జ్ఞానమును పొందగలరు. ధర్మమును, శాస్త్రమును ఆశ్రయించి, మనోసంకల్పములను వాటి కనుగుణముగా మార్చుకోవాలి. మనస్సుయొక్క స్వభావము, కుక్కను పోలి ఉంటుంది. మనం భయపడి పరుగెత్తితే అది మనవెంటపడి తరుముతుంది. కర్రతీసుకుని బెదిరిస్తే పారిపోతుంది. సర్వధర్మములందునూ,

మనోవాక్కాయ కర్మలందునూ, సుఖదుఃఖములందునూ, మనస్సు వ్యాప్తమై ఉన్నది. ధర్మాచరణమునకు మనస్సే ప్రధాన స్థానమైయున్నది. కర్మలన్నియూ మనోమయములే. ఎవడైననూ, ఎప్పుడైననూ, దోష యుక్తమైన మనస్సుతోకూడి మాట్లాడిననూ, కర్మలు చేసిననూ, గుర్రముల మార్గములోనే రథచక్రములు పోవునట్లు మనోసంకల్ప మార్గములోనే పాపములూ పోతూ ఉంటాయి. మానవులు మనస్సునకు అధికారము నీయక, ప్రాప్తమును విశ్వసించి, తృప్తితో జీవించటం అభ్యసించాలి.



బౌద్ధమతము జ్ఞానమార్గమును, సన్మార్గమును అభిమాన దైవతాపేక్ష లేకయే బోధిస్తుంది. భగవదనుగ్రహంతో నిమిత్తం లేకుండానే జ్ఞానోదయం గల గటాన్ని, ప్రకృతి సిద్ధములైన సూత్రాలను అనుసరిస్తూ, మానవులందరికీ న్యాయాన్ని చేకూర్చటానికై నైతిక విలువలు స్థాపించి న్యాయసమ్మతమైన శిక్షలను విధించటాన్నీ, ఆత్మతో ప్రమేయం లేకుండానే పునర్జన్మ కలగటాన్నీ, భగవదనుగ్రహంతోగానీ, ఒకానొక ఋషి శక్తితోగానీ, యజ్ఞయాగాదులతో గానీ, జపతపాది అనుష్ఠానములతోగాని, ఉత్సవాలతోగానీ, స్తోత్రాలతోగానీ, నిమిత్తం లేకుండా సత్కర్మలు చేయటంద్వారా ఈ జన్మలోనే, ఈ ప్రపంచంలోనే సంసార సంబంధాలను తెంచుకొనే సులభోపాయాలను, బౌద్ధమతం బోధిస్తున్నది.

# తొమ్మిదవ అధ్యాయం

## ( సూత్ర యోగము )

**శ్రీ నాగార్జున ఉవాచ :**

భిక్షువులారా ! ధమ్మచక్క పవత్తన సుత్తమే (ధర్మచక్ర ప్రవర్తన సూత్రమే) బుద్ధుని ప్రథమ బోధయనీ, ఆయన తన జీవితాంతమువరకూ, ప్రజలు బౌద్ధధర్మాన్ని పాటించుటకై చేసిన ఉపదేశములన్నియు అందులో ఇమిడి ఉన్నాయనీ మనకు తెలుసు. చెడుగునుగూర్చి తథాగతుడు వివరిస్తూ "చెడుపనులు చేసేవాడు అతడి పాపం పండేవరకే సుఖాన్ని అనుభవిస్తూ ఉంటాడు. పాపం పండిన పర్వాత తత్ఫలాన్ని వాడు అనుభవిస్తాడు. సూర్యుడిపై ఇసుక చల్లితే అది తిరిగి మన కంట్లోనే పడుతుంది. ఒక మూర్ఖుడు అజ్ఞానంతో ఒక సన్మార్గుడికి చేసిన అపచారం మరలా ఆ మూర్ఖుణ్ణే బాధిస్తుంది. గాలిలోగానీ, సముద్రగర్భంలోగానీ, పర్వత గుహల్లోగానీ, ప్రపంచంలో మరెక్కడైనా గానీ, మృత్యువు కందని ప్రదేశంలేదు. ఎవ్వరు ఎంత ప్రయత్నించినా దానిని తప్పించుకోలేరు. ఈ విషయం గ్రహించి, అందరూ సన్మార్గ ప్రవర్తకులు కావాలి. చెడు తలపులు, క్రౌర్యం వీడాలి. మంచివారనే ఖ్యాతి సంపాదించాలి" అని చెప్పాడు. "చెడుపనులు చేయకుండటం, సుగుణాలను అలవరచుకోవటం, మనస్సును పరిశుద్ధం చేసుకోవటం బుద్ధుల ఉపదేశ సారం" అన్నది మనం మరచిపోరాదు.

ఒకప్పుడు బుద్ధుడు శ్రావస్తిలోని జేతవనం అనాథ పిండకుని ఆరామంలో నివసిస్తున్న సమయంలో జనసింహుడనే శ్రవణకుడు తథాగతుణ్ణి దర్శించి "స్వామీ ! అక్రియా వాదమంటే ఏమిటో తెలవియ్యండి ?" అని ప్రార్థించాడు. అప్పుడు భగవానుడు "ప్రబుద్ధా! నేను క్రియావాదాన్నీ, అక్రియా వాదాన్నీ రెండింటినీ బోధిస్తున్నప్పటికీ, అక్రియా వాదంవైపే ఎక్కువగా మొగ్గుతున్నాను. అక్రియావాదమంటే చేయగూడని పనులు చేయరాదని ప్రవచించటమే! "జీవహింస చేయరాదు, అబద్ధము లాడరాదు. చాడీలు చెప్పరాదు. పరుల సొమ్ము అపహరించరాదు. వ్యభిచారము పనికిరాదు. మద్యపానము

చేయరాదు - తల్లిదండ్రులనూ పెద్దలనూ అగౌరవ పరచరాదు" అని ఈ విధంగా నేను చెబుతున్నందువల్లనే నన్ను అక్రియావాదిగా పేర్కొంటున్నారు. మంచి చేయకున్ననూ, చెడుమాత్రం చేయరాదు. అని నా అభిప్రాయం. చేయకూడని పనులు విరమించిన అపఖ్యాతి రాదు. సంఘములో గౌరవ ప్రతిపత్తులు గలుగుతవి" అని బోధించాడు. అపకీర్తితో బ్రతకటం కంటే మరణించటం మంచిది. కీర్తిగల వాళ్ళకు మరణం అంటూ ఉండదు. పాంచ భౌతికమైన దేహం నశించిననూ యశఃకాయం యుగయుగాలుగా నిల్చి ఉంటుంది.

శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :

ప్రబుద్ధులారా ! ధర్మచక్ర ప్రవర్తన సూత్రములు మానవుల నివృత్తి మార్గమునకు, జన్మరాహిత్య మార్గమునకు అవలంబనములు. సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పము, సమ్యక్ కర్మ, సమ్యక్ జీవనము, సమ్యక్ వాక్కు, సమ్యక్ వ్యాయామము, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి. అనునవి అష్టాంగ మార్గములు. ఈ మార్గమే జనన మరణములకు మధ్యేమార్గము. మోక్షమార్గము. ప్రబుద్ధులారా ! జన్మించినవారికి దుఃఖము సత్యము. వ్యాధులవలన, భార్యాబిడ్డల వియోగమువలన, వారి ప్రవర్తనవలన, దుఃఖము సంభవమవుతుంది. ఒక దుష్టప్రవర్తనలగల కొడుకుఉన్న వానివలన, వ్యభిచారియైన భార్యవలన దుఃఖము కలుగుతుంది. తినుటకు అహారము లేక, కట్టుబట్టలు లేక దుఃఖము కలుగుతుంది కోరిన కోరికలు నెరవేరకున్న దుఃఖ కారణమౌతుంది. ఉపాదాన స్కందము అయిదును (అనగా పంచేంద్రియ విషయవాసనలు అయిదును) దుఃఖకారణము. దానినే "తృష్ణ" అంటారు. అనగా తృప్తి లేకపోవుట. కామతృష్ణ ఎన్నటికీ తీరదు. కోరికలు తీర్చుకొంటున్నకొద్దీ మరలా కోరికలు పుట్టుతునే ఉంటాయి. జన్మతృష్ణయూ అట్టిదే ! ఎన్ని జన్మలెత్తినను మరలా జన్మించవలయుననే భ్రాంతి ఉంటుంది. ఇక జన్మించకూడదు అను స్మృతియే ఉండదు. సంపద తృష ఎన్ని కోట్ల రూపాయలు వచ్చిననూ, బంగారము ఎంత లభించిననూ, ఎంత స్రామాజ్య మున్ననూ ఇంకనూ కావలయుననే కోరుతూ ఉంటుంది. చావు సత్యా

మని తెలిసిననూ శాశ్వతముగా బ్రతకవలయుననే తృష్ణ ఉంటుంది. ఈ తృష్ణయే దుఃఖానికి కారణం.

తృష్ణానిరోధమే (కోరికలు లేకయుండుటయే) దుఃఖ నివారణ మార్గము. "ప్రాప్తించిన దానితో తృప్తిబడి "యదృచ్ఛా లాభ సంతుష్టో ద్వంద్వాతీతోవిమత్సరః" ప్రాప్తించిన దానితో తృప్తిపడి, ఆదాయమునకు తగిన విధముగా జీవిత పోషణ సవరించుకుని, ఆత్మజ్ఞానము కలిగియుండుట దుఃఖనివృత్తి మార్గము. జన్మరాహిత్యమే శాశ్వత దుఃఖ నివృత్తి మార్గము. ఈ కనుపించునదంతయు అసత్యము. నశించునది, నిన్ను విడిచిపోవునది. నీకు భవనమున్నది. అందమైన భార్యఉన్నది. అత్యంత ప్రియమైన కుమారుడున్నాడు నిద్రలో నీకు ఎవరు ఉన్నారు ? ఏది ఉన్నది ? నీ శరీరము కూడ లేదు. పైన బట్ట తొలగినను నీకు తెలియదు. నిద్రతో ఏది యున్నదో అది సత్యము. నిన్ను సర్వము వదిలి వేసెను. కానీ, శ్వాస (జీవుడు) వదల లేదు. అదే సత్యము. జీవుడు అక్షరుడు. నశించువాడుకాదు. ప్రతిరోజు నీవు చిన్న నిద్ర పోతుంటావు! ఏదో ఒకరోజు పెద్ద నిద్రవస్తుంది. అదే మరణము, అదే సత్మము. "చావు సత్యము" అని నమ్మి, "శరీరము అశాశ్వతము. క్షణ భంగురము" అని దేహ భ్రాంతిని, మనసు తృష్ణను, సంసార మమకారమును వదలి, ఆత్మ తత్వస్వరూప జ్ఞానము పొందాలి. జ్ఞానము లేనివాడు జంతువుతో సమానము. "జ్ఞానేన హీనం పశుభిస్సమానః" అను సత్యమును తెలిసికొని సత్యస్వరూపమైన మోక్ష స్థానము పొందాలి.

ప్రచారక సూత్రములు – మానవులను అజ్ఞానము వివిధ విధములుగ ఆవరించి ఉంటుంది. "ధూమేనావ్రియతేవహ్ని యథాదర్శోనలేనచ" అగ్ని మీద పొగ కప్పబడి ఉంటుంది. కొద్దిగా గాలి తగిలినను ఆ పొగపోయి అగ్ని ప్రకాశిస్తుంది. కొంతమంది మానవులకు అజ్ఞానము ఆవిధము ఆవరించి ఉంటుంది. వారి అజ్ఞానము సద్గురు దర్శనము చేతగాని, ధార్మిక గ్రంథ పఠనము చేతగాని తొలిగి జ్ఞాన సంపన్నులౌతారు. మరికొందరికి అద్దమునకు మురికి అంటిన విధముగా అజ్ఞానము అంటి ఉంటుంది. గట్టిగా తడి గుడ్డతో తుడిస్తే ఆమురికి వదలిపోతుంది. ఆవిధముగా కొంతమందికి సత్సంగము

గురు ఉపదేశ వాక్యము, ఆత్మతత్వ బోధచేత అజ్ఞానము తొలగిపోతుంది. మరికొంతమందికి వజ్రమును కప్పు ఆవరించిన విధమున అజ్ఞానం ఆవరించి ఉంటుంది. దానిని, సానబట్టిన కప్పు తొలగి ప్రకాశమును పొందుతుంది. అదేవిధముగా కొంతమంది సద్గురువులను చేరి, వారి ఆజ్ఞను శిరసావహించి, జ్ఞానమును పొందుతుంటారు. మరికొందరిని శిశువును మాయపట్టిన విధముగా అజ్ఞానం ఆవరించి ఉంటుంది. కత్తితో కోసిన మాయ శిశువును వదులుతుంది ఆ విధముగా అజ్ఞానము ఆవరించియుండు వారికి గురువులు తగు క్రమశిక్షణ ఇచ్చి యోగాసన, ప్రాణాయామసాధనల నిచ్చి తొలగించి వేస్తుంటారు.

ప్రబోధకులారా ! మీరు ప్రబోధించునపుడు ఈతత్వములను గురించి అజ్ఞానముతో యుండువారి బుద్ధిని చెదరగొట్టక, వారిని నిరుత్సాహపరచక, క్రమక్రమముగా సాంఖ్యము, తారకము, అమనస్కము, పరిపూర్ణము బోధించవలెను. పాపకార్యములుచేయు వానినికూడ నిషేధించరాదు. వాళ్ళకు అపాప సంకల్పములు రహితమగునట్లు, శాంతముతో ప్రబోధించవలెను. ఎవరైనను బుద్ధిలేనివారు, జ్ఞానము లేనివారు, మిమ్ములను పరిహాసము చేసినను, అవమానము చేసినను మీరు చలించరాదు. "తుల్యనిందాస్తుతిర్మౌని" అన్నట్లు మీకు ప్రియభక్తులైనవారు మిమ్మలను స్తోత్రము చేయునపుడు ఎట్లుండెదరో అజ్ఞానులు, బుద్ధిలేనివారు నిందించి అవమానించినను అటులనే యుండవలెను. మరియును దీక్షవహించి, తీవ్రకృషిచేసి అట్టివానిని తన ప్రియశిష్యునిగా చేసి కొని, వానితో ఆనందించవలెను. ఎట్టివానితోను శతృత్వముండరాదు. "అజాత శతృత్వం ఆత్మత్వం" అను సూత్రమును తెలిసికొనవలెను.

**ఆదిత్య సూత్రములు** - సూర్యుడు ఉదయించిన ఆ ప్రకాశమును తామర పుష్పము చూచి, వికసించి, ఆ ప్రకాశమునుచూస్తూ, ఆనందించుచుండును. సాయంత్రమునకు పశ్చిమ దిక్కునకు తిరిగి సూర్యుడు అస్తమించినపుడు చీకటిని చూడక ముకుళించుకొనును. తామర పుష్పము సూర్యుని తేజస్సునిచూచి ఆనందించు విధముగా మానవులు తమయందలి అంతర్జ్యోతిని చూస్తూ ఆనందించవలెను. గుడ్లగూబలాగ జీవించకూడదు.

గుడ్లగూబ సూర్యుడు ఉదయించిన ఆ తేజస్సును చూడక కొండ గుహలో జొరబడి, చీకటిలో నివసించును. సూర్యుడు అస్తమించిన తరువాత చీకటిలో సంచరించును. మానవులు అజ్ఞానాంధకారమున జీవించరాదు. అంతరాత్మ జ్ఞాన జ్యోతిలో జీవించవలెను. మన శరీరమున అయిదు అగ్నులున్నవి. అందు నాలుగు అగ్నులు జ్ఞానాగ్నికి వ్యతిరేకముగా నున్నవియే. ఈ రెండు పక్షములలో ఒక అగ్నికి బలముగలిగిన, రెండవ అగ్నిని అణచివేసి ఆ అగ్ని ప్రకోపించుచున్నది.

కామాగ్ని ప్రజ్వలించినపుడు, జ్ఞానాగ్నిని అణచివేసి, అంతులేని అసభ్య కోరికలను కోరుచున్నది. జ్ఞానాగ్ని ప్రజ్వలించి, కామాగ్నిని అతిక్రమించిన మనసునందేకాగ్రతగలిగి, సంకల్పరహితమై ఆత్మనుచేరి ఆత్మానందముపొందుతుంది. క్రోధాగ్ని ప్రజ్వలించిన జ్ఞానాగ్నిని అణచివేసి, రాగద్వేషాదులను ప్రజ్వలింపచేసి కొట్టుట, తిట్టుట, హత్యలు చేయుట మొదలగు పాపభూయిష్ట కర్మలు చేయుచు, యెప్పుడూ కోపముతో ఉండేట్లుచేస్తుంది. జ్ఞానాగ్ని విజృంభించి, క్రోధాగ్నిని చల్లార్చి, శాంతినిప్రసాదించి, పరమ శాంతినిపొందు మార్గమున ప్రవేశ పెట్టుతుంది. రూపాగ్ని వస్తు సౌందర్య తత్వమును చూస్తూ ఉంటుంది. అన్ని కోరికలకు ఇది పునాది, చంటి పిల్లలకు ఈ అగ్ని ఉండదు. అందువలన వారు యేదియును కోరరు. ఆహారముతో పెరుగుతుంటారు. రూపాగ్ని ఎప్పుడు ప్రకాశించునో. అప్పుడు చూచినదంతయు కోరుతుంటారు. బట్టలు, నగలు, అందము, అలంకారము మొదలగు నాన్నిపై కోర్కెలన్నియు ప్రజ్వలిస్తాయి. వివాహ సమయమున రూపాగ్నికి పట్టాభిషేకము కట్టుతారు. అందువలన యెన్నో సంబంధములు మారుతూ ఉంటాయి. మానవులు అగ్నితత్వముల నెరిగి, కామ, క్రోధ, జఠర, రూపాగ్నులను చల్లార్చి, వానివలన గలిగిన పాపములను జ్ఞానాగ్నిచేత దగ్ధముచేసి "జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం" అని బుద్ధిమంతుల ఆదేశము నాశ్రయించి, జ్ఞానులై తరించవలయును.

**ఆహార సూత్రములు** - ఆహారము నాలుగు విధములుగా నిశ్చయింపబడియున్నది. 1. మాంసాహారము, 2. శాఖాహారము, 3. అపక్వాహారము,

4. అమృతాహారము, మాంసాహారము అజ్ఞానులు, భూతదయ లేనివారు, బుద్ధిలేనివారు, అనాగరకులు తినెడి ఆహారము. తన ప్రాణ పోషణకు మరొక ప్రాణమును తీసి తినే ఈ ఆహారం పాపభూయిష్టమైన ఆహారం. శాఖాహారమనగా "వనం మానవ జీవనం" అని మానవ జీవితమునకు ఆధారమైన చెట్ల సంపద నుండి ఆహారముగా తీసికొనుట. అనగా చెట్ల పంట (పండ్లు, కాయలు ఆకులు గడ్డలు) ఆహారముగా తీసికొనుట. కొందరు ఈఆహారమునుకూడా జీవహింసగా వాదింతురు. కాని జీవహింస కాదు. ప్రాణులకు జీవుడు నియమితముగా అయిదు స్థానములందుండును. అక్కడ దెబ్బతగిలినపుడు మరణించును. చెట్లకు జీవుడు పంచప్రాణములందుగాక వృక్ష సర్వభాగములందును వ్యాపించి యుండును. అందువలన ఒక భాగము నరికిన చెట్టు చావదు. మరలా చిగురించును అందువలన జీవహింస కాదు. మానవుడే ఆశ్రమము వాడైనను, శాఖాహారులుగా నుండవలయును.

అపక్వాహారము అనగా వంటచేయని పచ్చిపదార్థములను (పండ్లు, గడ్డలు, కాయలు, పాలు మొదలగునవి) స్వీకరించి, శరీరమును పోషించుకొనుట. ఇది గృహస్థాశ్రమము వారికి సాధ్యము కాదు. బ్రహ్మచారులు, సన్యాసులు మొదలగు కొందరు అనుసరింతురు. అమృతాహారము కష్టతరమైనది. సర్వసామాన్యులకు సాధ్యము కానిది. మానవులు తినిన ఆహారము రక్తముగా మారుచున్నది. రక్తమునుండి శుక్లము ఏర్పడుచున్నది. ఈ శుక్లమునకు రెండు మార్గములున్నవి. అధోరేతస్సు. ఊర్ధ్వరేతస్సు అని రెండు మార్గములు. అధోరేతస్సు అనగా గృహస్థ ధర్మమున ప్రవేశించి స్త్రీ గర్భమున బిడ్డకు అయిదు నెలలవరకు ఆహారముగా ఏర్పడుచున్నది. అదే బ్రహ్మచర్యమున యోగశక్తిచేత తన శుక్లమును తన అన్నమయ కోశమున చేర్చగలిగిన వానికే కొంతకాలము ఆహారముగ ఏర్పడును. యోగమున సమాన స్థితి కలిగిన స్మృతియే ఈ కర్తృత్వమును నిర్వహించుచుండును. అందువలన ఎన్ని సంవత్సరములైనను శరీరము వెలుపలి ఆహారములో సంబంధము లేక సమాధియందుండ వచ్చును. ఈ అమృతాహారము సామాన్యులకు సాధ్యము కాదు.

**రాహుల సూత్రములు** – రాహులునిలా అతఃకరణమును పరిశుద్ధముగా ఉంచుకొనవలెను. పాత్రను బోర్లించక యుంచిన ఎప్పుడు, ఏమి పడునో అను సంశయము ప్రజ్వలిస్తూ ఉంటుంది. పాత్రను బోర్లించిన సంశయ రహితముగా నుంతవచ్చు. అందువలన నీ అతఃకరణమును బోర్లించి ఉంచాలి. అప్పుడే నీవు ఏ వేదనయు లేక ప్రశాంతముగా ఉండగలవు. మానవుని కర్మలు మూడు విధములుగా ఉన్నవి. శరీరము – మనము తినెడి అహారమును పరిశీలించి హింసాహారము కాకుండేలాగున ఎట్లు పరిశీలించి తినవలయునో, అదేవిధముగా శరీరముతో పనిచేయునపుడు, ఈ పని తన జీవునకూ, ఎదుటి సంఘమునకూ ఏ విధమైన ఉపకారము చేయుచున్నది ? అని పరిశీలించి, యోచించి, చేయచుండవలెను. చక్కగా యోచించి, ధర్మ సమ్మతమైన కర్మలు చేయవలెను. యోచింపక ఏ పనిచేయరాదు. నోటితో మాట్లాడునపుడు చక్కగా యోచించి, పలుకు సత్యం ఇతరులకు మేలుచేయునది గను వినుటకు సొంపుగా యుండునట్టిదిగను, గౌరవప్రదమైనదిగను, ధర్మబద్ధమైనదిగను నుండవలెను. అట్లు యోచించి మాట్లాతవలెను. అటులనే మనసులో సత్సంకల్పములుండవలెను. శరీరముతో చేయు పనియొక్క గాని నోటిలో చెప్పుమాట యొక్కగాని, మనసులోని సంకల్పము యొక్కగాని భవిష్యత్తు ఫలితములను గురించి యోచించి చేయవలెను. స్త్రీలు ముఖమున బొట్టుపెట్టు కొనునపుడు అద్దమును చూచి చక్కగా పెట్టుకొనేటట్లు, మానవులు శరీరము వాక్కు, మనసులో పనిచేయునపుడు ధర్మమునూ, ఆత్మనూ, చూచి చూచి చక్కగా పలుక వలెను.

ఒకనాడు నేను రాహుల కుమారుని చూచి ఇట్లు బోధించాను "రాహులా! నీవు పంచ భూతముల తత్త్వములను గ్రహించి, ఆవిధంగా ఆచరిస్తూ ఉండు. భూమి ఎవరెంత అవమానించినను, అపకారము చేసినను, క్షమించి అదరించును. నీవు భూమియంత ఓర్పు కలిగి యుండుము. "క్షమయా ధరిత్రీ". పవిత్ర భావమున జలమువలె అవేద భావనతో ఉండుము. జలము ఏవిధముగా అపవిత్రముల నన్నింటిని పవిత్రము చేయుచున్నదో, నీవునూ అట్లేపవిత్ర భావన గలిగి ఉండుము. అగ్ని సర్వమును

దగ్ధము చేయు విధముగా నీవును నీలోని దుర్గుణములను దగ్ధముచేయుము. వాయువ్య రూపమైన శ్వాసను భద్రపరచుకొనుము. స్మృతిలో శ్వాసను తీయు చుండుము. నవ ద్వారములలో ఏ ద్వారమునుంచి జీవుడు పోయినను పున ర్జన్మ కలదు. శ్వాసను ఆశ్రయించి, జీవుడు ప్రయాణము చేస్తాడు. ప్రాణా యామమును ఆశ్రయించి శ్వాసను, సుషుమ్నా నాడిలో సహస్రారమునందలి బ్రహ్మరంధ్రముద్వారా శ్వాసను వదలిన జీవుడు, శ్వాసతో ప్రయాణముచేసి మోక్షమును పొందుతాడు. జీవుని ఉద్ధరించుటకు శ్వాస ప్రధానమైనది.

సర్వభూతములపట్ల, మైత్రీ భావంచేత, ద్వేషము నశిస్తుంది. ఆ తర్వాత కరుణాభావమును భావించు. దానిచే హింస తొలగి పోతుంది. ఆ తర్వాత ముదితా భావనను భావింపుము, దానిచే నిస్పృహ తొలగిపోతుంది. ఉపేక్షా భావనను భావించుము. దానిచేత ప్రతి హింసా వృత్తి తొలగిపోతుంది. విషయవాసనాదోషం అంటకుండా ఉండడానికై, విషయ అనిత్యతను భావిస్తూ ఉండు. అది మహాఫల ప్రదము. భిక్షువు అర ణ్యమున చెట్టుక్రిందనో, ప్రశాంత గృహమందుననో, ఆసన బద్ధుడై స్మృతిని ఎదుట బెట్టుకుని కూర్చొని స్మరించుచు, శ్వాసను తీసుకొంటుంటాడు. స్మరిం చుచు శ్వాసను వదులుతుంటాడు. శ్వాసను విడచుచున్నానని ఎరుగు తున్నాడు. పనులన్నిటిని అనుభవిస్తున్నాడు. ఊపిరిని తీసుకొనుట నేర్చు కొనుచున్నాడు. అటులనే శ్వాసను తీసుకొనుటకూడ నేర్చుకొనుచున్నాడు, చివరి శ్వాసప్రశ్వాసలనుకూడ ఎరిగి నివృత్తి మార్గమున చివరి శ్వాస నడిపి నిర్వాణము పొందుతున్నాడు.

**ప్రజాపతి గౌతమీదేవి సూత్రములు** - గౌతమీదేవి బ్రహ్మచర్య మునూ, భిక్షుణిగా నుండగోరి జ్ఞానభిక్షను కోరగా నేనిట్లు బోధించాను. "అమ్మా! మానవులు విరాగమును కోరి, సరాగమును పొందుతారు. ఇంద్రియ వియోగమును గోరి సంయోగమును పొందుతారు. సంయమును గోరి, సంగ్రహమును పొందుతారు. సంతోషమును గోరి, సంతాపమును

పొందుతారు. శుభకరమును గోరి, అమంగళాన్ని పొందుతారు. స్థితప్రజ్ఞలేని వారు భిక్షుణీ ధర్మమును నిర్వహించలేరు. అమ్మా ! సరాగమును వర్జించి, విరాగమునూ, సంయోగమును బహిష్కరించి వియోగమునూ, సంతాపము తొలగించి సంతోషమునూ, అమంగళమును తొలగించి, సుమంగళ ప్రద మునూ కోరువారు భోగలాలసత్వమునకు గాక వైరాగ్యమునకు, దృఢమైన నిశ్చయము గల స్థితప్రజ్ఞ గలవారెవరైనను జ్ఞానభిక్షార్థులు. సన్యసించి యోగ భ్రష్ఠులు కాకూడదు. అది భిక్షు సంఘమునకే అపకీర్తి కరమగును. భిక్షుణీ స్త్రీలు ముఖ్యముగా ఎనిమిది సూత్రములను అనుసరించవలసి ఉంటుంది. 1. నిర్దిష్టమైన బ్రహ్మచర్యమును అనుసరించాలి. 2. గురువుగాని, భిక్షువు గాని, భక్తుడుగాని ఎవరైనను "పరే పురుషుడైనచో యేకాంతముగా మాట లాడరాదు. 3. ఎక్కడ ప్రబోధములు జరుగుచున్నను తన సంఘముతో పోయి వినుచుండవలయును. 4. ఏకాంతముగా పోకూడదు. 5. స్త్రీలు చెప్పినను, వ్యర్థము చేయక, శ్రవణ మనననిధి ధ్యాసలు చేయవలయును. 6. "బోధయంతః పరస్పరః" ఒకరికి తెలిసినది మరొకరికి బోధించి, కాల మును సద్వినియోగము చేయవలెను. ఎట్టి సమయమునందైనను ఒకరిని ఒకరు విమర్శించరాదు. పొరపాట్లను బైటబెట్టరాదు. తమకంటె గొప్పవారి ద్వారా ఆ పొరబాట్లు సవరించుకొనవలెను. తప్పులెన్నరాదు. గురుఆజ్ఞ లేనిదే ఉపదేశ మివ్వరాదు. భిక్షుని నియమిత కాలసాధనా, ఆసనా, వ్యాయామ ధర్మాలను ఏ పరిస్థితి యందును నిలుపరాదు. శరీరమునకు ఆహారం ఎంత అవసరమో జీవునకు జ్ఞానయోగము అంత అవసరము, శరీర మును పోషించునది ఆహారము. జీవుని ఉద్ధరించునది జ్ఞానయోగము.

**జన్మసూత్రము** - జన్మను దేవుడిచ్చుచున్నాడని కొందరు చెప్పు చున్నారు కానీ దేవుడిచ్చుటలేదు "నకర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః" ఈ ప్రకృతి స్వరూపమైన సృష్టికీ, దేవునకూ ఏ విధమైన సంబంధము లేదు. మనసుతో కూడిన అతీంద్రియములు దైవతేజాంశ సంభవుడైన జీవుని ఆకర్షించుటవలన, ప్రకృతి జీవుడు కలసికొని ఈ జగత్తునందున సమస్త ప్రాణి సముదాయము (మానవులు, జంతువులు, పక్షులు, చెట్లు మొదలైన

వన్నియును) నీరు, నిప్పు, గాలి, ఆకాశము, జీవుడు సృష్టించబడుచున్నవి అంతేగాని దేవుడు సృష్టించుటలేదు. సృష్టికి ప్రకృతి కారణము. సర్వమునకు దేవుడు ఆధారము. స్త్రీ పురుషుని కలయికవలన స్త్రీ గర్భమున, శుక్ల శోణిత ములు కలయుచున్నవి వాని యందలి ప్రకృతి జీవుని ఆకర్షించుచున్నది. జీవుడు ఆకర్షింపబడి జన్మ ఏర్పడుచున్నది.

**జటిల సూత్రములు** - చిన్నవని అలక్ష్యము చేయనివి ఆరుగలవు. శత్రువు, వ్రణము, ఋణము, అగ్ని, అసత్యం, దుర్గుణం ఇవి కొంచెమైనను శేష ముంచరాదు. శత్రువు ఒక్కడు తప్పినను మరలా సైన్యమును గూర్చుకుని యుద్ధముచేసి జయిస్తాడు. శరీరమున కురుపులేచిన సంపూర్ణముగ తొలగించు కొనవలయును. లేకున్న మరలా ప్రజ్వలించి బాధ కలిగించును. అప్పు అంతయు తీర్చి కొంచెము మిగిలినను వడ్డికి వడ్డికి పెరిగి, పెరిగి పెద్ద మొత్తము అవుతుంది. అగ్ని కొంచెము మిగిలియున్నను మరలా ప్రజ్వలించి సర్వమును దగ్ధము చేస్తుంది. దుర్గణము కొంచమున్నను ప్రకృతితో, చేరి పెరిగి సంఘమునకు ద్రోహముచేస్తుంది. అసత్యము కొంచెమే అయినను మహా పాపాన్ని కల్గిస్తుంది. వీనిని శేషము లేకుండా తొలగించవలెను.

**స్మృతి సూత్రములు** - స్మృతి యనునది ప్రశస్తమైనది పవిత్రమైనది శ్రేష్టమైనది ఈ స్మృతి యనునది నాలుగు విధములుగా ఉన్నది. 1. ఆత్మ స్మృతి, 2. దేహస్మృతి, 3. స్పర్శ స్మృతి. 4.కర్మస్మృతి. జీవుడు అనుభవించు అనుభూతి రెండు విధములుగా ఉన్నది. "శ్రోత్రంచక్షు స్పర్శనంచ రసనం, ఘ్రాణమేవచ. అధిష్టాన మనశ్చాయం. విషయానుపశేవత్" జీవుడు చెవి,కన్ను నాలుక, ముక్కు చర్మమువలన గలుగు విషయవాసనలను, మనసు అందిం చుటవలన అనుభవిస్తున్నాడు. నిద్రయందు సర్వము స్తంభించి యున్నది. అప్పుడు దేనితో అనుభవించుచున్నాడు ? స్మృతితో అనుభవిస్తున్నాడు. మానవుడు కూర్చున్నను, లేచినను, తినను, త్రాగినను, విహరించినను, దైవ శబ్దమైన ఓమ్‌సత్. అని స్మృతికి తెచ్చుకొనవలెను. ప్రతి పని చేయుటకు మునుపు, "ఓమ్ సత్" అను దైవ శబ్దమును స్మృతికి తెచ్చుకొనవలెను.

ఒక ధ్యానయోగి అరణ్యమున చెట్టు క్రింద కూర్చుని సమ్యక్ సమాధి స్థితిని పొందెను. లేచుటలేదు. పరుండుట లేదు. తినుట లేదు. నిద్రించుట లేదు. శరీరమునకు వెలుపల నుండు శబ్ద, స్పర్శ రూపరసగంధాది విషయ సంకల్పములు బయటికి త్రోసివేసి మనసును ఆత్మయందు స్థిరపరచియున్నాడు. ఏమి అనుభవిస్తున్నాడు ? దేనితో అనుభవిస్తున్నాడు ? ఎట్లు అనుభవిస్తున్నాడు?

జీవుడు స్మృతితో సచ్చిదానందమునూ, పరమ శాంతినీ అనుభవిస్తున్నాడు. శరీరమునకు అమృతాహారము నిచ్చి స్మృతియే పోషిస్తున్నది. సమాధి స్థితియందు జ్ఞాననేత్రము అంతర్జ్యోతి స్మృతి సచ్చిదానందముండును ఇంద్రియజ్ఞానముండదు. స్మృతిజ్ఞానము మాత్రముంటుంది. జీవుడు ఒక శరీరమును విడిచి మరొక శరీరమును పొందేటప్పుడు జీవుని వెంట అయిదు ఇంద్రియములు, మనస్సు అంతవరకు జీవుడు అనుభవించిన ఇంద్రియ విషయ వాసనలను తీసికొని ప్రయాణము చేస్తుంది. జన్మరహితుడై మోక్షార్హుడైన జీవుడు శరీరమును విడిచి పరంధామమునకు ప్రయాణము చేసేటప్పుడు ఇంద్రియలుండవు. జ్ఞాన నేత్రముతో అంతర్జ్యోతిని చూచుచూ స్మృతిలో సచ్చిదానందమును జీవుడు శాశ్వతముగా అనుభవించుటే మోక్షము. మోక్షానుభూతిని పొందునది స్మృతి కనుక స్మృతి పవిత్రమైనది, శ్రేష్ఠమైనది, ఉత్తమమైనది. ప్రతి ఒక్కరు ఆ స్మృతిని పొందవలెను.

సాధకుడు శ్వాసతీయునపుడు, శ్వాసవిడచునపుడు దీర్ఘముగా తీయునపుడు, దీర్ఘము విడుచునడు స్మృతితో గమనించుచుండవలెను. ఎంతసేపు శ్వాసనతీసిన అంతసేపు శ్వాసను విడువవలయును. శ్వాస ముక్కు క్రింది భాగమునకు, గర్భమునకు ప్రవేశించి, తినిన అన్నమును జీర్ణముచేసి, శరీరమును పోషిస్తుంది. అదే శ్వాసను సుషుమ్నా నాడితో ముక్కునకు పై భాగమునకు పంపిన, సహస్రారము, బ్రహ్మరంధ్రము చేరుతుంది. శ్వాస బుద్ధిని దాటినపుడు ఆనందమయ కోశమును చేరుతుంది. అదే శాంతిస్థానము. సుఖసంతోషములు, ఇంద్రియములు మనసునందున్నవి. శరీరమునకు వెలపల ఏ వస్తువునందును శాంతి లేదు. శరీర అంతర్భాగమున, బుద్ధికిపైన, శర

స్సులో సహస్రార భాగమున ఉన్నది. దానిని శ్వాస స్మృతితోనే పొందగలరు. రాజ్యమున్నను, భోగభాగ్యములున్నను, భార్యాసంతతియున్నను, ఆస్తి అంతస్థులున్నను శాంతి ఉండదు. శాంతిని సుషుమ్నా శ్వాసలోనూ, స్మతిలోను మాత్రమే శాంతిని పొందగలరు. అందువలన శ్వాస స్మృతిని భద్రపరచుకో వలెను. మానవుడు ఏది చేసినను స్మృతిని యెదుటపెట్టుకొని చేయవలెను.

స్మృతి భ్రమింపకున్న జీవున కేవిధమైన బంధములు కలగవు. జీవునకు బంధములు విషయవాసన దగ్గరనుంచి ప్రారంభిస్తవి. విషయవాసనలు ఇంద్రియముల సంఘమును చేరును. ఇంద్రియ సంఘము మనసులో చేరి కోరికగా మారుతుంది. కోరిక నెరనేరకున్న కోపముగా మారుతుంది. కోప ముగా మారినప్పుడు స్మృతి, భ్రమ పడుతుంది. స్మృతి భ్రమ పడుటవలన బుద్ధి నశిస్తుంది. బుద్ధి నశించిన జీవుడు అనేక దుఃఖములకు, కష్టములకు గురి అవుతాడు. జ్ఞానియైనవాడు ఎపుడువిషయవాసనలో ప్రవేశించునో అప్పుడేస్మతిని ఆశ్రయిస్తుంది. స్మృతి ధర్మమును నిత్యమును, సత్యమును ఆశ్రయించును. అందువలన విషయవాసన కోరికగా మారక నశించి పరమ శాంతి లభిస్తుంది. కనుక స్మృతిని ఆశ్రయించ జీవించవలెను.

విధాన సూత్రములు - జీవుడు దైవతేజాంశ సంభవుడు. అక్షరుడు. స్వస్థానము పరంధామ అటువంటివానికి భూలోకమున జన్మ ఎట్లు ప్రాప్తిం చింది? తన స్థానము అయిన పరంధామను ఎందుకు చేరలేక యున్నాడు? దైవ తేజాంశ సంభవుడైన జీవుడు ప్రకృతి ఆకర్షణ శక్తికి పరవశుడై, మన సుతోకూడిన ఆరింద్రియముల చేత ఆకర్షింపబడి ప్రకృతియందు ప్రవేశించు చున్నాడు. "కార్య కారణ కర్తృత్వే హేతు ప్రకృతి రుచ్యతే" కార్యాకారణ కర్తృత్వము ప్రకృతికి యుండుండటంవలన రూపమును ఏర్పరచుచున్నది. రూపము ఏర్పడుట వలన ఇరువది నాలుగు తత్వములు ఉత్పన్నమగున్నవి. ఇరువది నాలుగు తత్వములకు, ఇరువది నాలుగు ఇంద్రియములు ఉద్భవించు చున్నవి. వానివలన వివిధ రూపములు, శబ్దములు, రుచులు స్పర్శములు.

గంధములు అనుభవమునకు వచ్చుచున్నవి. వానివలన క్రామక్రోధ, లోభ, మోహ మదమత్సరములు, సప్త వ్యసనములు, సత్వ రాజస, తమోగుణ ములు, తృష్ణా, అసూయ, భ్రాంతి, మమకార, అహంకారములు, హింసా, అసత్యము అస్తేయం, అజ్ఞానం ఇరువది నాలుగు శత్రుల లక్షణములు జీవుని కర్మబద్ధుని చేయుచున్నవి. వానిని తొలగించుకొనువారు జన్మరహితులు. జ్ఞానులు.

జన్మరాహిత్యము చేసుకొను జ్ఞానులు, బుద్ధిమంతులు మొదట ఇరువది నాలుగు దుష్ట లక్షణములను బహిష్కరించవలెను. మనస్సును శరీరమునకు వెలుపల ఇంద్రియములతో చేరనీయక ఆత్మానుసంధానము చేయవలెను. ఎనిమిది ధర్మమార్గములను అనుసరించవలెను. జ్ఞానము, ఇంద్రియ జ్ఞానము ప్రకృతి వస్తుతత్వ జ్ఞానముగాక. ఆత్మతత్వ స్వరూప జ్ఞానమును పొంద వలెను. "త్యాగోహి పురుష వ్యాఘ్రః" త్యాగముగలవాడు పురుష సింహము. కనుపించు సర్వము నశించునది. యద్దృశ్యంతన్నశ్యం అను సత్యము నెరిగి దేనినైనను త్యాగము చేయవలెను. ధైర్యము "అభయం సత్వసం శుద్ధి జ్ఞానయోగ వ్యవస్థితః" అభయము అనునది సత్య సంబద్ధ జ్ఞానము, "నేను మోక్షార్హుడను. ఈజన్మముననే ఈ శరీరముతోనే మోక్షార్హ తను పొందుతాను. అని ధైర్యముతో నుండవలెను. "నేను సామాన్యుడను. నాకు మోక్షార్హత లేదు. అది యెంతటి మహానుభావులకో ?" అని అధైర్య పడకూడదు. ధైర్యముతో యోగసాధన చేయవలెను.

వైరాగ్యముతో మనసును, కోరికమీదికి పోనీయక, నిగ్రహించి, ఇంద్రియ విషయ వాసనలను నిరోధించి, శరీరము సుఖభోగములను ఆపేక్షిం చక, యింద్రియములను జయించినవారై, ఇంద్రియములతో సుఖములుగాక, స్మృతిలో ఆనందమును అనుభవించుచుండవలెను. తృప్తి "యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతోవిమత్సరః" తనకు ప్రాప్తించిన దానితో తృప్తి పడ వలెను. అట్టుల తృప్తి పొందినవాడు రాజాధిరాజు, ఎంత భాగ్యమున్నను

ఎంత సామ్రాజ్యమున్నను ఆశచేత ఇంకను కావలెననువాడు రాజాధిరాజైనను పరమ దరిద్రుడే. అందువలన ప్రాప్తించిన దానితో తృప్తిపడవలెను. ఏ పని చేసినను ప్రజ్ఞతో చేయవలెను. సమర్థత యుండవలెను. చురుకుగా కార్యమును సాధించవలెను. తోటి వారికి నోటితో చెప్పుట, కర్రతో కొట్టుట కాకుండా కనుచూపులలో భావమును ప్రకటించవలెను. తలా, చెయ్యి, వ్రేలు మొదలగు అవయవముల సైగతో యుద్ధమునందు గుఱ్ఱమువలె చురుకుగా కార్యనిర్వహణ చేయు సామర్థ్యము పొందవలెను. సోమరితనము పనికిరాదు. నిరుత్సాహముండరాదు.

శ్రద్ధ - శ్రద్ధ వలెననే కార్యసిద్ధి కలుగుతుంది. శ్రద్ధవలననే జ్ఞానం లభిస్తుంది. "శ్రద్ధావాన్‌లభతే జ్ఞానం జ్ఞానం లబ్ధ్వాపరాంశాంతి". శ్రద్ధవలన, జ్ఞానమువలన పరమశాంతి లభిస్తుంది. జీవుడు శ్రద్ధా స్వరూపుడు. "శ్రద్ధా మయోయం పురుషః". మరణావస్థయందు మనసు రూపమున ఏ శ్రద్ధ కలిగి యుంటాడో జీవుడు ఆ రూపమును పొందుతాడు. అందువలన శ్రద్ధకు ఒక జీవుని జన్మస్వరూపమును మార్చెడి ప్రభావ మున్నది. కనుక శ్రద్ధను జాగ్రత్తగా వినియోగించుకొనవలెను. శ్రద్ధలేనివాడు ఏ కార్యమును సాధించ లేడు. మృత్యు స్వరూపమైన సంసారమున మునిగిపోతాడు. మానవునకు కీర్తి ప్రశస్తమైనది.

**సన్న్యాస సూత్రములు** - సన్న్యాసము అనునది నాలుగు విధములుగా ఉన్నది. 1) సంసార సన్న్యాసము 2) సంకల్ప సన్న్యాసము 3) కర్మ సన్న్యాసము 4) వాక్ సన్న్యాసము. సామాన్యముగా సన్న్యాసం అంటే సంసార సన్న్యాసమని అంతా అనుకొంటారు. కాని నిజమైన సన్న్యాసం సంకల్ప సన్న్యాసం. "సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే". సర్వ సంకల్పములను సన్న్యసించినవాడే, యోగారూఢత్వమును పొందుతాడు. సంసారమును సన్న్యసించి సంకల్పములను సన్న్యసించని వాళ్ళు మిథ్యాచారులు,

మోసగాళ్ళు. ప్రతియోగ సాధకుడు మొదట సంకల్ప సన్యాసము చేయవలెను. లేకున్న దేవదత్తునివలె యోగభ్రష్టుడవుతాడు. యోగసాధకునకు ఈ నాలుగు సన్యాసములుండవలెను. గృహస్థుడైనవాడు ధ్యాన సమయమున సంసారమును వదలి ఏకాంతముగా కూర్చుండవలెను. నియమిత ఆసనమున కూర్చుండి కర్మేంద్రియ జ్ఞానేంద్రియ కర్మలను సన్యసించి, కదలక, నిశ్చలముగా ఏదో ఒక ముద్ర భావనతో ఉండవలెను. మనసున సంకల్పములు సన్యసించి, స్మృతిలో సచ్చిదానందమును అనుభవించవలయును. నోటితో మాట్లాడక మౌన ముద్రలో నుండవలయును. ఇది గృహస్థు అనుసరించవలసిన సన్యాసము. శరీరమును పోషించుకొనుటకు, సంసారమును పోషించుటకు తన స్వధర్మము (వృత్తికర్మ) అవశ్యము చేయవలెను. కర్మ నిర్వహణ వివరములకు తప్పక మాట్లాడవలెను.తగు విధి సంకల్పములుండవలెను. పోషణ రక్షణకు సంసారమునందుండవలెను. కాని "నేను, నాది" అను అహంకారమును, మమకారమును వదలి, "నేను కర్తనుగాదు. ఈ ఆస్తి నాది కాదు. నేను ధర్మకర్తను నా బాధ్యతలను నెరవేర్చుకొనుచున్నాను. నా బాధ్యతైన రక్షణపోషణ చేయుచున్నాను" అని ధర్మకర్తగా జీవించవలెను. అహంకార, మమకార, భ్రాంతి, భ్రమ ఆశలయందు పడి కర్తగా జీవించకూడదు. ప్రవృత్తి మార్గమున ఉండరాదు. నివృత్తి మార్గమున ఉండవలయును. ధర్మకర్తగా జీవించవలెను.

**దుఃఖ సూత్రములు** - మానవులకు దుఃఖము ఎటుల ప్రాప్తించుచున్నది? ఎటుల తొలగించుకోవలెను? జన్మించుటే దుఃఖమునకు ఆశ్రయము. రాజాధిరాజైనను, కోటీశ్వరుడైనను, కూలివాడైనను శరీరవ్యాధి వలన కలుగు దుఃఖము అనుభవించక తప్పదు. ఇది మొదటి దుఃఖము. రెండవది భ్రాంతి. మమకారము దుఃఖము, తనకు అత్యంత ప్రియమైన భార్యకుగాని, సంతతికిగాని, తల్లిదండ్రులకుగాని, బంధువులకుగాని వ్యాధి బాధకలిగిన వానికి దుఃఖము ప్రాప్తించును. వస్తువులు దుఃఖము నిచ్చును. ఒకనికి బంగారు ఆభరణ మున్నది. అది కనుపించలేదు. అది ఇంటిలోనివారికందరకు దుఃఖమును కలిగిస్తుంది. చావు సత్యమని సర్వమానవులకు తెలుసు. కాని చావు

అనిన అమితముగా దుఃఖింతురు. తమ చావునకే గాక తమకు అభిమానము, మమకారములుగల ఇతరుల మరణమును గురించి కూడా దుఃఖిస్తారు. తమ చావునకు తామే దుఃఖిస్తారు. భర్త మరణించినను, సంతతి మరణించినను సంవత్సరముల పర్యంతము దుఃఖిస్తునే ఉంటారు. తాను కోరిన కోరిక ఫలించకున్నా దుఃఖిస్తారు. తాను చేయు వృత్తియందు తాను అనుకున్నంత లాభము రాకున్నను దుఃఖిస్తారు. నష్టము వచ్చిన విపరీతముగా దుఃఖిస్తారు. దుఃఖము అనునది అజ్ఞానత్వము. అనిత్యమైన ప్రకృతిని ఆశ్రయించి సత్యము నిత్యము అయిన ఆత్మతత్వము నెరుంగలేక "నేను జీవుణ్ణి ఈ శరీరము నేను కాదు. ఈ శరీరము నాదికాదు. నాది మోక్ష రాజ్యము. ప్రకృతి వస్తువు యేది నాది కాదు. మట్టినాదికాదు. వజ్రము నాదికాదు. శరీరముమరణించుస్వభావము కలిగినది. మరలాజన్మించు స్వభావముగలిగినది. అది శరీర ధర్మ"మని తెలిసిన వానికి దుఃఖముండదు. "నేను శరీరము. నాది శరీరము" అను అజ్ఞానము ఉండు వానికి పైన చెప్పిన దుఃఖములన్నియు ప్రాప్తిస్తవి. మానవులకు బలీయమైన ప్రభావము కలిగినది ప్రాప్తము. తనకు ఎంత ప్రాప్తమున్న అంతయే లభిస్తుంది. అంతకుపైన ఏమిచేసినను లభించదు. ప్రాప్తము నెరిగినవారు ఎవరు మరణించినను, ఎంత నష్టము వచ్చినను విచారించరు. జ్ఞానియైనవారు దుఃఖ కారణములు తెలుసుకొని దానిని తొలగించుకొనవలయును. ప్రకృతి ధర్మమును (ప్రాప్తము) తెలిసికొని ఆచరించవలెను.

**ధ్యాన సూత్రములు** - ధ్యాన సూత్రములు నాలుగు విధములు. మొదటి ధ్యానము ముక్కు రంధ్రములతో శ్వాస తీయవలెను. ఎంతసేపు తీసిన అంతసేపు వదలవలెను. శ్వాసతీయుట, వదలుట సమానముగా ఉండవలెను. శ్వాస, ముక్కు పై భాగమున సంచరించవలయును. శ్వాసతీయుట, విడుచుట సమముగా నుండుటకు ఒక మంత్రమును ప్రమాణముగా అనుసరించవలెను. రెండవ ధ్యానమున జ్ఞాననేత్రమున అంతర్జ్యోతిని దర్శించవలెను. మనసునందు ఏవిధమైన సంకల్పము ఉండకూడదు. మనసు ఆత్మయందు అనుసంధానమై యుండవలెను. మూడవ ధ్యానము శ్వాసను,

ముక్కు రంధ్రములతోగాక సుషుమ్నా నాడిలో అంతర్ముఖమును చేసి తీయ వలెను. అది సహస్రారమును చేరుతుంది. అదే మోక్ష మార్గము. నాలు గవ ధ్యానస్మృతిలో ఆత్మానంద మనుభవించుట. ఆ సమాధి స్థితిలో ఎన్ని సంవత్సరములైనను, ఈ శరీరముతోనే మోక్షానుభూతిని అనుభవిస్తూ ఉండవచ్చును.

**బ్రాహ్మణ సూత్రములు** - బ్రాహ్మణత్వము అనునది ఒకకులమునకు చెందినదికాదు. "బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః". బ్రహ్మజ్ఞానముగలవాడు ఎవడో వాడు బ్రాహ్మణుడు. ఆత్మతత్వ స్వరూప జ్ఞానము కలిగియున్నవాడు, ఆత్మానాత్మ వివేక జ్ఞానము గలిగి యున్నవాడు, సత్ప్రవర్తన గలిగి, పంచ శీలములను, అహింస, సత్యం, ధర్మము నెరింగి, పరులకు బోధిస్తూ ఉండే వాడు, అజ్ఞానులకు గలిగెడి సంశయములు శాస్త్ర ప్రమాణముగా నివారణ చేయుచుండేవాడు, జ్ఞానేంద్రియములైన చెవి, కన్ను, నాలుక, చర్మము, ముక్కులు వీనివలన గలిగెడి శబ్దస్పర్శ రూప రసగంధ వికారములనూ, కామ క్రోధ లోభ మోహ మదమత్సర్యములను బయటకు త్రోసివేసి, పరిశుద్ధమైన అతఃకరణం కలిగియున్నవాడు, త్రికరణశుద్ధి గలిగియున్నవాడు, సదాచారము, త్రికాల ధ్యానము గలవాడు, తల్లి, తండ్రి, గురువు, జ్ఞానులను సత్కరించి పోషిస్తుండేవాడు, ఆశ లేనివాడు, నిస్సంగుడు బ్రాహ్మణుడు.

**గృహపతి సూత్రములు** - ప్రబుద్ధులారా! నాలుగు ఆశ్రమాలవాసులునూ మోక్షార్హులే. అందు గృహస్థాశ్రమవాసులు ప్రధానులు. మిగిలిన మూడు ఆశ్రమ ములవారికీ ఆధారభూతులు, పోషణకర్తలు వీరే! కనుక గృహస్థాశ్రమ ధర్మము లను పాటించి, ఏ వృత్తిచేత జీవించువారైనను ప్రభువులు, శ్రీమంతులు, కూలి వారైనను తమధర్మముల ననుసరించి మోక్షార్హతను పొందవచ్చును. గృహస్థులకు మొదటిది స్వధర్మము. తాను ఏ వృత్తిచేత జీవించవలెె? అని నిర్ణయించుకొనునపుడు ప్రవృత్తి మార్గమున తనవృత్తిని, జీవనోపాధిని నిశ్చ యించుకొనవలెను, ఏ పరిస్థితులయందైనను తన స్వధర్మమునకు భంగము కలుగనీయకూడదు. "ధర్మ, అర్థ, కామ, మోక్షః" అని ధర్మ సమ్మతముగా

ధనమును సంపాదించవలెను. ధర్మ సమ్మతముగా కోరికలను తీర్చుకొన వచ్చును. సుఖసంతోషములను పొందవచ్చును. అంతేకాదు తాను మానవుడై జన్మించినందుకు పురుషార్థమైన మోక్షమును పొందవలెను. కాలమును విభజించవలెను. సంపాదనను విభజించి సద్వినియోగము చేయవలెను. స్వధర్మమున శరీరపోషణకు కొన్నిగడియలు, జీవుని ఉద్ధరించుటకు, యోగసాధనకు కొన్ని గడియలు వినియోగించవలెను. సంపాదనయందు కొంతభాగము దాన ధర్మములకువినియోగించవలెను. సత్ప్రవర్తనకలిగి పతివ్రతలుగను, ఏకపత్నీ వ్రతులుగను, పంచశీలవంతులుగను ఉండవలయును.

గురుదేవుల నాశ్రయించి జ్ఞానసిద్ధిని పొందవలెను. మానవులు జ్ఞానమును మరచి, అజ్ఞానమున ప్రవేశించి, శరీరమునే సర్వస్వముగా భావించి, కోరికలు తీర్చుకొనుటయే కర్తవ్యమని భ్రమపడి, అందుకు కావలసిన ధనమును అధర్మముగా దొంగిలించి, హత్యలు చేసి, మోసము చేసి, పాప భూయిష్ఠమైన కర్మలు చేస్తున్నారు. నీచమైన జన్మములను పొందుచున్నారు. బుద్ధిమంతులైనవారు అజ్ఞానమున ప్రవేశింపక, భ్రమలయందు తగులుకొనక జ్ఞానము నాశ్రయించి, ధర్మముననుసరించి "ఇకజన్మించకూడదు. ఇదియే కడసారి జన్మ"యను ప్రతిజ్ఞను బూని దీక్ష వహించి గురువు బోధించిన ధర్మములను నియమబద్ధముగా యోగసాధన చేయుచు మోక్షార్హతను పొందవలెను. మోక్షార్హతకు సంసారమును సన్యసించ నవసరములేదు. సంకల్పములు నశించిన చాలును. కోరికలను క్రమ శిక్షణయందుంచిన చాలును. ఇంద్రియములను క్రమ శిక్షణయందుంచవలయును. శరీరమును తగు వ్యాయామము చేసి క్రమశిక్షణయందుంచవలెను. శ్వాసను క్రమ శిక్షణయందుంచవలెను. శ్వాసను యథేచ్ఛగా విడువరాదు. తెలిసినడుపుచుండువలెను. సర్వమునకు ఆధారముగా స్మృతిని యుంచవలెను. ఇట్టి గృహపతి తప్పక మోక్షార్హుడుకాగలడు.

**యుక్త (తగిన) సూత్రములు** - మానవులు ప్రతి విషయమునందును ఈ యుక్త సూత్రములను మరువరాదు. తగిన ఆహారమును తీసుకొనవలెను. తన వయస్సుతనకు తగిన ఆహారమును తీసుకొనవలెను. ఎక్కువ ఆహారము

తీసుకొనరాదు. ఆహారము లేక యుండరాదు. అదే విధముగా తగిన నిద్ర పోవలెను. విపరీతముగా రాత్రులు, పగలు నిద్రపోరాదు. నిద్రలేకుండా యుండరాదు. ఏ విషయమునందును అతి పనికిరాదు. అదే విధముగా భార్యయందు ప్రేమ తగినంతగానే యుండవలెను. సంతానమునందుకూడ మోహము తగినంతగానే యుండవలెను. ధరించు వస్త్రములుగాని ఆభరణములుగాని, వాహనములుగాని తగినవిధముగా నుండవలెను. లోభత్వము పనికిరాదు. పెద్ద శ్రీమంతుడున్నాడు. అతడు తగిన విలువైన దుస్తులు ధరించవలెను. తన నౌకరులు ధరించు తక్కువ దుస్తులు ధరించరాదు. అది పరమ లోభత్వము తాను నివసించు గృహముకూడతగిన విధముగా ఉండవలెను. ఇట్లు గృహపతులులేకాక, అన్ని ఆశ్రమవాసులు కూడా తమతమ ఆశ్రమ ధర్మములకు తగినట్లుగా జీవితమును గడుపవలెను.

**ఆహార సూత్రములు** – మానవులు ఎటువంటి ఆహారమును తీసుకొనవలయును? అహింసా స్వరూపమైన పవిత్రాహారమును తీసికొనవలెను. తేనెటీగవలె జీవించవలెను. తేనేటీగ పుష్పముపైన కూర్చుని పుష్పమునకు గానీ, దాని వాసనకుగాని, ఆకునకుగాని ఏ విధమైన అపకారము చేయదు, పవిత్రమైన ఆహారమును తీసికొని జీవించుచున్నది. పవిత్రమైన ఆహారము ఏ ప్రాణికి ఏ విధమైన అపకారము కలుగనీయదు. మానవుడు ఆహారము దగ్గర కూర్చొని "నేను ఏ ప్రాణికి అపకారము చేయలేదు. నేను తగిన పని చేసి నాకష్టమును తినుచున్నాను" అని పరిపూర్ణమైన విశ్వాసముతో తన ఆహారమును తాను తినవలయును. పని చేయకుండా అన్నము తినేవాడు మలం భక్షించేవాడు, పాపాన్ని భుజించేవాడవుతాడు. అందువలన ప్రతి మానవుడు ఏ ప్రాణికి అపకారము చేయక, ఎవరికి ద్రోహము, మోసము చేయక ధర్మసమ్మతముగా సంపాదించి పవిత్రమైన ఆహారమునే తినవలెను.



# పదవ అధ్యాయం
## (గుణనిర్గుణ యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

ఓ భిక్షులారా ! క్షమాగుణముకన్న మిన్నయైన గుణము మరొకటి లేదు. బుద్ధ సంఘములో చేరిన ప్రతి పరివ్రాజకుడు దీనిని కలిగి ఉండాలి. ఒకసారి అంగుళీమాలుడు బిక్షాపాత్రతీసుకొని శ్రావస్తిలో భిక్షాటనకై వెళ్ళాడు అతణ్ణిచూచి వీధిలో ఒకడు అతనిపై ఒక రాయిని విసిరాడు. మరొకడు కర్ర విసిరాడు. వేరొకడు చెత్తాచెదారం పోశాడు. ఇట్లా అతణ్ణి బాధపెట్టారు. అతని భిక్షాపాత్ర విరిగి పోయింది. గుడ్డలు చిరిగి పోయాయి. తల పగిలింది. కారుతున్న రక్తంతో అట్లానే అతడు బుద్ధుని దగ్గరకు వెళ్ళాడు. బుద్ధుడు అతణ్ణి చూచి "అన్నింటినీ సహించు! అన్నింటిని సహించు!" అన్నాడు. ఈ విధంగా దోపిడిదొంగ బుద్ధబోధనలు స్వీకరించి ధర్మవర్తనుడయ్యాడు. మనిషికి ఉత్తమాభరణం ఈక్షమ. ఈ విషయం అర్థంకావటానికి మీకొక కథ చెబుతాను.

పూర్వం "కలాబు" అనే పేరుగల దుర్మార్గుడైన కాశీరాజొకడు ఉండేవాడు. ఒక రోజు అతడు వేశ్యాస్త్రీలతో వినోదిస్తూ, ఒకతోటలో తనప్రియురాలైన ఒక కాంత ఒడిలో పడుకొని నిద్రపోయాడు. అప్పుడు ఆ వేశ్యస్త్రీలు అతణ్ణి వదలి, ఆతోటలో విహరిస్తూ, ఒకచోటకూచొని తపస్సు చేసుకొంటున్న ఒకమునీశ్వరుడి దగ్గరకుపోయి, ఆయన చేస్తున్నధర్మోపదేశాన్నివింటూముగ్ధులై కూచున్నారు. కొంతసేపటికి ఆ రాజునిద్రలేచి, తనను నిర్లక్ష్యం చేసి, వదలి పోయిన వేశ్యలపై కోపించి. దానికి కారణం ఆ మునీశ్వరుడే అని తలచి, అతణ్ణి శిక్షించాలని కత్తిదూసి, దగ్గరికిపోయి "నీవు చేస్తున్న ధర్మోపదేశా లేమిటి?" అని గద్దించాడు. ఆముని తానువాళ్ళకు మాధర్మాన్ని బోధిస్తున్నానని చెప్పాడు. క్షమ అంటే ఇతరులు తనను నిందించినసూ, కొట్టినసూ, తిట్టినసూ, కోపించకుండా ఉండటమేననికూడా వివరించి రాజుకు చెప్పాడు. ఆ మాటలు లెక్కచేయక ఆ రాజు ఆ మునిని కొరడాలతో బాద మని సేవకులకు ఆజ్ఞాపించాడు. భటులు ఎంత బాధిస్తున్నా ఆముని చలిం

చక బాధను ఓర్చుకోసాగాడు. కాళ్ళు, చేతులు నరికి నప్పటికీ, ఓర్పువీడ లేదు. అట్లా రక్త ప్రవాహంలో తనముందు పడిఉన్న ఆమునిని గుండెపగిలే టట్లు ఆ రాజు తన్నాడు. అప్పుడు ఎదురుగా ఉన్న భూమి చీలి, లోపలినుండి అగ్ని జ్వాలలు బైటికివచ్చి ఆ రాజును లోపలికి ఈడ్చుక పోయాయి. అది చూచి దయామయుడైన ఆముని, ఆ రాజు తనను అంతగా బాధించినప్పటికీ అతనిపై ద్వేషం లేకుండా "నా కాళ్ళుచేతులు నరికి నన్నింత బాధపెట్టిన ఈరాజు తిరిగి జీవించుగాక! ఈ రాజు చేసిన అకృత్యాలను పుణ్యాత్ములు లెక్కించకుండా ఉందురుగాక!" "అని పలికాడు. ఆ రాజు తిరిగి జీవించాడు. ఆముని క్షమాగుణమునుచూచి దేవతలుపుష్పవృష్టికురిపించారు. ముని కాళ్ళు, చేతులు మామూలుగా వచ్చాయి. అది చూచి కాశీరాజు హృదయం మారి, ఆమునికి శిష్యుడై సాధుజీవనుడైనాడు. కనుక క్షమాగుణము చాలా మిన్నయై నదిగా మనము భావించవలెను.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

ప్రబుద్ధులారా! ఈ జగత్తంతయు త్రిగుణముల వలననే పరివర్తన చెందుతున్నది. ఈ జగత్తంతయు ఈ మూడు గుణముల స్వరూపమే,! వేదములుకూడా ఈగుణవిషయములను బోధించుచున్నవి. కనుక వేదముల కతీతమైన నిర్గుణ పరమాత్మ తత్వస్వరూపజ్ఞానమును మనం పొందవలెను. గుణతత్వమైన ప్రకృతి స్వభావమున్నంతవరకు మోక్షార్హత కలుగదు. నిర్గుణమునందే మోక్షార్హత కలదు. త్రిగుణాత్మకమైన వేదములు మోక్షమునీయ జాలవు. అవి ప్రవృత్తిమార్గములేగాని నివృత్తిమార్గములుగావు. మానవులు చేయు ప్రతి కర్మయును ఏదో ఒక గుణమునకు సంబంధించినదిగా ఉంటుంది. జ్ఞానియైనవాడు ఈ గుణతత్వముల నెరిగి, గుణాతీతమైన నిర్గుణ తత్వమును ఆశ్రయించాలి. సత్వగుణముకూడా జీవుడికి బంధహేతువౌతుంది. సత్వగుణము పుణ్యాలను ప్రసాదిస్తుంది. పుణ్యముకూడా జన్మబంధకారణ మౌతుంది. నిర్గుణమే జన్మరాహిత్యమును ప్రసాదిస్తుంది.

ద్వైతోపాసనయందుగల జ్ఞానము సాత్త్విక రాజస తామసము లని మూడు విధములుగా ఉన్నది. ఉపాసనలో సగుణ, నిర్గుణ భేదములు రెండున్నవి. "దేవుడు తేజోమయుడు. ఆయన సూక్ష్మాతిసూక్ష్మము. సర్వమునకు ఆధారభూతశక్తి. సచ్చిందానందము" అని భావించి ఉపాసించేవాళ్లు నిర్గుణోపాసకులు. ఉత్తమజ్ఞానులు. బుద్ధిమంతులు. వీళ్ళే మోక్షార్హులు. సాత్త్వికజ్ఞానం గలవారు "దేవుడు ఒక్కడు. మానవాకారుడు. అనేకకార్యములు చేయువాడు, పాపములను తుడిచి వేసేవాడు, పుణ్యపాపములను సరితూచే వాడు, సర్వవ్యాపకుడు, పరలోకమునందుండేవాడు. రక్షించేవాడు." అని ఉపాసిస్తూ ఉంటారు. "దేవుళ్ళు అనేకులున్నారు. వాళ్ళు భూలోకాన స్త్రీగర్భమున జన్మిస్తూంటారు. వాళ్ళకుగూడా మానవులకులాగా మరణం ఉంది. సంతానాన్నికూడా వాళ్ళు కంటూ ఉంటారు. యజ్ఞాయాగాదులవల్ల దేవతలు ప్రీతి వహిస్తూ ఉంటారు" అని ఉపాసించటం రాజసజ్ఞానం. మూఢనమ్మకాలతో కూడినది తామస జ్ఞానము. ఇది హింసారూపమైనది. పాపభూయిష్టమైనది. అజ్ఞానస్వరూపమైనది. "దేవుడు పురుషుడేకాదు. స్త్రీదేవతలూ ఉన్నారు. వాళ్ళు మాంసాహారులు. వాళ్ళకు బలులిచ్చిన ఆదేవతలుసంతోషించి వరము లిస్తారు. కోరికలను తీరుస్తారు. అని మూఢనమ్మకము చేత గ్రామదేవతలు అనుపేరుతో ఉపాసిస్తుంటారు-కొంత మంది. మహామూఢులు అడవి యందు ప్రయాణికులను బంధించి, ఈ దేవతలకు నరబలి ఇస్తుంటారు. ఇది ద్వైతోపాసనకు బద్ధవిరుద్ధమైన ధర్మము. తనప్రాణము మీద తనకు ఎంత ఆశ ఉన్నదో ప్రతి ప్రాణికి దాని ప్రాణము మీద అంత ఆశయుండుననే భావన కలిగి యుండాలి. తనకు కాలులోముల్లు గుచ్చుకున్న ఎంతోబాధపడతాడు కాని ఎదుటి ప్రాణినికత్తితోనరికి, రక్తపాతముచేసి, భయంకరముగాహింసించి, చంపుచున్నాడు. ఇటువంటివాళుకొత్తగామానవత్వములేనివాళ్ళుక్రూరమృగములతో సమానమైనవాళ్ళు. మానవులు మానవ ధర్మములను గుర్తెరిగి మానవుల లాగాజీవించవలెను. దేవుని పేరున హింసాకాండలుచేసి క్రూరమృగములవలె

జీవించిన పాపభూయిష్ఠులై మరుజన్మమున భయంకర కుష్ఠువ్యాధి గ్రస్తులుగను కాళ్ళు, కండ్లు లేని వికలాంగులుగను జన్మించెదరు.

"దేవుడు తేజోమయుడు" అని భావిస్తూ శరీరమునకు వెలుపల యుండే స్పర్శరూపరసగంధములను వెలుపలకు త్రోసివేసి, జ్ఞాననేత్రమున అంతర్జ్యోతిని చూస్తూ, స్మృతితోసర్వనిర్వహణను నిర్వర్తించువాళ్ళు నిర్గుణోపాసకులు. "దేవుడు ఒక్కడు. మానవాకారుడు"అని ఉపాసించువారు సగుణోపాసకులు. దేవుళ్ళు అనేకమంది గలరు. వాళ్ళు భూలోకమున స్త్రీలగర్భమున జన్మిస్తారు. వాళ్ళకు జననమరణము లుంటాయి. అనేకఆకారములుంటాయి." అని ఆ ఆకారములనూ, విగ్రహరూపములనూ, ఏర్పరచి ఆ విగ్రహములను అలంకరించి, ఆభరణములుపెట్టి, పండ్లు, ఫలహారములు, భోజనముపెట్టి ఆరాధించుకుంటారు. వాళ్ళు విగ్రహోపాసకులు. మానవులు దేవుని విగ్రహమును చెక్కి ఆ చెక్కినరాతిని దేవుడంటారు. ఇది అతి స్వల్పమైన రాజసజ్ఞానము. మానవులు నిర్గుణోపాసనను గుర్తెరిగి ఆత్మతత్వస్వరూపజ్ఞానముతో దైవోపాసన చేయవలెను.

మానవులు అనుభవించే సుఖము మూడు విధములుగా ఉన్నది. సాత్వికము రాజసము తామసము. సాత్వికము అనగా పరులసుఖమును చూచి సంతోషించుట. ఒకవృద్ధుడు ఆకలితోబాధపడుతుంటే వానికి అన్నముపెట్టి, వానిసుఖమునుచూచి సంతోషించుటే సాత్వికము. ఒక సాధకుడు గురువును ఆశ్రయించెను. క్రమశిక్షణబద్ధముగా ప్రాతఃకాలమునలేచుట, ఆసనములు, ప్రాణాయామము చేయుట కష్టతరముగానుండెను కొంతకాలము సాధనచేసిన తరువాత ఆసనసిద్ధి కలిగెను. ధ్యానమున కూర్చొనెను. అత్యంత సుఖమును ఆనందమును అనుభవించెను. ఇదిసాత్వికము. సాధన సమయమున కష్టమనిపించినను తర్వాతఅమృతమువలె సాత్వికసుఖము పరిణమిస్తుంది. రాజససుఖమనగా ఇంద్రియ సుఖములు. క్షణభంగురములు. భార్యతోను. ఆహారాదిరుచులతోను, ఇతరవిషయ వాసనలతోను అనుభవించుసుఖము రాజససుఖము. ఇతరులను బాధించి, స్త్రీలమానభంగముచేసి, ఇతరుల సొమ్ముదొంగిలించి,

మోసముచేసి, హత్యలుచేసి, త్రాగుడుమొదలగు మత్తుపదార్ధములను అనుభవిస్తూ పొందేసుఖము తామససుఖము.

ధైర్యము మూడువిధములు: సాత్వికధైర్యము, రాజసధైర్యము, తామస ధైర్యము. మానవుడు తన మానవజన్మను సార్థకము చేసికొనుటకు భయపడక. ధైర్యముతో యోగసాధన చేయుట సాత్విక ధైర్యము. "నేను సామాన్యుడను. నాకు మోక్షార్హత లేదు'' అను అధైర్యమును పారద్రోలి ధైర్యముగ, ధ్యానము చేస్తూ ఇంద్రియముల విషయములకు, విషయ వాసనలకు, మనసంకల్పములకు లోనుగాక, నిశ్చయాత్మకమైనబుద్ధితో, ధైర్యముగా ధ్యానము చేయుట సాత్వికధైర్యము. తన స్వార్థమును కోరి ప్రతిఫలము నపేక్షించి తన స్వధర్మమును ధైర్యముతో నిర్వహించుట రాజస ధైర్యము, ఒకశిపాయి యున్నాడు. అతనిస్వధర్మముయుద్ధముచేయుట. అతడు తనప్రాణమునకు భయపడక ధైర్యముగా శత్రువుల నెదిరించి యుద్ధము చేయుట రాజసధైర్యము. తాను చేయవలసినపనినిబద్ధకించి, చేయలేనని భయపడక, ధైర్యముగా చేయుట రాజసధైర్యము. దౌర్జన్యము చేయుటకు మానభంగము చేయుటకు, హత్యలు చేయుటకు, మోసముచేయుటకు కార్యభంగము చేయుటకు, పరుల సొమ్ము అపహరించుటకు వహించు ధైర్యము తామస ధైర్యము.

బుద్ధి మూడు విధములుగ నున్నది : అవి సాత్విక బుద్ధి, రాజస బుద్ధి, తామసబుద్ధి, సత్యమును నెరుగు బుద్ధి సాత్విక బుద్ధి. నిత్య అనిత్య వివేక జ్ఞానముగలిగి. అనిత్యమునందు భ్రాంతిని విడిచి, నేను అను అహంకారము, నాది అను మమకారమును విడిచి, ప్రకృతి వికారములను చెందక యోగమునందు నిశ్చలముగానుండు బుద్ది సాత్వికబుద్ధి. బంధహేతువైన ఈ కర్మమార్గమునువీడి, మోక్షహేతువగు నివృత్తి మార్గమును, కర్తవ్యములను, భయాభయములను, సంసార బంధమును, సంసారనివృత్తిని ఉన్నదిఉన్నట్లు ఏది ఎరుంగుచున్నదో అబుద్ధి సాత్వికబుద్ధిగా మనము ఎరుంగవలెను. స్వార్థమునకు బుద్ధిని వినియోగించి, అధర్మమని తెలిసినను దానిని ఆచరిం

చుచు, ధర్మమని తెలిసినను తిరస్కరించుచు, చేయతగ్గపనిని చేయుచు, చేయ వలసినపనిని విడుచుచు, ఉన్నదున్నట్లుగాక. అపార్థముగ దేనిని నెరుగు చున్నాడో అట్టిబుద్ధి రాజసబుద్ధి. "హింసించుట, అబద్ధము పలుకుట పరుల సొమ్ము అపహరించుట, వ్యభిచారముచేయుట, మద్యపానముచేయుట తప్పు కాదు" అనిభావించేది తామసబుద్ధి.

కర్మమూడు విధములు, సాత్వికకర్మ, రాజసకర్మ, తామసకర్మ. శాస్త్ర ప్రమాణముగ ఉన్న కర్మ తప్పక చేయుట సాత్వికకర్మ. ఇదిచేయకూడదని నిషేధించిన దానిని చేయకుండుట, వారి వారి ఆశ్రమ ధర్మముల ప్రకారము నడచుకొనుట, వ్యాయామము ప్రాణాయామ, ఆసన, పరోపకార, దానధర్మ యోగ అనుష్ఠాన సాధన కర్మలు తప్పకచేయుట సాత్వికకర్మ అనబడుతుంది. ప్రవృత్తి మార్గముగాక నివృత్తిమార్గకర్మ సాత్వికకర్మ. అదే మోక్ష ప్రాప్తి. కర్మ. ఏఆశ్రమ సాధకుడైనను ప్రారంభమున కర్మతోనే ప్రారంభించవలెను అదే సాత్వికకర్మ. రాజసకర్మ అనగా ఫలితమునపేక్షించి చేసెడి కర్మ. ప్రభువులు యజ్ఞములను చేయిస్తుంటారు. చేసెడివారు ఋత్విక్కులు (బ్రాహ్మణులు) "ఒక యజ్ఞమునకు ఇంత సంభావన ఇవ్వవలెను. వేదములు చదివినందుకు ఇంత ధనము, మంత్రములు చెప్పినందుకు ఇంతధనము, యజ్ఞగుండమున నెయ్యి పోసినందుకు ఇంత ధనము, సమిధలు వేసినందుకు ఇంత ధనము" అనికోరుతుంటారు. ఇవి రాజస కర్మలు.

రాగద్వేషాదులచేత తాను చేయు కర్మ ఫలిత మెట్లు పరిణమిస్తుందో? తెలుసుకోకుండా, ఉద్రేకముతో, అనాలోచితముగా చేయు అనర్థదాయకమైన కర్మలు తామసకర్మలు. కొందరు తామస కర్మలనే వృత్తిగాజేసుకొని దొంగతనం, హత్యలు చేస్తుంటారు. మానవుడుగా తాను జన్మించినందుకు ప్రతివ్యక్తి సాత్వికకర్మలు చేసి జీవితాన్ని చరితార్థం చేసుకోవలెను. సమస్తకర్మల యందు ఫలాపేక్షలేనివాడై చేయు కర్మలు నిష్కామకర్మ లనిపించు కుంటాయి. ఇట్లా కర్మలు చేయటంవల్ల సర్వోత్కృష్టమైన ఆత్మశుద్ధి కలుగు తుంది. నిర్మలమైన బుద్ధిగలవాడు, దృఢమైన మనో నిగ్రహముగలవాడు,

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే ఇంద్రియవిషయ వాసనల యందలి అభిలాషను విడిచి, రాగ ద్వేషములను, తృష్ణాభ్రాంతులను విడిచి, ఇహపర భోగములభ్రాంతి లేక, కర్మలుచేసిన ఆ కర్మల బంధము వారికి అంటదు. పరప్రాణుల మేలుకొరకుచేయు నిష్కామకర్మ నివృత్తిమార్గముకాగలదు. ఒక వైద్యుడున్నాడు. ఔషధములను తయారు చేసి, వ్యాధులను నివారణచేసి ప్రాణుల బాధలను తొలగించుచున్నాడు. ధనము తీసికొనుటలేదు. ఇది నిష్కామ కర్మ. నివృత్తి మార్గము. ఒక పండితుడున్నాడు. అనేక మందికి విద్యాభ్యాసము చేయుచున్నాడు. ఏ విధమైన ప్రతిఫలము, ధన, ధనేతరములేవియు తీసికొనుటలేదు. ఇది నిష్కామకర్మ. నివృత్తి మార్గము. ఒకశ్రీమంతుడు ఎంతో శ్రమపడి ధర్మశాల కట్టించి ప్రజల కిచ్చెను. ఇది నిష్కామకర్మయోగము.

దైవ కర్మ స్వభావము చిత్రమైనది. చేయవలసిన కర్మచేసిన, రావలసిన ఫలితము దానంతట అదే వస్తుంది. ఈ దైవకర్మతత్వము నెరుంగనివారు ఫలితమును కోరుతుంటారు. చివరకు "నాకుమోక్షము కావాలి." అనుటకూడా కోరికగా ఉంటుంది. మోక్షము కావలెనను కోరికనుకూడా సన్యసించాలి. భూమిని దున్ని, తగిన యెరువులువేసి మంచి విత్తనములు పెట్టి, సమయమునకు అవసరమైనపుడు నీరు పెట్టుచున్నవాళ్ళు "ఓభూదేవీ! నాకు పంటనిమ్ము" అని అడుగనవసరములేదు. చక్కని పంటను భూదేవీ అడుగకుండానే ఇస్తుంది. కర్మ ఫలితము గూడా ఇట్లే అని నీవు భావించాలి. చేయవలసిన కర్మచేసిన రావలసిన ఫలితము దానంతట అదే ప్రాప్తించునను జ్ఞానముగలవారు ఆత్మతత్వస్వరూపయోగసాధన చేసినచో శాశ్వతమైన అమృత తత్వము, సచ్చిదానంద స్వరూపమైన మోక్షస్థానము ప్రాప్తిస్తుంది. మోక్ష స్థానము కోరిన లభించేది కాదు. నిష్కామ కర్మల వలన లభిస్తుంది.

తపస్సు మూడువిధములు:-సాత్వికతపస్సు రాజసతపస్సు తామసతపస్సు. తపస్సు పుణ్యము నిచ్చునదేగాని మోక్షము నిచ్చునది కాదు. తపస్సనగా

దేవుడు మానవాకారుడనీ, రూప నామ క్రియ లున్నవనీ, భావించి రూపము మీద మనసు నిలిపి నామమును స్మరించుట. దేవునకు రూపనామ క్రియలున్న వను నంతవరకు మోక్షమురాదు. వేదములు చదువుటవల్లను యజ్ఞములు చేయుటవల్లను, తపస్సుచేయుటవల్లను, దానములు చేయుటవల్లను పుణ్యము ప్రాప్తిస్తుందేగాని మోక్షప్రాప్తి కలుగదు. సాత్విక తపస్సు "దేవుడు సగుణ స్వరూపుడుగా నున్నాడు. ఆ దేవుడు నన్ను రక్షించును. వరములిచ్చును. అని సాత్వికభావంతో, కోరిక నేరవేరుటకొరకు చేసేది. సంతానము కొరకు కొందరు, అనుకూలభర్తకొరకు కొందరు, దేవుని రక్షణ కొరకు కొందరు, దేశము భిక్షముగ నుండుటకు కొందరు, సాత్వికతపస్సు చేస్తుంటారు.

కొందరు ఏదియో ప్రకృతి స్వరూపమైన విషయ వాసనలకు లోనై దేహ బ్రాంతి చేత మరణము లేకుండా యుండుటకు, తపస్సు చేస్తారు. కొందరు కోరికలు నెరవేరటానికి తపస్సుచేస్తారు. తాముచేయు వ్యాధర్మ ప్రవృత్తియందు ఎక్కువ ధనము ఎక్కువ ఫలితము లభించుటకు మరి కొందరు తపస్సుచేస్తారు. పరులకు ఏవిధమైన ఉపకారముచేయక తనస్వార్థమునకు మాత్రమువిజయము చేకూర్చుటకు చేయుతపస్సు రాజసతపస్సు. ఇతరులకుకు హాని, ప్రమాదము, పరప్రాణులకు హింస, అధర్మమునకు ఆధారముగా ఉండుటకై చేయు తపస్సు తామసతపస్సు. ఒకడు తనయిష్టదైవము గూర్చి తపస్సుచేసి, తాను ఎవరినెత్తిన చేయిపెట్టిన వారు భస్మమగునటుల వరమును పొందాడు. అనేక మంది శిరస్సులపై వాడు చేయిపెట్టి అనేక మందిని భస్మము చేశాడు. చివరికి తననెత్తినే తాను చేయిపెట్టుకుని తానూ భస్మమైపోయాడు. ఇతరులనుహింసించిన ఫలితాన్ని చివరకువాడు పొందాడు. ఇటువంటి హింసాస్వరూపమైన తపస్సు తామస తపస్సు అనబడుతుంది.

శ్రద్ధ మూడు విధములు అవి. సాత్వికశ్రద్ధ, రాజసశ్రద్ధ, తామసశ్రద్ధలు. మానవులు శ్రద్ధలేనిదే ఏకార్యమును సాధించలేరు. శ్రద్ధవలననేజ్ఞానము కలుగుచున్నది. జ్ఞానమువలన శాంతి కలుగుచున్నది. "శ్రద్ధావాన్ లభతేజ్ఞానం జ్ఞానావాన్ లభతే శాంతి". "పరమశాంతి స్వరూపమైన మోక్ష

సాధనకు మొట్టమొదటిమెట్టు శ్రద్ధ''యని బుద్ధిమంతులు గుర్తించవలెను. శ్రద్ధ లేని వారు ధర్మము నెరుగలేక సంసారమునబడి నశించిపోతారు. శ్రద్ధయే ప్రధానమైనది. ఎవడు ఆత్మతత్వ స్వరూప శ్రద్ధగలిగి గురువుల నాశ్రయించి, గురు ఆజ్ఞలను శ్రద్ధగా ఆచరించి శ్రవణమనన నిధి ధ్యాసలు గలిగి, సాధన చేస్తాడో వాడు నిర్గుణతత్వమైన జ్ఞానమును పొందుతాడు. జ్ఞానమువలన పరమశాంతి, సచ్చిదానందము లభిస్తుంది. అదియే మోక్షమార్గము. అందువలన మానవులు నిర్గుణశ్రద్ధ నాశ్రయించి మోక్షప్రాప్తిని పొందవలెను. ఎవనికి ఆత్మతత్వమునందు శ్రద్ధయుండదో వాడు ప్రవృత్తి మార్గమున, సంసారసముద్రమున బడి వినాశమును పొందుతాడు.

సాత్విక శ్రద్ధ యనగా ఫలితమును కోరి,పుణ్యమును కోరి, దైవకార్యములను శ్రద్ధగా చేయుట. కొందరు శ్రద్ధగా శ్రమకోర్చి "పుణ్యము ప్రాప్తిస్తుం"దని తీర్థయాత్రలు చేస్తారు. నదులలో స్నానము చేస్తే పుణ్యము లభిస్తుందని వాళ్ళపరిపూర్ణ విశ్వాసము. కాని అది సత్యముకాదు. అదే నిజమైన ఆనదిలోని జలచరము లన్నింటికిని ఆ పుణ్యము లభించాలి కదా! ఆ నదీ తీరమునందలి పల్లెపట్టణములయందు నివసించు ప్రజలుస్నానమునకే కాక త్రాగుటకు, వంటకు, శుభ్రపరచు కొనుటకు, ఆ నది నీటినే ఉపయోగించుకొంటూ ఉంటారుగదా! మరి వారికి పుణ్యము ప్రాప్తించాలిగదా? అటుల ప్రాప్తిస్తున్నదా? కొందరు ఎంతో శ్రద్ధతో, దీక్షతో, వ్రతములు చేస్తుంటారు. దీక్షసమాప్తమయ్యే వరకు ఆహారము తినరు. నిద్రించరు. ఇట్లు చేయుట విరుద్ధము. ఎక్కువ భుజించువానికిని, బొత్తిగా భుజింపని వానికిని, విపరీతముగ నిద్రించువానికిని, బొత్తుగా నిద్రింపని వానికిని యోగము సిద్ధింపదు.

రాజస శ్రద్ధయనగా ప్రకృతి స్వార్థస్వరూప ఫలితమునుకోరి, ఆశాపాశబద్ధులై, శరీరమును అనేక కష్టములకు గురిచేసి కర్మలను చేయుట ఒక శిల్పి రాతివిగ్రహమును చెక్కుటకు ప్రారంభించాడు. వేళకు అన్నము తినుటలేదు. రాత్రుళ్ళు నిద్రించుటలేదు. ఎప్పుడు పని పూర్తిచేసి

ధనమును పొందుతానా! అని తృష్ణకు బద్ధుడైనాడు. పూర్తిచేయుటయే లక్ష్యముగా, అతిశ్రద్ధతో కర్మనుచేస్తున్నాడు. ఇది రాజస శ్రద్ధ అనబడుతుంది. బట్టలను నేయువాడు ఎన్నిమారులు పోగులు తెగినను ఎంతో శ్రద్ధతో మళ్ళీ అతికించి, నేసి బట్టలను తయారు చేస్తాడు. మానవుడేకాక పక్షులు, జంతువులు క్రిమికీటకాలు కూడా రాజసశ్రద్ధ ననుసరిస్తున్నవి. ఇందుకు ఉదాహరణ భ్రమరకీటక న్యాయము. కందిరీగ తన జాతిని ఉత్పత్తిచేయుటకు అండోత్పత్తి గాని, పిండోత్పత్తిగాని చేయదు. ఆకులపై ప్రాకెడి చిన్న పురుగును తెచ్చి తన గూటియందుంచుతుంటుంది. లోపల గూటియందున్న జీవుడు ఈ శబ్దమును శ్రద్ధగావిన్న ఆ శ్రద్ధ తత్వమునుపొంది, "శ్రద్ధామయోయంపురుషః" అని కందిరీగ రూపమును పొంది, చెట్లపైన, ఆకాశమున సంచరిస్తాడు. శ్రద్ధకు ఇంత ప్రభావమున్నది. ఆకుపురుగును కందిరీగగా మార్చినది శ్రద్ధయేగాని దేవుడు కాదు. ఇది రాజసశ్రద్ధ.

తామసశ్రద్ధయనగా ఇతరప్రాణులను చంపుటకు, ధర్మవిరుద్ధముగ పరుల సొమ్మును దొంగిలించి, మోసముచేసి, హత్యలుచేసి అపహరించుటకు, స్త్రీలను మానభంగము చేయుటకు ఈ మొదలైన ధర్మవిరుద్ధ పాపభూయిష్టమైన కర్మలను చేయుటకు చూపే శ్రద్ధ తామసశ్రద్ధ అనబడుతుంది. ఒక ప్రభువు ఎంతో సుఖముగా తన అంతఃపురమున అష్ట అయిశ్వేరములు అనుభవిస్తూ ఉండేవాడు. ఒకరోజు వానికి వేటయందు శ్రద్ధ కలిగింది. అంతఃపురమును విడిచాడు. హంసతూలికాతల్పము విడిచాడు. అరణ్యములో ప్రవేశించాడు. దారి తెన్నులులేని ఆ అరణ్యమార్గమున ముండ్లు, రాళ్ళు, గుట్టలు, మెట్టలు నడచి, ఒక నదీతీరము చేరి, నదికి నీటికై వచ్చు జంతువులనూ, మృగములనూ. వేటాడదలిచాడు. క్రింద ఉంటే భూమిమీదయున్న అడవిమృగములవలన ప్రమాదముగలుగవచ్చునని భావించి ఒకచెట్టుకొమ్మపై కూర్చొని నిద్రను నిగ్రహించి, గురిచూచి వేటాడి, జంతువులను చంపాడు. అంతఃపురము వదలి అరణ్యమున చెట్టు కొమ్మపై యెంతోశ్రమకోర్చి వానిని కూర్చుండునట్లు చేసింది తామసశ్రద్ధ అదేవిధముగా రాత్రిళ్ళు దొంగతనము

చేయువారు ఎంతో శ్రద్ధను వహించి, నిద్రను నిగ్రహించి, మేల్కొని, శ్రద్ధతో దొంగ తనముచేసి పరుల సొమ్ము అపహరిస్తున్నారు. ఇది తామస శ్రద్ధ.

ఒక సాధకుడు శీతాకాలములో వేకువజామునే నిద్ర మేల్కొని, చలిని గూడా లెక్కించక, నదికేగి, స్నానంచేసి రావడానికి పూనుకొంటాడు. ఇది సాత్వికశ్రద్ధ. అదేసమయములో ప్రక్కగ్రామమునుండి పాలు, పెరుగు, కూరగాయలుతెచ్చి, పట్టణముల యందు అమ్ముకోవటానికి మరొకడు పోతాడు. ఇది రాజసశ్రద్ధ. స్వార్థముకొరకు కష్టములను భరించెడి శ్రద్ధ రాజసశ్రద్ధ. అదేసమయమునకు అదే నదిలో చలి నీటిలో తిరుగుచు ఒక బెస్తవాడు వలను విసిరి చేపలను పట్టుతున్నాడు. చేపల కొరకు అనేక మారులు నీటిలో మునుగు తున్నాడు. చలిబాధను సహిస్తున్నాడు. ఇతర ప్రాణులను హింసించుటకు జూపే ఈ శ్రద్ధ తామసశ్రద్ధ. ఈ ముగ్గురును శ్రద్ధవల్లనే వారి వారి కార్యములను నెరవేర్చుకొంటున్నారు. శ్రద్ధలేకున్న ఎవ్వరును ఏ విధమైన కార్యమును చేయలేరు, ఆయా గుణతత్వములవలన పుణ్యము, పాపము, పుణ్యపాపములేని కర్మఫలమును ఆయావ్యక్తులు పొందుతున్నారు. మానవులు పుణ్యపాపముల కతీతమైన మోక్షమును నిర్గుణధ్యాన యోగమువలన పొందవలెను. ఇట్టి సాత్వికశ్రద్ధ మిలగుల శ్రేష్టమైనది.

మానవుడు భుజించెడి ఆహారము మూడు విధములుగా ఉన్నది. అది సాత్వికము, రాజసము, తామసము. అందు మానవులు సాత్వికాహారమునే తినవలెను. తాను భుజించే ఆహారము అయుర్వృద్ధినిచ్చునదిగా ఉండవలెను. దేహమునకు బలమును, ఆరోగ్యమును, మనస్సులకు సుఖసంతోషములను ఇచ్చునవిగను, రసవంతమైనవిగను, చమురుగలిగి రుచివంతముగనుండునవిగను, భుజించెడివానిదేహము నందలిపంచభూతములకు అనుగుణమైనబలమును నిచ్చునవిగను, అనగా శరీరమున తత్వము పటిష్టముగా లేకున్న [illegible] ఆహారమునందు పృథ్వీతత్వము పటిష్టముగా యుండునట్టి ఆహారమును తీసికొనవలెను. తనశరీరము నందు లోహములు, వెండి, బంగారము, ఇనుము,

రాగి, మొదలగు లోహములు, లోపించియున్న తినెడి ఆహారమున అవిపటిష్ఠ ముగా ఉండునట్టి ఆహారమును తీసికొనవలెను. అదియే సాత్వికాహారము. మానవులు తవ శరీరావసరమును గుర్తించి అట్టి ఆహారము తీసికొనవలెను.

మానవులు తమ ఆరోగ్యమును గమనించక కేవలము నాలుకరుచిని మాత్రము ప్రధానముగా తీసికొని, ఆరోగ్యమునకు భంగము కలిగించే అతి కారముగాను, అతి ఉప్పగాను, అతి పులుపుగాను ఉండే ఆహారాన్ని తీసికొంటుంటారు. అట్టివారు నాలుక రుచి ఎరింగిన వారేగాని శరీర ఆరోగ్యము నెరింగిన వారు కారు. కొందరు శరీరమునకు మత్తునిచ్చెడి పదార్థములను వాడుతుంటారు. వాని వలన శరీరమున ఆరోగ్యము చెడిపోతుందను విషయాన్ని గుర్తించరు. ఆరోగ్యమునకు భంగము కలిగించునవన్నియు రాజసాహారములు. జీవహింసచేసి, ఇతరపక్షు లనూ, జంతువులనూ, చేపలనూ చంపి తినెడి ఆహారము తామసాహారము. వాటిని చంపువారు కొందరుగను, తినువారు కొందరుగను ఉంటారు. వాళ్ళలో "తినువారికి పాపములేదు. చంపువాళ్ళకే పాపముసంభవిస్తుం"దని తినువారు వాదిస్తుంటారు."తినువారికేపాపముప్రాప్తిస్తుంది. వారుతినుచున్నం దువల్లనే మేము చంపుచున్నాము. మేముతినుటలేదు. తిన్నవారికే పాపము" అని చంపువారు వాదిస్తుంటారు. కాని పాపము ఇరువురికి సమానముగానే కలుగుతుంది. కనుక చంపనూకూడదు; తిననూకూడదు. రెండును దోష యుక్త కర్మలే.

వాక్కు - మూడు విధములుగా ఉన్నది, సాత్వికవాక్కు, రాజస వాక్కు, తామసవాక్కు. సత్యమును పలుకుటే సాత్వికవాక్కు మరియు ఆత్మ తత్వమును జిజ్ఞాసులైనవాళ్ళకు బోధించేది, గురువుల ప్రబోధములూ, ఇతరు లకు హితమును కలుగజేసేది, సంతోషమును కలిగించేది, ప్రియమైన నివృత్తి మార్గమును ప్రతిపాదించేది అయినవాక్కు సాత్వికవాక్కు. అదే సమ్యక్ వాక్కు. రాజసవాక్కు పరులకు ఏ విధంగాను ఉపయోగపడక తన సంపా దనకో, తనకార్యములు నెరవేర్చుకొనుటకో, మసిపూసి మారేడుకాయనుచేసి

చూపుటకో చెప్పుచమత్కారమైన మాటలు. మానవులనుమాటలలో మభ్యపెట్టి తనకార్యము నెరవేర్చుకొనుటకు స్తుతించేవాక్కు, సారమును సత్యము లేని వాక్కు రాజసవాక్కు అనబడుతుంది. విద్యావంతులు ధనదనేతరములను ప్రతిఫలముగా తీసికొని చెప్పెడి విద్యయును, కవులు ప్రభువులను కీర్తిస్తూ, స్తోత్రముచేస్తూ, ప్రతిఫలమును పొందేవాక్కు రాజసవాక్కు.

తామసవాక్కునకు మొట్టమొదటిశబ్దము అసత్యము. అబద్ధములు పలుకుట, ఇతరుల సొమ్మును అపహరించుటకు నిందలు ఆరోపించుట, తామస వాక్కులు. ఇవి కూడవు.

సంఘము మూడు విధములుగ నున్నది. సాత్విక సంఘము, రాజస సంఘము, తామస సంఘము. సాత్విక సంఘమునే "సత్సంగ్" అంటారు "సత్సంగత్వంలోనే మోక్షప్రాప్తి కలుగుతుంది. సత్సంగమువలన ప్రకృతి యింద్రియ విషయవాసనా వికారస్వరూప సంఘముతో నిస్సంగత్వ మేర్పడుతుంది. దానివలన యింద్రియ నిగ్రహము, తృష్ణ రాహిత్యము, దాని వలన మోహము, కోరికలు. భ్రాంతి మమకారము నశిస్తుంది. నిర్మలత్వం సిద్ధిస్తుంది. నిర్మలత్వమే ప్రవృత్తి మార్గమునూ, సుస్థిర బుద్ధితత్వమునూ కలిగిస్తుంది. సుస్థిరబుద్ధితత్వమే జ్ఞానయోగస్థితి. జ్ఞానయోగమే మోక్షమార్గము. అందువలన ఒక సాత్వికసంఘము, భిక్షుసంఘము, లభించిన మోక్షములభిస్తుంది. అందువలన మానవులు జ్ఞానులను దర్శిస్తూ ఉండవలెను. వారి ఆదేశములను శిరసావహించవలెను. ప్రకృతిమార్గమున ముంచివేయు కామ, క్రోధ, లోభ మోహమద మత్సరముల సంఘమును, ఇంద్రియ విషయవాసనా సంఘమును బహిష్కరించవలెను. నిర్మలతత్వమును పొందవలెను. అదే సత్వగుణ సంఘము కులతత్వమును బహిష్కరించి, గుణతత్వమునకు ప్రాధాన్యమిచ్చి, గౌరవించి, ఆదరించునదే సాత్విక సంఘము.

రాజస సంఘము - బుద్ధికి, మేధకు, జ్ఞానమునకు, త్యాగమునకు ప్రాతినిధ్యము ఇవ్వక. కులమునకు, మాత్రము ప్రాధాత్యతను ఇచ్చి, తమకులము

వారికే పెద్దపీటవేయుట, ఇతరకులములవారిని ద్వేషించుట, అగౌరవపరచుట, ఇతర మతముల వారిపై అసూయ కలిగి ఉండుట, ధర్మమును, నీతినిజాయితీలను అతిక్రమించి స్వార్థముతో ప్రవర్తించుట, రాజససంఘములోని వారు చేయుపనులు. ఏ సంఘములో చేరి దురభ్యాసములు, అసత్యము, వ్యభిచారము, మోసము మున్నగునవి నేర్చుకొంటారో ఆ సంఘము తామస సంఘ మనబడుతుంది. బాల్యములో ఎవరికిని దురభ్యాసము లుండవు. స్నేహితుల సంఘంద్వారా దురభ్యాసములు పట్టుబడుతవి. మంచి సంఘములో చేరిన మంచిఅలవాట్లు, చెడు సంఘములో చేరిన చెడు అలవాట్లు కలుగునని గ్రహించి, బుద్ధిసంఘములో ప్రవేశించి సంస్కరించ బడవలెను.

మానవులు వారివారి స్వభావముల ననుసరించి కర్మలు చేస్తుంటారు. ఈ స్వభావమన్నది ఈ జన్మ సంబంధముగాదు. పూర్వజన్మ వాసనతో కూడినది. విద్యనేర్పునది ఒకే ఒక గురువైననూ విద్యార్థులు సమతమ స్వభావముల ననుసరించి ప్రావీణ్యం పొందుతుంటారు. కొందరికి వినంగానే అర్ధమౌతుంది. కొందరికి ఇంటిదగ్గర చక్కగాచదివితేనే అర్ధమౌతుంది. కొందరికి ఎంత చెప్పినా అర్థంకాదు. ఇది స్వభావతత్వము. సాత్విక స్వభావముగలవారు చిన్నవయస్సులోనే ఆత్మతత్వస్వరూపజ్ఞానము కలిగి, సాధనాభ్యాసములుచేసి, మోక్షార్హులౌతారు.రాహులుడు ఏడు సంవత్సరముల వయస్సున జ్ఞాన భిక్షనుకోరి మోక్షార్హుడైనాడు. విశాఖ పదిహేడు సంవత్సరముల వయస్సులోనే సన్యసించి, ఇంద్రియముల నిగ్రహించి, ఆత్మతత్వ స్వరూపజ్ఞానము కలిగి, మహాత్యాగినియై మోక్షార్హత పొందింది. ఇది సాత్విక స్వభావము. రాహులు మాతకు ఎవరును సన్యాసము ఇవ్వలేదు. తన స్వభావము ననుసరించి తానే సన్యాసినిగా మారింది. ఇది సాత్విక స్వభావము. సంఘమునకు స్వభావమును మార్చెడి ప్రభావమున్నది. కొందరు జన్మప్రభావము చేత రాజస, తామస స్వభావులుగా నున్ననూ వారిని సత్యంగములు సాత్విక స్వభావముగల వారినిగ చేయగలదు. ఆమ్రపాలి రాజస స్వభావముతో ప్రవర్తించుచున్ననూ బుద్ధ భిక్షుసత్సంగములోచేరి, తనపూర్వ స్వభావమును

పూర్తిగా మార్చుకొని, సాత్విక స్వభావమును పొంది ఆత్మతత్వరూప జ్ఞానసంపద పొందింది.

స్వార్థమును ప్రధానముగా తీసికొని, ధనకాంక్షతో ఎక్కడకు వెళ్ళినను ఏ విధముగా ధనము సంపాదించ గలమని ఆలోచిస్తూ ఉండే స్వభావము రాజసస్వభావము. సహజముగ వ్యాపారస్తులకు ఈ స్వభావముంటుంది. కొందరు మిశ్రమ స్వభావము కలిగి ఉంటారు. కొంతమంది వ్యాపారమున అబద్ధములు చెప్పి, మోసముచేసి సంపాదించిన ధనమును కొంత ధర్మ కార్యములకు వినియోగిస్తుంటారు. వాళ్ళు మిశ్రమ ఫలితమును అనుభవిస్తారు. తమస్వభావమునకు తగినట్లు పుణ్యము, పాపము, పుణ్యా పాపమిశ్రమము అనుభవిస్తారు. ఒకపెద్ద వ్యాపారస్థుడు ఉండేవాడు. వ్యాపారమున అబద్ధములుచెప్పి, మోసముచేసి, తక్కువ కొలతలిచ్చి, లక్షలు సంపాదించాడు. అంత్యకాలమున అనేక మందికి ఆశ్రయముండే లాగున ఒక పెద్ద ధర్మశాలను కట్టించి, దానితో తనసంతతికి సంబంధములేకుండా ప్రజల కప్పగించాడు. ధర్మశాల కట్టిన పుణ్యవిశేషమున అతడు మరుజన్మలో శ్రీమంతుల కుటుంబమున జన్మించాడు. వ్యాపారమున చేసిన పాపముల ఫలితమున దీర్ఘ వ్యాధిగ్రస్తుడైనాడు. ఇవి స్వభావము ననుసరించి ప్రాప్తించినకర్మఫలములు. పరులను దూషించుట హింసలుచేయుట, అబద్ధములు పలుకుట, స్త్రీలను మానభంగముచేయుట, దొంగతనము చేయుట, మధుపానములుచేయుట, ఇవన్నియు తామస స్వభావమువల్ల చేసేకర్మలు.

వర్ణాశ్రమ ధర్మములు, ఒక కులమును ప్రతిపాదించి చెప్పుటలేదు. కుటుంబ సంప్రదాయమును గురించి చెప్పుటలేదు. స్వభావమును గురించియే చెప్పుచున్నవి. "జ్ఞానవిజ్ఞాన మాస్తికం బ్రాహ్మణం కర్మస్వభావజం" ఆత్మ తత్వస్వరూప జ్ఞానముకలిగి యుండుట, నిత్యంధ్యానయోగముచేయుట, ఇంద్రియ నిగ్రహము, పంచశీలములు, సత్ప్రవర్తన స్వభావముగా కలిగిన కర్మ బ్రాహ్మణ స్వభావకర్మ అని చెప్పబడుచున్నది. "శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాపల్యాయనం దానమీశ్వర భావశ్చ క్షాత్రంకర్మస్వభావజం"

"శౌర్యము, కీర్తి, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమునందు శత్రువులవలన భయము చెంది పరుగెత్తకుండుట, దైవభక్తి కలిగియుండుట, దానధర్మములు చేయుట, ప్రజలను చక్కగా పరిపాలించుట, మున్నగునవి స్వభావముగా గలిగిన కర్మ క్షత్రియకర్మ యని చెప్పబడుచున్నది. అదే విధముగ వైశ్య శూద్ర స్వభావకర్మలు చేయు వాళ్ళను వైశ్యులనీ, శూద్రులనీ చెప్పుచున్నారు. వర్ణాశ్రమ ధర్మములకు స్వభావకర్మలు ప్రమాణమేగాని జన్మించిన కులములు ప్రమాణము కానేరవు.

విద్యమూడు విధములుగా ఉన్నది, సాత్విక విద్య. రాజసవిద్య, తామసవిద్య. సాత్విక విద్యనే ఆత్మ విద్యగా చెప్పుతారు. నిత్యవస్తుతత్వ జ్ఞానము, నివృత్తిమార్గము, సత్యమును తెలిసికొనుట, పుట్టినవారుమరణిస్తారనీ, మరణించినవారు పుడతారనీ తెలిసి, మరణించినవారుజన్మించక మోక్షమును పొందు తారనితెలిపేమార్గమే(దుఃఖ నివృత్తి మార్గమే)ఆత్మవిద్య. అదేసాత్విక విద్య. తత్వవేత్తలైన గురువుల నాశ్రయించి, పరమాత్మ తత్వమును సంశయరహితముగ తెలిసికొని, గురువు ఆజ్ఞనుపాలించి, యోగసాధనచేసి, సమాధి స్థితిని పొందుట ఆత్మవిద్య. అది అన్ని విద్యలకన్న శ్రేష్ఠమైన, పవిత్రమైన విద్య. దానితో సమానమైనవిద్య మరొక్క టేదియును లేదు. వేలాదిప్రజలు యందు పూర్వజన్మసంస్కారము గలవాడు ఒక్కడుమాత్రమే ఆ ఆత్మవిద్యను గ్రహిస్తున్నాడు. అది గ్రహించిన వాళ్ళల్లో ఒకానొకడు సిద్ధిని పొందుతున్నాడు. ప్రతి మానవుడును తన మానవజన్మను సార్థకము చేసుకొనుటకు తత్వవేత్తలైన గురువుల నాశ్రయించి, ఆత్మవిద్య నెరిగి, జన్మరాహిత్యమును చేసికొనవలయును. అదియే సత్యము నెరుగుట, సత్యమును చేరుట.

రాజసవిద్య అనగా ప్రకృతి శరీరమునకూ, జీవితమునకూ. సంసారమునకూ సంబంధించిన విద్య. సంసారమును, శరీరమును పోషించుకొనుటకు యేదియో యొక విద్యను నేర్చి ఉండవలయును, అందు కొన్ని శిల్పవిద్యలున్నవి. అవి సంఘమునకు అత్యంత అవసరమైయున్నవి. వడ్రంగి శిల్ప విద్య నాగలిచేయుట. రైతు పొలముదున్ని పంటపండించుట రైతుశిల్పవిద్య

వడ్రంగి నాగలిచేసి రైతునకు ఇచ్చుచున్నాడు. రైతు తనవిద్యతో పొలము దున్ని పంటలుపండించి, వడ్రంగిని పోషించుచున్నాడు. ఇవి ప్రవృత్తిమార్గ విద్యలు. నిత్యజీవిత అవసరమునకు నివాసములు ఏర్పరచుకొనుచున్నారు. రాజులు భవనములను నిర్మించుకొనుచున్నారు. ధరించుటకు వస్త్రములు, ఆభరణములుతయారుచేయుచున్నారు. ఇవన్ని ప్రకృతిస్వరూపరాజసవిద్యలు. తామసవిద్య యనగా ఇతర ప్రాణులను హింసించుటకు ప్రయోగించువిద్య. ఈ విద్యలో విలువిద్యఒకటి. విలువిద్య హింసారూపమైనది. తామస విద్య లనుధర్మరక్షణయందు ప్రయోగించిన దోష ముండదు. గనుక విలువిద్యను ధర్మ రక్షణకు మాత్రమే వినియోగించవలయును. లేకున్న పాపబద్ధులగుదురు. మారణవిద్యలైన ఉచ్చాటనాదులు చేయరాదు.

ప్రళయం మూడు విధములుగ నున్నది. సాత్విక ప్రలయం, రాజస ప్రళయం, తామస ప్రళయం. ప్రళయం అనగా మరణావస్త. మానవుడు జీవితాంతము ఎటులున్నను మరణావస్థయందు గుణతత్వము జీవుని జన్మకు కారణమౌతుంది. గనుక మానవులు తగుశ్రద్ధతో మరణావస్థయందు సత్వగుణ సంపన్నులుగ నుండవలయును. సత్వగుణ సంపన్నులై ఉన్నపుడు జీవుడు శరీరమును విడచిన, ఆజీవుడు, శ్రీమంతుల కుటుంబమున జన్మిస్తాడు. దైవ భావన గలిగి ఉంటాడు. దానము, ధర్మము పరోపకారము మొదలైన సుగుణాలు కలిగి ఉంటాడు. బ్రతికినంత కాలము సత్వగుణ సంపన్నులుగ ఉన్నచో మరణావస్థయందు సత్వగుణమే ఉంటుంది. రజోగుణతమోగుణ బద్ధులైనవారికి తదనుగుణమైన జన్మ ప్రాప్తిస్తుంది. తమ శ్వాస వదలు వరకు గుణతత్వమును మహాజాగ్రత్తగా భద్ర పరచుకొనవలెను. ఇది పుణ్యమును గోరు సత్వగుణసంపన్నులస్థితి. పుణ్యమున కతీతమైన మోక్షమును కోరు వారు గుణాతీత పరమాత్మతత్వ స్వరూపజ్ఞానమునుపొంది, సంకల్పరహితులై సమాధిస్థితిని పొంది శరీరముతో నున్నపుడే మోక్షానుభూతి అయిన సచ్చిదా నందమును, పరమ శాంతిని, అమృతత్వమును, దివ్యతేజస్సును పొంది యుంటారు. వాళ్ళకు గుణముల వికారము ఏ మాత్రము ఉండదు. పుణ్య

ఘును కోరు వరకు, మనసు యుండు వరకు గుణముల ప్రమాదము తప్పక ఉంటుంది.

రజోగుణమునకు స్వార్థము,లోభత్వము, ఆశ, కోరికలు, పక్షపాతము వ్యామోహము అసూయ (బేధబావము ప్రధానముగ ఉంటవి).

తమోగుణము-హింసాత్మక స్వరూపమైనది. భయంకరమైనది. పాప భూయిష్టమైనది. కామ, క్రోధ, లోభ, మోహ, మదమత్సరములతో కూడు కొన్నది. ధర్మ విరుద్ధ స్వరూపమైనది. సంఘమునకు విద్రోహకరమైంది సంఘమునందు ఎవరి యందును తమోగుణమును ఉండనీయక సత్వగుణ సంఘముతో ప్రకృషి చేసి, తమోగుణమును తొలగించి, సంఘమును సంస్క రించవలయును. తమోగుణ బద్ధులు కౄరమృగములతో సమానము. ఎవని యందైనను కామ, క్రోధములు ప్రజ్వలించిన వెంటనే అతడు తనలోతమోగు ణము ప్రకోపించినదని తెలిసికొని, గుణతత్వమును మార్చుకొన వలెను. అది మానవత్వ ధర్మము. మానవులకు పొరపాటులు సహజము. కాని పొరపాటు లతోను, దోషములతోను మరణించరాదు. వాటిని సవరించుకొని, సంస్క రించుకొని, సత్వగుణ ప్రధానులుగా జీవించ వలయును.

## కస్సప సోదరులు

ఉరువేల కస్సపుడు, నది కస్సపుడు, గయ కస్సపుడు అనే వాళ్ళను కస్సప సోదరు లని పిలుస్తారు. ఈ ముగ్గురు బుద్ధుడు ప్రదర్శించిన మూడు వేల ఐదు వందల అద్భుతాలను, ఇంద్రజాలాలనుచూచి (రాళ్ళను, అగ్నిని వమనం చేసే రెండుసర్పాలను జయించటం, దేవతలను రప్పించటం, ఉరు వేలకస్సపుని మనస్సులోని ఘర్షణను వెలువరించటం, మొద్దులను విరచటం మొదలైనవి) తమ శిష్య బృందంతో బుద్ధుడికి శిష్యు లయ్యారు.

# పదకొండవ అధ్యాయం

## (స్మృతి యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షుకులారా! సమస్త జీవరాశిలో మానవుడు ఉత్కృష్టుడని చెప్పబడుచున్నాడు. కాని ప్రవర్తనలో జంతువుకన్నను హీనముగా ప్రవర్తిస్తున్నాడు. భగవంతుడు ప్రసాదించిన జ్ఞానమును సద్వినియోగము చేసుకొనుటలేదు. అర్థమునుకోరి పరమార్థమును గ్రహించుటలేదు. తాను చేయవలసిన ప్రయత్నమేదో స్మృతికి తెచ్చుకొనుటలేదు. ఈస్మృతి మానవున కొక్కనికే ఉన్నదని చాలమంది భావిస్తుంటారు. పశుపక్ష్యాదులలో గూడ ఈ స్మృతి ఉన్నది. దేవుడు నిత్యము పరమాత్మతో కలియవలెనని ఆరాటపడుతుంటాడు. ఆవేదన పడుతుంటాడు. ఈ ఆరాటము, ఆవేదన నివురుగప్పిన నిప్పువలె ఉంటుంది. సమయం వచ్చినప్పుడు బైట పడుతుంది. స్మృతి పశుపక్ష్యాదులలో కన్నా ఎక్కువగా మనుష్యులలో ఉన్నది. జంతువులలో గూడ ఈ స్మృతి యున్నదనుటకు బుద్ధుని జీవితమున జరిగిన మూడు సంఘటనలు మీకు వివరిస్తాను.

ఒకసారి తథాగతుడు బోధివృక్షము క్రింది ధ్యానములో నున్నప్పుడు మూడు సింహములువచ్చి, ప్రశాంత చిత్తముతో ఆయన పాదముల ముందు పరుండి యుండెడివి. ఒక ఏనుగు ఆయన చుట్టూ శుభ్రము చేసెడిది. ఆ సింహములూ, ఆ ఏనుగు పరస్పరము మైత్రీ భావముతో మెలగెడివి. "నలగిరి"యను మదపుటేనుగు బుద్ధునిహత్యగావించుటకు దేవదత్తునిచే ప్రేరేపించబడినది. కాని తథాగతుని సమీపమునకురాగానే దానికి స్మృతిజ్ఞానము కలిగి, శరణాగతయై బుద్ధుని పాదాలపై వ్రాలినది. సాధువుగా మారినది. ఇచ్చట ఈ కృష్ణానదీ తీరమునే తథాగతుడు ధ్యానములోనున్నప్పుడు ఒక నాగము వారి పాద సన్నిధిలో తోకచుట్టుకొని, పడగెత్తి, వారినే జూచుచుండెడిది.

తథాగతుడు దానికి ధర్మోపదేశము గావించి, దానిని తనభిక్షాపాత్రయం దిడుకొని తీసుకొనిపోయి, దూరముగా ఒక పుట్టలో దానిని విడిచి వచ్చినాడు. ఆ పుట్టయందు ఆ నాగరాజు నివసించుచు స్మృతి జ్ఞానమును ఆర్జించెను. నాగరాజు ఆ విధముగా జ్ఞానమార్జించినది కనుక ఈ కొండకు నాగార్జున కొండ అని పేరు వచ్చింది.

ఈ కృష్ణనదీతీరముత తథాగతుడు ధ్యానములోనున్నప్పుడు మరియొకసారి ఒక ఆబోతు వచ్చి వారిముందు ప్రతి దినము పరుండుచుండెడిది. జనులు దానిని "నంది"యని పిలిచేవాళ్ళు. ఆనంది స్మృతి జ్ఞానము కలిగి ఎల్లప్పుడూ దైవభావనతో ఉండెడిది. వైశాఖ పౌర్ణమి రోజున అది తథాగతుల ఎదుట అట్లా పరుండియే తుదిశ్వాస విడచినది. భిక్షువులంతా నంది నిర్వాణము పొందిన కొండ గనుక ఇది "నందికొండ"అని పిలవటంప్రారంభించారు. ఆ పేరే కొంతకాలానికి స్థిరపడింది. ఇట్లా పశుపక్ష్యాదులలోనే ఈ స్మృతి జ్ఞానము గోచరిస్తూ ఉండగా మానవులమైన మనము ఎంతగా దీనినిపెంపొందించుకొని, ఎంతగా సమ్యక్‌జీవితాన్ని గడిపి నిర్వాణమును పొందవలెనో వేరుగా నేను చెప్పనక్కరలేదు. ఎల్లరు సర్వదా ఈ స్మృతి జ్ఞానము కలిగి ఉండవలెను.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

బౌద్ధ భిక్షులారా! స్మృతి అనునది. పరమపావనమైనది, యోగమునకు సర్వ ఆధారభూతమైనది, యోగియైనవాడు ఏదిచేసినను స్మృతిని ఎదుట నుంచుకుని చేయవలెను. యోగసమాధియందు సత్వవిధముల రక్షించునది, పోషించునది, స్మృతియే అయియున్నది. ఒకయోగసాధకుడు అరణ్యమున, ఏచెట్టుక్రిందనో, ఏకొండగుహయందునోనియమితాసనబద్ధుడైకూర్చుని సమాధి స్థితియందున్నాడు. కాళ్ళు,చేతులుశరీరము కదిలించుటలేదు కళ్ళతోచూచుట లేదు. శరీరము వెలుపలయుండు శబ్దస్పర్శరూపరసగంధములను వెలుపలికి తోసివేసి,మనసును ఆత్మయందు బద్ధపరచి, సమాధిస్థితియందున్నాడు. ఆహా

రము తినుటలేదు, నీరు త్రాగుటలేదు, నిద్రించుటలేదు, తిరుగుటలేదు. సంవత్సరముల పర్యంతము కూర్చున్నచోటు నుంచి కదులుటలేదు. కొన్నిరోజులు ఆహారము లేకున్న మరణము సంభవిస్తుంది. జీవుడు శరీరమును విడచి మరొక శరీరమున ప్రవేశిస్తాడు. పూర్వపు శరీరము చెడి దుర్గంధభూయిష్ట మౌతుంది. ఇది శరీర ధర్మము.

యోగియగు వాని శరీరము ఆహారములేక ఎట్లు జీవించియున్నది, ఇంద్రియ జ్ఞానము లేక ఏమి అనుభవించుచున్నాడు? ఎట్లు అనుభవించుచున్నాడు? శరీరము ఎట్లు పోషించబడుచున్నది? యోగసమాధి స్థితియందు సర్వనిర్వహణ స్మృతియే అయియున్నది. మానవుల శుక్లశోణితములను "అమృతాహారము" అంటారు. ఇది శరీరము అంతర్భాగముననేయున్నది. స్మృతి ఈ అమృతాహారమును ఊర్ధ్వ రేతస్సు మార్గమున అన్నమయ కోశమును జేర్చి జీవునకు ఆహారమును అందజేయుచున్నది. అందువలన ఇంద్రియ జ్ఞానము లేకయే శరీరము పోషింపబడుచున్నది. సమాధి స్థితియందు ఇంద్రియ సుఖ సంతోషము ఉండవు. నాలుగు అనుభూతులుంటాయి. సచ్చిదానందము, పరమశాంతి. తేజోమయం, అమృతతత్వము. వాని స్మృతితో జీవుడు అనుభూతిని పొందుతుంటాడు. జీవుడు శరీరమును విడచి, పరంధామమును చేరినపుడు జీవుని వెంట స్మృతి ఉంటుంది. జీవుడు సర్వమును శరీరముతో వదలేస్తాడు. కాని స్మృతిని వదలటంలేదు. మరొక శరీరము పొందిననూ, మోక్షమును పొందిననూ, స్మృతి జీవుని విడువకయే ఉంటుంది శరీరములో ఉన్నప్పుడు ఇంద్రియములలో సుఖ దుఃఖములు అనుభవిస్తారు. యోగస్థితిని పొందినవాళ్ళు ఇంద్రియాతీతులై స్మృతితోఇంద్రియ సుఖసంతోషముల కతీతమైన సచ్చిదానందమును హాయిగా అనుభవిస్తారు. ఈ స్మృతి మరుపుచేత కప్పబడియున్నది. అందువలన సామాన్యులు తెలిసికొ జాలకున్నారు.

ప్రబుద్ధులారా ! స్మృతియన్నది. నాలుగు విధములుగా ఉన్నది. యోగ స్మృతి, కర్మస్మృతి, స్వధర్మ స్మృతి, జన్మ స్మృతి. యోగస్మృతి యోగ సమాధి స్థితియందు శరీరమును పోషిస్తుంది. మోక్షానుభూతి అయిన సచ్చిదా

నందమును. పరమశాంతిని, తేజోమయ అమృతతత్వ అనుభూతిని జీవునకు అందించి, జీవునకు మోక్షానుభూతిని పొందింప చేయునది యోగస్మృతి. శరీరమున్నపుడు శరీరధర్మము ననుసరించి "శ్రోత్రంచక్షుస్స్పర్శనం చ రసనం ఘ్రాణమేవచ అదిష్టాయమనశ్చాయం విషయా నుపసేవతే "చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు, ఇంద్రియము లందలి విషయ వాసనలను మనసు జీవునకు అంతజేయుట వలన జీవుడు విషయ వాసనలు అనుభవిస్తున్నాడు. యోగసమాధి యందు ఇంద్రియములు, మనస్సు ఉండవు. కనుక స్మృతి అందించుట వలన జీవుడు మోక్షానుభూతిని పొందుచున్నాడు. ఇది యోగ స్మృతి. యోగస్మృతి ప్రకృతి విలక్షణమైనది. ప్రకృతి ఏవస్తువుతో సంభంధము లేనిది. నివృత్తి మార్గ స్వరూపమైనది. పరమపావనమైనది. శ్రేష్టమైనది.

కర్మస్మృతి అనగా మానవుడుజీవించుటకు, శరీరమును పోషించుకొనుటకు ఏదియో ఒక కర్మను విధిగా చేయవలెను కర్మను శరీరముకొరకు చేయుచున్నాము. జీవునకొరకు యేమి చేయవలయును? దైవభావనమును కల్పించ వలెను. అందుకు శరీరముతో ఏ పనినిచేయుటకు పూనుకొన్నను ప్రారంభమున "ఓమ్‌సత్" అనుశబ్దమును స్మృతికి తెచ్చుకొనవలెను ఆపని పూర్తి అయిన తర్వాత మరలా 'ఓమ్‌సత్' అని స్మృతికి తెచ్చుకొనవలెను. అటులు దైవశబ్దమును స్మృతికి తెచ్చుకొనుట వలన జీవుడు దైవభావనా స్మృతియందుంటాడు. అందువలన కర్మబంధములు జీవునికి అంటవు. కాలికి బురద అంటిన నీరుపోసిన తొలగిపోతుంది. అదే విధముగా కర్మలవలన జీవునకు అంటిన దోషము దైవశబ్ద స్మృతిచేత తొలగింప బడుతుంది. చేసిన కర్మఫలితము శరీరము కొరకు, స్మృతి 'ఓమ్‌సత్' జీవుని కొరకు ఫలితమిస్తుంది. అందువలన ప్రతి కర్మచేయునపుడు 'ఓమ్‌సత్' స్మృతికి తెచ్చుకొనవలెను. ఇది కర్మస్మృతి.

స్వధర్మస్మృతి అనగా-మానవుడు జీవించుటకుగాను వృత్తిగా ఏర్పరచు స్వధర్మమున ఏపుడుఏపని చేయవలెనో దానిని అప్పుడుతప్పక చేయుచుండ వలయును. రైతువర్షము కురిసినపుడు ఏమిచేయవలెను?

భూమిని ఎప్పుడు దున్నవలెను? ఎప్పుడు ఎరువులు వేయవలెను? ఎప్పుడు విత్తనము పెట్టవలెను? ఎప్పుడు చేనులో కలుపుమొక్కలను తీసివేయవలెను? ఎట్లు పైరులను రక్షించవలెను? ఎప్పుడు పంటను భద్రపరచుచుండవలెను? అనుధర్మములను మరువక తప్పక నిర్వహించుచుండవలెను. అదియే స్వధర్మస్మృతి. మరపు ఆవరించి యుండుటవలన తాముచేయవలసిన ధర్మములను మరచి పోతుంటారు. కష్టనష్టములకు గురియగుతుంటారు. కొందరు స్మృతియున్నను "రేపు చేద్దాం మాపు చేద్దాము" అనికాలమును గడుపుతుంటారు.''ఆలస్యం అమృతం విషం"ఆలసించిన అమృతం విషముగ పరిణమిస్తుంది. గనుక చేయవలసిన పని వెంటనే చేయవలెను. పనిచేయునపుడు "ఓమ్‌సత్" స్మృతి మరువరాదు. విద్యార్థులు చదువుటకు ముందు "ఓమ్‌సత్" అనిచెప్పి చదువవలెను. చదువు పూర్తయి, ముగించునపుడు ''ఓమ్‌సత్" అని పుస్తకము మూయవలెను. ప్రతిపనివారును పనికి ముందు, అంతిమమున "ఓమ్‌సత్" స్మరించుచుండవలెను.

స్త్రీలకు ప్రత్యేకించి ఏడు లక్షణములుండవలెను. మొదటి లక్షణము కీర్తి. సత్కీర్తిస్త్రీల ప్రవర్తన ప్రధానముగాఉండవలెను. స్త్రీ, పతివ్రతగా ఉండవలెను. అపకీర్తికరముగా జీవించుటకంటె మరణించుట మంచిది. పుట్టింటి వారికిని, అత్తయింటివారికిని విశాఖ తెచ్చిన విధముగ సత్కీర్తి తేవలెను. ఎవని భార్య వానికి సాక్షాత్తు లక్ష్మివలె నుండవలయును. అనగా భర్త సంపాదనను అర్థము చేసికొని, తృప్తిపడి, కోరికలను హద్దులో నుంచుకొని, యే విషయమునను భర్తమనసునకు బాధను కలిగించక,అనుకూల దాంపత్యములో నుండు స్త్రీ తన భర్తకు లక్ష్మివలె ఉంటుంది. స్త్రీలకు, సమ్యక్ వాక్కు ఉండవలెను. ముఖ్యముగా అందరితోను గౌరవముగా, మధురమగు మాటలతో మాట్లాడవలెను. "గారు" అను శబ్దమును పరిభాషగా నుంచుకొనవలెను. తనకంటె చిన్నవారినికూడ అబ్బాయిగారు, అమ్మాయిగారు అనుపలుకు చుండవలెను. ఎవరు తమ యింటికి వచ్చినను ఎంతో ఆప్యాయతగా, ఎంతో అభిమానముతో, మర్యాదగా మాట్లాడ వలెను.

స్మృతి అనునది స్త్రీలకు ప్రశస్తమైనది. స్త్రీలు తమ స్వధర్మమున ఏది మరచినను అది కుటుంబముపై ప్రభావం చూపిస్తుంది. పురుషులు యెంత సంపాదించినను జీవనాధారమైన ఆహారము స్త్రీచేతులయందున్నది. గనుక స్త్రీలు స్వధర్మ స్మృతిని చక్కగా అనుసరించవలయును. మరుపులేక జ్ఞాపక స్మృతిని సదా ఆచరణయందుంచుకొనవలయును. ఏదియును మరువరాదు.

స్త్రీలు పనిని చూచి భయపడరాదు. ఎంతపనినైనను శక్తివంచన లేక ధైర్యముగా చేయుచుండవలయును. ఇంటిపనులు చేయునపుడు దాసి మనిషివలె పనులు చేయవలెను. కార్యనిర్వహణయందు మంత్రివలె ఆలోచనలు చెప్పవలెను. కుటుంబ పరిస్థితులయందు పిల్లలను పోషించుట, ముసలివారికి సేవచేయుట, వ్యాధిగ్రస్తులకు ఉపచర్యలు చేయుటయందు భూమికున్నంత ఓర్పు కలిగి యుండవలెను. అనుకూల దాంపత్యమున అత్యంతసుఖము నిచ్చి భర్తను సంతోష పెట్టవలయును. ఇవి స్త్రీల కుండ వలసిన లక్షణములు.

ధ్యానమునకు స్మృతి ప్రధానమైనది ధ్యానము నాలుగు విధములుగ నున్నది. మొదటి ధ్యానము శ్వాసను అర్థము చేసికొనవలయును శ్వాస రెండు విధములైన కార్యములను నిర్వహించు చున్నది. మానవులు లోపలకు తీసెడి శ్వాస ప్రాణవాయువు. గర్భమునందుండునది, వెలుపలకు వదలునది అపాన వాయువు. రెండును కలిసికొని మానవులు తినిన ఆహారమును జీర్ణము చేసి, శరీరమునకు అందించి శరీరమును పోషించుచున్నది. ఇది యొకకార్యము. ఈకార్యము శ్వాస ముక్కునకు క్రిందిభాగమున గర్భమునందు ప్రవేశించి నిర్వహింపబడుచున్నది. ఇది మానవుని స్మృతి లేకయే జరుగుచున్నది. మొదటి ధ్యానము శ్వాస ముక్కునకు పైభాగమున సంచరించుచు స్మృతితోనడుపబడుతుంది. ఎంతసేపు తీసిన అంతసేపువదలవలెను. "ప్రాణాపానౌ సమాకృత్వా నాసాంభ్యంతరచారిణౌ" లోపలకు తీయునది. ప్రాణవాయువు. వెలుపలకు వదలునది అపానవాయువు. వీనిని సమముగా నడుపవలెను. వేగముగాతీసి నిదానముగా విడువరాదు. నిదానముగాతీసి వేగముగా విడువరాదు. శ్వాసను స్మృతితో నడుపుటయే మొదటి ధ్యానము

దీర్ఘముగా తీసి, దీర్ఘముగా విడువవలయును. ఇది శ్వాస జీవుని ఉద్ధరించు విధానము. శ్వాస శరీరమును పోషిస్తుంది. జీవుని ఉద్ధరిస్తుంది. మానవులు శరీరమును పోషించు శ్వాసనేతీయుచున్నారు. జీవునిఉద్ధరించుశ్వాసను మరచి పోతున్నారు.

రెండవధ్యానము-జ్ఞాననేత్రముతో అంతర్జ్యోతిని చూడవలెను. మానవులకు శరీర అంతర్భాగమున అంతర్జ్యోతి యున్నది. జ్ఞాన నేత్రమున్నది. స్మృతి క్రమలో పడినపుడు అంతర్జ్యోతిని జ్ఞాననేత్రముతో ప్రకృతి విషయ వాసనా స్వరూపమును నిద్రావస్తలో చూచుచున్నాడు. మానవుడు కండ్లు మూసికొని నిద్రించుచున్నాడు. శరీరమువెలుపలి మాంసమనేత్రములుచూచుట లేదు. కండ్లుమూసుకుని యున్నాడు. వెలుపలి సూర్యచంద్ర అగ్నిదీపముల వెలుతురు లేదు. పగలు వెలుతురులో మాంస నేత్రములలో చూచిన విధము గనే కలలోనూ చూచుచున్నాడు, బాహ్యనేత్ర ములతో చూచుచున్నట్లే అంతర్జ్యోతితో జ్ఞాననేత్రముతో చూచుచున్నాడు. ప్రతి ప్రాణి శరీరమున వెలుగు ఉన్నది. ఖదరీకీటకన్యాయ మంటారు. అనగా మిణుగురుపురుగు న్యాయము. మిణుగురుపురుగు మానవులకు ఒక న్యాయము "మానవులారా! నాలోని వెలుగును నేను చూచితిని. వెలుపలకు, తీసి మీకు చూపుచున్నాను. చూడుడు! నాలోయున్న వెలుగుమీలోనుఉన్నది. చూడుడు! ఆనందించుడు!" అని చెప్పుచున్నది. మానవుడు తనలోని అంతర్జ్యోతిని జ్ఞాన నేత్రముతో జూచి, స్మృతిచేత జీవుడు అనుభూతిని పొందుట రెండవ ధ్యానము.

మానవులు సామాన్యముగా ముక్కుతో శ్వాస నడుపు చున్నారు. వీటిని సూర్యనాడి, చంద్రనాడి అంటారు. ఇడ పింగళనాడి అనికూడా అంటారు. ఇవి గాక సుషుమ్నానాడియని మరొకనాడి ఉన్నది. అదిమూలాధారము నుండి సహస్రారము వరకు నడచుచుండును. శిశువు గర్భమునందున్నపుడు ముక్కు రంధ్రములతో శ్వాస నడుపదు. కొంత కాలము ముక్కులుకూడా ఏర్పడవు. అప్పుడు సుషుమ్నానాడిలో శ్వాస నడుపుతాడు. ధ్యాన సాధకుడు మూడవ ధ్యానమున శ్వాసను సుషుమ్నానాడిలో నడుపవలెను. అది

సహస్రారమును చేరుతుంది. జీవుడు శరీరమును విడచునపుడు నవరంధ్ర ములందు ఏద్వారమునుండి శరీరమును విడచిననూమోక్షార్హతలేదు. పునర్జన్మ కలదు. జీవుడు శరీరమును విడచునపుడు, సహస్రారము నందలి బ్రహ్మ రంధ్రము నుండి సుషుమ్నానాడి ద్వారా శరీరమును విడచిన, జీవుడు మోక్ష మును పొందుతాడు. అదే నివృత్తి మార్గము. అందువలన మూడవధ్యానమున జీవుని మార్గమును, సుషుమ్నానాడి శ్వాసను, స్మృతిని సిద్ధము చేయవలెను. ముక్కు, శ్వాసను సుషుమ్నానాడి శ్వాసను స్మృతితో నడుపుతుండవలెను. అప్పుడు ఆనందస్థితి అనుభూత మవుతుంది.

నాలుగవ ధ్యానము సమ్యక్ సమాధి. బ్రహ్మచర్య సన్యాస గృహస్థ వానప్రస్థాశ్రమములవారు అందరును ప్రతిరోజు సమాధిస్థితిపొంది ధ్యానము చేయవలయును. "ఇక ధ్యానము చేయనవసరములేదు. మేము మోక్షా ర్హులమైతిమి. పరిపూర్ణమును పొందితిమి. ఇకమేముచేయవలసినదేమియులే"దని అపోహ పడుతుంటారు. అదిపొరపాటు. కడసారిశ్వాసవరకు నిత్యము ఉదయము సాయంత్రము తప్పక నాలుగవ ధ్యానము చేయుచుండవలెను. శరీరమునకు ఆహారము ఎంత అవసరమో జీవునకు ధ్యానము అంతఅవస రము. ఒక రోజు అనేక పిండివంటలుతో అనేక కూరలతో, ఎంతో రుచి కరముగ భోంచేసిన సరిపోవునా ? ప్రతి రోజు భోం చేయవలెను. అదే విధముగ ప్రతిరోజు సమాధిస్థితి ధ్యానమును చేయుచుండవలయును. నాలు గవ ధ్యానమున సచ్చిదానందమును, పరమశాంతిని, తేజోమయమును, అమృత తత్వమును. స్మృతి జీవునకు అనుభూతినిచ్చి బంధరహితుని జేస్తుంది.

స్మృతినిమరపుచేత ఆవరింపబడకుండులాగున జాగ్రత్తగా నుంచుకొన వలెను.స్మృతిజీవునకు ముఖ్యబంధువు. శరీరమునకు ముఖ్యబంధువులు ఆరుగు రున్నారు. మానవునకు తల్లి, తండ్రి, తోబుట్టువు. భార్య,సంతతి, హితులైన బంధువు లెట్లున్నారో అదే విధముగ జీవునకు ఆరుగురు బంధువు లున్నారు. అందు మొదటి బంధువు స్మృతి. జీవుని మరణావస్థయందు సర్వమును విడచు చున్నవి. కాని స్మృతి విడచుటలేదు. జీవుడుమోక్షమును పొందినను, జీవునకు

మోక్షానుభూతిని నిచ్చునది స్మృతియే అయి ఉన్నది. మోక్షమునందు స్మృతి జీవునకు బంధువై ఉన్నది. జీవునకు ఆత్మ రెండవ బంధువు. ఇదే ఉద్ధరించు బంధువైయున్నది. "జీవుడు ఆత్మచేతనే తన్నుతాను ఉద్ధరించుకొనవలెను. మూడవ బంధువైన జ్ఞానముచేతనే జీవుడు పరమశాంతిని పొందగలడు. జీవునకు పరమ శాంతినిచ్చు బంధువు జ్ఞానమై యున్నది.

జీవునకు నాలుగవ బంధువు ధర్మము. జీవుని రక్షించు బంధువు ధర్మము. శరీరమునకు పాదరక్ష లెటువంటివో జీవునకు సర్వరక్షలు అట్టివే! "ధర్మోరక్షతిరక్షితః" మనము ధర్మమును రక్షించిన ధర్మము మనలను రక్షించును. శరీరము శాస్త్రధర్మమును, స్వధర్మమును తప్పక అనుసరించుచుండవలెను. ప్రత్యేకించి దైవోపాసన యందు పండితుల బుద్ధికి తోచినయట్లు దైవోపాసన చేయరాదు. తత్వవేత్తలైన గురువులనాశ్రయించి "నష్టోమోహా స్మృతిలబ్ధః"స్మృతిని కప్పిపుచ్చియున్న మరుపునుతొలగించుకొనవలెను. శరీరము ధర్మమును తప్పి ఏ చిన్న విషయమున ప్రవేశించినను జీవునకు పెద్ధ ప్రతిబంధక మవుతుంది. గనుక శాస్త్ర ప్రమాణ ధర్మమును స్మృతియందుంచుకొని, అధర్మమునప్రవేశించక, ప్రకృతిభ్రాంతిలేక, భ్రమలకు లోనుగాక దేహభిమానముతో, విషయవాసనా సుఖభోగములకు బద్ధులుగాక, వైరాగ్య బుద్ధితో కోరికలు తొలగించుకొని, ధర్మబుద్ధితో ప్రవర్తించుచుండవలయును.

జీవునకు అయిదవ బంధువు సత్యము. శరీర ధర్మమున స్త్రీలకు భర్త ఏ విధముగ పోషణకర్తగా ఉంటాడో జీవునకు సత్యము అట్టిబంధువై ఉంటుంది. జీవుడు సత్యమును తెలిసికొనవలెను. ఈ జగత్తంతయు రెండు విధముల వస్తువులచేత పరివరన చెందుతున్నది. మొదటిది నిత్యవస్తువు. రెండవది అనిత్యవస్తువు. జగత్తున కనిపించునదంతయు అనిత్యము. కనిపించెడి సర్వమునకు ఆధారముగ, కనిపించక యుండునది నిత్యము. అదే

సత్యము. నశించనిదీ, మార్పులు చెందనిదీ ఏదియో ఆదే సత్యము. "జీవు నకు దుఃఖ నివృత్తి యెటులు గలుగును?" నని తెలిసికొనుటయే సత్యము. జన్మవలన దుఃఖముకలుచున్నదని తెలిసికొనవలెను. అదియే సత్యము."జన్మ రాహిత్యమే దుఃఖనివృత్తి"యని తెలిసికొనుటయే సత్యము.సత్యమైన అక్షయ సుఖమే మోక్షానుభూతి. జీవుడు"కనుపించునదంతయు నశించునది"అని తెలిసి కొనవలెను. "యద్దృశ్యంతన్నశ్యం" దేహేంద్రియములతో అనుభవించుసుఖ భోగములన్నియు దుఃఖమునకు కారణభూతమగు"నని తెలిసికొనవలెను. జీవుడు స్మృతితో అనుభవించు సచ్చిదానందపరమ శాంతితేజోమయం, అమృత తత్వం సత్యమని తెలసికొన వలెను. అడియే జన్మరాహిత్య మోక్షానుభూతి. జీవుడు చేరవలసిన సత్యస్థానము ఆదే!.

జీవునకు ఆరవ బంధువు అహింస. ఏ ఇతర ప్రాణికి బాధను కలిగించక మిత్రభావముతో నుండుట, "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణయేవచ" తనప్రాణముమీద తనకు ఎంతవ్యామోహముంటుందో సకలప్రాణులకు వాటి ప్రాణము మీద అంత వ్యామోహముంటుంది. తనకు ప్రాణాపాయము అనిన ఎంతో భయపడతాడు. తప్పించు కొనుటకు ఎంతో ప్రయత్నము చేస్తాడు. ఎందరినో సహాయము కోరుతాడు. తాను మరొక ప్రాణిని అతి సులభముగా బాధిస్తాడు. దాని బాధను కొంచమైనను గుర్తించడు. మానవుడు సంఘమును ఆశ్రయించవలెను. "సంఘం శరణంగచ్ఛామి". మానవులేకాదు క్రిమికీటకములు, పక్షులు, జంతువులుకూడాతనసంఘములోనివే. సృష్టియందు మానవుడు సకల ప్రాణులకుసహాయము చేసి, వాటి బాధలను నివారణచేయ గలడు. వాటిని పోషించగలడు. సృష్టియందు ఇది మానవులకున్న ప్రత్యేక శక్తి. దానిని మానవులు సార్థకము చేసికొనవలెను. ఒక చెట్టునకు చీడపట్టి నది. మరొక చెట్టు నివారణ చేయలేదు. మానవుడు నివారణ చేయగలడు. ఒక ఆవునకు దెబ్బ తగిలినది. మరొక ఆవు బాధనివారణ చేయలేదు. మానవుడు నివారణ చేయగలడు. అదే విధముగ పక్షులకు, జంతువు లకు మహోపకారము చేయుశక్తి బాధనివారణచేయు శక్తి మానవులకున్నది.

ఆశక్తిని సద్వినియోగము చేయవలెను. ప్రాణులకు సుఖముచేకూర్ప వలెను. ప్రాణులకు బాధను కలిగించరాదు.

జీవుడు ఒక శరీరమును విడచి, మరొక శరీరమును ప్రవేశించునపుడు స్మృతి జీవునివెంటనేయుండి, యోగ సమాధియందున్న వాని శరీరమును పోషించిన విధముగా, గర్భమునందున్న శిశువు శరీరమును పోషిస్తుంది. గర్భమున యున్న శిశువునకు ఇంద్రియములు, చైతన్యము ఉండవు. కొంతకాలము ఇంద్రియములు ఏర్పడవు. తల్లి అనుభవించెడి శబ్దస్పర్శ రూపరస గంధాది విషయ వాసనలన్నియు గర్భము నందలి శిశువు నందుండు జీవునకు చెందుచున్నవి. వాని జీవితమున అవి ప్రతిఫలించు చున్నవి. ఇంద్రియములు లేని జీవుడు స్మృతితోనే తెలిసికొనుచున్నాడు. తల్లివిషయ వాసనలు గర్భమునయున్న జీవునకు స్మృతివలన తెలుస్తున్నవి. కనుక గర్భవతిగయున్న స్త్రీ దైవభావనతో ఉండవలెను. దైవ శబ్దములు ఆత్మతత్వ ప్రబోధములు వినుచుండవలెను. ధ్యానము చేయుచుండ వలెను.

గర్భవతియగు స్త్రీ "తాను ఏ విషయ వాసనా స్వరూపమైన కర్మ చేసి ననూ అది తన బిడ్డకు చెందుతుంది." అనుస్మృతి జ్ఞానముతో నుండవలెను, సాత్విక గుణసంపన్నముగా నుండవలెను. రాజసగుణ తామసగుణ కర్మలు పూర్తిగ నిషేధించవలెను. కామ, క్రోధ, లోభ, మోహ, మద,మత్సరములు పూర్తిగ నిషేధించవలెను గర్భవతి కోరికలు కోరి అవి నెరవేర్చుకొనలేక కొరతపడిన మనస్సుతోనే ఉన్నయెడల అది గర్భమునందలి జీవునకు జీవితపర్యంతము ప్రతిబంధకమవుతుంది. కామాగ్ని నిరంతరము కాల్చివేస్తునే ఉంటుంది. జీవునకు సంఘ సంస్కారముగాని, సంఘ దోషముగాని తల్లి గర్భమునందే, తల్లి సంఘముతోనే ప్రారంభ మవుంది. అందువలన తల్లి తన సంతతికి సిరిసంపద భోగభాగ్యములకన్న సద్గుణములు,జ్ఞానము, సత్ప్రవర్తన భద్రపరచవలెను. గర్భవతియగుస్త్రీయెప్పుడునూ కోపముతో ఉండినగర్భమందలి శిశువు పరమ దుర్మార్గుడుగాను, హంతకుడుగాను, లోక కంటకుడుగాను,

దుష్టస్వభావముగలవాడుగాను నుండును. గనుకగర్భవతియగుస్త్రీ స్మృతిని మరువక, స్మృతిని యెదుటబెటుకొని యేపనినైనను చేయవలెను. సత్త్వగుణమును ఆశ్రయించవలెను. రాజస గుణమును, తామస గుణమును, బహిష్కరించవలెను.

మానవునకు కష్టములు, దుఃఖములు విషయ వాసనలతో ప్రారంభమౌతుంటాయి. కంటితో ఒక వస్తువును చూచుచున్నాడు. దానిపై విషయ వాసనగలుగు చున్నది. ఆ విషయవాసన బలమును చేకూర్చుకుని కోరికగా రూపొందుచున్నది. "కోరికను నెరవేర్చుకొనవలయును" అనుకర్మయందు ప్రవేశించుచున్నాడు. స్మృతిని భ్రమలయందు పడవేయు చున్నాడు. స్మృతిని మరుపుచేత కప్పివుచ్చి, భ్రమలయందు పడవేసి, బుద్ధినిమాయచే కప్పి పెట్టి. బుద్ధిలేని పనిచేసి కష్టములకు గురిఅవుతున్నాడు. పాపములకు బద్ధుడవుతున్నాడు. అందువలన జ్ఞానులైన వారు స్మృతిని మరుపుచే కప్ప బడనీయక, భద్రముగా నుంచు కొని బుద్ధిని సద్వినియోగముచేసుకొనవలెను. బుద్ధిలేని పనులుచేసి, కష్టములకు, పాపములకు గురికాకూడదు.

సామాన్య మానవులస్మృతి యేవయసువారికైనను మరుపుచేత కప్పబడి ఉంటుంది. ఈ మరుపును తొలగించుకొనుటకు ఎంతకాలము పట్టును? అనునది నిశ్చయించలేము. శిశువు గర్భములో ఉన్నపుడేమరుపు స్మృతిని వదలి, ఆత్మతత్వస్వరూపజ్ఞానమును పొందవచ్చును. రాజవర్ధనుడను రాజు వృద్ధాప్యమున స్మృతిని పొంది మోక్షార్హుడయ్యెను. కనుక ఏ వయస్సు ఎంత కాలము, అను నిర్ణయములేదు. సంవత్సరమా? ఆరునెలలా? మూడు నెలలా? ఒకవారమా ? ఎంతకాలములో స్మృతిని పొందవచ్చు? అంగుళీమాలుడు హత్యచేయుటకు వచ్చెను. అప్పుడు వాడు స్మృతి పూర్తిగా మరుపుచేకప్పబడి దుష్టసంకల్పముతో నున్నాడు. కేకవేసినాడు. నేనువెనుకకు తిరిగిచూచి నిలచితిని. అంగుళీమాలుడు నన్నుచూచుచూ సమీపించి, పాదాక్రాంతుడై క్షమాభిక్షను అర్థించాడు.

అంగుళీమాలునకు అతిస్వల్పకాలములోనే మరుపు తొలిగి, ఆత్మ స్వరూప జ్ఞానము స్మృతికి వచ్చినది నన్ను భిక్షుకు అహ్వానించిన ఆమ్రపాలి భిక్షుపూత్రియగు సరికే మరుపు తొలగి, ఆత్మజ్ఞానము స్మృతికి వచ్చి "నాది" అనేభ్రాంతి, "నేను" అను అహంకారము ఆమెకుక్షణకాలములో తొలగిపోయి నది. "నేనుమహా అందగత్తెను. గొప్పనాట్యకత్తెను. గొప్ప సంగీత విద్వాం సురాలను"అనుఅహంకారమును వదలివేసినది.నాకుఅనేకమామిడితోటలున్నవి అనేక భవనము లున్నవి. ఆభరణములున్నవి" అను మమకారమునువదలి వేసినది. తన ఆస్తిని సర్వమును, భవనములను, తోటలను, ధన కనకవస్తు వులను భిక్షుసంఘములకు త్యాగముచేసి, దేహభ్రాంతిని వదలి కాషాయమును ధరించి బుద్ధభిక్షుణియైనది. ఎంతకాలములో వాళ్ళకు స్మృతి జ్ఞానము కలిగినదని చెప్పగలరు! కనుక మరుపు తొలగుటకు, స్మృతి కలుగు టకు కాలనిర్ణయములేదు. సంవత్సరముల పర్యంతము గురువులనాశ్రయించి, గురుసేవచేయుచూ గురు ఆజ్ఞను పాలించుచున్ననూ మరుపు తొలగని వారు కలరు. అందువలన స్మృతి జ్ఞానమునకు కాలపరిమితిలేదు. అది వారివారి ప్రజ్ఞాశక్తి మీద, సంస్కార ప్రభావము మీద ఆధారపడి ఉన్నది.

"స్మృతి భ్రమవలన"యోగానుభూతిని పొందితిమి. గురువులము. పీఠాధి పతులము"అని చెప్పుకొనువాళ్ళుకూడా యోగభ్రష్టులై నిర్గుణ సత్వగుణ రాజస గుణములుకూడా విడచి, తమోగుణ బద్ధులై, సామాన్యులకంటె హీనగుణబద్ధులై నీచకర్మలుచేసి, నీచజన్మలకు బద్ధులవుతుంటారు. భయంకరవ్యాధిగ్రస్తు లవుతారు. దేవదత్తుడు "నేను గురువును పీఠాధిపతిని" అనిచెప్పుకుని, ఒక గురు పీఠమును స్థాపించి కొందరిని శిష్యవర్గముగా చేసుకొని ప్రబోధమును చేస్తుండేవాడు. మనసునందు రాగద్వేషములు పోలేదు. దాని వలన మరుపు స్మృతిని భ్రమపడి, బుద్ధినశించి, వానిలో కామ,క్రోధ, లోభమోహమద మత్స రములు విజృంభించినవి. అసత్యములాడుచు ఇతరులను,ద్వేషించి,నిందించు టయేగాక, పరమ దుర్మార్గులు పాపభూయిష్ఠులుచేయు హత్యప్రయోగముచేసి నాపైపెద్ద బండను దొర్లించాడు. "ధర్మోరక్షతి రక్షితః" ధర్మము రక్షింప

బడినది. భయంకరమైనబండ నా ప్రక్కనబడి, బ్రద్దలై చిన్న చిన్న ముక్కలైనది. పాపము ఫలించినది. దేవదత్తుడు క్షయరోగ పీడితుడై భయంకర దుర్మరణమును పొందినాడు. అందువలన ఎట్టిపరిస్థితులయందును స్మృతిని, భ్రమలయందు పడకుండ, మరుపుచేత కప్పబడకుండా భద్రపరచుకోవాలి.

స్మృతిజ్ఞానము కొంతమందికి వైరాగ్యము చేత కలుగుతుంది. తనకు అత్యంతము ప్రియమైన వస్తువు. తనసర్వస్వముగ నమ్మియున్నవస్తువు తనకు దూరమైనపుడు వైరాగ్యముచేత స్మృతిజ్ఞానము కలుగుతుంది. విజయవర్మ యను పౌరుడొకడుండేవాడు. అతనికి అత్యంతఅపురూప సౌందర్యవతి, అనుకూలవతియగు భార్య ఉండేది. గుణవంతుడైన కుమారుడున్నాడు. భార్య కొడుకులను తనసర్వస్వంగాభావిస్తుండేవాడు ఒకరోజునదిని దాటుటకుపడవ యందు వీరు ముగ్గురు ప్రయాణము చేస్తున్నారు. తలవని తలంపుగా సుడి గాలివచ్చి పడవను ముంచి వేసింది. విజయవర్మ మాత్రము ఈదుకుని గట్టును చేరాడు. భార్య, కుమారుడు నదిలో మునిగి మరణించారు. అతనికి లోకమంతయు అంధకార బంధురమైంది. వైరాగ్యముచేత స్మృతి జ్ఞానము గలిగి. బుద్ధభిక్షు సంఘమునచేరి, ఇంద్రియ విషయ వాసనలను బహిష్కరించి, స్మృతిని భద్రపరచుకొని సాధనాదిధ్యానముననుసరించి, ఆత్మ సాక్షాత్కార స్వరూప జ్ఞానమును పొంది మోక్షార్హుడైనాడు.

మానవులు కొందరు దివ్యదృష్టి గలిగి దూరప్రాంతము లందలి దృశ్యములను శబ్దములనుచూడగలిగి, వినగలిగి ఇతరులకు చెప్పగలుగుతారు. ఇది ఇంద్రియ జ్ఞానముకాదు. ఇంద్రియనేత్రములతో చూచుటలేదు. శ్రవణేంద్రియముతో వినుటలేదు. మనసుతో జీవునకు అందించుటలేదు. స్మృతివిషయములనుగ్రహించి జీవునకు అందించుట ఒక మార్గము దివ్యదృష్టి. స్మృతిఅనేది విషయమును గ్రహించిజీవునకు అందించు మార్గము. దానిని జీవుడుఇంద్రియముల ద్వారా వెలిబుచ్చుచున్నాడు. ఇది స్మృతి ప్రభావము.

స్మృతికి సత్సంగ్ ఆధార భూతమైనది. ఎటువంటి మరుపుతో ఉన్నవారైనను సత్సంగముతోచేరి, శ్రద్ధగా శ్రవణమనన, నిధి, ధ్యాసలు చేయు

చుండిన, మరుపు తొలిగి, స్మృతిజ్ఞానము లభించగలదు. జన్మాంతర సంస్కారము లేకపోయినను సంఘమునకు సంస్కారమును కల్పించెడి శక్తికలదు. ఒక భిక్షుసంఘ విహారము నందు పరిచర్యలు చేసే స్త్రీఒకతె ఉండేది. ఆమె తనపని చేసుకొంటూ భిక్షువులు ఒకరితోనొకరు చెప్పుకొను అనుభవబోధామృతమును శ్రద్ధగా వింటుండేది. మనసు విషయవాసనా స్వరూపమైన వికారముల నుండి విరక్తిని పొంది, ఇతరులతో మాటలాడటం, ఇతరుల మాటలు వినడం వాళ్ళను పూర్తిగా గౌరవించి మౌనముగా ఉండటం అభ్యసించెను. భిక్షువులు ఆమె లక్షణములను గుర్తించి, ఆత్మతత్వమును ఆమెకు బోధించి ప్రథమ ధ్యానమును నేర్పారు. మరుపుతొలగి స్మృతి ప్రకాశించి, స్మృతి జ్ఞానమునుపొంది. ఆత్మానందానుభూతిని ఆమె పొందింది. కనుక సంఘము వలన మరుపు తొలగి స్మృతి కలుగగలదు.

మానవులందు కొందరు మహానుభావులు కాలజ్ఞానము గలిగి సుదూర భవిష్యత్తున ఈ లోకమునందు జన్మించు మహానుభావుల చరిత్రను కాల పరివర్తనను గ్రంథ రూపమున లోకమునకు తెలియబరుస్తుంటారు. జీవుడు స్మృతి వలన అట్లు తెలిసికొనుచున్నాడు. అంతటి మహత్తరమైన ప్రభావ శక్తి స్మృతికి ఉన్నది. అంతటి మహత్తరశక్తిని మానవులు తన హృదయమునందుంచుకొని, మరుపుచేత కప్పిపుచ్చి, వ్యర్థముచేసి, జీవితములను వ్యర్థము చేసుకొనుచున్నారు. స్మృతిజ్ఞానము గలవారు తాను ఎప్పుడు మహా పరినిర్వాణము పొందునది, ఎచట పొందునది, తెలిసికొని, ఆ విధముగా ప్రవర్తిస్తుంటారు. మౌద్గల్యుడు కార్తీక పున్నమినాడు తన జన్మస్థానమున మహాపరినిర్వాణమును పొందుదునని తెలియబరచి, ముందుగనేజన్మస్థానము చేరి, బంధుమిత్రభక్తులకందరకు తెలియబరచి, అంత్యక్రియా విధానమును నిర్ణయించి, కార్తీక పున్నమినాడు మహా పరినిర్వాణమును పొందెను. ఇది స్మృతి ప్రభావము.

మానవులలో ఒక్కమాటతో స్మృతిని మార్చుకొని ఆత్మతత్వ స్వరూప జ్ఞానులైనవారును కలరు. సుదత్తుడను గొప్ప శ్రీమంతుడుండేవాడు. అతనిని

ప్రజలు అనాథ పిండదు అని పిలుస్తూ ఉండేవారు. అతడు పేదలపట్ల చాలా వితరణ కలిగిఉండేవాడు. కనుక అతణ్ణి అంతా అనాథ పిండదుడనే వాళ్ళు. ఒక రోజు నాదర్శనమునకు వచ్చాడు. వానిని చూచి 'బుద్ధజ్ఞాన భిక్ష పొందుటకు వచ్చితివా?' అని ప్రశ్నించాను. ఆమాటతో అనాథ పిండదుడు అత్యంత ఆనందభరితుడై మరుపును తొలగించుకొని స్మృతిజ్ఞానము ను పొంది బుద్ధ భిక్షువై తన సంపదనంతా వెచ్చించి బుద్ధ విహారం నిర్మించినాడు. గురు దక్షిణగ సమర్పించినాడు. అదియే సమ్యక్ స్మృతి.

మానవులు నిద్రలేచినది మొదలు పరుండు వరకును స్మృతిని మరువ రాదు. నిద్రలేచిన వెంటనే దైవభావనను స్మృతికి తెచ్చుకుని మొట్టమొదటి శబ్దము "ఓమ్‌సత్" అని ఉచ్చరించవలెను. భూమి మీద పాదముపెట్టు నపుడు మొట్టమొదటి శబ్దం 'ఓమ్‌సత్' అనవలెను. విద్యార్థులు చదువుటకు పుస్తకముతీసికొనునపుడు 'ఓమ్‌సత్'అని తీసికొనవలయును. చదివి ముగించు నపుడు 'ఓమ్‌సత్' అనవలెను. ఫలహారముగాని, ఆహారముగాని తీసికొను నపుడు 'ఓమ్‌సత్'అనవలెను. ముఖము కడుగుకొను నపుడు, స్నానముచేయు నపుడు 'ఓమ్‌సత్' అనవలెను. అన్నము దగ్గర కూర్చున్నపుడు, లేచునపుడు 'ఓమ్‌సత్' అనవలెను. ఇతరులకు యే వస్తువైనను దానమిచ్చునపుడు 'ఓమ్‌సత్' అని యివ్వ వలయును. రాత్రి పరుండునపుడు ఓమ్‌సత్ అని పరుండ వలయును. స్త్రీలు వంట చేయునపుడు, అన్నము పాత్రగాని, కూరపాత్ర గానిపోయిమీద పెట్టునపుడు. 'ఓమ్‌సత్'అనవలయును దించునపుడు'ఓమ్‌సత్' అని దించవలయును.పురుషులకువడ్డించునపుడు(అన్నము, కూరలు మున్నగు నవి వడ్డించునపుడు)ఓమ్‌సత్ అనవలయును. అన్నము తినునపుడు. ఇతర విషయతొల్యముగా మాట్లాడకూడదు. దైవభావనతో స్మృతిని భద్రపరచుకొని తినవలయును. ప్రతితల్లి, తండ్రి, యితర పెద్దలు తమ యింటి యందున్న పిల్లలకు గురువులవలె స్మృతి శబ్దమైన 'ఓమ్‌సత్' అను శబ్దమును అభ్యాసము చేయించవలయును. ఇదే సమ్యక్ స్మృతి ధర్మము.

# పన్నెండవ అధ్యాయము
## (కర్మ యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షులారా! జన్మించిన ప్రతి మానవుడు అనుక్షణం ఏదో ఒక కర్మను చేస్తునే ఉంటాడు. కాయంతో చేసిన కర్మనే కర్మగా లోకం గ్రహిస్తుంది. మనస్సుచేత, వాక్కుచేత చేసేకర్మలను గమనించటంలేదు. కాయంతోచేసే కర్మలఫలితం కంటే వాక్కు, మనస్సులతోచేసే కర్మఫలితాలు ఒకదానికంటే ఒకటి ఎక్కువగా ఉంటాయి. మానవుడు కర్మ సన్యాసం మంచిదను కొంటాడు. అదితప్పు. కర్మసన్యాసమంటే ఆ కర్మవల్ల కలిగే ఫలితాన్ని ఆశించకుండా కర్మచేయటమన్నమాట. ఒక్కొక్కప్పుడు తానుచేయవలసిన కర్మను (బాధ్యతను) చేయకపోవటంకూడా పాపం అవుతుంది. ఈ విషయం మీకు బోధించటానికి ఒక సంఘటన వివరిస్తాను. వినండి!

ఒకానొకప్పుడు ఒక భిక్షు సోదరుడు విరేచనాలతో బాధపడుతూ తన విసర్జన (మలం)పైనే పడిపోయాడు. అప్పుడు భగవానుడు భిక్షువుల విహారాలను సందర్శిస్తూ ఆ రోగివిహారానికి వచ్చాడు. అప్పుడు ఆనందుడుకూడా వెంట ఉన్నాడు. తాను విసర్జించిన మలంపైనే, సొమ్మసిల్లి పడిపోయిన ఆ భిక్షును చూచి "సోదరుడా!" నీజబ్బేమిటి? అనిప్రశ్నించాడు. "విరేచనాలతో బాధపడుతున్నా"నని అతడుచెప్పాడు. "నీకెవరైనా సపర్యలుచేస్తున్నారా?" అని అడిగాడు ఆయన! "లేదుప్రభు!" అన్నాడు ఆ భిక్షు. "ఎందుకని? భిక్షు సోదరులు నిన్ను చూచుకోవటం లేదా?" అని అడిగాడు తథాగతుడు. "నేను భిక్షుగణానికి నిరుపయోగిని. అందుకని వీళ్ళు నన్ను పట్టించుకోవటంలేదు" అన్నాడు అభిక్షు. వెంటనే తథాగతుడు!" ఆనందా! వెళ్ళి నీళ్ళు తీసుకురా! ఈ సోదరుణ్ణి నేనేశుభ్రపరుస్తాను"అని ఆ రోగి శరీరమంతా కడిగాడు. తథాగతుడు అతని తలవైపూ, పూజ్యఆనందుడు కాళ్ళవైపూ పట్టుకొని అతణ్ణి పడకమీద పడుకోబెట్టారు. ఆ తర్వాత భిక్షుక సంఘాన్ని సమావేశపరచి ఇలా ప్రశ్నించాడు బుద్ధుడు.

'సోదరులారా! ఫలానావిహారంలో ఒకసోదరుడు జబ్బుపడిఉన్నాడా?

"అవును ప్రభూ!" భిక్షుకు లన్నారు.

"అతని జబ్బేమిటి?"

"ప్రభూ! అతను విరేచనాలతో బాధపడుతున్నాడు"

"మరి-మీలో ఎవరైనా అతణ్ణి గురించి పట్టించుకొంటున్నారా?"

"లేదు-ప్రభూ!"

"ఎందువల్ల?" తథాగతుడు ప్రశ్నించాడు మళ్ళీ.

"ఆ సోదరుడు-సోదరగణానికి నిరుపయోగం ప్రభూ.! వృద్ధుడైనాడు. ఏ పనిచేయ్యలేడు. అందుకని పట్టించుకోలేదు" భిక్షుగణం సమాధాన మిచ్చింది. అప్పుడు తథాగతుడు వాళ్ళవైపు జాలిగా, బాధగా చూచి "సోదరులారా! మీకుతల్లిదండ్రీ ఎవరూలేరుగదా! మీరుపరస్పరంశ్రద్ధచూపిం చుకోకపోతే మరెవరు చూపిస్తారు. చెప్పండి! సోదరులారా! నాపై శ్రద్ధ చూపించేవాళ్ళు రోగగ్రస్తులపైకూడా శ్రద్ధచూపించాలి. తోటిభిక్షునిపైశ్రద్ధ వహించటం ప్రతిభిక్షుని కనీసధర్మం-ఇది భిక్షుని స్వకర్మ. ధర్మాన్ని ప్రతి ఒక్కడు పాటించకపోతే తనకేకాదు. సంఘానికికూడా ద్రోహం చేసినట్లవు తుంది" అన్నాడు. కనుక పరధర్మం ఎంతటి భయావహమో స్వధర్మచ్యుతి కూడా అంతటి పాపహేతువు అవుతుందన్న విషయం మనము గమనించాలి.

## శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :

కర్మ అనునది - సకర్మ, స్వకర్మ, అకర్మ, వికర్మ. ప్రవృత్తికర్మ, నివృత్తికర్మ, కామ్యకర్మ, నిష్కామ్యకర్మ, సాత్వికకర్మ, రాజసకర్మ. తామస కర్మ, దైవికకర్మ అని అని 12 విధములుగా ఉన్నది. "సకర్మ" యనగా పరులకు ఉపకారముచేయు కర్మ. ధర్మశాలలు, వైద్యశాలలు, పాఠశాలలు కట్టించుట మొదలైనవి. త్యాగులైనవాళ్ళు అనేక శ్రమలకోర్చి, ధనము వ్యయముచేసి ధర్మ శాలలు, విద్యాశాలలు నిర్మిస్తారు. ప్రయాణికుల వసతి కొరకు మంచి నీటి కేంద్రములను ఏర్పరుస్తారు. బావులను త్రవ్విస్తారు,

జలాశయములను ఏర్పరుస్తారు. అన్నదాన సత్రములను నిర్వహిస్తారు. మార్గములందు చల్లని నీడ నిచ్చు చెట్లను, పెంచుతారు. ఇవి సకర్మలు. పుణ్యప్రదమైనవి.

కొందరు విద్యాదానము, వైద్యదానము చేస్తారు. వారు విద్యార్థులకు అన్నము పెట్టి విద్యాభ్యాసము చేయిస్తారు. బీదవాళ్ళకు పెళ్ళిళ్ళుచేసి వారి జీవితాలను చక్కదిద్దుతారు. కాళ్ళు, కళ్ళు, మొదలగు అవయములు లేని వారికి(వికలాంగులకు)ఆశ్రయం యిచ్చి ఆదరించిపోషిస్తుంటారు. ప్రయాణీకు లకు వసతి కొరకు మార్గములను పరిశుద్ధం చేస్తారు. వృద్ధులను, అనాధ లను, ఆదరించి పోషిస్తారు. ఇట్లా పరులకూ, పరప్రాణులకూ, మహోప కారము గలిగించు కర్మలన్నియు సకర్మలుగా చెప్పబడు చున్నవి.

"స్వకర్మ"యనగా తాను చేయవలసిన కర్మను సక్రమముగా నెర వేర్చుట. దీనినే స్వధర్మ మనికూడా అంటారు. ధర్మములన్నింటియందు స్వధర్మము శ్రేష్ఠమైనది. స్వధర్మము దోషముయుక్తమైనను, దానిని తప్పక చేయవలెను. లేకున్న అదిఅనేకమందికి ప్రమాదమును, బాధను కలిగిస్తుంది. ఒక సైనికుడున్నాడు. శత్రువులు దండెత్తి తన రాజ్యముపైకి వస్తున్నారు. ఆ సైనికుడు వారిని ఎదిరించి చంపవలయును. ఇది హింసతోకూడినదైనను తప్పక చేయవలయును. లేకున్న దేశద్రోహము, రాజద్రోహము చేసినట్లగును. రైతు సకాలమునకు పైరు పెట్టి తగు ఎరువులు, వేసి పంటను పండిం చకపోతే ప్రజలకే గాక, ప్రభువునకుకూడా ఆహార సమస్య ఏర్పడుతుంది. వ్యాపారస్తుల వ్యాపారము స్తంభించి పోతుంది. ఒక్కడు తాను చేయవల సిన కర్మను చేయకున్న దాని ఫలితము అనేక మందికి అనుభవిస్తారు. పాద రక్షలుచేయు వాడైనను, తనపని తానుచేయకున్న అనేకమందికి బాధకలుగు తుంది. ప్రతివ్యక్తి స్త్రీలు,పురుషులు, కళాకారులు మొదలైనవాళ్ళుతమ పనిని నియమిత కాలమునందు సూర్యుడెట్లు నియమమును తప్పక ఉదయిస్తు న్నాడో అట్లు తప్పక చేయవలెను.

అకర్మయనగా తాము చేయవలసిన పని చేయక, సోమరులై పరుల కష్టమును తిని బ్రతుకుట. పని చేయనివాడు ఎంతో పాపము మూట గట్టు కొంటున్నాడు. పనిచేసి అన్నము తినవలెను. అన్నము దగ్గర కూర్చుని, "నేను పనిచేసి అన్నము తింటున్నాను." అని అంతరాత్మకు సమాధానము చెప్పి, ఆ తర్వాత అన్నము తినవలెను. శరీరమును పోషించుకొనుటకు పనిచేయ నవసరము లేని శ్రీమంతులు, ప్రభువులు, వృద్ధులు, జీవుని ఉద్ధరించు ధ్యానము, శాస్త్రపఠనమును చేసి అన్నము తినవలెను. విద్యార్థులు తమపాఠములు చదివిన తర్వాతనే అన్నము తినవలెను. స్త్రీలువంటలు మంచి రుచికరముగ, తినుటకు ఆహ్లాదకరముగ నుండునటుల చేయవలెను. పనిచేయని మానవులు ఆ కర్మ దోషబద్ధులవుతారు. పాపము చేయుచున్న వారవుతారు.

కాలపరిమాణము ఇరువది నాలుగుగడియలు. అందు యెనిమిది గడియలు నిద్రకూ, యెనిమిది గడియలు తన జీవితపోషణ కర్మకూ, నాలుగు గడియలు విహారవిశ్రాంతులకు వినియోగించుకొనవలెను. ఇంతవరకు శరీరమును పోషించు కొనుటకు చేయవలసిన కర్మలు చేసిన తర్వాత జీవుని ఉద్ధరించుకొను కర్మ (ధ్యానయోగకర్మను) తప్పక చేయవలెను. దానిని నాలుగు గడియలు చేయవలెను. దినమును ఈ విధముగా సద్వినియోగము చేయవలెను. కాలమును వ్యర్థముచేయువాడు కాలమును హత్యచేయు వాడగును. ఎవరును కాలమును హత్యచేయరాదు. పనిచేయక యుండ రాదు. తగిన ఆహారము, తగినబట్టలు, అలంకారము, తగిన సత్ప్రవర్తన యుండవలెను. దురభ్యాసములు, దుష్ట సంకల్పములు లేక పరోపకార బుద్ధితో జీవించవలెను. రాత్రిళ్ళునిద్రఅపరాదు. పగటివేళ పండరాదు. నిద్ర సమయములందు తగు నిద్రపోవలయును. మానవుడు తగువిధంగా జీవించాలను సూత్రాన్ని మరువరాదు. ప్రక్కవారిని చూచి భ్రమపడి కోరికలను కోరరాదు. తనప్రాప్తమును అర్థం చేసికొని తృప్తి పడవలెను.

వికర్మ అనగా శాస్త్ర విరుద్ధ కర్మలు [చేయకూడని కర్మలు]చేయుట.

మానవులు ఏ పని చేయవలెను? ఎపని చేయకూడదు? అని నిర్ణయించుకొనునపుడు శాస్త్రమును ప్రమాణముగా తీసికొనవలెను. శాస్త్రమునందుచేయవలయునని చెప్పినకర్మలుచేయవలెను. ఎవరిబుద్ధితోచినట్లు వాళ్ళుధర్మములు చెప్పరాదు. చేయరాదు. "కొందరు నా బుద్ధికి తోచినట్లు చేయుచున్నా"నని శాస్త్రమెరుగని వారు అంటుంటారు. అదితప్పు. శాస్త్రమునందు చేయకూడదని నిషేధించిన కర్మతేవీ చేయరాదు. అసత్యము పలుకరాదు. దొంగతనము చేసిగాని, మోసగించిగాని, పరులసొమ్మును అపహరించరాదు. వ్యభిచారము చేయరాదు. సప్తవ్యసనములు మానవలెను. ఇతరులకు బాధ కలిగించుట, అగౌరపరచుట మొదలగు చేయకూడని కర్మలు-వికర్మలు.

ప్రవృత్తికర్మ-కర్మలను చేయునది దేహేంద్రియములు, అనుభవించునది జీవుడు. నశించెడి స్వభావముగల శరీరము కర్మలనుచేసి నశించి పోవుచున్నది. దైవాంశసంభూతుడై నశించని స్వభావముగల జీవుడు సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. అందువలన జీవుని బంధించు కర్మలు, బంధవిముక్తి చేయు కర్మలు కూడా శరీరమే చేయవలసి ఉంటుంది. భార్యాపిల్లల వ్యామోహముతో వారి సుఖ భోగైశ్వర్యముల కొరకు, కోరికతో భవనములు కట్టించుట ఆభరణములు చేయించుట, భూములను సంపాదించుట, తోటలను పెంచుట, మొదలగు పనులు చేయాలని ఎంచుకుని, అందుకు కావలసిన ధనమును అన్యాయముగా, ధర్మవిరుద్ధముగా సంపాదించుటకు చేయుకర్మలు ప్రవృత్తి కర్మలు.

జీవునికి జన్మరాహిత్యముచేయు కర్మలు నివృత్తికర్మలు. గృహస్తులు విధిగా ధర్మార్థకామ మోక్షకర్మలు చేయవలయును. సంసారమును పోషించుకొన వలసిన బాధ్యతయున్నది. అందుకు కావలసిన ధనమును, ధర్మప్రవర్తనగలిగి, ధర్మవిరుద్ధముగాని కర్మలుచేసి సంపాదించి, ధర్మ విరుద్ధముగాని సుఖములను అనుభవిస్తూ, సత్యవ్రతులుగనూ, ఏకపత్నీవ్రతులుగను, పవిత్ర వంతులుగను ధర్మవ్రతులుగను, దానవ్రతులుగను, బ్రహ్మచర్యవ్రతులుగను, శీల వ్రతులుగనూ ఉంటూ, విషయ వాసల

లకు, వికారములకు, బానిసలుగాక తన శరీరము నందు ఇంద్రియముల నుంచుకొని, శరీర పోషణకు మాత్రము నిషిద్ధముగానికర్మలను చేస్తూ,మోక్షమును మరువక, జీవుని సంసార విషయ వాసనలయందు ఉంచక, నివృత్తి మార్గమున, ఆత్మసాక్షాత్కార స్వరూప జ్ఞానము గలిగి, యోగసాధనము చేయుట నివృత్తి కర్మయని చెప్పబడుచున్నది.

కామ్య కర్మయనగా శరీరము శాశ్వతమని భ్రమించి, ఇంద్రియసుఖము లనుభవించుటే ప్రధానముగా భావించి త్యాగబుద్ధి, పరోపకారబుద్ధి లేని వాడై, యెదుటివాడు ఎంతబాధల యందున్నను, ఏ పరిస్థితుల యందున్నను తనకు కావలసిన డబ్బును తాను తీసుకొని పనిచేయుట. ఒక గ్రామమున ఒకపండితుడుండేవాడు. కాలవశాత్తు వానిభార్యమరణించింది. శవమును శ్మశానమునకు చేర్చుటకు ఎవ్వరూను తోడులేక పోయిరి వారి కులపు బ్రాహ్మణులను పిలువగా మేము కోరిన డబ్బులు ఇస్తే మేము శవమును శ్మశానమునకు చేరుస్తామని వారుఅన్నారు. వారుకోరినంతడబ్బు ఆ పండితుని చేతిలో లేదు. ఎంతో బాధపడి చివరకు ఒక రైతు సహాయమున డబ్బును సంపాదించితెచ్చి శవమును శ్మశానమునకు చేర్చాడు. శవవాహకులకు ఆ పండితుని బాధతో పనేముంది?, వాళ్ళుకోరినడబ్బు వాళ్ళకువచ్చింది. ఇతరులకష్టనష్టములతోను, బాధతోను, ప్రమాదములతోను సంబంధములేక వారివారి కోరికల ప్రకారం చేసేఇట్టికర్మలు కామ్యకర్మలు.

నిష్కామ కర్మ-నిష్కామ కర్మయనగ ప్రతిఫలము నపేక్షించక చేయు కర్మ. "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" కర్మలు చేయుట యందే యధికారముండవలయును ప్రతిఫలమునందు ఏమాత్రము అధికారముండ కూడదు. లోకోపకారమునకోసమహాత్ములుచేయు కార్యములన్నీ ప్రతిఫలము నపేక్షింపక ఉంటాయి. ప్రతిఫలము నపేక్షింపకప్రాణులకుమహోపకారము చేయువాళ్ళలో సూర్యుడు మొదటివాడు. సూర్యుడు తనకిరణశక్తిని లోకమునకుఇచ్చుచున్నాడు. కిరణశక్తి వలనమేఘము ఏర్పడటము, మేఘము

వలన వర్షము, వర్షము వలన పంటలు, పంటల వలన ఆహారము, ఆహారము వలన సకల ప్రాణులు జీవిస్తున్నాయి. సూర్యుడు ఏ ప్రాణి దగ్గరనుంచి ఏ విధమైన ప్రతిఫలమును పొందుటలేదు. మానవులు సూర్యునివలె నిష్కామకర్మను చేయవలెను. అదేమోక్షమార్గము. చివరకు మోక్షము కావలయునను కోరికనుకూడావిడువవలెను. అదేమోక్ష సన్యాసము, నిర్వికల్ప సమాధి.

సాత్విక కర్మ-సాత్విక కర్మయనగా సత్వగుణ ప్రపూర్ణమైన కర్మ. జగత్తంతయు త్రిగుణముల వలననే పరివర్తన చెందుచున్నది. సత్వరజ స్తమోగుణముల వలన గలిగిన వికార స్వభావముల వలన ప్రాణులు వికారములను పొందుచున్నవి. ఈ గుణములు ప్రకృతి వలన ఉద్భవించినవి. దేవుడన్ననో ప్రకృతి విలక్షణుడు. గుణాతీతుడు, గుణవికారములేనివాడు. నిర్గుణుడు, మూఢు లీసత్యమును తెలిసికొనలేరు.పండితులుకూడా వేదములు త్రిగుణాత్మకమైనవని తెలసికొన లేక మూడువేదముల నాశ్రయించి, నశించెడి సుఖములను కోరి యజ్ఞములను చేయుచున్నారు. వాళ్ళ బొత్తుగా దైవతత్వము నెరుగక, అన్యదేవతలను ఆరాధించే అజ్ఞానులు. జ్ఞానులైన వారు దేవుడు గుణాతీతుడను సత్యము నెఱిగి, క్షేమ కరమైన యోగము నభ్యసించవలెను.

సత్వగుణము పుణ్యము నిచ్చునదేగాని మోక్షము నిచ్చునది కాదు. పరులకు ఉపకారము చేయుట, జీవహింస చేయకుండుట సత్ప్రవర్త కలిగి శీలవంతులుగ నుండుట, శాస్త్రముచేత నియమింప బడిన కర్మలచే కామ, క్రోధ, లోభమోహమదమత్సరములు లేక సకల ప్రాణులయందును దయా, మిత్రత్వము గలిగియుండుట మనస్సును యింద్రియసంఘముతోగాక, ఆత్మ సంఘముతో చేర్చి వికార రహిత మొనరించి, నేను అనెడి అహంకారము, నాది యనెడి మమకారము లేక, ఉన్నదానితో తృప్తిపడి, దానము, ధర్మము, పరోపకారబుద్ధి కలిగి, వైద్యశాలలు, విద్యాశాలలు, ధర్మశాలలు, నిర్మించుట బీదలకు పెండ్లిచేయుట, శాస్త్రమును చదువుట, చదివించుట, వినుట, అన్నదానము, వస్త్రదానము. విద్యాదానము చేయుట, మధురమైన వాక్కులతో

మర్యాదగా మాట్లాడుట, పెద్దలను, గురువులను, జ్ఞానులను సత్కరించి సేవ, చేయుట, ఆదరాభిమానములతో వారిని పోషించుట, సాత్విక కర్మలనిచెప్ప బడుచున్నవి. ఇవి పుణ్య కర్మలు మాత్రమే, పాపమును ఇవి తొలగించ లేవు. మోక్షమును ఇవ్వలేవు.

పుణ్యకర్మల వలన పాపము తొలగునని కొందరు చెప్పుదురు. అది అజ్ఞానము. మరికొందరు దైవపూజలు చేసిన యెడల దేవుడు పాపములను తొలగిస్తాడంటారు. దేవుడు పాపములను తొలగించడు. మానవుల శరీరములందు అయిదుఅగ్నులున్నవి అందు క్రోధాగ్ని, జఠరాగ్ని, రూపాగ్ని, కామాగ్ని అను నాలుగు అగ్నుల ప్రభావము వలన మానవులు పాపములు చేస్తుంటారు. జ్ఞానాగ్ని సకల పాపములను దగ్ధము చేస్తుంది పుణ్యము వలన సత్ఫలంవస్తుంది. పుణ్యఫలమువలన శ్రీమంతుల కుటుంబమున జన్మింతురు. పాపఫలితముగా వ్యాధి గ్రస్తులవుతారు. దీనిని మిశ్రమ ఫలిత మంటారు. పాపపుణ్యముల ఫలితములను మానవులు అనుభవింపక తప్పదు.

పుణ్యము కూడా జీవునకు బంధకారణ మవుతుంది. ఇది శాంతిని ఇవ్వ లేదు. గనుక మానవులు సాత్విక కర్మలు జీవునకు బంధహేతువని తెలిసికొని, గుణాతీత నిర్గుణత్వమును తెలిసికొని, ఆత్మతత్వస్వరూప జ్ఞానముగలిగి, జీవుని ఉద్ధరింపజేసి సచ్చిదానందమును, పరమశాంతిని పొందవలెను. సాత్విక కర్మలు మోక్షము నివ్వజాలవు.

రాజసకర్మ నేనుయనెడి అహంకారముతో, నాదియను మమకారముతో పరిపూర్ణస్వార్థ స్వభావము గలిగి, పరమలోభత్వముగలిగి, కొంచమైనను త్యాగబుద్ధి, పరోపకార బుద్ధిలేక, తాను, తన సంసారము తప్ప మరొక ప్రాణి యందే విధమైన అభిమానము, ఆదరణ, దానము, ధర్మము, పరోపకారబుద్ధి లేక తాను ఎవ్వరికిని ఏవిధమైన సహాయము చేయక, అందరు తనకు సహాయము చేయవలెనన్న భావముతో, స్వార్థముతో చేయు కర్మ. ఈ కర్మలో ప్రతిఫలాపేక్ష ఉంటుంది.

తన ఏడ్డలు, తన సంసారము సలక్షణముగా నుండినచాలునని, తన కుటుంబం కోసం భవనములు కట్టించుట, భూములు సంపాదించుట, ఆభరణములు చేయించుట, వారికి అయిశ్వర్యములు కల్పించుట, వారి సుఖమును మాత్రము కోరుట, యితరుల కష్టములు తొలగించుట యందు, సుఖములు కల్పించుట యందును తనకు ఏ విధమైన సంబంధములేనటుల ప్రవర్తించుట రాజసకర్మ లనబడతాయి. రాజసకర్మలుచేసేవాళ్ళు మరుజన్మమున కర్మఫలాభిలాషులైన కూలివాళ్ళుగ జన్మిస్తారు. పని చేసిననే తిండి, లేకున్న పస్తులుగా జీవిస్తారు.

రాజస స్వభావముగలవారు దైవమును ఆరాధించినను ధనము కొరకే ఆరాధిస్తుంటారు. వాళ్ళకు స్వార్థము, ధనాపేక్షతప్ప మరొక ధర్మమే కనుపించదు. వాళ్ళకు ఓర్పు ఉండదు. ఒకగ్రామమున ఇరువురు సోదరులుండేవాళ్ళు ఇరువురును. రాజసస్వభావముగలవాళ్ళే. వారిలో పెద్దవాడు శ్రీమంతుడు.తమ్ముడదిసహించక తపస్సుచేసి దేవత ప్రత్యక్షంకాగా "అమ్మా! నాకు వేరేవరాలు. ఏవీఅవసంలేదు. మాఅన్నగారు ఎదికోరితే దానికి రెండురెట్లు నాకు లభించేటట్లు వరముప్రసాదించుచాలు:" అనికోరాడు. దేవత అతనికిఆవరమిచ్చింది. ఇంటికి వచ్చేసరికి ప్రతిది అన్నకు వచ్చినదానికంటె రెండు రెట్లు ఎర్పడి ఉండటం కనిపించింది. అదిచూచి అన్న సహించుకొనలేక తమ్ముడి వరప్రభావమును తెలిసికొని "ఓ దేవా! నాకు ఒక కన్నుపోయేటట్లుచేయు"మని కోరాడు. అతనికి ఒక కన్ను గుడ్డిదైనది ఆ వరప్రభావముచేత తమ్ముడికి రెండు కండ్లు చూపుపోయింది. అసూయభావంతో పరులమేలుచూచి సహించలేని రాజసబుద్ధి ఎవరికి ఉండరాదు. దేవతలు ప్రత్యక్షమైనను అటువంటి వాళ్ళకు ఏసుఖం ఉండదు.

తామసకర్మ - ధర్మ విరుద్ధముగా, శాస్త్ర విరుద్ధముగా చేయు పాపభూయిష్టమైన కర్మలు తామసకర్మలు. తనకు ఇష్టములేక పోయినను, అధర్మమని తెలిసినను, పాపమనితెలసినను ధనమునుఆశించి, భవిష్యత్తు ఫలితమును

ఆలోచించక చేయుకర్మ తామసకర్మ. వీరసేనుడను నతనికిఆనందకుమార్‌కు శత్రుత్వములేదు. రాజశేఖర్ అనునతనికి ఆనందకుమార్‌నకు విరోధమున్నది. రాజశేఖర్‌ధనమిచ్చినందువలన వీరసేనుడు ఆనందకుమార్‌ను హత్యచేసాడు. ఇది తామసకర్మ. రాజు విచారించి వీరసేనునకు శిరచ్ఛేదన శిక్షవిధించాడు. హత్యచేసిన యెడల దానికి శిక్ష ఉంటుందనే పరిజ్ఞాన ముండదు. అది తామస లక్షణము. అటులనే పరస్త్రీలను మానభంగము చేస్తారు. ఆ పాపం వలన ఎటువంటి శిక్షకు గురి కావలసి వస్తుందో తెలియదు. ఇది తామస లక్షణము.

పరులు కష్టపడి సంపాదించిన, భద్రపరచిన సొమ్మును దొంగిలించి అనుభవిస్తుంటారు. దాని వలన యెంతటి పాపము వస్తుందో గుర్తించరు. హత్యలు చేయుట, స్త్రీల మానభంగము చేయుట, దొంగతనము చేయుట, మోసము చేయుట, అబద్ధములుచెప్పుట, అజ్ఞానము చేత అవిద్యాదోషము చేత, దైవమును, ధర్మమును, పూర్తిగా మరచిపోవుట, దుష్టప్రవర్తనతో జీవించుట, పెద్దలను, గురువులును, జ్ఞానులను అగౌరవపరచి పరుషవాక్యములు మాట్లాడుట తామస కర్మలని చెప్పబడు తున్నాయి.

ఇంద్రియములకు గోచరమయ్యే సృష్టియంతయు కర్మ వలననే ఏర్పడుతుంది. అవ్యక్తపరమాత్మ దివ్యతేజ కిరణముల యందలి కర్మవలన పరంధామ ఏర్పడింది. పరమాత్మ అంశమైన అక్షరతత్వము నుంచి జీవుడు ఏర్పడ్డాడు. పరంధామ ఛాయవలన మూలప్రకృతి మాయ యేర్పడింది. మూలప్రకృతి విచ్ఛిన్నమై భిన్నప్రకృతి భూమిజలము అగ్నివాయువు ఆకాశము మనసు బుద్ధి అహంకారము ఏర్పడ్డాయి. భిన్న ప్రకృతి సంయోగ వియోగముల వలన సూర్యచంద్ర నక్షత్రములు ఏర్పడ్డాయి. మనస్సంకల్ప ప్రభావము వలన నక్షత్రముల నుండివెలువడిన ప్రకృతి జీవుడు కలిసికొని, సంయోగక్రియవలన ఆదియందుప్రాణులేర్పడ్డాయి. అతిసంకల్పసృష్టిగా ఏర్పడింది. తర్వాత మిథున నక్షత్రప్రభావము వలన కామోద్రేకం కలిగి మిథున

సంపర్కము ప్రారంభమైంది. సంపర్క సృష్టి సూర్యుని కిరణజన్య సంయోగ కర్మవలన యేర్పడింది. సూర్యుని కిరణజన్య కర్మవలన మేఘము, మేఘము వలన వర్షము, వర్షము వలన ఆహరము, ఆహారము వలన శుక్ల శోణితములు, సంపర్క క్రియవలన శుక్లశోణితములు జీవుడు కలసుకొని ప్రాణులు సృష్టి యేర్పడుచున్నది. కర్మవలన సృష్టియేర్పడుచున్నదేగాని దేవుడు సృష్టించుట లేదు.

సాత్వీక కర్మలు దైవమును ధర్మమును ఆశ్రయించి ఉండటంచేత పుణ్యప్రదముగా ఉంటవి. జీవునకుఉత్తమ జన్మప్రసాదిస్తవి. శ్రీమంతులుగను అయిశ్వర్యవంతులుగను, ఆరోగ్యవంతులుగను, విద్యావంతులుగను అను కూల దాంపత్యము సత్సంతానము గలిగి సుఖజీవులుగ జీవించుజన్మ లభి సుంది. అందువలన రాజస, తామస, కర్మలు చేసి జీవుని ఉద్ధరించుకొంటు ఉంటాము. "కర్మలుచేయునది దేహేంద్రియములు, అనుభవించునది జీవుడు". అను సత్యమును తెలిసికోవాలి. దైవమును ధర్మమును మరువరాదు. ధనము సంపాదించినను, సుఖములననుభవించినను ధర్మమును, శాస్త్రమును ఆశ్రయించి, శాస్త్రమునందు చెప్పబడియుండు ధర్మములను అనుసరిస్తూ ఉండాలి.

జీవుని కర్మ బంధము అనేక జన్మల కర్మల ఫలితముగా ఉంటుంది. మహాజ్ఞానులు గొప్పతపనంపన్నులు, మహాత్ములు, గురువులు, పీఠాధిపతులు కూడా భయంకరమైన వ్యాధులను అనుభవిస్తుంటారు. ఈ జన్మలో సత్య వ్రతులుగను. ఏకపత్నీవ్రతులుగను, ధర్మవ్రతులుగను, దానవ్రతులుగ నున్ననూ, తామస కర్మలుచేసిన భవిష్యజన్మలో భరించరాని కష్టముల ననుభవించక తప్పదు.

సృష్టి స్థితిలయములు, జీవునకుజన్మ, జన్మరాహిత్యము, ఉత్తమజన్మ, నీచజన్మ, కర్మలవలననే కలుగుచున్నవి. అందువలన కర్మయొక్క తత్వ మును తెలిసికొని మానవుడు సంసార సముద్రమును దాటవలయును. మాన

వులు, అజ్ఞానము అవిద్యా దోషమునకు బద్ధులై, కనిపించెడి ప్రకృతియే సర్వముగా భావించి, "ప్రకృతికి విలక్షణము, అక్షరుడు, దివ్యతేజోమయుడు. కనిపించెడి సర్వమునకు ఆధారభూతుడు, పరమాత్మ" అనుసత్యమును తెలిసికొని, ప్రకృతి వికారములకు లోనుగాక, కర్మలయొక్క స్వభావమును అర్థము చేసికొని, సంఘమున ఏవిధమైన ద్రోహము చేయక, ఆత్మతత్వ స్వరూపజ్ఞానము గలిగి జన్మరాహిత్యం చేసికోవాలి.

"కర్మాచరణము,కర్మసన్యాసము"అని కర్మ రెండువిధములుగ నున్నది. కర్మప్రకృతిస్వరూపము శరీరము. ప్రకృతిస్వరూపమైన శరీరమును పోషించుకొనుటకు నియమితశాస్త్రవిరుద్ధము, ధర్మవిరుద్ధము గాని కర్మలుచేసి, శరీరమును పోషించుకొనవలెను. అంతమాత్రమున మానవుల కర్తవ్యము పూర్తి కాదు. శరీరమునకు ఆధారముగా చైతన్యశక్తి నిచ్చి, శరీరమును చెడిపోకుండా కాపాడు జీవుడున్నాడు. జీవుని ప్రాణశక్తి లేనిదే శరీరము ఏపనియును చేయలేదు. కాని మానవులు జీవుని గుర్తించుట లేదు. శరీరమును మాత్రము గుర్తించి పోషించుకొనుచున్నారు. వారికి జీవుని యుద్ధరించుకొను భావన కల్గటంలేదు. జీవుని,దేవుని గుర్తించునదే జ్ఞానము. ఈజ్ఞానము ఒక్క మానవులయందు మాత్రమే విశేషించి ఉన్నది. తన యందున్న జ్ఞానమును పొందని మానవుడు బలసిన పందితో సమానము. మానవులకు జంతువులకు గల వ్యత్యాసము ఈ జ్ఞానమే.

మానవులకు రెండు నేత్రములేకాదు, మూడవ నేత్రంపైన జ్ఞాననేత్రమున్నది. జ్ఞాన నేత్రముతో శరీరము జీవుల తారతమ్యమును తెలిసికొని, జీవునకు మోక్షప్రాప్తిని కలిగించవలెను. శరీరము ప్రకృతితో, పంచభూతములతోను, మనసు, బుద్ధి, తెలివి, అహంకారముతోను, ఇంద్రియములతోను, ఏర్పడి నశించెడి స్వభావము గలది. కర్మలకు ఆధారభూతమైనది. జీవుడు దైవాంశమైన అక్షరుడు. పరంధామయందు ఉద్భవించిన వాడు. నశించువాడుకాదు. పుట్టుకలు, మరణములు కలవాడు. మరణించిన తరువాత మరొక శరీరమున జన్మించేవాడు. కర్మబంధవిముక్తుడైన

వాడు. తన స్వస్థాన మైన పరంధామమును చేరుకొనేవాడు. అదియే మోక్ష స్థానము. కర్మలు చేయునది దేహేంద్రియములు. వానిఫలితమును జన్మలెత్తి అనుభవించుచున్నది జీవుడు. మానవులు ఈ తారతమ్యమును తెలిసికొని, శరీరమును పోషించుకోనవలెను. జీవుని ఉద్ధరించు కొనవలెను.

జీవుని యుద్ధరించుకోవలయు ననిన కర్మను సన్యసించాలి. శరీరమును కదలక యుండునటుల నియమిత ఆసనమున, నియమిత ముద్రలో కూర్చోవాలి. ఇంద్రియములతో ఏ విధమైన కర్మను చేయరాదు. కంటితో చూడరాదు. చెవితో వినరాదు. నోటితో మాట్లాడరాదు. వెలుపలనుండు శబ్దస్పర్శ రూపరస గంధాదులను వెలుపలకు త్రోసివేసి. సంకల్పవికల్పాత్మకమైన మనసును నిగ్రహించి, ఆత్మయందు జేర్చి, నిశ్చయాత్మకమైన బుద్ధితో, జ్ఞాననేత్రముతో అంతర్జ్యోతిని దర్శిస్తూ ఆత్మతత్వ స్వరూప జ్ఞానము గలిగి, ఆత్మానందమును, పరమ శాంతిని జీవుడనుభవించుటే మహాపరినిర్వాణ మార్గము.

జీవునకు చూపవలసిన ఆధారమేది? మానవులు జీవునకు ఏ ఆధారము చూపుచున్నారు? ఇరువది సంవత్సరముల తర్వాత వచ్చిన భార్యకు భూమిగాని ధనముగాని ఇచ్చి ఆధారము చూపుచున్నారు. తర్వాత పుట్టిన సంతతికి ఆధారము చూపుతున్నారు. తల్లి గర్భమున నుండినప్పటి నుంచి తమ శరీరమును కనిపెట్టుకొని, తమ శరీరమును మోసికొని తిరుగుతూ తాను చేయుసర్వకార్యములకు ప్రాణశక్తి నిచ్చి, శరీరమునకు ఆధారముగా నుండు జీవునకు మానవులు ఏమి ఆధారము చూపుచున్నారు? జీవునకు చూపవలసిన ఆధారమేమిటి? జీవునకు చూపవలసిన ఆధారము జన్మరాహిత్యము లేక ఉత్తమ జన్మ. ఇప్పుడు ఉన్న జన్మకంటే శ్రేష్ఠమైన జన్మ ప్రాప్తించుట పుణ్యకర్మల వలన కలుగుతుంది. యోగము వలన జన్మరాహిత్యము ప్రాప్తిస్తుంది. దానములు (అన్నదానము, వస్త్రదానము, విద్యాదానము మొదలగు దానములు) పుణ్యకర్మలు, పూజలుచేత సగుణోపాసకులు దేవుని అనేక విధముల ఉపాసింతురు-కొందరు. సంఘమునకు మహోపకారము

చేస్తున్నారు. ఇవన్నియు పుణ్య కర్మలు. ఇవి ఇంద్రియములకు సుఖము నిచ్చునవేగాని జీవునకు శాంతినిచ్చునవి కావు.

జీవుని శాంతి మార్గమునకు, మహాపరినిర్వాణమునకు పర్వతమువలె అడ్డుపడువానిలో మొదటిది కామము, ఈ కామము ఎంత అనుభవించినను తృప్తిలేనిది, అగ్నికి ఎన్ని కట్టెలు వేసినను ఏట్లు తృప్తి లేక ఉంటుందో అట్లా కోరికలు ఎన్ని తీర్చుకున్నను తృప్తి ఉండదు. కనుక కామము జ్ఞానికి గర్భశత్రువు. జ్ఞానియగు వాడుమొదట కోరికలను జయించవలెను. రెండవ శత్రువు క్రోధము కోరికలు నెరవేరుటకు భంగము గలిగి క్రోధము ప్రజ్వలిం లించును. దాని వలన తనకు గాని యెదుటి వానికిగాని ప్రమాదము సంభ వించును. దానివలన జీవుని ఉద్ధరించు కొనువారుమొదట దీనిని జయించవల యును. దేహేంద్రియములతో అనుభవించెడి సుఖ దుఃఖములకు అది కారణ మగును. అవిక్షణ భంగురములు కనుక దేహభ్రాంతిని వదలిఆత్మానందము ను పొందవలెను. అది శాశ్వతమైన సుఖము. జీవునకు కావలసినది పరమశాంతి సచ్చిదానందము. ఇంద్రియ సుఖములుకాదు.

జీవునియుద్ధరించునది సత్ప్రవర్తన. ధర్మచక్రప్రవర్తన. ధర్మచక్రము నందు చెప్పబడి యుండు యిరువది నాలుగుధర్మములను తప్పక అనుసరించ వలెను. త్రిసూత్రములు (సత్యము-ధర్మము-సంఘము), పంచశీలములు (అహింస, సత్యము-పరులసొమ్ము అపహరించకయుండుట, వ్యభిచారము చేయకుండుట, త్రాగుడు, జూదమాడుట మొదలగు వ్యసనములు లేక యుం డుట), అష్టాంగములు (పవిత్రదృష్టి, పవిత్ర సంకల్పం, పవిత్రకర్మ పవిత్ర జీవనం. పవిత్రవాక్కు, పవిత్ర వ్యాయామం, పవిత్ర స్మృతి, పవిత్ర యోగ సమాధి స్థితి),అష్టాంగ ధర్మములు(జ్ఞానము-త్యాగముధైర్యము, వైరాగ్యము. సత్కీర్తి తృప్తి, తీక్ష, ప్రజ్ఞమొదలగు ఇరువదినాలుగు ధర్మములను ఆచరణ యందుంచు కొనవలెను. ఇవిజీవునకు ఆధారము, నివృత్తి మార్గము, మహా పరినిర్వాణ మార్గము. దీనివలన మానవుడు బ్రతికి యుండగనే పరమశాంతిని, సచ్చిదానందమును నిరంతరము అనుభవిస్తుంటాడు. దుఃఖదూరు డౌతాడు.

పైనకనబరచిన వన్నియు జీవునకు మిత్రులు. జీవునకు శత్రువులు యిరువది నలుగురున్నారు. వారిని దగ్గరకు చేరనియక తరిమికొట్టవలెను. అరిషడ్వర్గము(కామము, క్రోధము,లోభము,మోహము, మదము,మత్సరము) సప్తవ్యసనములు (వ్యభిచారము, త్రాగుడు, జూదము, హింస, అబద్ధము, నాస్తికత్వం పరులకు అపకారము చేయుట) అసూయ పడుట, దురభ్యాసములు, రాజస గుణము తామస గుణములు, విశ్వాస ఘాతకము, కృతజ్ఞత లేకుండుట, అపకీర్తి, అమర్యాద, అసహ్యత, దురభిమానము, అజ్ఞానము అసంతృప్తి, కులతత్వము జీవుడిని శత్రువులు. జీవుని ఉద్ధరించువారు ఈ శత్రువులను వైరాగ్యముతో దూరముగ తరుమవలెను.

జీవునకు ఇరువది నాలుగు మిత్రబృందములు, యిరువది నాలుగు శత్రు బృందములు ఉన్నవి. జీవునకు శత్రుబృందము దేహేంద్రియములకు మిత్ర బృందముగా నున్నది. ప్రకృతి వికార స్వరూపముగా ఉన్నది. జీవుని మిత్ర బృందము శరీరమునకు పవిత్రసంఘమై యున్నది. మానవులు ఈ సత్యము నెరిగి, జీవుని మిత్రులైన ధర్మసంఘమునచేరి, శరీరమును పవిత్రమొనరించుకొని, గౌరవ సన్మానములు పొందవలెను. గురువులను దైవ సమానముగా పూజించేడివారు కలరు. గురువు పాదములను కండ్లకు అద్దుకొనువారు కలరు. అంతటి పవిత్రత శరీరమున కెట్లు లభించినది? శరీరము చేసిన యోగము వలన. జ్ఞానయోగము శరీరమును పవిత్రము చేస్తుంది. జీవునికి జన్మ రాహిత్యము కలుగచేస్తుంది. అందువలన శరీరమును సద్వినియోగము చేసికొని, శరీరపవిత్రతను, జీవునిమహాపరినిర్వాణమును పొందవలెను.

దైవికకర్మ-దేవునకు మానవులు చేయవలసిన కర్మయేదియునులేదు. స్వార్థభావముతోగాక, దైవభావనతో చేయు కర్మలు దైవిక కర్మ లంటారు. ఇది ఎక్కువ సగుణోపాసకులకు ఆచరణీయమై ఉన్నవి. దేవుని మానవాకారునిగా భావించి విగ్రహారాధన చేసేవారు ఆ విగ్రహమునకు అభిషేకము చేస్తుంటారు. అలంకారములను చేసి చూచిఆనందిస్తుంటారు. మిత్రులతో అర్చనలు, పూవులతో పూజలు చేస్తుంటారు. నివేదనలు అర్పించి వానిని

ప్రసాదముగా స్వీకరిస్తుంటారు. ఇవన్నియు దైవికకర్మలుగా చెప్పబడుతున్నవి, ఈ దైవిక కర్మ పురాణోక్తదైవోపాసన విధానము.

శాస్త్రోక్త దైవోపాసన-శరీరము పంచ భూతముల సముదాయము. ప్రకృతి వలన యేర్పడినది. "శరీరమునకు వెలుపల కనుపించునవేవియు దేవుడు కాదనియు, అవినశించెడి ప్రకృతి స్వభావముగల పదార్థములనియు, దేవుడు అక్షరుడు అచలు, డవ్యక్తుడు, దివ్యతేజోమయుడు, మాంసనేత్రము లతో, ప్రకృతి నేత్రములతో చూడబడేవాడుకాదు, జ్ఞాననేత్రముతో మాత్రమే దర్శించటానికివీలైనవా"డనిగ్రహించి, నిశ్చలచిత్తంతోసచ్చిదానందమునూ, పరమశాంతినీ పొందటంశాస్త్రోక్త దైవికకర్మ.ప్రాణాయామము. యోగసాధన శాస్త్ర పఠనము, శ్రవణము, సద్గురుబోధామృత పానము మొదలైనవి దైవికకర్మలుగా చెప్పవచ్చు. పురాణోక్తదైవిక కర్మలు కించిత్ పుణ్యము నిచ్చి, దేహేంద్రియములకు సుఖములను భోగములను ఇచ్చునవేగాని, జీవునకు మోక్షము నిచ్చునవికావు. శాస్త్రోక్త దైవిక కర్మలు మాత్రమే జీవునకు మోక్షాన్ని ప్రసాదిస్తాయి.

కర్మల యొక్క రహస్యాన్ని ఫలితాన్ని ఇట్లా ఉంటుందని జ్ఞానియైన వాడు తెలిసికొని, చేయకూడని నిషిద్ధమైన కర్మలు నిషేధిస్తూ, చేయదగిన కర్మలు చేస్తూ, యోగసాధనమున కర్మసన్యాసమును అనుసరించి, శబ్దమును, సంకల్పమును అతిక్రమించి, నిర్వికల్పనసమాధి స్థితిని పొంది, ఇంద్రియ ములకు అతీతమైన సచ్చిదానందమునూ, పరమశాంతినీ పొంది, ఆత్మసాక్షా త్కారజ్ఞానము కలిగి, జీవుడు జన్మరాహిత్యమును పొంది, తన స్వస్థానమైన పరంధామను చేరి, శాశ్వతముగా మోక్షమును పొంది, ఎన్నియుగములు గడచినను మరలజన్మలేక శాశ్వతానందము పొందవలెను. ప్రకృతి కర్మలు ఇంద్రియ వికారస్వరూపమైనవి. జీవుణ్ణి కర్మ బద్ధుణ్ణిచేస్తవి. శరీరమునకు పవిత్రత, గౌరవముగాక నీచముగా, హీనముగ బ్రతుకునట్లు చేస్తాయి. కనుక వాటిని విసర్జించవలెను.



# ఏదవపంహాదవ అధ్యాయము

## (జన్మ యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షులారా! బౌద్ధతత్వమునకు కర్మసిద్ధాంతము మూలస్తంభముగా నున్నది. బౌద్ధునకూ విశ్వమంతయు కర్మసిద్ధాతముపై ఆధారపడి, కార్య కారణ సంబంధముగల గొప్పసూత్రంగా కనిపిస్తుంది. చెడు చేసినచో ఇప్పుడో, మరియొకప్పుడో దాని చెడుఫలము మనం అనుభవించవలసి వస్తుంది. కాబట్టి మంచిని కోరేవాడు మంచిపనులే చేయవలసి ఉంటుంది. చెడ్డభావనలకు మనస్సులో తావు ఇవ్వరాదు. అంతమాత్రమున కర్మమాన వుని అదృష్టభాగ్యమనీ, భగవంతుడే మనభాగ్యమునకు కారకుడనీ మనం భావించరాదు. "జరిగిందేదో జరిగిపోయింది దాన్ని గురించి విచారిస్తే లాభంలేదు. ఇకనైనా మనం మంచి పనులు చేసి భవిష్యత్తును చక్కదిద్దు కొందాం" అని భావించి, మనం మంచి పనులు చేయటానికి పూనుకోవాలి. పునర్జన్మ ఈ కర్మ ఫలంగానే కలుగుతుంది. ఈ కర్మసిద్ధాంతము దానికి తోడైన పునర్జన్మ సిద్ధాంతం లేనిదే నిలువలేదు. మరణం అనేది ఈ జన్మకూ పునర్జన్మకూ మధ్యనున్న విశ్రాంతి. రెండు దినములకు మధ్య మనం నిద్ర అనే విశ్రాంతి పొందుతున్నాం. దైనందిన జీవితంలో ప్రొద్దునేలేచి, క్రిందటి రోజు మాదిరిగానే దిన కృత్యములన్నీ మనం నెరవేర్చు కొంటున్నాం. అట్లే కొంచెం హెచ్చు తగ్గులతో పునర్జన్మలోగూడా క్రిందటి జన్మలోని అనుభవ ములు, సంస్కారములు అన్నీకట్టగటుకొని మనః ఫలకంపై మనకుకనిపించని వ్రాతలో వ్రాయబడి ఉంటాయి. దాన్నే 'తలరాత' అంటున్నారు. ఆ అను భవముల ప్రభావం ఈ జన్మలో జీవుడిమీద తప్పక పడుతుంది. ప్రతి జన్మ యందు మేధస్సు క్రొత్తగా సృష్టింపబడటంచేత, పూర్వజన్మ స్మృతులు మనకు కలగటంలేదు. సంఘంలోని హెచ్చు తగ్గులను ఈ పునర్జన్మ సిద్ధాం తం వివరించినంత సక్రమంగా మరేదియు వివరించదు. తథాగతుడు తన పూర్వ జన్మలను గురించి చెప్పిన జాతక కథలు చూస్తే, ఆయనకు పునర్జన్మ సిద్ధాంతంపై ఎంతటి విశ్వాసం ఉన్నదో మనకు బోధ పడుతుంది.

ఒకసారి కాశీయందలి ఒక బ్రాహ్మణరైతు తన పొలము దున్నిన తర్వాత ఎద్దులను విడిచి పెట్టి వేరొక పని చేయుచుండెను. ఆ యెద్దులు మెల్లగా తప్పించుకొని అడవిలోనికి పోయినవి. ఆ బ్రాహ్మణుడు ఎద్దులకోసం వెదుకుతూ అడవిలోనికి పోయి దారితప్పాడు. చాలారోజులు ఆహారం లేక అడవిలోనే తిరుగసాగాడు. ఒకరోజు ఒక ఫలవృక్షాన్ని చూచి, దాని పండు అందుకొనబోయి జారి ప్రక్కనే వున్న గోతిలో పడిపోయాడు. అప్పుడు అక్కడ కోతిగా జన్మించి ఉన్న బోధిసత్వుడు ఆ బ్రాహ్మణుణ్ణి రక్షించాడు. తర్వాత అ కోతి నిద్రపోతుండగా ఆ బ్రాహ్మణుడు కృతఘ్నుడై పెద్దరాతితో ఆ కోతి తల పగులగొట్టాలను కొన్నాడు. కాని మహాత్ముడైన బోధిసత్త్వునకు ఆ విషయం తెలిసి, లేచి, ఒకచెట్టుపైకి లఘించి తనను తాను రక్షించు కొన్నాడు. అయినను ఆ బ్రాహ్మణునిపై ద్వేషం లేక, అడవి నుండి బయ టకు పోయే మార్గాన్ని చూపాడు. బ్రాహ్మణుడు బోధిసత్త్వునకు చేయతల పెట్టిన ద్రోహంవల్ల కుష్ఠువ్యాధిగ్రస్తుడయ్యాడు. ఈ కథ మహాకపి జాతకంలో చెప్పబడింది. దీనినిబట్టి జీవుడికి జన్మలున్నాయనీ, కర్మ ఫలితాన్ని జీవుడు అనుభవించక తప్పదని మనకు తెలుస్తున్నది.

శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :

ప్రబుద్ధులారా! మరణించిన తరువాత మానవుడు ఏమౌతున్నాడు? ఇది ఒక సమస్య. దీనికి సమాధానము మనము ఈ జన్మయందే తెలుసుకోవలసి ఉన్నది. మానవుడు మరణించిన తరువాత పునర్జన్మకలదని మనం తెలుసు కోవాలి. పుట్టిన తర్వాత ఏ విధంగా బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధక్యము కలవో అట్లాగే మరణించిన తరువాత మరుజన్మ కూడా ఉన్నది. శరీరము నశించి పోయేది, కాని జీవుడు నశించేవాడు కాదు. దైవాంశ సంభూతుడు దేహము ఉండగనే మానవుడు అంతర్ముఖుడు కావాలి. యోగ సాధన చెయ్యాలి. జీవుడు పంచప్రాణములుగా ఈ శరీరమందంతటా ఉన్నాడు. తల వెనుక భాగమున ఉన్న ప్రాణము పంచేంద్రియములచే ఒనరింపబడు కర్మల సారాంశము జీవులకు చేర్చుచున్నది. సుఖదుఃఖములను

ననుభవింపచేసి వానినిభద్రపరచుచున్నది. జీవుడుశరీరమును విడిచి ప్రయాణము చేయుచున్నపుడు తలయందున్న ప్రాణము, తాను భద్రపరచి యున్న ఫలితమును తీసుకొని బయలుదేరుచున్నది. దీనినే 'తలవ్రాత' అని అంటారని లోగడ మనం చెప్పుకొన్నాం. ఈ తలవ్రాత ప్రకారమే జీవితం నడుస్తుందని అంటారు.

జీవుడు జ్ఞానము కలిగి యోగ సాధన చేసినపుడు జన్మ రహితమైన మోక్షస్థానాన్ని చేరుకుంటాడు. దానధర్మములు, పరోపకారము చేసిన మానవుడు బీదవాడైనను మరుజన్మలో శ్రీమంతుడుగా పుడతాడు. శ్రీమంతుడు పరోపకారము మొదలగు దివ్యగుణములు కలిగి ఉండకపోతే మరుజన్మలో బీదవాడవుతాడు. కావునఉన్నదానితోనే దానధర్మాలు, పరోపకారంచెయ్యాలి ఒక కాలు లేని బిక్షగాడు బిచ్చమెత్తుకొంటూ ఉండేవాడు. దారినపోయే ఒక జ్ఞానిని చూసి అతడు "స్వామీ! దేవుడు నాకు కాలు లేకుండా చేసాడు" అని విలపించాడు. అదికాంచి ఆ జ్ఞాని ఇట్లా పలికాడు. "పిచ్చివాడా! జీవుడు కాదు-నీవేచేసుకున్నావు. నీవు పూర్వజన్మలో చాలా బలవంతుడవు. నీకు డబ్బిచ్చి, ఎవరిని కొట్టమని చెప్పినా వారిని కొట్టి వస్తుండే వాడివి. డబ్బు కోసం నీవు ఒకడి కాలు నరికావు. తత్ఫలితముగా ఈ జన్మయందు నీ కాలును నీ పాపం ఖండించింది."

మానవుడు తాను చేసిన పాపములను మరుజన్మలో అనుభవిస్తాడు. ఒకస్త్రీ దుఃఖపడుచు ఒక జ్ఞాని వద్దకువచ్చి "స్వామి నాభర్తనాకు అన్యాయం చేసాడు. నన్ను కొట్టి ఇంటి నుండి తరిమివేశాడు" అని చెప్పుకుంది. అందు కాజ్ఞాని "అమ్మాయీ! ఇది నీవు చేసుకున్నకర్మయే! నీవుపూర్వజన్మలో కొడుకూ కోడలు అన్యోన్యతను సహించక, అత్తరికం చెలాయిస్తూ నీ కోడల్ని అనేక విధముల కష్టములుపెట్టి, వాళ్ళ అన్యోన్యతకు భగం కలిగించి నీ కోడల్ని తరిమి వేశావు. అందువలననే నీకిప్పుడు ఈ వియోగము కలిగింది" అని చెప్పాడు. మనము చేసెడి ప్రతి కర్మకు ఫలితాన్ని అనుభవించక తప్పదు.

దానము ధర్మము పరోపకారము, చేస్తూ పాపకార్యాలు చేయకుండా ఉండేవాళ్ళ శ్రీమంతులుగా, ఆరోగ్యవంతులుగా పుడతారు. దానము ధర్మము చేసి పాపపు పనులు చేయువారు శ్రీమంతులుగాను, వ్యాధిగ్రస్తులు గాను గాను పుడతారు. దానము ధర్మము చేయకుండా పాపపు పనులు చేయకుండా ఉండేవారు కర్మఫలాభిలాషులైన కూలి వారుగా జన్మిస్తారు. ఆత్మగౌరవం కలబీదవారుగా పుడతారు. అచ్చంగా పాపకార్యాలు చేసేవారు మరుజన్మలో వ్యాధి గ్రస్తులుగా జన్మిస్తారు. కుంటి గుడ్డి వికలాంగులుగా జన్మిస్తారు. మానవుడు సాటిమానవుడ్ని ప్రేమించాలి, అదరించాలి. జీవితమును గడుపుటకు ఎవ్వరికి ఏ విధమైన అపకారము చేయరాదు. సాధ్యమైనంత ఉపకారము చేయాలి. తేనేటిగ పుష్పమునుండి మకరందాన్ని తీసుకునేటప్పుడు ఆపుష్పానికిగానీ, వృక్షమునకుగానీ ఎట్టి అపకారము చేయక పుప్పొడిని గ్రహించి, చెట్టు మరలా జీవించి పుష్పించడానికి మరియొక పుష్పముమీద వాలి ఫలదీకరణకు తోడ్పడుతుంది. మానవ జీవితం కూడా ఇట్లా ఉండాలి. చీడపురుగు చెట్టును సమూలంగా నాశనం చేసి జీవిస్తుంది. అట్లాఎన్నటికి మానవులు జీవించరాదు. మానవుడు శరీరమునే దృష్టిలో పెట్టుకుని మంచి బట్టలు వేయుచున్నాడు, పలు విధములైన ఆహారములను తింటున్నాడు. "శరీరమే తాను" అనుకుని దానిని అనేక విధాలుగా పోషిస్తున్నాడు. కానీ శరీరంలోగల జీవ చైతన్యం గురించి ఏనాడును ఆలోచించటంలేదు. తుదకు ఈ శరీరము కాల్చివేయ బడుతుంది. కానీ జీవుడు అక్షరుడు. మనముచేయు పుణ్యకార్యములు సుఖమయ భావి జీవితానికి ఆధారములన్న విషయాన్ని మనము మరునరాదు.

మానవుని జీవితం 1. ఆరోగ్యము 2. సంఘము. 3. వృత్తి 4. ఆహారము. 5. ప్రవర్తన అనుఐదువిషయములపై ఆధారపడి ఉంటుంది. ఆరోగ్య లేకుంటే ఎన్ని భోగభాగ్యములు ఉన్నా వ్యర్థమే. ఆరోగ్యాన్ని కాపాడుకోటానికి నిత్యమూ మనము శారీరక వ్యాయామము చేస్తూ ఉండాలి. సజ్జనులతో మైత్రి మనలను పవిత్రులుగా చేస్తుంది. యోగుల సంఘము మనలను ఆత్మ సాక్షాత్కార మార్గములో ప్రవేశపెడుతుంది. చెడు స్నేహము

మనలను పాపాచారులుగా చేస్తుంది. మనము చేసెడి వృత్తి పరోపకారము కలదిగా, ధర్మయుక్తంగా ఉండాలి. ఆహారము మితంగా, హితంగా, పోషక విలువలతో కూడి ఉండాలి. ఆహారము స్థూల శరీరమునకు శక్తి నిస్తుంది. ధ్యానము మనస్సుకు ఆహారము అవుతుంది. అందు వలన వ్యాయామము ప్రాణాయామము, ధ్యానమును, మానవుడు తప్పక చేస్తుండాలి. మానవుడు తన ప్రవర్తన యందు పంచ శీలములు(ఐదు సూత్రములను)అనగా అహింస సత్యము, అస్తేయము బ్రహ్మ చర్యము తప్పక అనుసరించాలి.

మానవుడు దుఃఖములు లేకుండా జీవించాలంటే కొన్ని ధర్మాల్ని ఆచరించ వలసి ఉంటుంది. తీసుకునే ఆహారాన్ని సమతుల్యంగా పోషక పదార్థములతో, ధర్మ సంపాదనతో సముపార్జించి తీసుకోవాలి. పరిశుభ్రమైన బట్టలు ధరించాలి. తనకు కలిగిన దాంతో తృప్తిగా సంతోషంగా ఉండాలి. ఎదుటి వారికి చూచి తాముకూడా అట్లా ఉండాలని డాంబికమునకు పోరాదు. జీవితాన్ని శాంతియుతంగా సాగించాలి. గొప్పల కోసం అప్పులు చేయరాదు. ఇంటియందు అందరూ కష్టించి, ఎవరికి తగిన పని వారు చేయాలి. ఒక్కరు పని చేసి తక్కిన వారందరూ ఊరికే కూర్చోవటం సరికాదు. వేకువజామునే నిద్రమేల్కొంచాలి. పగలు మేల్కొని రాత్రి నిద్దురపోవాలి. నిద్రను ఆపుకొని మేల్కొనరాదు పగలు నిద్రించరాదు. పసిపిల్లలు ఎక్కువసేపు నిద్రించాలి. తాను చేయవలసిన పనిని వదలి, దైవ భక్తి అనుపేరుతో కాలమును వ్యర్థము చేయరాదు. పగలు తమ కర్తవ్యమును తాము నిర్వర్తించాలి. సూర్యాస్తమయం తరువాత బ్రహ్మ ముహూర్తమందుయోగము, ధ్యానము, దైవారాధన మొదలగునవి చేస్తూ ఉండాలి. తమ స్వధర్మమును ఆచరించినతరువాత,ధ్యానాన్ని, యోగాన్నిసకాలంలోఅభ్యాసం చేయక పోతే సోమరితనం ప్రాప్తిస్తుంది. తమ ప్రవర్తనయే తమ సుఖమయ జీవితానికి కారణమవుతుంది. ఒక ఇంటిలో నలుగురు కుమారులున్నారు. ఒకడు గొప్ప విద్యావంతుడైనాడు. మరొకడు రాజవైద్యుడు అయినాడు. మరొకడు శిల్పకారుడైనాడు. ఒకడు బుద్ధి కుశలత లేక యున్నాడు. ఒకే

తల్లి గర్భంలో జన్మించినను వాటివారి పూర్వజన్మ కర్మానుసారంగా వారు న్నారు. ప్రాక్తన జన్మ సంస్కారంపైనే ఈ జన్మలో మనకుపలిగే సుఖ దుఃఖాలు ఆధారపడి ఉంటాయని మనం గ్రహించాలి.

మానవుడు ప్రశాంతమైన మనస్సుతో, స్మృతితో అనుభవించు సుఖమే నిజమైన, స్థిరమైన సుఖము. భ్రూమధ్యము నందు ప్రాణశక్తిని నిలిపి, మన మూడవనేత్రం తెరుచుకుండేట్లుగా సాధన చెయ్యాలి. యోగం చెయ్యటా నికి సన్యసింప పనిలేదు. సన్యాసం తీసుకున్న పిదప కొంతమంది సంసార సుఖాలను తలచుకుంటూ ఉంటారు. వాళ్ళు కపట సన్యాసులు. అలాంటి సన్యాసం పనికిరాదు. గృహస్థాశ్రమం నందుండి కూడా విషయ వాసనా రాహిత్యంతో ప్రవర్తించేవాళ్ళున్నారు. వాళ్ళు సన్యాసులకంటే పైస్థాన మందుంటూ యోగులనిపించుకొంటారు. మోక్షార్హతకు వయస్సు కారణంకాదు. తల్లి గర్భంలో ఉన్న బిడ్డ యోగాన్ని చేస్తూ ఉంటుంది. ఆయోగాన్నే మన జీవిత కాలంలో సాధన చేసి మోక్షాన్ని పొందవచ్చు.

శ్లో॥ దేహినోస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతర ప్రాప్తి ధీర తత్ర నముహ్యతి॥

జీవునకు ఈ శరీరము నందుబాల్యము యౌవనము మొదలైనవి ఏవిధంగా ఉన్నవో, అట్లే శరీరము వదలి మరొక శరీరమును పొందే సిద్ధి (దేహాంతర ప్రాప్తి) కూడా ఉన్నది. కావున స్థితప్రజ్ఞులు దేహంమీద మోహం కలిగి ఉండరు. వాళ్ళు సదా యోగ సాధనలో నిమగ్నులై ఉంటారు.



# పద్నాలుగవ అధ్యాయము

(జ్ఞాన యోగము)

శ్రీనాగార్జున ఉవాచ :

భిక్షులారా! ఈ జగత్సమస్తము సత్, అసత్ అను రెండు పదార్థముల చేత పరివర్తనం చెందుతున్నది. "సత్ పదార్థ"మనగా నశించనిది. అదేజీవుడు (ఆత్మ) "అసత్ పదార్థ" మనగా నశించెడిపదార్థము."యదృశ్యంతన్నశ్యతి". మనకు కనుపించేదంతయు నశించే స్వభావముకలది. దీనినే అనాత్మ అని కూడా అంటారు. ఆత్మానాత్మ వివేక జ్ఞానము ప్రతిమానవుడు తెలుసుకొనవలెను. అదియే సమ్యక్ జ్ఞానము. ముఖ్యముగా మనము తెలుసుకొనవలసినది ఏమిటంటే "ఈ శరీరం శాశ్వతం కాదు-మనస్సుతో కూడి మొత్తం ఆరు ఇంద్రియముల ప్రభావంతో మానవుడు కర్మలు చేస్తుంటాడు, కర్మ చేయుటకు ఈ శరీరమే మూలము. నశించే శరీరంతో చేయుకర్మల ఫలితాన్ని నశించనివాడైన (అక్షరుడైన) జీవుడు అనుభవిస్తుంటాడు. శరీరము జీవుడు కలుస్తున్నారు. విడిపోతున్నారు. జీవుడు విడచిన శరీరము నశించిపోవుచున్నది. జీవుడు మరియొక శరీరమున ప్రవేశిస్తున్నాడు. ఇట్లా ఒక శరీరమును విడిచి మరొక శరీరమున ప్రవేశించుటకు-మూలమైనది అతని కర్మ. పుణ్యపాపములు రెండూ సుఖదుఃఖ కారణములై, పునర్జన్మకు హేతువులౌతున్నవి. కనుక మానవుడు పాపకర్మలను వదలి, పుణ్యకర్మల ఫలితము తానాశింపక-కేవలము ఆత్మజ్ఞానము కలిగి జీవుని స్వస్థానమైన "పరంధామ"ను చేరుకొనవలెను. అచ్చట సచ్చిదానందమును, పరమ శాంతిని, అమృతత్వమును అనుభవించవలెను. మానవుడు భ్రాంతి మమకారము లందుబడి కర్మబద్ధులు కారాదు. తథాగతుని జీవితాన్నే మనం సందేశంగా గ్రహించి, ఆ విధంగానే నడచుకోవాలి.

కొన్ని వేల సంవత్సరాల క్రితం బోధిసత్త్వుడు అమరావతిలో సుమేధుడనే సంపన్నుడైన బ్రాహ్మణుడుగా పుట్టాడు. ఆయన తన సంపదనంతా పరిత్యజించి తపోవనానికి వెళ్ళిపోయాడు. ఒకసారి సుమేధుడు రమ్మవాటి (రమ్యవాటి) అనే నగరానికివచ్చి, ప్రపంచానికి సత్యమార్గాన్ని బోధించే ఆనాటి బుద్ధుడైన"దీపంకరు"నికి స్వాగతమీయటానికి స్థలాన్నిశుభ్రంచేస్తున్న

హొరులను చూచి, తాను ఒక మార్గాన్ని శుభ్రం చేయటానికి ప్రతిజ్ఞ తీసుకొని పనిచేయ్యటం మొదలుపెట్టాడు. ఆ పనిపూర్తికాకమునుపే బుద్ధుడు (దీపంకరుడు) అక్కడికి వచ్చాడు అప్పుడు తాను పనిచేస్తున్న మార్గంలో కొంత బురదగాఉండడంచూచి బోధిసత్వుడు(సుమేధుడు)బుద్ధుడుఆమార్గాన్ని నడచు చున్నప్పుడు బురద కాలికి అంటుకోకుండా ఉండాలని'దండ'ప్రణామంగా బుద్ధునిఎదుట, ఆబురదలో పడుకొని, తనశరీరం మీదుగా ఆయననడవటానికి వీలుకలుగచేశాడు. ఈ మంచి కార్యం వలన తరువాతి జన్మలో ఆయన బుద్ధుడైనాడు. ధార్మికురాలైన ఒక స్త్రీ ఆ సమయంలో అక్కడే ఉండి దీపంకర బుద్ధునికి ఎనిమిది పుష్పాంజలులు సమర్పించింది. తానుచేసిన పుణ్యం వలన తరువాతి జన్మలో బుద్ధుడుగా కాబోవు సుమేధునకుభార్యగా, యశోధరై జన్మించింది. "మనము చేయు ఉత్తమ కర్మల వలన మనకు ఉత్తమ జన్మలు భవిష్యత్తులో కలుగుత" వన్న విషయం మనం మరువరాదు. ఈజ్ఞానబుద్ధితో నిత్యము ప్రతిమానవుడు జాగరూకుడై సమ్యక్ జీవనము గడపటం ప్రారంభించాలి.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

జ్ఞానమనునది ఎనిమిది విధములుగా నున్నది. 1. జ్ఞాన యజ్ఞము 2. జ్ఞాన తపస్సు 3. జ్ఞానాగ్ని 4. జ్ఞానావస్థ 5. జ్ఞాన నేత్రము. 6. జ్ఞాన పద 7. జ్ఞాన ఖడ్గము. 8. జ్ఞాన ద్వీపము వీనిలో జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠమైనది, పవిత్రమైనది. జ్ఞాన యజ్ఞమనగా జ్ఞానాగ్ని ప్రజ్వలింప చేసి ఆ అగ్నితో బహుశాఖలుగా విస్తరించి యున్న ఈ సంసార వృక్షమును జ్ఞాన ఖడ్గముతో ఖండించి జ్ఞానాగ్నిలో దహింపచేయాలి. వైరాగ్యమను ఖడ్గముతో అహంకార మమకారములను కొమ్మలనూ, నావారు పరాయి వారను భ్రాంతి యుక్తమగు కోమ్మలనూ నరికివేసి, దీక్షయనెడి నెయ్యిపోసి, నిగ్రహమను మంత్రముతో చేయు యజ్ఞమే జ్ఞాన యజ్ఞము. కామ క్రోధములను జయించి, ఇంద్రియములను నిగ్రహించి, మనస్సును సంకల్పరహితము చేసుకుని, వైరాగ్యముతో ఆత్మయందు విశ్రాంతి తీసుకుని, అంతర్జ్యోతిని దర్శించి, ఆత్మతత్వ స్వరూప జ్ఞానము కలిగి, ఆత్మానందము అనుభవించుటయే జ్ఞాన యజ్ఞము, యోగసమాధి అనబడుతుంది.

శరీరమునకు వెలుపల జ్ఞానేంద్రియములున్నవి. ఇవి శబ్ద, స్పర్శ, రూప రసగంధాలను గ్రహిస్తున్నవి. జీవుడు శరీర అంతర్భాగమున ఉన్నాడు. ఇంద్రియముల ద్వారా ఇంద్రియ విషయములను అనుభవించు చున్నాడు. జీవుడు చంచలమై మనస్సుగా మారి ఇవి అన్నియు చేయుచున్నాడు. మనస్సును వెలుపలకు రానీయకుండా ఆత్మాను సంధానము చేసిఇంద్రియ విషయ వాసనలు వెలుపలనే ఉంచివేసి, యోగ సాధనద్వారా భ్రూమధ్య మందున్న జ్ఞాన నేత్ర సహాయంతో తనను తాను తెలుసుకోవడం జ్ఞాన తపస్సు అన బడుతుంది. సాధకుడు వైరాగ్యంతో ఇంద్రియమును జయించటానికి ప్రయత్నించాలి. శ్వాసను సుషుమ్నాలో చేర్చి, ఊర్ధ్వ ముఖంగా పయనించి సహస్రారం చేరుకోవాలి. అప్పుడే పరమ శాంతిమయ కోశ మందలి. (ఆనంద మయ కోశమందలి) పరమాత్మ ప్రాప్తి లభిస్తుంది.

మానవుని శరీరమందు ఐదు అగ్నులున్నవి. ఈ అగ్నుల వలనే మానవుడు పాపాలు చేస్తూ ఉన్నాడు. పాపాలు తొలగించుకుంటూ ఉన్నాడు. క్రోధాగ్ని వలన విచక్షణా రహితుడై అనేక పాపములు చేయుచున్నాడు. జఠరాగ్ని వలనఆహారమును అక్రమమార్గంలో సముపార్జనచేయుచుచున్నాడు కామాగ్ని వలన కొరికలు సృష్టించుకొని ఆ కోరికలకు బానిసవుతున్నాడు. ఒక కోరిక తీరగనే మరియొక కొరిక సృష్టింపబడుతుంది. సముద్రములో ఒడ్డునకు అలలు నిర్విరామంగా వస్తునట్లు మనకోరికలు కూడా అంతులేకుండా ఉంటవి. కోరికలు నెరవేరక పోతే కోపము, బాధ కలుగుతవి. వాటి వలన స్మృతి భ్రమ కలుగుతుంది. బుద్ధి నశిస్తుంది. బుద్ధి నశించి నందు వలన అనేక పాపకార్యాలు చెయ్యటం జరుగుతుంది.

మానవులకు నాలుగు అవస్థలునాయి. 1. జాగ్రదావస్థ 2. నిద్రావస్థ 3. జ్ఞానావస్థ. 4. మరణావస్థ.

జీవుడు ఇంద్రియ సంఘముతో కలసి కర్మలు చేయుటయే జాగ్రదావస్థ. జీవుడు ఇంద్రియ సంఘమును వదలి మరుపుతో ఇంద్రియ జ్ఞానము

లేక నిద్రించుటయే నిద్రావస్థ. జీవుడు జ్ఞానము కలిగి కర్మలను ప్రతిఫలాపేక్ష లేకుండా, అహంకార రహితంగా ఆచరిస్తూ, యోగ సాధన ద్వారా ఆత్మ సాక్షాత్కారానికి ప్రయత్నం చేయటం జ్ఞానావస్థ. శరీరత్యాగము మరణావస్థ. పాపపుణ్యములకూ, సుఖదుఃఖములకూ జాగ్రదావస్థయే కారణము. నిద్రావస్థలో మానవుడు స్వప్నము చూస్తున్నాడు. ఏ నేత్రముతో చూస్తున్నాడు? ఏ వెలుగుతో చూస్తున్నాడు? శరీరంలో అంతర్భాగాన ఉన్న అంతర్జ్యోతితో, జ్ఞాన నేత్రముతో చూస్తున్నాడు. మానవులకు ముఖము నందున్న రెండు నేత్రములు కాక అంతర్భాగాన మూడవ నేత్రమున్నది. సూర్యుడు అగ్ని చంద్రుడు బహిర్జ్యోతులు, శరీరము లోపల వీటన్నింకి వెలుగును ప్రసాదించగల అందర్జ్యోతి (స్వయం జ్యోతి) ఉన్నది. దీనినే మనం

జాగ్రదావస్థలో ఉన్న అనుభూతి నిద్రావస్థలో ఉండదు. ఒకరికి కడుపునొప్పి వ్యాధి ఉన్నది. జాగ్రదావస్థలో కడుపు నొప్పితో బాధపడుతూ ఉంటాడు. కాని నిద్రావస్థయందు ఆ బాధ తెలియుటలేదు. మరణావస్థలో జీవుడుశరీరమును విడిచిపోవుచున్నాడు మరణానంతరం శరీరమునుకాల్చినను బాధఉండదు. కావున సుఖదుఃఖములను అనుభవించుచున్నది. జీవుడే కానీ శరీరంకాదు. ఒకడు మరియొకరిని కత్తితో నరికాడు. నరక బడ్డవాడు బాధపడుతూ ఉన్నాడు. కత్తికి మాత్రం ఏవిధమైన బాధలేదు. కరణితో చేయు కర్మ ఫలం కర్త అనుభవిస్తాడు. ఇచ్చట శరీరము కరణి. దేనితో కర్మ చేయుచున్నాడో అది కరణి. చేయునది కర్మ. అనుభవించునది కర్త. జీవుడు కర్మను చేయుటకు శరీరము కారణము. కర్మఫలము ననుభవించునది జీవుడు మాత్రమే. ఈ కారణము వలననే జీవునకు ఉత్తమజన్మ, మరణావస్థ తరువాత మరల జాగ్రదావస్థ, నిద్రావస్థలు కలుగుచున్నవి. తన సాధన వలననే జీవునకు జ్ఞానావస్థ లభిస్తుంది. జాగ్రదావస్థలో ఉండి, ఇంద్రియవిషయములైన శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధాలపై రాగము నుంచక, సంకల్ప వికల్పములను వదలి, నివృత్తి మార్గమున యోగసాధన చేసి, శాశ్వతమైన ఆత్మానందమును పొందుటయే జ్ఞానావస్థ అనబడుతుంది.

దీనినే మోక్షానుభూతి అనికూడా అంటారు. జీవుడు స్మృతితో పరమశాంతిని పొందుటయే మోక్షము, జాగ్రదావస్థలో ఉన్ననూ ఇంద్రియ వికారమునకు లోను కాకుండా ఉండటమే యోగి లక్షణం. భ్రూమధ్య స్థానములో మానవులకు జ్ఞాన నేత్రము మూసుకొని ఉంటుంది. జంతువులకు పశుపక్ష్యాదులు మొదలగు క్రిమికీటకాదులు మొదలగు జీవరాశులకు ఈ జ్ఞాన నేత్రములేవు. మానవుడు జ్ఞాననేత్రము కలిగి ఉన్నను. దానిని తెలుసుకొనకుండా ఉన్నాడు. వృక్షములతో ఆకులు సూర్యరశ్మిని స్వీకరించుచున్నవి. వీటికి ఇంద్రియములు లేవు. కాని ఇంద్రియ జ్ఞానమున్నది.

పక్షులకు, జంతువులకు కొన్ని ఇంద్రియములున్నవి. కానీ జ్ఞానము లేదు. బుద్ధి, తెలివి, అహంకారము లేవు. స్మృతితో అనుభవించుచున్నవి. అవి కూడా తినుట, తిరుగుట, నిద్రపోవుట, సంతానోత్పత్తి చేయుట, భయపడుట మొదలగు పనులు చేయుచున్నవి. మానవులకూ, పశువులకూ ఒక్క జ్ఞానమే తేడాగా ఉన్నది. మానవ శరీరమందు తొంబది ఆరు ప్రకృతి తత్వములున్నవి. ఇంత ప్రకృతి సంపదను శరీరమందుంచుకుని దైవీ సంపదను తెలుసు కొనలేక వ్యర్థ జీవితమును గడుపుచూ జంతువుల కంటే హీనముగా బ్రతుకు చున్నాడు మానవుడు.

మానవుడు మాంసపు కన్నులతో ప్రకృతిసంపదలను చూచుచున్నాడు. ఇంద్రియములతో సుఖమునూ, దుఃఖముగానూ అనుభవించుచున్నాడు. జ్ఞాన నేత్రముతో దైవీ సంపదను కాంచుటలేదు. మొదట జ్ఞాన నేత్రముతో జీవునకు, శరీరమునకు గల తారతమ్యతను తెలుసుకోవాలి. సాధన చతుష్టయముల యందు ఇది రెండవది. శరీరము నశించునది. అది ప్రకృతి స్వరూపము. నశించెడి స్వభావము కలది. జీవుడు అక్షరుడు. నశించువాడు కాడు. మానవులు "శరీరమే తాము" అని భ్రాంతిలో ఉన్నారు రామయ్య అంటే శరీరమును గురించి వర్ణించున్నారు. "ఎర్రటివాడు, పొడుగాటివాడు" అని చెప్పుచున్నారు. జీవుడు శరీరమును వదలి పోయినతరువాత "రామయ్య చనిపోయినాడు". అని చెప్పుచున్నారు. ఇప్పుడు రామయ్య-శరీరము పేరా?

జీవుని పేరా? దీనివలన "రామయ్య" అని జీవుని సంభోదించుచున్నట్లుగా తెలియుచున్నది. నిన్ను ఉద్ధరించుకొన వలయునన్న జీవుని ఉద్ధరించుకొన వలెను. జ్ఞాననేత్రముతో అంతర్జ్యోతిని దర్శించేందుకు ప్రయత్నించెయ్యాలి. దీపము లేని ఇల్లు, జ్ఞానము లేని శరీము అంధకారములో ఉంటాయి.

జ్ఞాన నౌక ;- నౌక (పడవ) అనగా నీటిలో మునంచక తేల్చునది అని భావము. మానవుడు దుఃఖమను సముద్రములో, ప్రకృతి అను మాయలో మునిగి యున్నాడు. మనస్సును నిగ్రహించుకోలేక, కోరికలను పెంచుకొని అనేక పాపములు చేయుచున్నాడు. ఇక్కడ రెండు పదార్థములున్నవి. 1. సముద్రంలో ముంచునదైన మనస్సు (మాయ), తేల్చునదియైన జ్ఞానము. కావున జ్ఞానమనే పడవను ఆధారం చేసుకొని, ఈ సంసారమనెడి సముద్రమును మనం దాటాలి. అనేక పాపములు చేసి "నేను పాపాత్ముడను. నాకు మోక్షార్హత లేదు" అనినిరుత్సాహ పడనవసరం లేదు. "అపిచేదసి పాపేభ్యో సర్వేభ్యోః పాపకృత్తమాః"పాపాత్ములలో మిక్కిలి పాపాత్ముడైననూ జ్ఞానమనెడి పడవ సహాయంతో సంసార మనెడి సముద్రమును దాటి మోక్షమను గమ్యమును చేరవచ్చు. పాపులు మరల పాపము చేయక పశ్చాత్తాపము చెంది, జ్ఞానమును నాశయించి, యోగసాధనచేసిన తప్పక మోక్షార్హులౌతారు. సముద్రము ఎంత లోతైనను పడవలో యుండు వారికి ఎట్టిఅపాయము కలుగదు. పడవ నీటిలోనికి నీరురాదు. పడవలోనికి నీరువచ్చినా పడవ మునిగి పోదు. మానవులీ సంసార మందుండవచ్చు. మానవులయందు సంసార ముండరాదు. తామరాకు నీటి యందున్నను తామరాకునకు నీరు అంటదు. కుమ్మరి పురుగు బురదయందున్నగానీ దానికి బురద అంటదు. వాటిపైన ఒక విధమైన జిగురు పదార్థము ఉండుట వలన నీరు, బురద వాటికి అంటుటలేదు. అట్లాగే మానవుల అంతఃకరణమునకు జ్ఞానమనెడి కవచముండిన, ఈ సంసార సాగరములోని కామ క్రోధములనే బురద, నీరు వారికిఅంటదు. పడవలో ప్రయాణముచేయువారికి సముద్రము లోతుతో నిమిత్తం లేదు. అట్లే జ్ఞానయోగము నభ్యసించువారికి తమపాపము గురించిన

చింత అవసరం లేదు. వైరాగ్యము, దీక్ష, ప్రజ్ఞ, ప్రయత్నము జీవులకు అత్యంత ఆవశ్యకములు. సాధనలో విఘ్నములు కలిగినను మరలా మరలా ప్రయత్నం చేస్తూ ఉండవలెను. మానవుడు సాధనచేత యోగి కాగలడు పాప రహితుడు కాగలడు. అట్టి జ్ఞానము ఎట్లా కలుగుతుంది? జన్మాంతర సంస్కారము వలన, సజ్జన సాంగత్యము వలన, సద్గురు కటాక్షము వలన కలుగుతుంది. కనుక తత్వవేత్తలయిన గురువుల నాశ్రయించి, వారి ఆజ్ఞలను పాలించి, దీక్షతో శిక్షణను పొంది-యోగసాధన చెయ్యాలి. సాధన చేయుట వలన అనుభవ జ్ఞానము లభిస్తుంది. కేవలము విన్నంతమాత్రాన విషయము తెలుస్తుంది కానీ అది అనుభవమునకు రాదు. చెఱుకుతియ్యగా ఉంటుందని తెలిసికొనిన చాలునా? చెఱుకును తెచ్చితినాలి. అప్పుడే చెఱుకుతీపి యెట్టిదో మనకు అనుభవమౌతుంది.

జ్ఞాన ఖడ్గము :- జ్ఞానఖడ్గమనగానే అదేదో హింసా స్వరూప శబ్దముగా మనకు అనిపిస్తుంది. జీవుని హింసించుచున్న మనస్సూ, మనస్సుతో కూడి యున్న ఆరు ఇంద్రియములనూ నిగ్రహించి, బంధించిన జీవునకు హింస తొలగి పోతుంది. బంధ విముక్తి కలుగుతుంది. ఇచ్చట సంసారము ఒక వృక్షముగా వర్ణించుట జరిగింది. చెట్టుకు ఆధారము వేళ్ళు. అవి నలుదిశలకు ప్రాకి ఉంటవి. వేర్లు భూమి సంఘమున చేరి, జ్ఞానము పెరిగినచో, వృక్షము పెరుగుటకు తోడ్పడతాయి చెట్టును చంపవలెనన్న వేరును సమూలముగా భూమి నుండి వేరు చేయాలి. చెట్టు భూమి సంఘమున చేరి బలము కలిగి యున్నది. అట్లాగే సంసార మనెడు వృక్షమునకు తొంబది ఆరు తత్త్వము లైన తొంబది ఆరు కొమ్మలు కలిగి, కామమనెడి మొదలు కలిగి, మనస్సంకల్ప వికల్పములనెడి అసంఖ్యాకములైన వేరులు కలిగి, అత్యంత ధృఢముగా ఉన్నది. ఈ సంసార వృక్షమునకుగల సంఘమును తొలగించాలి. ఇచ్చట మనస్సూ, ఇంద్రియ విషయములూ, సంసారమునకు కారణములు. ఈ సంఘములను తొలగించి, ఆత్మ సంఘాన్ని మనం చేరుకోవాలి. దీనికి ధృఢమైన వైరాగ్యమనెడు ఖడ్గముతో (జ్ఞాన ఖడ్గముతో) సంసార వృక్షము యొక్క వేరులను నరికివేసి, జ్ఞాన మార్గాన్ని నిష్కంటకంగా చేసుకోవాలి.

జ్ఞానము అనేక విధములుగా నున్నది, పరమాత్మ తత్త్వజ్ఞానము ప్రకృతి తత్త్వజ్ఞానము, శాస్త్రజ్ఞానము, పరిశోధనా జ్ఞానము, అనుభవజ్ఞానము, లౌకిక జ్ఞానము విచక్షణా జ్ఞానము, ప్రబోధనా జ్ఞానము, పరమాత్మ తత్త్వజ్ఞానమునే "దివ్య జ్ఞానము" అని అంటారు. నిత్యమును అనిత్యమును తెలుసుకొని, ఇంద్రియ సుఖము నపేక్షించక, నీలో ప్రకాశించుచున్న ఆత్మ జ్యోతిని నీ జ్ఞాన నేత్రము ద్వారా దర్శించి, ఆత్మానందమును, పరమ శాంతిని, పొందాలి. ప్రకృతి తత్త్వజ్ఞానమనగా పదార్థ విజ్ఞానము. పంచభూతములందు, ఖనిజములందు, లోహములందు, అణువణువు నందుగల పరమాణు శక్తిని పరిశోధించి, దాన్ని ఏ విధముగా ఉపయోగించుకోవాలో తెలుసుకొని, దాని సహాయంతో పరులకు జ్ఞానబోధ చేయాలి.

శాస్త్రజ్ఞానము :- అనగా భాషాపరిజ్ఞానము కలిగి, శాస్త్రమునందు ప్రతిపాదింపబడిన ధర్మ సూత్రములను అవగాహన చేసుకుని ఇతరులకు ప్రబోధించి వారికి కూడా ఆత్మజ్ఞానము కలుగునట్లు చేయటం శాస్త్రమునందు నిషేధించిన కార్యములను చేయకుండా ఉండటం. మన ఇష్టం వచ్చినట్లుగా, మనకు బుద్ధికి తోచినట్లుగా ధర్మాన్ని చెప్పకూడదు. శాస్త్ర ప్రమాణంగా చెప్పాలి. కేవలము గురువుల నాశ్రయించటం, ఏ శాస్త్రము చదువక పోయినను పూర్వజన్మ సంస్కార ప్రభావమువలన యోగసాధన చేసి ఆత్మతత్త్వ స్వరూప జ్ఞానము కలిగి ఉండుట అనుభవజ్ఞాన మనబడుతుంది.

లౌకిక జ్ఞానము అనగా లోకములో సంఘములో ఎట్లా ప్రవర్తించాలో ఎట్లామాట్లాడాలో, ఎట్లా జీవించాలో తెలుసుకుని జీవించటం. తల్లి దండ్రులను గౌరవించాలి, భార్యను ప్రేమించాలి. సంతానాన్ని క్రమశిక్షణగా పెంచాలి. ఇంటికి వచ్చిన అతిథి అభ్యాగతులను, బంధువులను సగౌరవంగా సత్కరించాలి. ఇంటిని శుభ్రంగా ఉంచుకోవాలి. ఇరుగు పొరుగు వారితో గౌరవంగా మిత్రభావంతో మెలగాలి. గొప్పవారు తక్కువ వారని విచక్షణ చేయరాదు. సంఘముతో కలసి మెలసి ఉండాలి. సద్భావంతో జీవించాలి.

విచక్షణా జ్ఞానమనగా యేది చేయవలెనో, ఏది చేయకూడదో, ఏది మాట్లాడాలో, ఏది మాట్లాడ కూడదో, ఎవరిని ఎట్లా గౌరవించాలో, ఏ అహారం ఎట్లా తీసుకోవాలో. ఎట్లా ప్రవర్తించాలో, తెలుసుకోవటం. కొందరు తాము ఆచరించకుండా ఇతరులకు ధర్మోపదేశము చేస్తూ ఉంటారు. దీనినే వాచా వేదాంతం అని అంటారు. శ్రవణ మాత్రమున శాస్త్రిలను అవలోకించి పెద్దలుచెప్పింది విని, వాటిని ఆచరించకుండా, ఆచరిస్తున్న వానివలె ఇతరులకు బోధిస్తూ ఉంటారు. "దీనినే గుడ్డివాని చేతిలో దివిటి" అని అంటారు. దివిటి వెలుగు గుడ్డివానికి పనికిరాదు. చూపుకలవారికి పనికి వస్తుంది. ఆత్మజ్ఞానము కలవారి బోధ మనలను నిత్య సాధనలో సచ్చిదానందాన్ని కలిగిస్తుంది. ఈ వాచా వేదాంతము విని ఆచరించే వారికి ఎంతయో ఉపయోగపడుతుంది. చెప్పులు కుట్టేవాడు ఎంతో అందంగా చెప్పులుతయారు చేస్తాడు. కానివాటిని తాను ఉపయోగించడు· మరియొకరు ఉపయోగిస్తారు. అట్లాగే ప్రబోధ జ్ఞానికి భిక్ష మాత్రము లభిస్తుంది. అనుభూతి కలుగదు. కనిపించే వస్తువులందు కనిపించ కుండా ఉండే సూక్ష్మ తత్త్వమును, అంతర్గత శక్తిని పరిశోధించి మానవులకు దాని ప్రయోజనము అందచేయటాన్ని పరిశోధనా జ్ఞానము అని అంటారు.

అన్నింటి కంటే శ్రేష్ఠమైనది, పవిత్రమైనది, ఆత్మజ్ఞానమొక్కటే. అది పవిత్రమైనది, శ్రేష్ఠమైనది, పరమ శాంతిని ఆనందాన్ని ఆత్మతత్త్వప్రకాశాన్ని జీవునికి ప్రసాదిస్తుంది. జన్మరాహిత్యము చేయునది ఒక ఆత్మతత్త్వ జ్ఞానము తప్ప మరియొకటి లేదు. "నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహా విద్యతే" ప్రపంచంలో జ్ఞానానికి సమానమయ్యేడిది, పవిత్రమైనది మరియొకటిలేదు. సిరిసంపదలూ, సామ్రాజ్యము ఆత్మజ్ఞానమునకు సమానముకానేరవు. ప్రభువులైన, చక్రవర్తులైననూ, ఆత్మజ్ఞాని పాదముల నాశ్రయింపవలసిందే.

ఆత్మజ్ఞాని శ్రేష్ఠతముడు. పరమాత్మ తత్వమును తెలుసుకొనలేక నశించెడి స్వభావము గల ఈ కనిపించు దేహేంద్రియములు శాశ్వతమని భ్రమపడి,

క్షణక్షణమునకు మార్పు చెందెడి ఇంద్రియ సుఖములను అపేక్షించి ఈ సంసారములో మునిగి తేలుట అజ్ఞానమనబడుతుంది. "నేను ధనవంతుణ్ణి నేను రూపవంతుణ్ణి" అనే భ్రమతో అహంకారముతో ఉండటం అజ్ఞానం అజ్ఞానులు సంసారసాగరంలో మునిగి పోవుచున్నారు. జ్ఞానులైనవారు నిత్యానిత్యవివేకము కలిగి ప్రవర్తిస్తారు. శరీరము నశ్వరము అని తెలుసు కుని, శాశ్వతమైన ఆత్మకోసమే ప్రయత్నిస్తుంటారు. నిరంతర సాధనద్వారా, నిశ్చయాత్మకమైన బుద్ధితో ఇంద్రియములను జయించి, నిరంతర యోగ సాధనచేసి, ఆత్మసాక్షాత్కార అనుభవము కలిగి, సచ్చిదానందమునూ పరమ శాంతినీ, అమృతత్వాన్నీ పొందుతారు. కనిపించెడి సకల వస్తు సముదా యము నశించు స్వభావము కలది. "యద్దృశ్యం తన్నశ్యం". ఆత్మ నశించ నిది, మార్పులేనిది. దాన్ని పొందే జ్ఞానమే నిజమైన జ్ఞానము. అట్టిజ్ఞానమును ప్రతి వ్యక్తి పొందవలెను.



## ఐదు గొప్ప సంఘటనలు

బుద్ధుని జీవితమున ఐదు గొప్ప సంఘటనలు జరిగినవి. 1 జననము 2 మహాభి నిష్క్రమణము (వైరాగ్యము) 3 సమ్యక్ సంబోధి (జ్ఞానప్రాప్తి) 4 ధర్మచక్ర ప్రవర్తనము 5 మహాపరి నిర్యాణము. ఈ ఐదు సంఘటనలు అమరావతి, నాగార్జున కొండ మున్నగు బౌద్ధ కేంద్రములలో, శిల్పములతో అభివ్యక్తము చేయబడినవి.

# పదిహేనవ అధ్యాయము

(బుద్ధి యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షులారా! ఎనుబదినాలుగు లక్షల జీవరాశిలో ఏ జీవికి లేని "బుద్ధి" మానవునకున్నది. దీనిని మనము ఉపయోగించి యుక్తమేదో అయుక్తమేదో గ్రహించుచు మనము పనులు చేస్తూ ఉండవలెను. శాశ్వతసుఖమేదియో గ్రహించి దానిని పొందుటకు ప్రయత్నించవలెను. సత్, అసత్‌ల మధ్యగల భేదమును గుర్తించవలెను. తథాగతుడు ముఖ్యముగా ఈ దుఃఖము నెట్లు పోగొట్టుకొని, సచ్చిదానందమునెట్లు పొంద వలెనో తన సిద్ధాంతములద్వారా లోకమునకు వెల్లడించాడు. ఈ దుఃఖ నివృత్తి మార్గమునే సర్వులకూ ఎరుక పరిచాడు. ఆయన తాను బోధించు పద్ధతిలో అవలంభించే విధానము చాలా విచిత్రంగా ఉంటుంది. ఆ విషయం మీకు తెలియ జేస్తాను.

శ్రావస్తినగరంలో కుశ గౌతమి ఒక వ్యాపారిని పెళ్ళిచేసుకొంది. కొంత కాలానికి ఒక కుమారుడు కలిగాడు. సంవత్సరం గడిచిందోలేదో ఆ పిల్లవాడు పాము కాటుకు గురై మరణించాడు. ఇంతకు పూర్వం ఆమెకు మరణం అంటే ఏమిటో తెలియదు ఎప్పుడూ చూడలేదు. అందుచేత తన కుమారుడు. మరణించాడంటే నమ్మలేక పోయింది. ఆ పిల్లవాడి శవాన్ని భుజానవేసుకొని ఇల్లిల్లు తిరుగుతూ, కనిపించిన వాళ్ళందరినీ తన కొడుకు మామూలుగా తిరగటానికి ఏదైనా మందులుఇమ్మని ప్రాధేయపడసాగింది. జనం ఆమెకు మతిచలించిందనుకొన్నారు చివరకు ఓ వృద్ధుడు ఆమెను చూచి "ఫలానాచోట గౌతమ బుద్ధుడనే ఆయన ఉంటాడు. ఆయన దగ్గరకు వెళ్ళు!" అని సలహా యిచ్చాడు. ఆమె భగవానుడి దగ్గరకు వెళ్ళి కుమారుడికి మందు ఇమ్మని అడిగింది. భగవానుడు ఆమె చెప్పింది విని "అమ్మా! పట్టణంలోకి వెళ్ళి, మరణం సంభవించని ఇంటి నుండి పిడికెడు ఆవాలు పట్టుకొనిరా! నీ కొడుకును బ్రతికిస్తాను. అన్నాడు. "అదెంతపని-ఇప్పుడే పట్టుక వస్తా"నని ఆమెకుమారుడి కళేబరం భుజానవేసుకొని ఊళ్ళోకి వెళ్ళింది. తాను

వెళ్ళిన ప్రతిఇంట్లోను ఎవరో ఒకరు ఎప్పుడో ఒకప్పుడు మరణించారని ఆమెకు తెలియవచ్చింది. ఆవాలు లేకుండానే ఆమెతిరిగి బుద్ధుడి దగ్గరకు వచ్చింది, అప్పుడు భగవానుడు ఆమెనుచూచి "అమ్మా! ఇప్పుడు నీకు బాగా అర్థమైంది గదా! మరణం సర్వసాధారణమైన విషయం. అది నీ ఒక్కదానికే కలిగిన దురదృష్టంకాదు. ఇప్పటికైనా తెలిసి వచ్చిందా? దుఃఖం విడిచిపెట్టు" అన్నాడు. అప్పుడు ఆమె "తెలిసింది స్వామీ! సర్వం అనిత్యం. మరణమే సత్యం" అని, ఆ పిల్లవాడిఅంత్యక్రియలు చేయడానికై ఆమె వెళ్ళిపోయింది. కనుక అజ్ఞానమే దుఃఖకారణం. సమ్యక్ సంబుద్ధియే ఆనంద కారణం. అదే నిర్వాణము. దాన్ని సముపార్జించి మనం సంబుద్ధులం కావాలి.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

ప్రబుద్ధులారా "బుద్ధే శరణమన్విచ్ఛా" అనిశాస్త్రములు చెప్పుచున్నవి. "బుద్ధ శరణం గచ్ఛామి" అని బుద్ధ మతము చెప్పుచున్నది. శరీరమునందు ఇరువది నాలుగు తత్త్వములున్నవి. అందు బుద్ధి ప్రధానమైనది మానవుడు బుద్ధిమంతుడు కావలెను. బుద్ధిమంతుడుగా జీవించవలెను బుద్ధినాశ్రయించి లోకహితంగా, సకల కార్యములు చేస్తుండవలెను బుద్ధిలేని మాటలు మాట్లాడరాదు. బుద్ధిలేని పనులు చేయరాదు. కన్ను, నాలుక, ముక్కు, చెవి, చర్మము అనెడి ఇంద్రియములు, మనస్సుతోకూడి సంచరించు మాయ, బుద్ధిని ఆవరించి ఉంటవి. అందువలన మానవులు బుద్ధియొక్క దివ్య శక్తిని పొంద జాలకున్నారు. మాయను తొలగించినచో మబ్బులు తొలగిన సూర్యుని వలె మనస్సు ప్రకాశిస్తుంది. మాయ అంటే ప్రకృతి. దీనితో (రాగముతో) కలిగి ఉన్న బుద్ధి బంధమౌతుంది. పరమాత్మ తత్త్వము మీద అనురక్తి గల బుద్ధి ధర్మ స్వరూప మౌతుంది.

మానవుడు నిద్ర లేచినది మొదలు అనేక కర్మలు చేస్తుంటాడు. శరీరమును పోషించుకొను కర్మలు, సంసారమును పోషించు కర్మలు, ఇంద్రియ సుఖముల కొరకు చేయు కర్మలు, జీవుని ఉద్ధరించుటకు చేయు కర్మలు అని ఈ కర్మలు నాలుగు విధాలుగా ఉంటవి. ప్రతీ కర్మల

యందు బుద్ధి యొక్క పాత్ర ఉన్నది. మాయా వరణము లేక యున్న బుద్ధి కలిగినచో ధర్మ సమ్మతమైన కర్మలు చేసి, పాప యుక్తులు కాకుండా, బుద్ధి మంతులుగా జీవిస్తారు. మాయకులోనైన బుద్ధికలిగినచో అధర్మంగా కర్మలు చేసి పతనమౌతారు. మాయా రహితమైన మనబుద్ధియే ఆత్మసాక్షాత్కారానికి మార్గం చూపుతుంది. శరీరాన్ని పోషించుకోటానికి ఆహారము ఎంత అవస రమో జీవుని ఉద్ధరించుకోటానికి జ్ఞానయోగము అంత అవసరము. శరీరము నకు స్నానము ఎంత అవసరమో జీవునకు స్మృతి కూడా అంత అవసరము. స్మృతి అంతఃకరణమును శుభ్రం చేస్తుంది. కావున జీవుడు జ్ఞానము స్మృతి కలిగి తనను తాను ఉద్ధరించుకోవాలి. ఆత్మను మరచి కేవలము శరీరమును, సంసారమును పోషించుకొనువారు జడప్రాయు లనిపించు కొంటారు.

మానవులు కొందరు పుణ్యకర్మలు చేస్తూ ఉంటారు. అకర్మలను, పవిత్రమైన బుద్ధితో, పలాపేక్ష లేకుండా ఆచరించాలి. బుద్ధిమంతులైన వారు పాపపుణ్యములనూ, సుఖదుఃఖములనూ వదలి జీవిస్తారు. వారు యోగము నాశ్రయించి ఆత్మ సుఖాన్నీ, పరమ శాంతినీ పొందుతుంటారు.

జన్మించిన వారికి మరణించుట యనునది తప్పదు. ఇట్లా జనన మరణ చక్రంలో పడియున్న వారికీ, "దీంట్లోనే సుఖముం"దని భ్రమించే వారికీ ముక్తి కలుగదు ఇంద్రియ సుఖములలో విశ్రమించకుండా, తన యందు ప్రకాశించుచున్న ఆత్మ జ్యోతిని జ్ఞాన నేత్రము ద్వారా దర్శించి అందు విశ్రమించిన మోక్షమును పొందుతారు.

మానవులు దాన ధర్మాది కర్మలు చేస్తు ఉంటారు. అవి రెండు విధ ములుగా ఉంటాయి. 1. కామ్య కర్మ 2. నిష్కామకర్మ. ఫలితాన్ని కోరికర్మనుచేస్తే దాన్నికామ్యకర్మ అంటారు ఇవి జీవులకు బంధకారణములు. నిష్కామ కర్మ అనగా ఫలితాన్ని ఆశించకుండా కర్మలు చేయుట. ఇవి బంధ రహితములు. "కర్మణ్యేధికారస్తే మాఫలేషు కధాచనా" కర్మలు చేయుట యందే అధికారము కాని ఫలితము నందు ఏ విధమైన ఆశ ఉండరాదు.

మానవుల యందు నాలుగు విధములైన స్వభావములు కలిగియున్న వారున్నారు. ఉత్తమములు, మధ్యములు, హీనులు, అధములు. ఉత్తములైన వారు తమ కార్యమునకు భంగము కల్గినను సహించి, పరుల కార్యమును మును నిర్వహించి పరోపకారము చేస్తూ ఉంటారు. మధ్యములు తమ కార్యాన్ని నెరవేర్చుకుంటూ దానికి భంగము కలుగనీయకుండా ఇతరులకు ఉపకారము చేస్తుంటారు. కొందరు తమస్వార్థము కొరకు ఇతరులకు అపకారము చేస్తూ ఉంటారు. ఇట్టివారిని హీనులు అనబడతారు. మరి కొందరు వ్యక్తులు తమకు ఎలాంటి ప్రయోజనము లేక పోయినను ఇతరులకు బాధను కలిగిస్తూఉంటారు. అపకారాన్ని చేస్తూ ఉంటారు. వీనిని అధములు అంటారు. పాపకర్మఫలాన్ని అనుభవించేది జీవుడు. అపాప కర్మలు చేయునది ప్రకృతి స్వరూపమైన దేహేంద్రియములు. ఈ సత్యాన్ని తెలుసుకొని కర్మల యందు ఫలాపేక్ష రహిత భావాన్ని కలిగి ప్రవర్తించటమే బుద్ధి మంతుల లక్ష్యము.

మానవులకు సకల దుఃఖాలు తొలగి పోవాలన్న చో వారుబుద్ధిని స్థిరం చేసుకుని "బుద్ధి యోగం పరం సుఖం". స్థిర బుద్ధితో పరమ శాంతిని పొందాలి. సుఖము ధనమందున్నదని, బంగార మందున్నదని. భార్యయందున్నదని, ఇంద్రియము లందున్నదని, భావించుచున్నారు. సుఖమునునది బుద్ధి యందున్నది. బుద్ధి మాయా మోహితమై దుఃఖమును పొందుతుంది. దుఃఖనివారణకు మొదటి మెట్టుమనోనిగ్రహం. మనోనిగ్రహంవలన ఆనందం లభిస్తుంది.

మనస్సు ఆత్మను చేరునపుడు మాయ బుద్ధిని వీడిపోతుంది. బుద్ధి ఆత్మజ్ఞానాన్ని పొందుతుంది. ప్రకృతి వికార లక్షణములు తొలగిపోతవి. ప్రకృతి సహజమైన దుఃఖము నశిస్తుంది. ఈ రహస్యము నెరిగి మానవులు బుద్ధి యొక్క పవిత్రతను గుర్తించి, మనస్సుకు స్వేచ్ఛ నీయక నిగ్రహించి ఏకాగ్రమొనర్చి యోగ సాధన ద్వారా ఆత్మ సాక్షాత్కారాన్ని పొందాలి. తత్త్వవేత్తలైన సాధకులనాశ్రయించి ఈ బుద్ధి యోగాన్ని ఎట్లా సాధన చెయ్యాలో తెలుసుకొని దీక్షతో సాధన చెయాలి. మొదట దుఃఖము ఎక్కడ

నుంచి ప్రారంభమౌతుందో తెలుసుకోవాలి. దుఃఖము విషయవాసనల నుండి ప్రారంభమౌతుంది.

విషయ వాసనలతో, మనస్సంకల్పములతో అనుభవించు సుఖములు అత్యంత అల్పములు. దుఃఖమునకు హేతువులు. బుధులైన వారు ఈ సత్యము తెలుసుకొని విషయవాసనాసుఖములను దగ్గరకు రానీయకుండా యోగ సాధనలో జీవితాన్ని గడుపుతారు. ఇంద్రియముల స్పర్శవలన గాక ఆత్మ స్పర్శ వలన అక్షయ సుఖాన్ని అనుభవిస్తూ ఉంటారు. బుద్ధిని మాయ ఆవరించి యుండుటచేత బుద్ధి ప్రభావమును తెలుసుకోకుండా అసత్యమును సత్యముగా భ్రమపడుచున్నారు. దీపము లేని ఇంటిలో జీవితము గడిపినట్లుగా అజ్ఞానాంధకారములో గడుపుతారు. జ్ఞానజ్యోతిపై మాయ అనే పాత్ర బోర్లించి యున్నది. దీపము ఉన్నను దాని కాంతిని మనము పొందజాలకున్నాము. ఆ మాయను తొలగించుకోవాలి.

"ఇంద్రియాణాం పరాణ్యాహు ఇంద్రియేభ్యః పరం మనః మనసస్తు పరాబుద్ధిః" కర్మేంద్రియములపైన జ్ఞానేంద్రియములు, జ్ఞానేంద్రియములపైన మనస్సు. మనస్సుపైన బుద్ధి ఉంటుంది. అనగా బుద్ధి మన శిరస్సు అగ్ర భాగంలో ఉంటుంది. మన బుద్ధిని శుద్ధం చేసుకోవాలి. గుణ తత్వమును అనుసరించి ఆ బుద్ధి సాత్విక బుద్ధి రాజస బుద్ధి, తామసబుద్ధి. మూడు విధములుగా ఉన్నది.

సాత్విక బుద్ధి అనగా సత్యమును తెలుసుకొను బుద్ధి. ఇది నివృత్తి మార్గము వలన లభిస్తుంది. జన్మ బంధములను విడగొడ్తుంది. రాజసబుద్ధి అనగా ఎవ్వరికి ఏ ప్రాణికి ఏ విధమైన ఉపకారము చెయ్యక. తన జీవనమే సర్వమూ అనుకొనుచు, స్వార్థముతో, లోభంతో, ఉంటుంది. తామస బుద్ధి అనగా ధర్మమును ఎరుగక, అధర్మమని తెలిసినను పాపమని తెలిసినను పాపపు పనులు చేయిస్తూ ఉంటుంది.

బుద్ధి స్వరూపములో మనస్సు 8 విధాలుగా చెప్పబడుతుంది. యోగ బుద్ధి, త్యాగబుద్ధి, సత్‌బుద్ధి, స్వల్పబుద్ధి, నీచబుద్ధి, లోభబుద్ధి, దుర్బుద్ధి.

యోగబుద్ధి, త్యాగబుద్ధి, సత్‌బుద్ధి నివృత్తి మార్గానికి దోహదం చేస్తాయి. మిగిలిన 5 బుద్ధులు ప్రవృత్తి మార్గంలో ప్రవేశింపచేస్తాయి. మానవులు ఎరుకతో తమ బుద్ధి ఏ మార్గంలో ఉన్నదో తెలుసుకొని, ఆ బుద్ధిని మరలించి నివృత్తి మార్గంలో ప్రవేశ పెట్టాలి. దుష్టబుద్ధి కలవారికి అనగా మాయచే పూర్తిగా ఆవరింపబడినవారికి దంభము, గర్వమూ, దురభిమానము, కోపము, వాక్పారుష్యము, మొదలగు, దుష్ట గుణములు ఉంటాయి. మానవులు అను సరించవలసిన ధర్మచక్రప్రవర్తన యందలి ఇరువది నాలుగు ధర్మములను తెలుసుకొని వాటిని ఆచరించి సంసార బంధములను విడగొట్టుకోవాలి.

బుద్ధిమంతులైన వారి మొదటి లక్షణం నిర్భయం "క్షుద్రం హృదయ దౌర్బల్యం" హృదయ దౌర్బల్యం క్షుద్రమైనది. సాధారణంగా "మోక్షప్రాప్తి మనలాంటి సామాన్యులకు సాధ్యంకాదు అది మహానుభావులకే సాధ్యం" అని అనుకుంటూ ఉంటారు. ఈ భావము పిరికివాని స్వభావము. "నేను మోక్షార్హుడను. నేను ఈ జన్మయందే ధృఢమైన సాధనద్వారా మోక్షార్హతను పొందుతాను" అని సుస్థిరమైన బుద్ధితో యోగసాధన చెయ్యటం బుద్ధిమంతుల లక్షణం. పరోపకారం చెయ్యటం, తనకు కలిగిన దానిలో దానమో ధర్మమో చెయ్యటం, లోభాన్ని దరిచేర నీయకుండా ఉండటం, సకల ప్రాణులయెడ మైత్రిభావము కలిగి ఉండటము, అహింస కలిగి ఉండటము, త్యాగ బుద్ధితో జీవితాన్ని గడుపుతూ ఉండటము, బుద్ధిమంతుల లక్షణములు.

బుద్ధిని గురించి యోగ శాస్త్రమైన శ్రీ మద్భవద్గీత అనేక విధములుగా ప్రతిపాదించి యున్నది మానవుల బుద్ధి విషయవాసనా స్వరూపమైన అర్థ వాదములను వినుట యందు శ్రద్ధ ఉన్నంత వరకు జ్ఞానము సిద్ధించదు. బుద్ధితో కూడినపుడే ధర్మాన్ని ఆచరిస్తారు. అలాంటి బుద్ధిని వ్యవసాయం చేసి అనగా సాధనచేసి జ్ఞానమనే పంటను పండించాలి. అదేబుద్ధి యోగం అదే మోక్షం ప్రాప్తింపజేస్తుంది."బుద్ధే శరణ మన్విచ్ఛా""బుద్ధ శరణం గచ్ఛామి" బుద్ధుని ఆశ్రయించుము. శరణము జొచ్చుము. "కర్మజం బుద్ధి యుక్తాహి ఫలం చక్త్వా మనీషణః" బుద్ధితో కూడిన మానవులు తాము చేయు కర్మల

ఫలములు అపేక్షింపరు. "యదాతే మోహకల్లం బుద్ధిర్వ్యతి తరిష్యతి" ప్రకృతి మయామోహాలను తొలగించినపుడు శాస్త్రధర్మములను వినుటయందు శ్రద్ధ కలుగుతుంది. "స్మృతి భ్రంశో బుద్ధినాశో" స్మృతి భ్రమలో పడినపుడు బుద్ధినశిస్తుంది. అప్పుడు బుద్ధిలేని పనులుచేసి కష్టానికి నష్టానికి గురౌతారు. "బుద్ధి పర్యవతిష్ఠతి" బుద్ధికి నిశ్చలత్వము ఏర్పడినపుడు సర్వదుఃఖములను తొలగించు ప్రశాంతత ఏర్పడుతుంది. "నాస్తి బుద్ధిరయుక్తశ్య" స్థిరబుద్ధిని నిశ్చలమైన నిగ్రహం లేనివారికి ఆత్మజ్ఞానము కలుగదు. బుద్ధి మోహాన్ని చెందినపుడు చేయవలసిన ధర్మములుతెలియవు. జ్ఞానులుగా ఉండువారు బుద్ధిని చెదరగొట్టరాదు. క్రమక్రమంగా, ఓర్పుతో, బోధిస్తూ తెలివాళ్ళకి సద్బుద్ధిని కలిగేటట్లు చేయాలి. బుద్ధిసహస్రారములో ఉంటుంది.

యోగ సాధనద్వారా బుద్ధిని నిశ్చలం చేసుకోవచ్చు. ఏకాగ్రం చేసుకోవచ్చు. ఒక ఆదర్శము, ఒక గమ్యము, కలిగిన మనస్సుకు శాంతి ఏర్పడుతుంది. కోరికలను జయించగల్గిననాడే మనకు నిజమైన శాంతి లభిస్తుంది. సాధకులు ఈ మార్గాన్ని అనుసరించి మనస్సును నిగ్రహించవచ్చును. నిర్దిష్టమైన అభిప్రాయం లేకుండా కోరికలకు బానిసై కళ్ళెం విడిచిన గుర్రంవలె ఇష్టము వచ్చిన చోటికి పరిగెత్తుతూఉన్న చంచలమైన మనస్సును అదుపులో ఉంచటం చాలాకష్టం. క్రమ్మకమంగా సాధన ద్వారా మనస్సును అదుపు చేసి, దాన్ని బుద్ధిగా మార్చుకొని ఆత్మసాక్షాత్కారం పొందటం నేర్చుకోవాలి.



# పదహారవ అధ్యాయము
## (జన్మ యోగము)

**శ్రీ నాగార్జున ఉవాచ :**

భిక్షులారా ! త్రిసూత్రాలలో "ధర్మం శరణం గచ్ఛామి" అని చెప్ప బడింది. తథాగతుడు ధర్మచక్ర ప్రవర్తన చేసి. అష్టాంగ మార్గము నిర్దేశించి నాడు. ప్రతి మానవుడు ఈ ధర్మము నెరిగివ ప్రవర్తించ వలెను. సత్ప్ర వర్తన యందు ప్రేమ, సూక్ష్మ పరిశీలన, గొప్ప వినయశీలత, పాపభీతి, గొప్పశక్తి-ఇవి లేనిచో ఇహలోకమునందును పరలోక మందును ఆనందము ననుభవించుట కష్టము. మనుష్యులు ఎల్లప్పుడు తాముచేసిన మంచిపను లను గురించి మాత్రమే తలపోస్తూ ఉంటారు. నేనీపాడుపని చేశా"నని కూడా భావిస్తూఉండవలెను. ఈ భావన పశ్చాత్తాపమునకు దారితీసి-సన్మార్గ ములోనికి మానవుణ్ణి తీసుకొని పోతుంది. అసలు ధర్మమంటే ఏమిటో తథా గతుల మాటలలోనే మీకు వివరిస్తాను. సావధానులై వినండి.

ఒకసారి బుద్ధభగవానుడు భిక్షుకగణం వెంటరాగా కోసలలో భిక్షా టనం చేస్తూ "సాల" అనే గ్రామం చేరుకున్నాడు. ఆ గ్రామంలో చాలా మంది బ్రాహ్మణులు నివసిస్తున్నారు. భగవానుడు వచ్చాడన్నవార్త వినం గానే బ్రాహ్మణులంతా భగవానుని దగ్గరకు వచ్చారు. "ధర్మంఅంటే ఏమిటో వివరించ"మని వారు అడిగారు. అప్పుడు భగవానుడు ఇట్లా చెప్పటం ప్రారంభించాడు. దేహానికి సంబంధించిన అధర్మ దౌష్ట్యక్రియలు మూడు, వాక్కుకు సంబంధించినవి నాలుగు, ఆలోచనకు సంబంధించినవి మూడు క్రియలుఉన్నవి. 1. జీవజంతువులను వేటాడి చంపటం 2 దొంగతనంచేయ టం, 3. వ్యభిచారం అనే మూడు దేహానికి సంబంధించిన అధర్మ దౌష్ట్య క్రియలు, 1 వాక్కుకు సంబంధించి అసత్యం పలకటం 2 చాడీకోరు కావటం 3. నోటి దురుసు కలిగి ఉండటం 4 అసందర్భంగా వాగటం అనేవిఅధర్మ దౌష్టక్రియలు. ఇక ఆలోచనల విషయానికి వస్తే 1 దురాశా కలిగి ఉండటం, 2 ఇతరులు ఇచ్చేదానంతో తృప్తిపడక ఆస్థిఅంతా తనకే దక్కాలనుకోవటం 3 అపకారబుద్ధి, దుష్ట బుద్ధిని కలిగి ఉండటం అనేవి దౌష్ట్య క్రియలు. ఈ ధర్మ దౌష్ట్యక్రియలు లేకపోవటమే ధర్మ పరత. ప్రతి వ్యక్తి ధర్మ పరతుడై చరిస్తూ ఉండాలి.

శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ:

ప్రాణులు మానవులకు అనేక ధర్మములను బోధించు చున్నవి. వాటిని చూచి, అవి అనుసరించు విధానము ననుసరించి మానవులు ధర్మాన్ని నేర్చుకోవాలి. ముఖ్యంగా ఇరువది నాలుగు ప్రాణులను చూచి ధర్మాన్ని నేర్చుకోవాలి

1. తామర పుష్పము 2. శ్రీగంధపు చెట్టు 3. వట వృక్షము 4. కొబ్బరిచెట్టు 5. ఖర్జూరి చెట్టు 6. మిణుగురు పురుగు 7. తెనె టీగ 8. కందిరీగ 9. సాలెపురుగు 10. కుమ్మరి పురుగు 11. తుమ్మెద 12. చీమ 13. కోడి 14. హంస 15. పావురము 16. కోకిల 17. చిలుక 18. నెమలి 19. తాబేలు 20. ఆవు 21. గుర్రము 22. ఏనుగు 23. కుక్క 24. సింహము.

1. తామర పుష్పము:- ఓ మానవులారా! నేను బురదలో పుట్టు చున్నాను. కానీ బురదలో నశించుటలేదు. బురదను, నీటిని దాటి పైకి వస్తున్నాను. బహిర్జ్యోతి అయిన సూర్యుని తేజస్సును పొంది ఆనందిస్తున్నాను. సూర్యుడు అస్తమించినపుడు మరియొక పదార్థం దేనిని చూడకుండా ముకుళించుకొని నిద్రావస్థను పొందుచున్నాను. మానవులారా! మీరు సంసారమనెడు బురదలో పుట్టి దాంట్లోనే మరణిస్తున్నారు. సంసారమను బురదను దాటి, దివ్యతేజమైన అంతర్జ్యోతిని దర్శించండి; పరమ శాంతిని, బ్రహ్మానందాన్ని పొందండి! వ్యర్థముగా దేనిని చూడవద్దు. మీ చూపును వ్యర్థం చేయవద్దు. నావలెనే తేజస్సును చూస్తూ జీవించండి. ఆత్మసాక్షాత్కారాన్ని పొంది జన్మను సార్థకం చేసుకోండి.

2. శ్రీ గంధంచెట్టు :- మానవులారా! నాకొమ్మలన్నియు సుగంధంతో పరిమళిస్తూ ఉన్నాయి. నా సుగంధంచేత సకల ప్రాణులు ఆహ్లాదాన్ని పొందుతున్నాయి. దైవోపాసకులు నాగంధాన్ని దేవునికి అలంకరించి దానిని

ప్రసాదంగా స్వీకరిస్తూన్నారు. నన్ను ఎంతో గౌరవిస్తున్నారు. నాకు ఇలాంటి గౌరవం ఎందువలన కలుగుతున్నది? నాలో ఏ విధమైన దుర్వాసన లేకుండాఉండుటనుచూచి మీలోనిదుర్వాసనను తొలగించుకోండి. యోగాన్ని, ధ్యానాన్ని అభ్యసించండి. మీలోని సర్వ దుర్వాసనలు తొలగిపోతాయి.

మానవులారా! నేను నా ప్రాణంపోయిన తరువాత కూడా సుగంధంగా ఉంటాను. మీరు కూడా నావలెనే సుగంధంగా ఉండాలి. మీరు మీ మనస్సు నందు గల విషయ వాసనలను తొలగించుకోవాలి. విషయ వాసనల దుర్గంధం వలన జీవితం దుర్గంధ భూషితమౌతుంది. జీవుడు కర్మ బద్ధుడు అగుచున్నాడు. కనుక మీలోగల విషయ వాసనల దుర్గంధమును వైరాగ్యము చేత తొలగించుకొని, ఆత్మసాక్షాత్కార జ్ఞాన సుగంధం చేత జీవితాన్ని సుగంధమయం చేసుకోండి. మరణించిన తరువాత కూడా మీ కీర్తి సుగంధం శాశ్వతంగా ఉంటుంది.

వటవృక్షం:- తండ్రియును, సంతానమును ఎట్లుండవలయునో మర్రిచెట్టు మనకు బోధిస్తుంది. మర్రిచెట్టు కొమ్మలు కొంచెం పెరిగేంత వరకు మర్రిచెట్టు మీద ఆధారపడిఉంటాయి. కొమ్మలలోంచి ఊడలు దిగిభూమిలోకి చొచ్చుకు పోతాయి. అప్పుడా కొమ్మలు తమ ఆహారాన్ని ఊడలద్వారా స్వీకరిస్తూ ఉంటాయి. మొదలుకు భారం కాకుండా తమ బ్రతుకు తాము బ్రతుకుతాయి. అయినను కొమ్మలు మర్రిచెట్టును తిరస్కరింపకుండా దానితో సహజీవనం చేస్తాయి. మానవులు కూడా ఈ ధర్మాన్ని ఆచరించాలి. పిల్లలు చిన్నవయసులో తల్లితండ్రుల మీద ఆధారపడి, యవ్వనం వచ్చినతరువాత తండ్రి సంపాదనతో జీవించరాదు. తండ్రికి భారంకారాదు, తల్లితండ్రులను తిరస్కరించి వారికి దూరం కారాదు. వారిని అభిమానించాలి. గౌరవించాలి.

కొబ్బరి చెట్టు - కొబ్బరి చెట్టులో గల పదార్థములన్నీ పరులకు ఉపకరిస్తాయి. దీనిలో చూచేటువంటి శక్తి ఉన్నది. కొబ్బరికాయకు మూడు కళ్ళులాంటి గుర్తులు ఉంటాయి. మూడవకన్ను జ్ఞాననేత్రము. అందుకే సగుణోపాసకులు కొబ్బరికాయను భగవంతునికి అర్పిస్తారు. కొబ్బరికాయ

లోని పైన పీచు తమోగుణము. లోపలి టెంక రజోగుణము. లోపలి కొబ్బరి సత్వ గుణము. కొబ్బరినీరు పవిత్ర అంతఃకరణకు ప్రతీక. "మన పవిత్ర అంతఃకరణమును భగవంతునకు అర్పించాలి" అని కొబ్బరికాయ చెబుతుంది. కొబ్బరి కాయవలె మనము కూడా మూడవ నేత్రమును కలిగి ఉండాలి. కొబ్బరి చెట్టువలె మన జీవితము పరులకు ఉపయోగించాలి.

5. తాటిచెట్టు ;- తాటిచెట్టు జీవితము సార్ధకమైనది. దీనిలో వ్యర్ధ పదార్ధ మన్నదిలేదు. దాని మొదలు మానవుల నివాసములకు ఉపయో గిస్తుంది. ఆకులు ఇంటి కప్పుకు పనికి వస్తాయి. కాయలు ఫలహారముగా ఉపయోగ పడ్తాయి. తాటినారా, తాటిపీచు, మనకు ఎన్నో విధములుగా ఉపయోగపడ్తాయి. అదేవిధముగా మానవుడు తన ఇంద్రియములను వ్యర్థము చేయరాదు. పరోపకారము చేయుటకు వినియోగించాలి. శరీరముతో తన స్వధర్మమును అనుసరించుచు, వ్యర్థ కార్యమును చేయకుండా జీవితాన్ని పరోపకారముతో సార్థకం చేసుకోవాలి.

6. మిణుగురు పురుగు :- సకల ప్రాణుల యందు ఆత్మ స్వరూపమైన అంతర్జ్యోతి ఉంటుంది. ఓ మానవులారా! ఆత్మనుగాంచి ధన్యులవండి. నా అంతర్జ్యోతిని నేను మీకు వెలుపలకు చూపిస్తున్నాను. ఆత్మజ్యోతియే సత్యము. దానిని దర్శించండి తరించండి. మిణుగురు పురుగు నుండి ఈ ఆత్మ బోధన మనం గ్రహించాలి.

7. తేనెటీగ :- ఓ మానవులారా! మీరును నావలెనే జీవితాన్ని గడ పండి. నేను నా జీవితమును, సంతానమును మధురమైన మధువుతో పోషిం చుకొను చున్నాను.హింసా స్వరూపమైన నీచ ఆహారముతో జీవించుట లేదు. నేను పుష్పము నుంచి మధువును తీసుకుంటున్నపుడు దానికి ఎలాంటి అప కారముచేయుటలేదు. నా వలన వృక్షమునకు సంతానోత్పత్తి కలుగు చున్నది మీరు కూడా ఏ ప్రాణికి అపకారము చేయకుండా, బాధను కలిగించకుండా, చేతనయినంత వరకు ఉపకారము చేస్తూ, మైత్రీ, కరుణలతో జీవించండి.

8. కందిరీగ :- శబ్దమునకు, జీవునకు సన్నిహిత సంబంధమున్నదను సత్యము తెలుసుకోవాలి. "శ్రద్ధామయోయం పురుషః" జీవుడు శ్రద్ధాస్వరూపుడు. ఏ విధమైన శ్రద్ధను చూపిస్తే ఆ విధమైన ఆకారమును జీవుడు పొందుతాడు. నేను కీటకమును తెచ్చి గూటియందుంచి దాని చుట్టూ శబ్దం చేస్తూ ఉంటాను. ఆ కీటకములోని జీవుడు శబ్దమునందు శ్రద్ధకలవాడై కీటక రూపమునుమార్చుకొని, నారూపాన్నిపొందుతాడు. మానవులారా! వ్యర్థ శబ్దములను అనవద్దు. వినవద్దు. సర్వకాల సర్వావస్థల యందు దైవ శబ్దములను ఉచ్చరిస్తూ ఉన్న, జీవుడు దైవ శబ్ద శ్రద్ధా స్వరూపుడై ఆత్మా సాక్షాత్కారమును పొందుతాడు.

9. సాలెపురుగు :- మానవులుచేయు కార్యములు సిద్ధించుటకు ప్రయత్నము ప్రధానమైనది. ప్రత్యేకించి యోగసాధనకు ప్రయత్నము చాలా ముఖ్యమైనది. యోగిఅయినవాడు సంకల్పమును పరిశుద్ధము చేసికొని సాధన ద్వారా పరమ పదాన్ని పొందటానికి ప్రయత్నం చేస్తూ ఉండాలి. మరలా మరలా ప్రయత్నం చేసి తన లక్ష్యాన్ని చేరుకోవాలి. ప్రయత్నంలో అనేక పర్యాయములు భంగం కలుగుతుంది. కాని మరలా మరలా ప్రయత్నం చేస్తూ ఉండాలి. మానవులారా! నేను గూడుకట్టుకునేటప్పుడు అనేక పర్యాయములు తెగి క్రింద పడుతూ ఉంటాను. కాని మరలా మరలా ప్రయత్నం చేసి గూడును నిర్మించు కుంటాను. మీరుకూడా ప్రయత్న భంగమునకు నిరుత్సాహ పడకుండా మరలా మరలా సాధనచేసి ఈ జన్మలోనే ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలి. నాగూటిని నాలోని పదార్థముతోనే నిర్మించు కుంటున్నాను. నీశరీరము నందు దివ్యమైన ఆత్మపదార్థమున్నది. మానవ జన్మ శ్రేష్ఠమైనది. మీలో విశేషంగా జ్ఞానమున్నది. ప్రకృతి మాయలో పడి మీరు పతితులు కావద్దు. నేను నాలోని పదార్థముతో నానివాసమును నిర్మించుకుంటున్నట్లు మీరును మీలోనిఆత్మపదార్థమును ప్రయత్నంద్వారా తెలుసుకొని ఆత్మసాక్షాత్కారాన్ని పొందండి. అప్పుడే జన్మ సార్థకమౌతుంది. మరలా మరలా ప్రయత్నం చేసి ఆత్మను పొందండి. మోక్షమే మీ ముఖ్య లక్ష్యము కావాలి. అంతేకాని, జనన మరణ భయ దుఃఖభరితమైన సాధారణ జీవితం కాదు.

10 కుమ్మరిపురుగు :- మానవులారా! నేను బురదలో పుడుతున్నాను బురదలో తిరుగు తున్నాను. కానీ బురదలో పడుచుటలేదు. నాలో బురద అంటనీయని పదార్థముకు భద్రపరచుకొని యున్నాను. మీరు ఈ సంసార మనే బురదలోనే పుడుతున్నారు ఈ బురదల్లో జీవిస్తున్నారు. ఈ బురద ఇంద్రియములకు, మీ మనస్సుకు అంటుకొని జీవితమును దుర్గంధమయము చేయుచున్నది. మీరు సంసారములో ఉండండి. కానీ, మీలో సంసారాన్ని ఉంచుకోవద్దు. మీకు సంసారము అంటకుండా ఉండులాగున జ్ఞానమనే పదార్థాన్ని భద్రపరచుకోండి.

13. తుమ్మెద :- మానవులు ఏకార్యాన్ని సాధించాలన్నా దీక్ష అవస రము. శిల్పులు దీక్షతో రాతి యందు సుందరాకారమును చెక్కుచున్నారు ఓ మానవులారా! నేను కఠినమైన దూలములకు గానీ, చెట్టునకుగానీ, దీక్షతో రంధ్రము చేయుచున్నాను. దీక్షతో కార్యము చేసిన సిద్ధికలుగుతుంది. మీరు జ్ఞానమనే ఖడ్గముచేత వైరాగ్యమనెడి దీక్షతో ఈ సంసార వృక్షమును తూట్లు పొడిచి నాశనము చేయండి. ప్రయత్నం చేయకుంటే ఏంత శక్తి యున్నను వ్యర్థమే అవుతుంది. నేను ఒకనాటిసాయంసమయమున తామర పుష్పంలోనిమకరందాన్నిత్రాగుతూఉండగాసూర్యుడు అస్తమించాడు. తామర పుష్పం మూసుకు పోయింది. నేను లోపల చిక్కుకు పోయాను బయటకు రావటానికి నాకు శక్తి ఉన్నను ఎలాంటి ప్రయత్నము చేయలేదు. సూర్యో దయం అవుతుందికదా! తామర పుష్పం విచ్చుకుంటుందికదా! అప్పుడు ఎగిరి పోవచ్చని సోమరిగా పుష్పంలోనే ఉండి పోయాను. చెట్టుకు రంధ్రం చేయ గల శక్తిని నాలో ఉంచుకొని కూడా అలసత్వంతో నేను అ పనిని చేయ లేదు. రాత్రియందు ఏనుగులు వచ్చి తామర పుష్పమును తొక్కివేసినవి. నేను మరణించితిని. ఇది నాప్రయత్న లోపము. నేను ప్రయత్నం చేసి యుండినచో జీవించి యుండెడిదానను. మానవులు నాలాగే అలసత్వమనే దోషము కలిగి జీవితమును వ్యర్థము చేసుకుంటున్నారు. తనలో దివ్య శక్తిని ఉంచుకొని అలసత్వముతో ప్రయత్నంచేయకుండా విషయవాసనలకు బానిసలై మరణిస్తున్నారు. ప్రయత్నం చెయ్యండి. ప్రకృతి వికారమును

ధ్వంసం చేయండి. మిమ్మల్ని మీరు ఉద్ధరించుకోండి. అలసత్వమును త్యాగం చేస్తేనే మి జీవితం ధన్యమౌతుంది.

12. పావురము :- మానవులకు జ్ఞాపకశక్తి ప్రధానమైనది. ధర్మోపదేశమునందు మరపు తీవ్రంగా పని చేస్తుంది. ఆత్మబోధను ఒక చెవితో విని మరియొక చెవితో వదలి వేస్తుంటారు. ఒకమారు వినునది చూచునది మరువకుండా జ్ఞాపకం ఉంచుకోవాలి. నాకు దూరప్రాంతమందున్న ప్రదేశములను చూపించి, స్వస్థలం చేర్చి, నన్ను వార్తావాహకునిగా వదలి పెడతారు. నేను చూచిన ప్రాంతమును జ్ఞాపకముంచుకొని ఆప్రదేశమునకు ఎగిరిపోయి వార్తలను చేరవేస్తూ ఉంటాను. ఓ మానవులారా! మీరు కూడా ఒకసారి చూచినది, వినునది జ్ఞాపకముంచుకొని ప్రవర్తించండి. గురువు ప్రబోధించిన జ్ఞానమార్గమును వదలకుండా శ్రవణమనననిధిధ్యాసలు చేసికొని జ్ఞానులుకండి.

13. కోకిల : మధురమైన మాటకే ఆదరాభిమానములు లభిస్తాయి. ఇతర జంతువుల కంటే మానవులకు మాట్లాడు శక్తి యున్నది. దానిని మధురంగా, మితంగా, సత్యంగా పలుకుతూ ఉండాలి. ఒకేశబ్దమునకు ఎన్నియో అర్థము లుంటవి. "మీ నాన్నగారు ఉన్నారా"? అని అనవచ్చును. లేక "మీ అమ్మ మొగుడు ఉన్నాడా"? అనవచ్చును. రెండుశబ్దములొకట్లటే. కానీ శబ్దములకు అర్థ మొక్కటే కానీ శబ్ద ప్రయోగమందు లాలిత్యము; కఠినత్వము గోచరిస్తూ ఉంటాయి. ఓ మానవులారా! నేను మధురంగా పలుకుట వలన మానవులు అత్యంత ప్రేమతో నన్ను పొగుడు చున్నారు. మీరు కూడా మధురంగా మాట్లాడండి, పరుషంగామాట్లాడకండి. మాటలతోనే మన్నలను అందుకుంటారు. మాటలతోనే శత్రుత్వమును పొందుతారు. ఆత్మతత్వ ధర్మాన్ని మీరు మధురంగా ఇతరులకు బోధించండి. మీరూ ఆచరించండి.

14. చీమ :- మానవులారా! మీరు బుద్ధి జ్ఞానములున్న శ్రేష్ఠమైన జన్మ కలవారు. మీరు పెడమార్గమున నడుస్తున్నారు. మమ్ములను చూడండి!

మేము ఎక్కడికివెళ్ళినా వరుసతప్పకుండా క్రమశిక్షణతో వెడుతూ ఉంటాము ఆహారాన్ని కలసి సంపాదిస్తాము. కలసి ఆరగిస్తాము. నాది, నీదని భావన లేకుండా మెలుగుతాము. మీరు ఎవరికి వారే సంపాదించుకుని, ఇతరులకు పెట్టకుండా స్వార్థంతో బ్రతుకుతూ ఉంటారు. మమ్మల్ని చూసి సహకార భావం నేర్చుకోండి మేము సంపాదించిన ఆహారాన్ని వ్యర్థం చేయకుండా పొదుపు చేసుకుని భద్రపరచు కుంటాము. వర్షాకాలంలో దాచుకున్న ఆహారాన్ని సమానంగా పంచుకుని ఆరగిస్తూ సురక్షితంగా ఉంటాము. మీరు కూడా మీ సంసారమందు పొదుపు చేసుకుని, కొంత ధనమును దానధర్మములకు, దైవ కార్యములకు వినియోగించాలి. మాకు రాజు, రాణి అనే పెద్దలున్నారు. తల్లి, తండ్రి, ప్రభువు, మాకు వారే. వారి ఆజ్ఞలను మేము ఎల్లప్పుడు శిరసా వహిస్తాము. మీరు కూడా తల్లి తండ్రులను, గురువుని, దైవాన్ని గౌరవించి వారి ఆజ్ఞలను పాలించండి. ఇదే సజ్జనుల లక్షణం. మా తల్లి పెట్టిన గుడ్లను మేమే మోసి రక్షించెదము. మా తోబుట్టువు మీద మాకంత అభిమానము, ప్రేమ ఉంటాయి. మీరుకూడా మీతోబుట్టువుల యందు గౌరవము ఆదరాభిమానము కలిగి ఉండండి.

15. కోడి :- ఓ మానవులారా ! మేము నియమము తప్పకుండా సూర్యోదయమునకు ముందు మేల్కొని, కూతకూసి ఇతర ప్రాణులను మేల్కొలుపుచున్నాము. మీరు మేల్కొన్నపుడు తొలి శబ్దము పరోపకారార్థమై వినియోగించుచున్నాము. మానవులారా! మీరుకూడా బ్రహ్మ ముహూర్తంలో మేల్కొని, యోగ సాధన చేస్తూ ఓంకార శబ్దము చేయండి.

16. హంస :- మానవులారా! నేను పాలను నీరును వేరుచేసి, పాలను స్వీకరించి నీటిని వదలివేయుచున్నాను. ఈ లోకంలో ఆత్మఅనాత్మకలసి యున్నది. మానవులు ఆత్మ పదార్థమును వదలి వేసి, అనాత్మ పదార్థమును ఆశ్రయించి వ్యర్థ జీవితమును గడుపుచున్నారు. మీరు నావలె ఆత్మ పదార్థాన్నే గ్రహించండి. నేను సముద్రమును సహితము అవలీలగా దాటగలను. మీలో జ్ఞాన శక్తి యున్నది. దానిని పెంపొందించుకోండి. అప్పుడు మీరు

కూడా సంసారసముద్రం అవలీలగా దాటగలరు. నాకు ఇంద్రియ వికారములు లేవు. నేను చంద్రుని కాంతిని చూచి ఆనందిస్తాను. మానవులారా! మీలో సచ్చిదానంద స్వరూప మైన అంతర్జ్యోతి ఉన్నది. దానిని చూచి ఆనందము అనుభవించండి. ప్రకృతి విషయవాసనా స్వరూపమైన సుఖములు క్షణ భంగురములు. అవి పర్యవసానంగా దుఃఖాన్ని ఇస్తాయి. కనుక వానిని కోరుకొనక ఆత్మానందాన్ని ఆస్వాదించండి.

17. చిలుక :- మానవులారా! మేము ఏకపత్నీ వ్రతులుగను, ఏకపతీ వ్రతులుగను జీవిస్తాము. అందుకే మమ్ములను జంటపక్షులని అంటారు. అనుకూల దంపతులుగా ఉంటాము. మేము మా బాధ్యతను సమానంగా పంచుకుంటాము. మీలాగా భార్యాభర్తలు, అనుకూల దాంపత్యంతో సుఖంగా జీవించాలి. మేము మానవుల మాటలు పలుకుతూ ఉంటాము. మానవులారా! మీరూ దైవ శబ్దములను పలుకండి.

19. నెమలి :- కామము మానవులకు బంధాన్ని ఇస్తుంది. బాధలకు ప్రమాదాలకు గురిచేస్తుంది. కామము జయించిన జీవులు ధన్యులు. మేము సంతానోత్పత్తికి కూడా సంపర్కం చేయము. ఓ మానవులారా! ఇంద్రియ సుఖములు అధమములు. మేము ప్రకృతికి పరవశించి, సూర్యుని తేజస్సును చూచి నాట్యము చేస్తాము అప్పుడు ఒక దివ్య సుఖము లభిస్తుంది. కంటి నిండా ఆనంద బాష్పాలు రాలతాయి: ఆ బిందువులనే ఆడపక్షి గ్రహించి సంతానోత్పత్తి చేస్తుంది. కనుక మానవులారా! మీరు కామమునందు ఆసక్తులు కాకుండా నిగ్రహించుకొని, మీలోని ఆత్మ జ్యోతిని కాంచి ఆనందించండి.

19. తాబేలు :- ఇంద్రియముల ఉద్రేకము మహాప్రమాదమైనది. సాధకుడు స్థిరముగా నున్ననూ, సముద్రము నందలి పడవను తుపాను ముంచివేయు విధముగా, సాధకుని ఇంద్రియముల ఉద్రేకము ముంచివేస్తుంది. కనుక ఇంద్రియములను నిగ్రహించి స్వాధీనములో ఉంచుకోవాలి. వాటిని

అంతర్ముఖం చేసుకోవాలి. ఇదియే తాబేలు చెప్పెడి ధర్మము. మానవులారా! నేను నా ఇంద్రియములను స్వాధీనము చేసుకుని, లోపలికిముళ్ళించి, అవసర మైనప్పుడు మాత్రమే వెలుపలకు తీసి ఉపయోగిస్తాను. అట్లాగే ధర్మవిరుద్ధ ముకాని కర్మలయందే మీ ఇంద్రియములను వినియోగించండి.

20. ఆవు :- మానవులారా ! నేను నాపాలను నాబిడ్డలకు స్వల్పము గానే ఇచ్చి మీ కూ మీ బిడ్డలకూ ఇస్తున్నాను. మీరు కూడా నాలాగే త్యాగ బుద్ధితో జీవించండి. మీ సంతాన సుఖములకే కాక పరుల సుఖము కొరకూ పాటు పడండి. "త్యాగోహి పురుష వ్యాఘ్రః" త్యాగియే పురుష సిం హము. త్యాగము యోగమునకు మార్గము. జ్ఞానముతో తన సర్వస్వము త్యాగముచేసి, యోగియై మోక్షార్హత పొందాలి. త్యాగమునకు, వైరాగ్యము నకు సన్నిహిత సంబంధమున్నది. చిత్త వృత్తులు నశించిన వారికి సమాధి లభిస్తుంది. త్యాగమువలన చిత్త వృత్తులు నశిస్తాయి. ఇంద్రియ విషయ వాసనలు, ఇంద్రియ వికారములు శమించిన పిమ్మట చిత్తవృత్తులు నశిస్తాయి. అప్పుడు ఆత్మసాక్షాత్కార జ్ఞానము లభిస్తుంది. యోగులు, త్యాగులు, భోగులూ, అనుమూడు విధములైన మానవులు ప్రపంచంలో ఉన్నారు. ఆత్మ తత్వ స్వరూప జ్ఞానము కలిగి. మోక్షప్రాప్తికి స్థిరమైన బుద్ధితో యోగ సాధన చేయువారు యోగులు. ఇంద్రియ సుఖములను త్యజించి ఇతరుల సుఖమునకు, రక్షణకు, పోషణకు, తమసాధన సంపత్తులు త్యాగము చేయువారుత్యాగులు. ఇంద్రియ సుఖములను అపేక్షించి, భోగములను అనుభవించువారు భోగులు. భోగలాలసతో పాపకార్యములు చేసి అపాపఫలితముగా వారు వ్యాధిగ్రస్తులౌ తారు. త్యాగులు, యోగులే మోక్షార్హతను పొందగలరు. త్యాగమే యోగము నకు మార్గము చూపిస్తుంది. కనుక మానవులు ఎప్పటికీ భోగులు కారాదు.

21. గుఱ్ఱము:- మానవుల మనస్సంకల్పముచేత, మరియుఇంద్రియ బలము చేత కార్యములు చేయుచున్నారు. గుఱ్ఱము ఇంద్రియాల శక్తితోకాక, బుద్ధిబలముతో కార్యములను నెరవేరుస్తుంది. ముఖ్యంగా యుద్ధంలో శత్రు

వులను గమనించి వేగముగా పరిగెత్తుట, నిలచుట, తిరుగుట, నిదానంగా నడచుట చేస్తూ తగు విధంగా ప్రవర్తిస్తుంది. సైనికుడు రెండు చేతులందు ఆయుధములుంచుకొని యుద్ధముచేస్తూ ఉంటాడు. గుర్రములను కాలిసైగతో నడిపిస్తాడు. గుఱ్ఱము మనకిట్లా చెబుతుంది. ఓ మానవులారా! నేను మనో సంకల్పముతో గానీ, ఇంద్రియములతో కానీ కార్యములు చేయుటలేదు. యజమాని కాలి సైగతోనే కార్యములు అర్థం చేసుకొని ప్రవర్తిస్తున్నాను. బుద్ధి సూక్ష్మంతో యజమాని చెప్పిన విధంగా నడుచుకుంటున్నాను. కనుక మీరు కూడా సూక్ష్మ బుద్ధితో, సైగతో సందర్భములననుసరించి కార్యములను అర్థముచేసికొని నెరవేర్చుకోండి. బుద్ధిలేనివారుగా జీవించవద్దు. దెబ్బతినకూడదు. మాట పడకూడదు."

22. ఏనుగు :- ఏనుగునకు ఇంద్రియ వికారములులేవు. వికారముగా సంచరించదు. "నిదానం ప్రధానం". అది తన కార్యములను నిదానంగా నెరవేర్చుకుంటుంది. పొరపాటు చేయదు. దానిని సవరించుకొనుటలేదు. బయలుదేరునపుడు నిర్ణయించుకుని నిశ్చయించుకున్న చోటుకి చేరుతుంది. ప్రక్కకు చూడదు. ప్రక్క శబ్దములను వినదు. ఇంద్రియ వికారము లేనందువలన అది నిశ్చలంగా ఉంటుంది. గజేంద్ర మోక్షమున, శ్రీకాళహస్తి చరిత్రమున ఏనుగు మోక్షము పొందినట్లు పండితులు చెబుతూ ఉంటారు. ఏనుగు దైవ కార్యములందునూ గౌరవము పొందుచున్నది. ఏనుగు మనకు ఇట్లా బోధిస్తున్నది. "ఓ మానవులారా! నావలెనే మీరునూ ఇంద్రియ వికారములు లేకుండా, మనస్సునందు కోరికలనూ, సంకల్పములనూ, విసర్జించండి. ఆత్మాభిమానంతో ఉండండి. గౌరవముతో జీవించండి." నా చరిత్రలో నాలుగు ఏనుగులు ఉన్నాయి. నా తల్లికి కలలో కనిపించిన ఏనుగు ఒకటి. నేను పుట్టినప్పుడే పుట్టిన ఏనుగు ఒకటి. నన్ను చంపుటకు వచ్చిన ఏనుగు ఒకటి. నేను సాధనచేయునపుడు నా దర్శనమునకు వచ్చిన ఏనుగు ఒకటి. ఏనుగు బుద్ధికి, సిద్ధికి సంకేతము.

**23.** కుక్క :- కుక్క విశ్వాసము గల జంతువు. తన యజమాని

అప్పగించినబాధ్యతను విశ్వాసముతో అది నెరవేరుస్తుంది. యజమానికి! సేవకునికి మధ్య ఉండవలసిన విశ్వాసమునూ, బాధ్యతనూ. కుక్క నిరూపిస్తుంది. తన యజమానికి విపత్తు కలిగిన, తన ప్రాణమునైననూ త్యాగము చేసి యజమానిని రక్షిస్తుంది. కుక్కకు వాసన చూచుశక్తి అధికంగా ఉంటుంది. అతి సూక్ష్మంగా ఉంటుంది. కుక్క మనకు ధర్మమును ఇట్లా చెబుతుంది. ఓ మానవులారా ! ఈ సృష్టికి యజమాని పరమాత్మ. నావలెనే మీరుకూడా యజమానియందు పరిపూర్ణమైన విశ్వాసముతో ప్రవర్తించండి. యజమాని యొక్క ఆదరాభిమానములను పొంది జీవించండి.

24. సింహము :- సింహము ఆదర్శమైన ప్రాణి. కీర్తి వంతమైనది. ప్రభువులు, కవులు, సామాన్యులు, సింహము, పేరును చెబుతూ ఉంటారు. ప్రభువులు కూర్చోటానికి సింహాసనాన్ని వాడతారు. ఇంటిలో ప్రధానమైనది సింహద్వారము. సింహావలోకనము అంటారు. విషయమును నిర్భయంగా నిర్మొహమాటంగా,గంభీరంగా చెప్పటాన్ని సింహగర్జనము అంటారు. అధిక బలము కలవాడు సింహబలుడు. అతిధైర్యముగా ప్రవర్తించువాడు పురుష సింహము. సింహము మనకు ధర్మాన్నిట్లా బోధిస్తుంది. ఓ మానవులారా! మీరు కూడా నావలె ధైర్యముగా ప్రవర్తించండి. "అభయం సత్యసంసిద్ధి" భయము లేకుండాబతకటమే మీయొక్క ప్రధమకర్తవ్యం కావాలి. సత్ కీర్తివంతులై జీవితాన్ని గడపండి.

వివిధములైన ప్రాణులు ధర్మమును నోటితో బోధించక పోయినను, వాని ప్రవర్తన యందుగల విధానముననుసరించి, అవి చూపు ధర్మములను మనము అర్థం చేసుకొనవచ్చును. మానవులకు అవిధర్మమును బోధిస్తున్నను వారు ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తూ ఉంటారు. మనస్సుకు వశమై ఉంటారు. మానవుడు పాపాన్ని తెలిసి చేస్తూ ఉన్నాడు. అధర్మాన్ని తెలిసి ఆచరిస్తూ ఉన్నాడు. ఉదాహరణకు కొన్ని పక్షులు ఒక మామిడి తోటలో మామిడి పళ్ళను తింటూ ఉన్నాయి. వాటి ఆహారమును అవి భుజిస్తున్నాయి. అది దొంగతనమని వాటికి తెలియదు. ఒకమానవుడు అటుగుండా పోతూ, తోటలో

ఎవరూ లేకపోవుటచూసి దొంగతనముగా పళ్ళనుకోయటం ప్రారంభించాడు. వానికి తాను చేస్తున్నది దొంగతనమని తెలుసు. ఇంతలో తోటమాలి వచ్చాడు. అతనిని చూసి ఆ మానవుడు పారిపోయాడు. కానీ పక్షులు ఎగిరి పోలేదు. తోటమాలి కేకలువేస్తే పక్షులు ఎగిరి పోయినవి. ఆ పక్షు లిట్లా అర్థం చేసుకున్నాయి. "ఓహో! మానవుడు చెట్టు నాదను భ్రమలో ఉండి మనలను వెళ్ళమంటున్నాడు. ఈ చెట్టును అతను పెంచి పోషించి నట్లున్నాడు. అతని సొమ్మును మనం తినకూడ"దని నిర్ణయించు కొని లేచి పోయినవి. తెలిసి తెలిసి నేరమునూ, పాపమునూ చేయువాడు మానవుడు. తెలిసి చేసిన పాపములకు దోషము ఎక్కువగా ప్రాప్తిస్తుంది. అందువలన పక్షుల కంటే, జంతువుల కంటే హీనంగా మానవుడు జీవించ రాదు.

మానవులకు ధర్మము ప్రధానమైంది. ధర్మమును ఆశ్రయించి ధన మును సంపాదించాలి. ధర్మమును అనుసరించి తన కోరికలను తీర్చు కోవాలి. మోక్షమును మనం మరువరాదు. మానవజన్మ దుర్లభమైనది. ఎన్ని జన్మలో ఎత్తిన తరువాత మనకు ఈ మానవజన్మ లభిస్తుంది. ఈ జన్మ నిష్ప్రయోజనంగా గతించిందంటే మరల మనకు ఈ జన్మ రాదు. కనుక ఈ జన్మలోనే మనము ధర్మములను ఆచరించి, యోగసాధన చేస్తూ ఆత్మ సాక్షాత్కారాన్ని పొందటానికి ప్రయత్నం చేయాలి. ఒక క్షణమైనను వ్యర్థం చేయరాదు. దైవతత్వ ధర్మము ఏ ప్రాణి ప్రవర్తన యందున్నను స్వీకరించి మనం ఆచరించాలి. మనల్ని మనం ఉద్ధరించు కోవాలి.



# పదిహేడవ అధ్యాయము

## (ప్రసాద యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షులారా ! మనమేదైనా ఒకనిర్ణయం తీసుకొనుటకు ముందు బాగుగా విచారించి ముందుకు అడుగు వేయవలెను. మన ఆలోచనల ననుసరించే మన వ్యక్తిత్వత్వం ఉంటుంది. కాబట్టి దుష్పథములో మన ఆలోచనలు పోకుండునట్లు కట్టుదిట్టములు చేసుకోవాలి. లేకపోతే వస్తుజ్ఞానం కలగదు. మనస్సును సమ్యక్ మార్గములో పయనించే నప్పుడే మన కోరికలు కూడా సమ్యక్ కోరికలుగా ఉంటవి పశు ప్రవృత్తి ననుసరించుచు కేవలము నిద్రాహార మైథునములే ప్రధానముగా నెంచు కోరికలను మనం విసర్జించాలి. తథాగతుడు కోరికలుండ గూడదని చెప్పలేదు. కాని మానవుడికి కలిగిన కోర్కెల వలన ఇతరులకునష్టము కలుగకుండా, విశ్వకళ్యాణము కలుగునట్లుఉండాలని చెప్పాడు. "వజ్రధ్వజ సుత్తము"లో "నేను విశ్వమానవ ప్రపంచమునకై ఈ భారము వహిస్తున్నా"నని చెప్పాడు. నిజమైన సన్యాసి కేవలం తన కుటుంబ పరివారం కొరకే పాటు బడు సంకోచ స్వభావమును విడిచిపెడతాడు. కాబట్టి తథాగతుడు తన సంసారాన్ని విడిచిపెట్టాడు.

ఈ సత్ ప్రవృత్తి వలన మంచి వాక్కు. సత్ ప్రవర్తన, మంచి పనినే చేయాలనే భావన కలుగుతుంది. మంచి అంటే "సత్యమైనది, కఠినముగానిది, వ్యర్థ ప్రలాపం కానిది. హితమైంది. "అని బుద్ధుడు నిర్వచించాడు. సత్ప్రవర్తన అంటే ఇతరులకు ప్రదర్శించడం కోసం చేసేది కాదు నిస్వార్థమైంది.

ఒక సారి ఒక బ్రాహ్మణుడు బుద్ధుని చూచి "బాహూక నదిలో స్నానం చేస్తే పాపాలన్నీ ప్రక్షాళన మౌతాయి" అన్నాడు. అప్పుడు బుద్ధుడు "నదీ జలంతో శరీరంశుద్ధంకాదు. పాపాత్ముని, కృపణుని, అసూయా పరుని, దుష్టుని ఏ నదీ జలంకూడా శుద్ధునిగా చేయజాలదు అసత్యమాడకపోతే, హింస చేయకపోతే స్వార్థబుద్ధితో దేన్నీ గ్రహించకపోతే, గయాక్షేత్రానికి పోక పోయినప్పటికీ అంతటి ఫలం లభిస్తుంది" అన్నాడు. బౌద్ధమతం మానవుని సన్మార్గ ప్రవర్తకుని చేయటానికే అవతరించింది. శీలా, సమాధులనే బుద్ధుడు

బలపరిచాడు. "శీల" అంటే పాపకృత్యాలనుంచి మనస్సును మరలించటం. "సమాధి" అంటే సమ్యక్ జీవన ఫలం. వీటి కోసం వివిధములైన తపశ్చర్యలూ, యోగాలు వివరించబడ్డవి.

బుద్ధుడు శ్రావస్తిలో ఉంటున్నప్పుడు ఒక సంఘటన జరిగింది. ఆ పట్టణంలో సంగారవుడనే బ్రాహ్మణుండేవాడు. ఆ బ్రాహ్మణుడు నిత్యం, రాత్రి, పగలు నదీస్నానానికివెళ్ళి దేహాన్ని శుభ్రం చేసుకుని వస్తూండేవాడు. అందరికీ ఇది వింతగా ఉండేది. పూజ్య ఆనందుని ద్వారా ఈ విషయం తెలుసుకొని తథాగతుడు ఆ బ్రాహ్మణుడి దగ్గరకు వెళ్ళాడు. బుద్ధుడు తన దగ్గరికి రావడంచూచి సంగారవుడు ఆయన్ను ఆహ్వానించి మర్యాద చేశాడు. కాసేపు కొంత సంభాషణ గడచిన తర్వాత బుద్ధుడు అతణ్ణిచూచి "ఓ బ్రాహ్మణా! నీకు నీటితో దేహాన్ని శుభ్ర చేసుకొనే అలవాటు ఉన్నదట! నిత్యం రాత్రి పగలు అదే పనిగా స్నానం చేస్తుంటావుట! నిజమేనా?" అని ప్రశ్నించాడు. అతడు "నిజమే"నని ఒప్పుకున్నాడు. "ఏ ఫలాన్ని ఆశించి నీవట్లా చేస్తున్నావు? అని మళ్ళీ ప్రశ్నించాడు తథాగతుడు. "గౌతమా! ఆ రోజు నేనే చెడుచేసినా ఆసాయంత్రం నేనుచేసేస్నానంవల్ల అదిక్షాళితమైపోతుంది. రాత్రి నేనే చెడు చేసినా మరునాటి ఉదయాన నేనుచేసే స్నానంవల్ల అది ప్రక్షాళన మౌతుంది" అన్నాడు ఆ బ్రాహ్మణుడు. అది విని బుద్ధుడు" నియతి అనేదే సరస్సు. అది నిర్మలంగా, నిష్కల్మషంగా ఉంటుంది. అక్కడ స్నానం చేసి, సర్వావయవాలు శుభ్రం చేసుకొని సత్పురుషులు అవతలి తీరంచేరుకుంటారు అంతేగాని ఈ శుష్కనదీస్నానాలుకావు" అన్నాడు అందుకు సంగారవుడు సంతోషించి, "బుద్ధం శరణం గచ్ఛామి" అంటూ అంటూ ఆయన పాదాలు ఆశ్రయించాడు.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

ప్రసాదము రెండు విధములుగా ఉన్నది. 1. పురాణోక్త ప్రసాదము 2. శాస్త్రోక్త ప్రసాదము. దైవోపాసనచేయువారు దేవునకునివేదించి

తినే ఆహార పదార్థములు పురాణోక్త ప్రసాదములు. అవి తినిన తరువాత మల మూత్రములుగా మారిపోతాయి. వీటిని సగుణోపాసకులు స్వీకరిస్తూ ఉంటారు. సగుణోపాసకులు దేవుడు మానవుని ఆకారంలో ఉంటాడని నమ్ముతారు. అనేక మంది దేవుళ్ళు కలరని, వాళ్ళను మూఢభక్తితో ఆరాధిస్తూ ఉంటారు. "దేవుడు ఎవరు? దేవతలు ఎవ?"రని వాళ్ళకు తెలియదు. దేవుడు నిరాకారుడు, తేజోమయుడు, సర్వవ్యాపకుడు, అనాది, అక్షరుడు, శక్తిస్వరూపుడు ఆ అనంతమైన శక్తిని తమద్వారా ప్రసారము చేసేవారే దేవతలు అనగా దివ్యశక్తి సంపన్నులైన మహాపురుషులే దేవతలని గ్రహించి, వారి నుండి జ్ఞాన ప్రసాదములనూ, యోగప్రసాదములనూ, సాధనాప్రసాదములనూ మనం స్వీకరించాలి. అంతే కాని, భగవంతునికి నివేదించిన పదార్థాలన్నే అసలు ప్రసాదమంటే ఏమిటో తెలియకపోవటం ప్రసాదాల పేరుతో ఆరగించటం వల్ల జరుగుతున్నది.

ఈ నాడు సంఘంలో చాలామంది మనము తినే పదార్థాలనే ప్రసాదంగా భావిస్తున్నారు. యజ్ఞములలో పశువులను బలియిచ్చి, వాటి మాంసమును వండి, వానినే ప్రసాదముగా పండితులు స్వీకరిస్తున్నారు. ప్రభువులు కూడా వాళ్ళను అనుసరిస్తున్నారు. బ్రాహ్మణులు అట్లా యజ్ఞమాంసాన్ని స్వీకరిస్తే స్వర్గం లభిస్తుందని చెబుతున్నారు. యజ్ఞంలో మాంసాన్ని స్వీకరించడం దోషంకాదనిగూడా చెబుతున్నారు. కాని జీవహింస ఎట్లా చేసినను అది హింసయే అవుతుంది. ఇప్పుడు దేశంలో కొన్ని తెగల వారికి దేవతలకు నరబలి ఇచ్చే ఆచారమున్నది. ఈ మూఢాచారమును మానవసమాజం త్యజించాలి.

కొందరు సగుణోపాసకులు దేవతా విగ్రహానికి అన్నమునూ, ఫలములనూ, అర్పించి, ఆ పదార్థములనే ప్రసాదముగా భుజిస్తున్నారు. దేవుడు అన్నము, ఫలాహారము తినువాడుకాడు. ఆహారం తినువారు మలమూత్రాలను విసర్జిస్తారు. దేవుడు నిరాకారుడు., తేజస్వరుపుడు. ఆయన ఆహారం తినే

వాడుకాడు· ఆయనకు మల విసర్జనలేదు. కనుక ఈ ఆచారము అజ్ఞానముతో కూడినది. ప్రకృతి రూపములైన భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, ఏదియూ దేవుడు కాదు.

కొందరు భక్తులు శివ లింగమును దేవుడుగా భావించి అభిషేకము చేస్తూ ఉంటారు. తేనే మొదలగు పదార్థములతో అభిషేకం చేసి వాటిని పంచామృత ప్రసాదముగా స్వీకరిస్తారు. ఆరోగ్యం సిద్ధిస్తుందే గానీ ఆత్మ సాక్షాత్కారం కలుగదు. నిర్గుణోపాసనలో దేవుడు దివ్యతేజోమయుడు. అతడు అంతర్యామిగా సకల ప్రాణులందు ఉన్నాడు. "దేవుడు మానవాకారుడు" అను వారు అజ్ఞానులు. దేవుడు పుట్టుట, మరణించుట అనునది లేదు. "దేవుడు దివ్యతేజోమయుడు, సర్వములకూ ఆధారభూతు"డని ఉపాసించు వారు సకల పాపములనుండి విముక్తులౌతారు. సూర్యుని తేజములకు పక్షపాతము ఉన్నదా ? ఆయన సకల ప్రాణులకు వెలుగును సమానముగా పంచిపెడుతున్నాడు. జీవులు వారివారి స్వభావము ననుసరించి ఆ వెలుగును స్వీకరిస్తున్నారు. సూర్యుడు సాక్షి భూతుడు. దేవుడు కూడా అట్లాగే సాక్షి స్వరూపుడు. ఏ ప్రాణి మీద ప్రేమకానీ, ద్వేషముకానీ. శత్రుత్వము కానీ, ఆయనకు లేవు. మానవులు వారివారి స్వభావమునూ, ప్రవర్తననూ, అనుసరించి సుఖదుఃఖములను పొందుతున్నారు. కష్ట సుఖములకు దేవుడు కారణం కాదని ప్రతి ఒక్కడు గ్రహించాలి.

శాస్త్రోక్త ప్రసాదములు ఆరు ఉన్నాయి. 1. ఆత్మప్రసాదము. 2. మనఃప్రసాదము 3. జీవ ప్రసాదము 4. యోగప్రసాదము 6. సంఘ ప్రసాదము. "మనఃప్రసాదము" అనగా మనస్సు ప్రశాంతముగా, ప్రసన్నతగా ఉండుట. మనస్సు నందు సంకల్ప వికల్పము లుండకుండుట. కామ, క్రోధ, లోభ మద మాత్సర్యములు మనస్సులో ఉండరాదు. రాగ ద్వేషము లుండరాదు. పరప్రాణులకు బాధను కలిగించు సంకల్పములు, సంఘమునకు అపకారము ద్రోహము చేయు సంకల్పములు ఉండరాదు. మనస్సు

విషయవాసనా వికార సంఘమును వదలి, ఆత్మ సంఘమునచేరాలి. మనస్సు ప్రశాంతముగా ఉండవలయుననిన దానికి తగిన ఆయుధం వైరాగ్యము. జ్ఞానముతో, దీక్షతో, వైరాగ్యంతో, మనస్సును నిగ్రహించి, ప్రశాంతతను పొందాలి. అదియే మనఃప్రసాదము.

మనస్సు నందలి దృఢభావన (సంకల్పం) జీవునకు జన్మను కలిగించెడి ప్రభావము కలిగి యున్నది. జీవుడు స్త్రీ గర్భమున ప్రవేశించు సమయమున ఆ స్త్రీ యొక్క మనస్సు ఎట్టి భావనతో ఉంటుందో, అట్టి భావనయే ఆజీవుడికి కలుగుతుంది. కనుక తల్లిదండ్రులు మంచి మనో భావనతో ఉండాలి. అప్పుడే సత్సంతానం ప్రాప్తిస్తుంది. మనస్సునందు విషయ వాసనా సంకల్పములు లేకుండా ఆత్మ తత్వజ్ఞానము కలిగి పరిశుద్ధముగా, ప్రశాంతముగా ఉండాలి. అదియే మనఃప్రసాదము.

సన్యాసము ఐదు విధములు 1. సంసార సన్యాసము 2. మౌన సన్యాసము 3. సంకల్ప సన్యాసము 4. కర్మ సన్యాసము. 5. మోక్ష సన్యాసము. సంసార సన్యాసమనగా పెండ్లిచేసుకొని గానీ, లేకుండాగానీ తన కుటుంబమునూ, విషయ వాంఛలనూ, వదలి, వైరాగ్యము, దీక్ష కలిగి, నివృత్తి మార్గంలో యోగ సాధన చేయటం. మౌన సన్యాసమనగా యావజ్జీవ పర్యంతముగానీ, కొంతకాలముగానీ ఎవ్వరితో మాట్లాడక మౌన వ్రతము ఆచరించటం. సంకల్ప సన్యాసమనగా సంకల్పములు విసర్జించుట. కర్మసన్యాసమనగా ఏ కర్మ (పని)చేయక సోమరిగా ఉండుట కాదు. తన నిత్య కర్మలు చేస్తూ, ఆకర్మల ఫలాన్నికోరకుండా, తీవ్రంగా యోగ సాధన చేస్తూ ఉండటం. ఇక వెలుపలి శబ్ద స్పర్శరూపరస గంధములను వెలుపలనే యుంచి, శ్వాసను స్మృతితో చేర్చి సాధన చేయుటయేమోక్ష సన్యాసము.

మాయామమకారాలు తొలగించుకొని, ఆత్మజ్ఞానము కలిగి, తమ యందున్న అంతర్జ్యోతిని, దర్శించి, ఆత్మానందమునూ, ఆత్మశాంతినీ,

అమృతత్వమునూ. పొందటమే ఆత్మప్రసాదము. మానవుడు ఇంద్రియము లతో సుఖములను అనుభవించు చున్నాడు. ఆ సుఖములు అనిత్యములు-క్షణభంగురములు. ఈ సుఖములే దుఃఖములకు కారణములు. నశి-చని సుఖము ఒకటి యున్నది. ఆ సుఖాన్ని పొందటానికే మానవుడు నిత్యం ప్రయత్నించాలి. అదియే ఆత్మానందం. ఆత్మానందమునకు మనస్సు, ఇంద్రియములు అడ్డుతగిలి, మనలను మాయామమకారములందు పడత్రోసి, అనిత్య సుఖములే నిత్య సుఖములనే మోహ భ్రాంతిని కలిగిస్తున్నవి. ప్రకాశ వంతమైన దీపముపై ఒక పాత్రను కప్పిపెట్టిన ఆ దీప ప్రకాశము కొంచమైనను బయటికి కనపడదు. అట్లాగే ఆత్మజ్యోతిని ప్రకృతి తత్వములు కప్పివేసి యున్నవి. ఎవరైతే ఈ ప్రకృతి తత్వములను తొలగించుకొనే సాధన చేస్తారో వారి అంతరాత్మ ప్రకాశవంతమై, పరమ శాంతినీ, సచ్చిదానందమునూ ప్రసాదిస్తుంది. అదియే ఆత్మప్రసాదము.

జీవులకు మహా ప్రసాదమేమనగా జన్మ. ఇదే ప్రసాదములలో శ్రేష్టమైన ప్రసాదము దైవాంశతో జన్మించినవాడు, మనస్సుతో సహా ఆరు ఇంద్రియములచేత ఆకర్షింపబడి, తన స్వస్థానమైన పరంధామమును, సచ్చిదానందమును, పరమశాంతిని విస్మరించి, వాంఛా బద్ధుడై, నిరంతరము దుఃఖములు అనుభవించుచూ, జనన మరణ చక్రములో పడిపోతున్నాడు. అట్లుగాక, సాధన ద్వారా జన్మరాహిత్యము చేసుకొనుటయే జీవప్రసాదము

మరచి పోయిన ఆత్మతత్వమును స్మృతికి తెచ్చువాడే గురువు. ఆత్మస్వరూపమును చూపించు సాధనను ఆత్మసాధకునికి కలుగునట్లు చేయుటయే గురుప్రసాదము సద్గురువులు అనేక శాస్త్రములు చదివి, వాటి సంస్కార ప్రభావము వలన స్వయముగా సాధనచేసి, ఆత్మానుభూతిని పొందుతారు. వారు వారిఅనుభవమును ఉపమాన ఉపమేయములతో, బోధపడేటట్లుగా బోధిస్తారు. శిష్యులను ప్రవృత్తి మార్గమునుండి నివృత్తి మార్గమునకు మరల్చి, దేహేంద్రియ విషయ వాసనలయందు వైరాగ్యము కలిగిస్తారు. బుద్ధి యోగములో శిక్షణఇచ్చి, ఆత్మతత్వ స్వరూపజ్ఞానాన్ని మానవులకుకలిగే

టట్లుగా చేస్తారు. ఇట్టివారే నిజమైన గురువులు. దొంగ గురువులు వాళ్ళ స్వార్థ కోసం నీచేత అనేక కర్మలు చేయిస్తూ ఉంటారు. కానీ ఆత్మని తెలుసుకొనే మార్గాన్ని బోధించరు. మధ్యమ గురువులు మంత్రాల్నీ వివిధ ఆరాధనా క్రమాల్నీ బోధిస్తూఉంటారు. కానీ ఆత్మను తెలునుకొనే మార్గాన్ని గురించి తెలుపరు. సద్గురువులైవారు తాము చేసిన ఆత్మ సాధనను శిష్యులకు క్రమముగా బోధించి, ఎట్లాచేయాలో అనుభవపూర్వకముగా చూపించి, వారిచేత సాధన చేయించి, యోగ సామ్రాజ్యాన్ని ప్రసాదిస్తారు. ఇట్టి గురువుల ప్రసాదమే సద్గురు ప్రసాదము. యోగప్రసాదము.

అన్నింటికంటే శ్రేష్ఠమైనది మోక్ష ప్రసాదము ఇంత వరకు మనము ఎన్నియో జన్మలు ఎత్తియున్నాము. ఈ మానవ జన్మ మరలా మనకు కలుగదు. వేలాది మందిలో ఏఒక్కడో మోక్ష ప్రసాదాన్ని కోరిన వేలాది మందిలో ఏ ఒక్కడో దాని కోసం సాధన చేస్తాడు. ఇట్లా సాధన చేసే వాళ్ళల్లో ఏ ఒక్కరో తనను తాను తెలుసుకుంటాడు. మోక్షాన్ని పొందుతాడు. కనుక మానవులందరూ తమను తాము ఉద్ధంచుకోవాలి. ఆధ్యాత్మిక జ్ఞానమునకై ప్రయత్నం చేయాలి. ఆ ప్రయత్నాన్ని సద్గురువు నాశ్రయించి, మోక్ష సాధనను గ్రహించి, ఆత్మానుభూతిని పొందాలి.

ఆత్మానుభూతిని పొందటానికి అందరూ అధికారులే. పరమ దుర్మార్గుడైన అంగుళీమాలుడు బుద్ధభిక్షువై తనను తాను ఉద్ధరించుకొన్నాడు. అలాగే స్త్రీలు కూడా ధర్మాన్ని ఆశ్రయించి మోక్షాన్ని పొందారు. వేశ్యాయైన, "ఆమ్రపాలి", చండాలిక యైన ప్రకృతి మొదలైన వాళ్ళు, ప్రజాపతి గౌతమి, యశోధరలతో పాటు మోక్షాన్ని పొందారు.

జ్ఞాన ప్రసాదాన్ని మించినది మరియొకటి లేదు. "నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహావిద్యతే" దైవోపాసన చేయువారు 1. అర్థులు, 2. ఆర్తులు, 3. ముముక్షువులు 4. జ్ఞానులు అని నాల్గువిధములు. ఆపద గానీ, ప్రమాదం గానీ, కలిగినప్పుడు, వాటి నివారణ కొరకై దేవుని ఉపాసన చేస్తుంటారు.

వీళ్ళు ఆర్తులు. కొందరు పుణ్యం కోసం దేవుని ఉపాసిస్తారు. కొందరు ధనం కోసం దేవుని ఉపాసిస్తారు. కోరికలతో ఇట్లా ఆరాధించే వాళ్ళు అర్థార్థులు. మోక్షం కోసం ప్రాకులాడువాళ్ళు ముముక్షువులు శ్రేష్ఠులైన వాళ్ళు జ్ఞానం కొరకు మాత్రమే దేవుని ఉపాసిస్తారు. "జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం", జ్ఞానం చేతనే జీవుల సకల పాపములు దగ్ధమై, వారు మోక్షార్హులౌతారు. పట్టుదలతో దీక్షతో, జ్ఞానమును పొందాలి. దీనికి సత్సాంగత్యము అత్యంతావశ్యకము. సంఘము పట్ల అదరాభిమానాలు కలిగి యుండుట, ఎవ్వరితోనూ శత్రుత్వం లేకుండా మిత్రత్వాన్ని కల్గియుండుటయే సంఘప్రసాదము. ప్రసాదమనగా ప్రసన్నతనూ, ప్రశాంతతనూ, ప్రసాదించేది. ప్రసన్నత మనం పరోప కారం చేస్తేనే మనకు కలుగుతుంది. ఆకలిగా ఉన్నవారికి అన్నం పెడితే వాళ్ళకు మనపట్ల ప్రసన్నత కలుగుతుంది. ఉదాహరణకు చెట్టుకు నీళ్ళు పోస్తే అది చక్కగా వికసిస్తుంది. వికసించిన వృక్షమును గాంచిన వారి మనస్సు ఆనందాన్ని పొందుతుంది.

కావున మానవుడు పురాణోక్త ప్రసాదములు స్వీకరించుట కంటే శాస్త్రోక్త ప్రసాదములను అనగా ఆత్మప్రసాదాన్ని స్వీకరించి, జన్మ రాహిత్యము చేసుకోవటమే మహాప్రసాదంగా భావించి, అందుకు తగిన విధంగా జీవితం గడపాలి. 

## మారధర్షణము



మార సైన్యము తన్ను నలుమూలలనుండి ముట్టడింపగా తథాగతుడు ఏనుగుపై (బుద్ధి) మారుని ఎదుర్కొనుటకుపోయాడు. కామం, అరతి, ఆకలి దప్పులు, తృష్ణ, సోమరి తనం, పిరికితనం, సంశయం, వంచన, మూఢత్వం, లోభం, యశస్సు, చెడుప్రవర్తన వలన పొందిన దాని వలన కలిగే గౌరవం, వైభవం, పరదూషణ, ఆత్మస్తుతి అనునవి మారుని సైన్యం. బోధిసత్వుడు జ్ఞానికావున వీనిని జయించగలిగినాడు.

# పదునెనిమిదవ అధ్యాయము
## (సంఘ యోగము)

**శ్రీ నాగార్జున ఉవాచ**

భిక్షులారా ! ''సంఘం శరణం గచ్ఛామి'' అన్నది బుద్ధుని వాక్యము. "నిర్మాణ మోహాజిత సంఘదోషః''అన్నది శాస్త్రవాక్యము. సంఘమనగా మానవులకు మాత్రమే సంబంధించిన సంఘముకాదు. సకల భూతములు కలసియున్నదే సంఘము. "సంఘమొక్కటే"అన్న సత్యము తెలిసికొని, ఏ ప్రాణికి అపకారము చేయక, మైత్రీభావముతో, కరుణతో ఉండవలెను. ఇతరప్రాణుల యొక్క సంఘసహాయములేక ఎవడును జీవించలేడు. మానవుడు తన ఆహారమును, ప్రాణవాయువును చెట్లనుంచి పొందుతున్నాడు. జంతు సంఘమునందు ఆవులు, యెద్దులు, గేదెలు, గుఱ్ఱములు, మేకలు మొదలైనవి మానవులకు సన్నిహిత సంఘములుగా నున్నవి. కనుక సంఘ మనగా "సకలప్రాణిసమూహ"మని అర్థముచేసుకొని, ఏ సంఘమునకెంత ఉపకారముచేయవలెనో. అంత ఉపకారము చేయవలెను. చెట్లకునీరు పోయవలెను. జంతువులకు మేతవేయవలెను. వాటికి వచ్చు వ్యాధులను నివారణ చేయవలెను. వేటితోను శత్రుత్వము పనికిరాదు ఒక సంఘము మరొక సంఘముతో అన్యోన్య ఆదరాభి మానములతో నుండవలెను. మనదేశములో కులతత్వము బలముగా ఉన్నది. కులతత్వమువల్ల మేధావులబుద్ధి దేశమునకు ఉపయోగపడక వ్యర్థమైపోవుచున్నది. ఈ కుల తత్వము నాశము చేయుటకు ప్రతి ఒక్కడు దీక్షవహించవలెను. బుద్ధి, అర్హత ననుసరించి పదవినిగాని, ఉద్యోగమును గాని, బాధ్యతనుగాని అప్పగించ వలెను. సంఘము సముద్రము వలె నుండవలెను. సముద్రములోనికి ఎన్నియో నదులువచ్చి కలయుచు చున్నవి. అట్లు చేరిన తర్వాత వాటి పేరులన్నియు పోయి అది "సముద్ర" మని పిలవబడు చున్నది. చిన్న నది, పెద్దనది అనువ్యత్యాసములేదు. అదే విధముగా బుద్ధ, సంఘములో చేరిన వారికి కులమత తత్వము లన్నియు శమించి, సంఘమను ఒకే పేరు నిలుస్తుంది. మానవులు బుద్ధికి ప్రాధాన్యత ఇవ్వవలయునేగాని కులమునకివ్వరాదు. సంఘములోని అజ్ఞానమును, అధర్మమును తొలగించి, సర్వజనులను సత్ప్రవర్తకులుగా నుండునట్లుచేసి, మోక్షా

క్షత కలిగించి, ఎవరికి వారు మాత్రమే జీవుని ఉద్ధరించుకొని, స్వస్థానమైన పరంధామను చేరునట్లు చేయవలెను. ఇదే నిజమైన సంఘ సంస్కారమని పించుకొనును. ఈసంఘసంస్కారమునే బుద్ధుడుచేసినాడు. ఇందుకోసమై తన రాజ్యమును, ప్రాణమునకు ప్రాణమైన రాణిని యశోధరను, అనాడేజనించిన కుమార రాహులుని, తల్లి దండ్రులను వదలి ఆఅర్ధరాత్రమున మహాభినిష్క్రి మణము చేసాడు.

అర్ధరాత్రమున బోధిసత్వుడు నిద్రలేచి-తనచుట్టూ గానముచేసి, అలసి పరుండిన స్త్రీ, జనమును చూచాడు. ఆయనకు అసహ్యము వేసింది. వెంటనే సారధియగు చెన్నునిపిలిచి తనకంధకాశ్వమును అయత్తపరుప ఆజ్ఞాపించాడు. ఒక్కసారి తన కన్నకొడుకును చూడవలెనను కోర్కెకలిగింది. వెంటనే తన భార్య ఉన్న అంతఃపురమునకు పోయాడు. పూలసెజ్జపై రాహులునిమాత ఒక చేయిని తన శిశువు శిరస్సుపై ఉంచి నిద్రించుచున్నది. ద్వారములోనికి ఒక్క అడుగు పెట్టిన బోధిసత్వునకు "నేనిప్పుడు పోయి రాణి చేతిని తొలగించి, శిశువునెత్తుకొన్నచో ఆమె నిద్ర లేస్తుంది. నా కార్యమునకు భంగము కలుగుతుం"దని పించింది. వెంటనే వెనుదిరిగి పోయాడు. ఇది బుద్ధునిస్థిరనిశ్చయము. కోరిక నిట్లు త్రెంచుకొనిన వాడుకనుకనే ఆయన సిద్ధార్థుడైనాడు. మనము కూడా అట్టి స్థిరబుద్ధి ఏర్పడుటకై అభ్యాసము చేయవలెను.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

సంఘముయొక్క విశిష్టతను మనం తెలిసికొనవలెను. సంఘం అనునది ఒక మానవులకు సంబంధించినదికాదు. సకలప్రాణులకు సంబంధించింది. ఒక ప్రాణికి మరొక ప్రాణికి ఏ విధమైన సంబంధమున్నదో తెలిసికొనవలెను. అదియందు మనస్సుయొక్క సంకల్ప ప్రభావమున పంచభూతములు మనస్సు బుద్ధి, అహంకారము, ఇరువది నాలుగు తత్వములు ఏర్పడినవి. మొదటి సంఘము ఎనిమిది సంఖ్యతో "భిన్న" ప్రకృతి సంఘముగా ఏర్పడింది.

ఇరువది నాలుగు తత్వములు సంఘముగా జీవునితో కలసుకొని ప్రాణులుగా సృష్టి ఏర్పడింది. ఆదియందు సంఘములేదు. "అసంగానందదేవాయ"అని పరమాత్మ ఒక్కడే దివ్య తేజోమయ పరమాణువుగా ఉండేవాడు.

పరమాత్మ తప్పమరొక్కటేదియు తద్భిన్నమైనది లేక సర్వం దివ్యతేజోమయముగా, అద్వైతము (రెండవది లేదు) అను ఒకే సంఖ్యతో ఉంది. తర్వాత దైవాంశ సంభూతుడైన అక్షరతత్వముగల జీవుడు ఉద్భవించాడు. పరమాత్మ జీవాత్మలతో ద్వైతము (రెండు సంఖ్య) ఏర్పడింది. మూడవ పాదముగా మూలప్రకృతిమాయ ఏర్పడింది, పరమాత్మ, జీవాత్మ, శరీరము, (ప్రకృతి) అని మూడు సంఖ్య చెప్పబడింది. అవే త్రి సూత్రములందు చెప్పబడినవి. జీవుడు ప్రకృతి సంఘముతో చేరుటకు పూర్వము నాలుగు అనుభూతులను పొంది ఉండేవాడు. సచ్చిదానందము, పరమశాంతి, తేజోయము, అమృతత్వములను ఆ నాల్గు అనుభూతులతో, నాలుగు సంఖ్య ఏర్పడింది. పంచ భూతములతో ఐదు సంఖ్య ఏర్పడింది.

మనసుతో కూడిన ఆరు ఇంద్రియములతో ఆరు సంఖ్య ఏర్పడింది. శరీరమునందు సర్వకార్యములకు ఆధారము బుద్ధి గనుక బుద్ధితో ఏడు, అహంకారముతో ఎనిమిది సంఖ్యలు ఏర్పడ్డవి. వీనినే అష్టవిధ ప్రకృతులంటారు. ఇట్లా ఏనిమిది సంఖ్య యేర్పడింది. నక్షత్రములు యేర్పడిన తర్వాత నక్షత్రముల (గ్రిహముల) ప్రభావముననుసరించి ముఖ్యముగా తొమ్మిది నక్షత్రముల (గ్రిహముల) ప్రభావము ప్రాణులపై ఉండుటచేత తొమ్మిది సంఖ్య ఏర్పడింది. నవగ్రహములు తర్వాత భూభ్రమణము., మనస్సు ననుసరించి, శరీరతత్వముల ననుసరించి అనేక సంఖ్యలు ఏర్పడ్డవి. శరీర తత్వములు యిరువది నాలుగనియూ, ముప్పదియారు యనియూ, తొంబదియారుయనియూ చెబుతారు.

మానవులకు మొదటి సంఘము వనము. అందుకే నేను "వనమానంద జీవనం" అని పదేపదే చెబుతాను. మానవులకు జీవనాధారమైనది

శ్వాస(ప్రాణవాయువు). అటువంటి ప్రాణవాయువును మానవులకిచ్చునది చెట్ల సంఘము. తర్వాత మానవులకు ఆహారము కావలెను. ఆహారము వలననే శరీరము పోషింపబడుచున్నది. అట్టి ఆహారము చెట్లసంఘము వలననే లభిస్తుఉన్నది. దీనినిబట్టిచూస్తే ప్రాణులు తమకు ఏ ఏ ప్రాణిసంఘముతో ఏ ఏ విధమైన ఉపకారములను పొందవలెనో ఆ విధముగా ఉపకారములనుపొంది జీవించుచున్నవని మనకు తెలుస్తుంది.

మానవులకు ఆహార మెంత అవసరమో, కట్టుకొనుటకు వస్త్రములుకూడా అంత అవసరము. వానిని కూడా మానవుడు ప్రత్తి మొదలగు చెట్ల నుంచి పొందుచున్నాడు. చలిప్రాంతములందు గొర్రెలు మొదలైన జంతు సంఘము నుంచి, వాని రోమములతో బట్టలు తయారు చేసికొను చున్నాడు. మానవుల జీవితమునకు మానవ సంఘముతోనేగాక అనేకప్రాణుల సంఘములతోకూడా అవసరమున్నది. మానవులు నివాసమునకు, మరియు వంటచెఱుకునకు మరియుమానవులకుమహాభాగ్యమైనఆరోగ్యమునకు చెట్లు, మందులు మూలికల నిచ్చుచున్నవి. మానవ సంఘమునకు చెట్ల సంఘమునకు ఇంత సన్నిహిత సంబంధమున్నది. అందుకే "వనం మానవ జీవనం". అనుట సార్థకమై యున్నది. "సంఘం శరణం గచ్ఛామి" అనిన ఒక మానవ సంఘమునకేనని మనం అపోహపడరాదు.

మానవుడు అన్నమేగాక, అత్యంత మధురమైన ఫలములనూ తిను చున్నాడు. ఎంతో ఆహ్లాదమును అనుభవిస్తున్నాడు. వాని వలన ఆరోగ్యము కూడా పొందుచున్నాడు. యోగులుకొందరు తమకుయోగసాధన సమయములో అన్నము తినుటమాని, తమయోగసాధనకు అనుకూలముగా పాలుపండ్లు తీసికొని సాధన చేస్తుంటారు. తర్వాత కొంత కాలమునకు పాలుపండ్లుకూడా మానివేసి, ఊర్ధ్వరేతస్సాధనతో శరీరమును నిలుపుకుని, యోగ సమాధిస్థితిని పొందుతారు. అనేక విధముల సుగంధద్రవ్యములు పసుపు, కారము మొదలగు పదార్థము లన్నియు చెట్లసంఘమునుండియే మానవులకు లభించు చున్నవి.

చెట్ల జాతియందు కొన్ని చమురుపదార్థము లిచ్చెడి విత్తనములను ఉత్పత్తి చేస్తుంటవి. వేరుశనగ, నూసెలు, కొబ్బరి, ఆముదములు మొద లగు చెట్ల సంఘము యొక్క చమురు పదార్థములు మానవ సంఘమునకు వంటకు, ఆరోగ్యమునకు, అలంకారమునకు మరియు అనేక విధములగా ఉపయోగపడుతున్నవి. అభ్యంజన స్నానమునకూ, శిరోజాలంకరణకు రాత్రులయందు చీకటినిపారగొట్టే దీపములుగావెలుతురు నిచ్చుటకు అవితోడ్ప డుచున్నవి. దేవతారాధనకు కూడా దీపమును వెలిగించు సాంప్రదాయము కలదు. మానవుడు దేవునితో సంఘము కల్పించుకొనుటకు చెట్లు సంఘము అవసరమని తెలియుచున్నది. తపస్సు చేసిన మహాత్ములందరు చెట్లక్రిందనే తపస్సు చేసినట్లు చరిత్రలు చెప్పుచున్నవి. సర్వ సామాన్య ప్రజలకు, మహాతపసంపన్నులైన మహాత్ములకు కూడా చెట్ల సంఘము సహకరించు చున్నది.

చెట్ల జాతియందు పూలచెట్ల జాతులున్నవి. అవి మంచి సువాసన విరజల్లు పుష్పముల నిస్తున్నవి. సగుణోపాసకులు ఎంతో భక్తితో, ఆ పుష్ప ములతో మూర్తిని అలంకరించి; ఆ అలంకారము చూచి ఎంతో సంతోషి స్తుంటారు. ఆ పుష్పాలను ప్రసాదముగా స్వీకరిస్తూంటారు. వారు ఆ మూర్తికి చేయు ఆరాధనలూ, నమస్కారములూ ఆ పుష్పములకు కూడా చెందుచున్నవి. పుష్ప హారములందు దారమున్నది ఆ దారమునకు కూడా నమస్కారములు చెందుచున్నవి. దారమునకు సువాసన లేదు. నమస్కార ములు పొందు అర్హత లేదు. కాని నమస్కారములు పొందు చున్నది. ఎందుచేత? అది సంఘప్రభావము. సువాసనగలిగిన పుష్పముల సంఘముతో దారము చేరినది. అందువలన సువాసన గల పుష్పములకున్న అర్హత దారమునకు కూడా లభించినది. ఈ విధముగా అజ్ఞానులకు కూడా జ్ఞానుల ప్రభావమువలన గౌరవసన్మానములు లభిస్తుంటవి. కనుక మానవులు మంచి సంఘ మేమిటో బాగా పరిశీలించి అట్టి సత్సంగముతో చేరిన "సత్సంగత్వే

నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చల తత్వే జీవన్ముక్తిః" అన్నట్లు జీవన్ముక్తి కలుగుతుంది. సంఘం శరణం గచ్ఛామి.

ఇంతవరకు చెట్ల సంఘమునకు మానవ సంఘమునకుగల సంబధము లను తెలిసికొన్నాము. ఇంక జంతు సంఘములకూ మానవ సంఘములకూ గల సంబంధమును తెలిసి కొందాం. జంతువులందు మానవులకు మొదటి సంఘము ఆవులు, యెద్దులు, గేదెలు మొదలైనవి. మానవులకు అన్నము తర్వాత ఆహారము పాలు, పెరుగు. కూరలు లేక యున్నను పెరుగు, మజ్జిగతో ఆకలి తీర్చుకొనగలరు. చిన్న పిల్లలకు తల్లిపాలు దొరకనప్పుడు ఆవు పాలను ఇస్తుంటారు. పాల నుండి తీయు నేతిని దీపారాధనకు వినియో గిస్తుంటారు. యజ్ఞములో బ్రాహ్మణులు ఆవునేతితో హోమము వ్రేల్చి, ఆవును కాల్చి చంపి, వసను నేతితోపక్వముచేసి, మాంసమును ప్రసాదముగా తిని "పుణ్యము లభించిన"దని సంతోషిస్తారు.

ఆవుల జంతు సంఘము మానవులకు ఏమి చేయుచున్నది? మానవుల సంఘము జంతు సంఘమునకు ఏమి చేయుచున్నది? పరిశీలించండి. తనకు ఉపకారము చేసిన ప్రాణికి మానవుడు అపకారముచేస్తున్నాడు-మానవుడు ఈ అవినీతి మానుకొని, యజ్ఞములు చేయుటమానివేసి, పశువు లను చక్కగా మేపి, యోగక్షేమములు జూచి వాటిపాలుపెరుగుతో హాయిగా ఆరోగ్యమును కాపాడు కొనవలెను. అది సభ్యతగల కార్యము. ఆవు సంతతి (యెద్దులు) రైతునకు సోదరులకన్నను మిన్నగా తన కార్య నిర్వహణ యందు(అనగా దున్నుట, బండిలాగుట, నీరుతోడుట, గానుగత్రిప్పుట మొద లగు కార్యములందు) చక్కగా తోడ్పడుచున్నవి. మానవ సంఘమునకు పశుసంఘము అత్యంత సన్నిహిత బధువుగా సహకరించుచున్నది.

జంతు సంఘ శరీర కష్టమునేగాక వాటిపేరువునుకూడా రైతు పొలము లకు సత్తువనిచ్చు పదార్థముగా వినియోగించుచున్నాడు. దానివలన రైతు నకు ఎక్కువ పంట పండుచున్నది. జంతువులు మరణించిన తరువాత

వాని చర్మము చెప్పులు మొదలగు వానికి ఉపయోగపడుచున్నది. పశు సంఘముకు మానవులు ఎంతయో ఋణపడియున్నారు.

మానవుల సంఘముతో కలసి సంచరించు పక్షులలో కోడి ముఖ్యమైనది. సూర్యుడు ఏ విధముగా తన నియమమును తప్పక మేల్కొలుపునో ఆ విధముగా కోడి మానవ సంఘమును తప్పక మేల్కొలుపును. మానవులు కోడి శబ్దముతో మేల్కొని తమ తమ కర్తవ్యములను నేరవేర్చుకొంటూ ఉంటారు. మానవుడు కోడి కూతతో లేచిన వెంటనే దైవమును స్మృతికి తెచ్చుకొనవలయును. మొట్టమొదటి సంకల్పముగా అది ఉండవలెను. మొట్టమొదటి శబ్దము దైవశబ్దముగా ఉండవలయును. "ఓమ్‌సత్" అని యుచ్చరించవలయును. చేతులతో హృదయనమస్కారముచేసి నేత్రములు తుడుచుకొనవలెను. నిద్రలేచిన వెంటనే తొలి సంకల్పము, తొలిశబ్దము, లౌకిక కర్మ, దైవికముగా ఉండవలయును. ఇది మానవ సంఘసదాచారమును. ఈ ఆచారము లేని మానవులు మానవులనిపించుకొనరు.

ఒకసంఘము మరొకసంఘమునకు ద్రోహము,అపకారముచేయక పరస్పర సహాయముచేసికొనుచు జీవితములు గడుపుచుండవలెను. మానవ సంఘము పశుసంఘమునకు మేతవేసి మేపిన, అవిమానవ సంఘమునకు పాలిచ్చి పోషించును. ఈ విధంగా ఆదరాభిమానములతో మనంసంఘ జీవనమును చేయవలయునేగాని ఒక సంఘము మరొక సంఘమునూ హింసింపరాదు. అట్లు చేయుట సంఘద్రోహము.

మానవులు జ్ఞానముగలవారు. వారు ఏ సంఘమునకు ద్రోహముచేయరాదు. సకల ప్రాణులను ఆదరాభిమానములతో రక్షించ వలయునే గాని భక్షించ కూడదు. ప్రాణులను భక్షించుట క్రూర మృగముల లక్షణము. మానవ లక్షణముకాదు. నేను ఒకప్పుడు గాయపడిన హంసనుచూచి యెంతయో విచారపడితిని. రాజసభయందు విచారణ జరిపించి పక్షులను హింసించుట అధర్మమని నిరూపించితిని. ఆ పక్షిగాయమును మాన్పి దాని బాధను

నివారణచేసి, స్వేచ్ఛగా వదలి పెట్టితిని. ఇది జ్ఞానము గలిగిన మానవ సంఘం చేయవలసిన ధర్మము.

మానవుడు చెట్టు, పక్షి, జంతు సంఘముల కన్నింటికి ఉపకారము చేయుశక్తి, బుద్ధిగలిగియున్నాడు. చెట్టుసంఘమునకునీరుపోసి పోషించగలడు. చెట్లకు యేదైన వ్యాధిగాని చీడపురుగుల బాధగాని ప్రమాదముగాని కలిగిన వాటికితగుకృషిచేసి మందులు ప్రయోగించివాటిబాధను ప్రమాదమును తప్పించ గలడు.మరొక చెట్టుగానిజంతువుగాని,పక్షిగాని ఇట్లుచేయలేదు. అదేవిధముగా ఒక జంతువునకు వ్యాధి బాధ గలిగినపుడు మరొక జంతువుగాని, చెట్టుగాని పక్షిగాని తీర్చలేదు. ఒక్క మానవ సంఘము మాత్రమే తీర్చగలదు అంతటి శక్తి ప్రభావములు మానవ సంఘమునకున్నది. మానవుడు తన మహత్తర శక్తి సామర్థ్యములను మరచిపోయి, యితర ప్రాణులను రక్షించుటకు బదులు భక్షించుచున్నాడు. ఇదిశోచనీయము.

మానవులు సృష్టియందు తనకున్న శక్తి, బుద్ధి, సమర్థతలను గుర్తించి వానిని సద్వినియోగము చేసి, ఒక మానవ సంఘమునకే గాక యితర చెట్టు పక్షి జంతు సంఘములకు మహోపకారము చేసి, ప్రాణుల సుఖమునుచూచి సంతోషించవలయును. అది మానవుని కనీస ధర్మమైయున్నది. మానవులు తనధర్మమును మరచి, యింద్రియవిషయవాసనలకు యింద్రియ వికారములకు బానిసలై మృగముల కంటె నీచముగ, క్రూరగుణములు గలిగి, యితర పక్షి జంతు సంఘములకే గాక మానవ సంఘమునకు కూడా ద్రోహముచేసి, అప కారములు చేసి, దుఃఖములు, బాధలు, ప్రమాదములు కలిగించి, పాప భాయిష్టులై మరుజన్మకు మానవజన్మను పోగొట్టుకుని నీచ జన్మను పొందు చున్నారు. పవిత్రమైన, శ్రేష్ఠమైన, మానవజన్మను వ్యర్థము చేయుచున్నారు.

మానవులు తమ మానవ జన్మ విశిష్టతను సార్థకము చేసికొనవలెను. మరొక ప్రాణికి సహాయము చేసెడి శక్తి స్వభావము ఒకమానవ సంఘమునకు

మాత్రమే యున్నది. ఇతర యేప్రాణి సంఘమునకు ఇట్టి శక్తి లేదు. ఒక చీమల సంఘమునకు మాత్రము తన చీమల సంఘమునకు కావలసిన సహాయము పోషణ, రక్షణ యిచ్చుశక్తి యున్నది. చీమలు సంఘజీవులు. ప్రాణులందు కొన్ని సంఘ జీవులు, కొన్ని వ్యష్టి జీవులుగనున్నవి. చీమలు, తేనెటీగలు, చెదలు మొదలగునవి సంఘజీవులు. పక్షులందుకూడా కొన్ని సంఘజీవులున్నవి. వాటి ఆహారమును అవి తిని సంఘముగా తిరుగు చుండును, సంఘముగా ఒకచోట పరుండును. కుక్కపిల్ల మొదలగునవి వ్యష్టి జీవులు. ఒంటరిగా తిని, ఒంటరిగా తిరిగి, ఒంటరిగా పరుండును. మానవుడు సంఘముగా తిరుగుజీవి. చీమలవలె సంఘజీవితమును గడుప వలయును. మానవులు మానవ సంఘమునకే గాక ఇతరప్రాణి సంఘములకు కూడ మహోపకారము చేయ వలయును.

సంఘజీవులందు ఈగలు ఒక జాతిలోనివి అవి నాలుగు విధములుగానున్నవి మధు కీటకం, గృహ కీటకం, భ్రమర కీటకం, రక్తకీటకం (అనగా తేనె టీగ ఇంటియీగ, కందిరీగ, జోరీగ). మానవులందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులనే విధముగ వీనియందును, నాలుగు జాతులున్నవి. తేనెటీగ యెవ్వరికి ఏవిధమైన అపకారము చేయక చెట్లునకు ఉపకారము చేసి, మధురమైన, శుద్ధ సాత్త్విక ఆహారమైన తేనెనుగ్రోలి జీవిస్తూ ఉంటుంది. ఇది యుత్తమ ప్రాణి. మానవులు దీనివలె జీవించవలయును. ఇంటి ఈగ మధురపదార్థములను తింటుంది. కురుపులపైవ్రాలి చీము, రక్తమును తింటుంది. కొందరు మిశ్రమ కర్మలుగా పాపపుణ్యమిశ్రమహారమును తిని జీవిస్తున్నారు. కందిరీగ మరొక పురుగును తెచ్చి తనగూటి యందుంచి, దానిచుట్టుశబ్దముచేసి తిరుగుతూ దానికితన రూపమును ఇస్తుంది. ఆపురుగును కందిరీగగా మార్చుచున్నది. ఇది సృష్టియందు ఆశ్చర్యమైన విషయము.

మానవులు ఈ కందిరీగను చూచి తనలోయున్న జీవునకు నిరంతరము దైవతత్త్వమును వినిపించి, జీవునకుదైవ తత్త్వరూపమును, మోక్షార్హతను కలిగించవలయును. జీవుడు దీక్షతో తత్త్వబోధ వినుటవలన జ్ఞానము లభి

స్తుంది. జ్ఞానము వలన యోగసిద్ధి లభిస్తుంది. యోగ సిద్ధివలన పరమ శాంతి లభిస్తుంది. అదే మోక్షము. కందిరీగ తన సంఘమును ఎటుల సృష్టించు కొంటున్నదో చూడుడు! మానవుడు తన జీవుని ఆవరించియున్న ప్రకృతి తత్వస్వరూపమును మార్చి, ఆత్మ తత్వ స్వరూపమును లభింపజేసి, జన్మ రాహిత్యమునొనరింపవలయును అదియే దేహేంద్రియ మనోవాక్కాయసంఘము జీవునకు చేయవలసిన సంఘసంస్కారము. లేకున్న సంఘ దోషము జీవుని కర్మబద్ధుని చేస్తుంది.

జోరీగ ఇతర పదార్థములను దేనిని తీసికొనక, పరప్రాణుల రక్తమునే ఆహారముగ తీసికొని జీవిస్తున్నది. తేనెటీగ జీవితమునకు బద్ధ విరుద్ధముగా, పరప్రాణినిబాధించి,దానిరకముతోనేజీవిసున్నది. ఇదిదుష్టసంభావము. సంఘ ద్రోహము. మానవులు కొందరు ఈ విధముగా దుష్టకర్మలు (హత్యలు. దొంగతనము, దౌర్జన్యము. మోసము, మొదలుగు కర్మలు) చేసి ఇతరుల, రక్తముపీల్చి పీడించి, పాపభూయిష్ఠ స్వరూపమైన ఆహారముతో జీవిస్తూ ఉంటారు. వారు మరుజన్మమున, భయంకర కుష్ఠువ్యాధి గ్రస్తులుగను, కాళ్ళు కళ్ళు లేని వికలాంగులుగను, దీర్ఘరోగ పీడితులుగను జన్మించి పాప ఫలితమును అనుభవిస్తారు. మానవులారా! భూమిమీద ఇటువంటి పాపపు జన్మగల వారిని చూచినపుడు వారి పాపకర్మలు స్మృతికి తెచ్చుకొనుడు. మానవులు తేనేటీగవలెను కందిరీగ వలెను జీవించవలయును.

ఇంత వరకు అనేక విధములైన ప్రాణులసంఘములను గురించి తెలిసి కొంటిమి. మానవ సంఘము యెక్కడ నుండి ప్రారంభమగుచున్నది? ఎటుల పరిణమించు చున్నది? తెలిసికొనవలెను, మానవసంఘం తల్లిదండ్రితో ప్రారంభమగుచున్నది. సంఘసంస్కారము. సంఘదోషము అక్కడనుండియే ప్రారంభమగుచున్నది తల్లిదండ్రి ఆరోగ్యవంతముగా పటిష్టముగా ఉండిన అది సంఘసంస్కారమౌతుంది. తల్లిదండ్రి వ్యాధి గ్రస్తులుగ ఉండినచో ఆ వ్యాధి సంతతికి వ్యాపించి, సంతతి రోగపీడితులుగా ఉండవలసి వస్తుంది. ఇది సంఘదోషమగును. కనుక తన సంతతిమేలుకోరువారు ఆరోగ్యమే మహా

భాగ్యమను ధర్మమునుగుర్తించి ఇతర భాగ్యములకన్నను సంతతికి ఆరోగ్య భాగ్యములనిచ్చు తల్లిదండ్రులు శ్రేష్ఠులు. ప్రతి తల్లిదండ్రి తమ సంతతి ఆరోగ్యమునుకోరి, తాము ఆరోగ్యముగా నుండవలయును.

మరొకసంఘము తల్లి. స్త్రీ గర్భవతిగా నున్నపుడు మనసులో ఏవిధమైన భావన ఉంటుందో ఆ భావనయూ, ఏ విధమైన మాటలు వింటుందో ఆ మాటలనూ, ఏ విధమైన దృశ్యాలు చూస్తుందో అదృశ్యాలూ ఆమె గర్భమునందలి శిశువునకుచెందుతవి. మాతృ గర్భమునందలి శిశువునకు ఇంద్రియ జ్ఞానము ఉండదు. స్మృతి, సుషుమ్నా స్వాస, ప్రాణశక్తి మాత్రము ఉంటవి. తల్లిసంకల్పములు స్మృతితో శిశువు తెలిసికొను చుండును. సుషుమ్నా నాడిలో తలపై భాగమున, సహస్రారమునుంచి శ్వాసతీసికొని ప్రాణశక్తితో శరీరమును పెంచుకొనుచుండును అందువలనగర్భవతి చెడుసంకల్పములుచేయుటవిషయవాసనాస్వరూప వికారభాషణములువినుటప్రదర్శనములు చూచుట వలన శిశువునకు దుష్ట స్వభావము గలిగి, దుర్మార్గుడై, సంఘద్రోహి కావచ్చును. మంచి సంకల్పములు, ఆత్మతత్వప్రబోధము, గురువుల, జ్ఞానుల దర్శనము చేయుచుండిన సంఘసంస్కారము గలిగి, బుద్ధిజ్ఞానముగల సంతానము కలుగును.

తల్లి గర్భము నుంచి జన్మించిన తర్మాత యింద్రియసంఘము ప్రారంభమగును. సుషుమ్నాస్వాసమారి. ముక్కుతో శ్వాసప్రారంభమగును. నోటితో ఆహారము తీసికొనును. తర్వాత కన్నులతో చూచుట ప్రారంభించును. తర్వాత సంకల్పము కలిగి చూచినది పట్టుకొనవలయునను ప్రయత్నము (కర్మ) ప్రారంభ మౌతున్నది. తర్వాత రుచి చూచు నాలుకకు చైతన్యము గలిగి, పట్టుకొనిన పదార్థములను నోటిలో పెట్టుకొనుచున్నారు. తర్వాత శబ్ద తత్వము గలిగి పిలచినవైపునకు చూచుచున్నారు. తర్వాత శరీరమునకు పటిష్టము గలిగి యిరువది నాలుగు తత్వములు చైతన్యమునకు వచ్చునవుడు మాట్లాడ గలుగుచున్నారు. నడువగలుగు చున్నారు. ఇది మొదలు కోరికలు యింద్రియ వికారములు ప్రారంభమగుచున్నవి. ఇచ్చట నుంచి తల్లి

దంౘ్రిసంఘము తగుౘ్రమశిక్షణ యిచ్చి,యింౘ్రియ సంఘమును స్వాధీనంలో నుంచవలయును.

బాల్యావస్థ యందు ఇతర పిల్లలతో సంఘమేర్పడును. ఈసమయమున తల్లిదంౘ్రులు, పిల్లల యోగక్షేమములందు బాధ్యతగలవారు, మహాజాౘ్రగత్త తీసికొనుచుండవలయును. ఎటువంటి స్వభావముగల పిల్లలతో చేరిన ఆటు వంటి స్వభావమే తమ పిల్లలకు సంౘ్రకమిస్తుంది. సంస్కారమును మార్చగల శక్తి సంఘమునకున్నది. అందువలన పిల్లలను దుష్టసంఘముతోగాక మంచి సంఘము వారితో స్నేహము కలుగునట్లు చేయవలెను.

బాల్యం నుంచే ౘ్రకమశిక్షణ అత్యంత అవసరము. ౘ్రకమశిక్షణేసర్వ రక్షణ. ఇంౘ్రియ సంఘమునకు స్వేచ్ఛ నీయక, శాస్త్ర సమ్మత కర్మలు నియమబద్ధముగా ఏ ఏ కాలములందు ఏ ఏ పనులుచేయ వలయునో, ఆకాల ములందు ఆయాపనులను నియమముగా చేయవలెను. చెడు సంకల్పములు లేకుండా, ౘ్రికరణశుద్ధితో, బాల్యావస్థయందే ౘ్రకమశిక్షణకు బద్ధులై మరణావస్థ వరకు తప్పక తమ తమ విధులను ఆచరించవలయును అడవిలో పుట్టిన పెద్దపులి మానవుడు చెప్పినటుల వినుచున్నది. పుట్టలో పుట్టిన విషసర్పము మానవుడు చెప్పినట్లుగా ఆడుచున్నది. తన కడుపున వుట్టిన బిడ్డ తనమాట వినుటలేదు. తాను వివాహమాడిన భార్య తనమాట వినుటలేదు. కారణము ౘ్రకమశిక్షణ లేకపోవుటే! ౘ్రకమశిక్షణలేని జీవితము కటికఎడారి వంటిది.

శరీరమునందు ఇంౘ్రియములకు ౘ్రకమశిక్షణ యందుంచవలయును. ఇంౘ్రియములను ౘ్రకమశిక్షణ యందుంచిన వారిహృదయములు ఉద్యానవన ములవలె ఉండును. ఇంౘ్రియములను ౘ్రకమశిక్షణ యందుంచని వాని హృద యము అరణ్యమువలె భయంకర మృగములతో చేరియుండును. ఉద్యాన వనమున తిరుగుటకు చక్కని దారులు గలిగి వరుసలు, వరుసలుగా పూల చెట్లు ఒకవైపున పండ్లను నీడను ఇచ్చుచెట్లు ఒకవరుసన కనుల పండుగగా నుండును. ముండ్లచెట్లు వ్యర్థమైన చెడు మొక్కలు ఉండవు. విౘ్రాంతి

తీసికొనుటకు హాయిగా ఉండును. విహరించుటకు, వినోదముగా ఉండును ఇంద్రియములు క్రమశిక్షణా బద్ధముగా యున్నవారి హృదయసీమ లిటుల ఉండును. చక్కని జ్ఞాన ఫలములు కలిగి, ధర్మవృక్షములనీడ గలిగి, దుర్గుణములనెడి చెడుమొక్కలు, ముండ్ల చెట్లు లేక యోగసాధనకు అనువుగా ఉండును.

తరువాత సంతాన సంఘము. సంతానమును క్రమశిక్షణా బద్ధముగా పెంచవలయును. మమకారము, గారాబము చూపరాదు. వజ్రము సానరాపిడితో అరగినందున ఎక్కువ కాంతిని పొందునటుల, పిల్లలు క్రమశిక్షణతో పెంచిన కీర్తివంతులు, బుద్ధిమంతులు అగుదురు. ఎంత మంచి భూమియైనను దున్ననిదే పంటల నివ్వదు. ఎంతమంచి సంతానమైనను క్రమశిక్షణతో పెంచితేనే కీర్తివంతులుకాగలరు.

ఆ తరువాత సంఘము కోడలు, అల్లుడు, మనుమలు, మనుమరాండ్రు. మానవుడు తన సంతతి మీదనేగాక కొడుకుల సంతతిమీద కూడా భ్రాంతిని మమకారమును కల్పించుకొనుచున్నాడు. ఇవన్నియు ప్రకృతిమాయ భ్రాంతి సంఘములు. ఈసంఘముల భ్రమలయందు పడి జీవుని, దేవుని మరచిపోవుచున్నారు. ఎదుట కనుపించువారే తమ బంధువులు అని అనుకొనుచున్నారు. కాని నిజమైన బంధువు, యుద్ధరించు బంధువు ఆత్మయను సత్యమును మరచిపోవుచున్నారు.

జీవుని మనసుతో కూడిన ఆరింద్రియములు ఆకర్షించి ప్రకృతి వికార స్వరూపమైన యింద్రియ విషయ వాసనలయందు, మాయ యందు పడవేయుచున్నవి. అందులకు ఆధారము మనస్సు. ఏ కార్యమునకైనను ప్రారంభమున మనస్సంకల్పమే ఆధారము. మనసంకల్పము రెండు విధములుగ నున్నది. ప్రకృతి సంకల్పతత్వము, పరమాత్మ సంకల్పతత్వము. ప్రకృతి సంకల్పతత్వము మనసు ఇంద్రియములతోచేరి, శరీరమునకు వెలుపలి ప్రకృతిపదార్థములతో అస్థిరమైన సుఖములను, భోగములను అనుభవించుట. ఇది దుస్సం

కల్పము. జీవునకు బంధకారణము. ప్రవృత్తి మార్గము సత్సంకల్పము అనగా మనసునందు ఆత్మభావనకలిగి, మనస్సు ఇంద్రియ సంఘమును వదలి, ఆత్మసంఘమునుచేరి, శరీరముచేత నివృత్తి మార్గకర్మలు చేయించి, జీవించి జీవుని ఉద్ధరించుకొనుట,

మానవుడు ఏ కార్యము చేసినను ప్రారంభమున కలుగు మనస్సంకల్పమునకు శరీర కర్మ ఆధారము. తరువాత పరిపూర్ణ మనస్సంకల్ప రహితము, నిర్వికల్పము, కర్మసన్యాసము, సమాధిస్థితి ప్రాప్తమౌతాయి. కనుక ప్రారంభమున మనస్సునసత్సంకల్పముతో, శరీరముతో, సత్కర్మలుచేయవలయును. సాధనా విధానము ఎనిమిదివిధములైనధర్మ తత్వములను ప్రతిపాదించుచున్నది. సాధన చతుష్టయము 1. సాంఖ్యము 2. తారకము. 3 అమనస్కము 4. పరిపూర్ణము. లక్షణచతుష్టయము, 1. ఆత్మానాత్మ వివేక జ్ఞానము, 2. శమదమాదిషట్కసంపత్తి 3. ఇహమాత్ర ఫలభోగవైరాగ్యము 4. ముముక్షుత్వము.

సాంఖ్యము సఖ్యతతోకూడినది. అనగాసత్సంగమునచేరి, గురువులను ఆత్మతత్వ ప్రబోధకులను, జ్ఞానులను, యోగసాధకులను కలసి, ప్రబోధములనువిని వినినవానిని వ్యర్థముచేయక, శ్రవణ, మనన, నిధి, ధ్యాసలతో సార్థకముచేసి, వినిన ప్రబోధమును మనసున విచారించి, మనసున అదేధ్యాసతో నుండవలయును, మనసున దైవ భావన సర్వకాల సర్వావస్థల యందును, మరవక స్మరించుచుండవలయును. ఇది యోగసాధనకు మొదటిమెట్టు. తారకము అనగా నశించెడి స్వభావముగల ప్రకృతి స్వరూపమైన శరీరమునకు దైవాంశసంభూతుడైన అక్షర స్వభావముగల జీవునకుగల తారతమ్యము తెలిసికొనుట. అమనస్కము అనగా మనసు భ్రమలతత్వమును విడిచి, శాస్త్ర ధర్మమునందు విశ్వాసము కలిగి ధర్మమును అనుభవించుట. ఒకయోగసాధకుడు ఉండేవాడు. ఒకరోజు అతడు భిక్షువులకు భిక్షయిచ్చి వడ్డిస్తున్నాడు. వానికి ఒక్కగాను ఒక్కకుమారుడు. ఆకుమారుడు వంటవాళ్ళు ఏర్పరచినగంజి గుంటలో పడి మరణించాడు. ఆవార్త యోగసాధకుడికి తెలిసింది. కాని

అతడు ఏ విధమైన విచారమునూ, అందోళననూ వ్యక్తంచేయలేదు. అక్కడ ఉన్నవాళ్ళకు ఆశ్చర్యము కలిగి ఇట్లా అడిగారు. "మహాత్మా! కుమారుడు మరణించినను నీకు దుఃఖము కలుగలేదేమి?" అని. అప్పుడు అతడు "జాతస్య హి ధ్రువో మృత్యుః" అన్న సత్యం నాకు తెలుసు. పుట్టిన వారికిఎవరికైనను, ఎప్పుడో ఒకప్పుడు చావుతప్పదు. ఇది సత్యము. సత్యమునకు దుఃఖించుట ఎందుకు ? దుఃఖించిన మరణించినవారు లేచివస్తారా? సత్యమే జ్ఞానము. అది తెలిసిన దుఃఖముండదు. అజ్ఞానములో పడియున్న మనస్సు వికారము పొంది దుఃఖాన్నికలిగిస్తుంది" అని అన్నాడు. ఇది జ్ఞానులయొక్క లక్షణం. ఇట్లా మనస్సు వికారములులేక, అచలస్థితితో, ఆత్మను ఆశ్రయించి, ఇంద్రియముల సంఘమును విడిచి, సుఖ, సంతోష, భోగముల కతీతమైన ఆత్మానందమును మనస్సుఅనుభవించుట అమనస్కము. పరిపూర్ణము అనగాప్రకృతి వికారతత్వము. తామరాకును నీరు అంటని విధముగా, జీవునకుఆటంక తాను సంసారము నందున్నను తనయందు సంసారము నుంచు కొనక, ఆత్మతత్వ స్వరూపజ్ఞానముకలిగి పుణ్యపాపములకు అతీతమైనమోక్షార్హతనుపొంది, సుఖ దుఃఖముల కతీతమెన ఆత్మానందమును బ్రతికి యుండగననే పొంది, పరమ శాంతియుత జీవితమును గడుపుట.కొందరుమరణించినతరువాత జీవునకుమోక్ష ప్రాపిగలుగునని చెప్పుచుందురు అదిపొరబాటు. బ్రతికియుండగనే, ఈశరీరముతోనే మోక్షానుభూతిని పొందవలెను. అదే జీవన్ముక్తి.

ఆత్మానాత్మ వివేకజ్ఞాన మనగా-"నశించెడి దేది?" నశించనిదేది? యని తత్వ విచారణచేసి, నశించే వానియందు యాసక్తిని వదలి, నశించని దానిని ఆశ్రయించి, యుద్ధరింపబడుట. "కనుపించునదంతయునశించునదే. శరీరము నశించునదే" నను సత్యమును తెలిసికొని, దానిమీదభ్రాంతిని వదిలి, "నశించని జీవుడు అక్షరుడు. అతడు శరీరమును వీడి, మరొక శరీరమును పొందుతున్నాడు" అను సత్యముకు తెలిసికొని, నశించని జీవుని ఉద్ధరించుకొనవలయును. ప్రకృతిసంపద, దైవసంపదయని రెండుసంపదలుగలవు. ప్రకృతి సంపద యనగా, భూములు,భవనములు,ఆభరణములు, బంగారము, ధనము

మొదలగునవి దైవ సంపదయనగా, జీవుని బంధరహితుని చేయుజ్ఞానము, త్యాగము. ధైర్యము, వైరాగ్యము, కీర్తి,తృప్తి, ప్రజ్ఞ, దీక్ష మొదలగు లక్షణములు, మానవులు దైవసంపద లక్షణములను ఆశ్రయించి, ఆత్మజ్ఞానము కలిగి, బుద్ధిమంతులుగా జీవించవలయును. ఇంద్రియములతో ప్రకృతి స్వరూపమైన శబ్ధ, స్పర్శ, రూప,రస, గంధములతో విషయవాసనా స్వరూపమైన సుఖములను అనుభవించుటయందు వైరాగ్యము కలిగి మోక్షాపేక్ష కలిగి యుండవలెను.

ఈ జగత్తంతయు సంఘముల సంయోగ వియోగముల వలననే పరివర్తన చెందుచున్నది. సంఘములకును, కర్మలకును సన్నిహిత సంబంధమున్నది. ఆ కర్మలు పాపపుణ్యములకు, అపకార, ఉపకారములకు, వినాశ విపరీతములకు, శాంతి భద్రతలకు కారణమగుచున్నది. సకలప్రాణుల ఉత్పత్తికి సూర్యుడు కారణము. సూర్యుని వలన వ్యక్తము అవ్యక్తమగుచున్నది. ఇది అగ్నితత్వము. వాయుతత్వ సంఘమువలన అవ్యక్తము వ్యక్తమగు చున్నది. సూర్యుని కిరణములు నీటిమీద ప్రసరించినపుడు కిరణసంఘమువలన కిరణజన్య క్రియఅనేకర్మ ఏర్పడుచున్నది. ఆ కర్మవలన వ్యక్తముగా కనబడుచున్న నీరు కనుపించక అవ్యక్త మగుచున్నది. వేసవి కాలము పాత్రలో నీరుపోసి యెండలో ఉంచిన కొంతసేపునకు నీరు కనిపించదు. ఇది కిరణసంఘము కర్మవలన జరుగు పరివర్తనయే ఘటమున నీరు కనుపించక అవ్యక్తముగా నున్నది. అది మనీభవించి మేఘమగుచున్నది. దానికివాయుసంఘము కలసినపుడు నీరుగా, వర్షముగావ్యక్తముగా కనుపించుచున్నది. ఆ నీరు భూమి సంఘముతో కలసి నపుడు కర్మ ప్రారంభమై పంటలు పండుచున్నవి.

ఆ పంట ఆహారముగా శరీరమును చేరినపుడు జీర్ణక్రియ ఏర్పడి ఘన పదార్థమైన ఆహారము ద్రవపదార్థముగా, రక్తముగా ఏర్పడుచున్నది. ఆ రక్తము శ్వాససంఘముతోచేరి ద్రవపదార్థము ఘనపదార్థముగా, ఎముకలు, మాంసము. తలవెంట్రుకలు, గోరులు, నరములుగా పరివర్తనము చెందు

చున్నది. రక్తము నుండి ఏర్పడిన శుక్లశోణితముల సంఘము వలన సృష్టి కర్మ ఏర్పడుచున్నది. దానినే క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగం అంటారు. మానవ శరీరమునకు క్రమక్రమేణ ఇంద్రియ సంఘము చేరుచున్నది. కర్మలవలన పాపపుణ్యములు, కష్టసుఖములు, జన్మ, మోక్షములు కలుగుచున్నవి.

మానవులు సంఘమును, కర్మలను, అర్థముచేసికొని సంఘమున ఎటుల కలువ వలయును? ఎటుల విడదీయవలయును? ఏకర్మలు చేయవలయును? ఏకర్మలు చేయకూడదు ? అనుతత్వమును తెలిసికొనవలయును. తగు విధముగా ప్రవర్తించవలయును. మానవుడు సత్సంగముతో చేరవలయును సత్సంగము ముక్తికిమార్గము. ఒకమంచి సంఘముతోచేరినఆసంఘ సంస్కారము జీవునికి మోక్షము నిచ్చును. గురుదేవుల సంఘములోచేరి ఆత్మతత్వ ప్రబోధమును దీక్షతో వినవలయును. వినిన దానికి జ్ఞానుల సంఘముతో. భిక్షుక సంఘముతోచేరి మననము చేయవలయునును శ్రవణ, మనన. నిధి ధ్యాసలతో సార్థకము చేయవలయును.

మనస్సును ఇంద్రియ సంఘము నుండి విడదీసి, ఆత్మసంఘమునచేర్చి క్రమ శిక్షణ యందుంచి, తమకు వశవర్తిగా నుంచుకొని. మనస్సునకు ఏకాగ్రత నొసంగి, సంకల్ప వికల్పములు లేకుండునట్లుచేసి, మోక్షమార్గమున శత్రుసంఘమైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను సప్త వ్యసనములను, రాజస, తామస గుణములను, శబ్దస్పర్శరూపరస గంధ వికారభాగములను, నాలుగు దుష్ట లక్షణములైన అజ్ఞానము, అపకీర్తి, అసంతృప్తి,అధర్మములను, మొత్తము ఈయిరువదినాలుగు శత్రువులను,వారికి నాయకుడైన మనస్సునుపారద్రోలి, ఆనాయకుడైన మనస్సును ఆత్మయందు బంధించి, బుద్ధితో కృషిచేసి "వ్యవసాయాత్మిక బుద్ధితో (నిశ్చయాత్మకమైన బుద్ధితో) యోగసాధన చేయవలెను.



# పందొమ్మిదవ అధ్యాయము

## (దీక్షా యోగము)

### శ్రీ నాగార్జున ఉవాచ

భిక్షులారా! దీక్షఅనునది లక్ష్యసాధనకు అత్యంత ప్రధానమైనది. దీక్ష లేనిదే మానవుడు ఏ కార్యమును సాధించలేడు. మానవుని లక్ష్యము ధర్మవిరుద్ధము, పాపభూయిష్టముగాక జగద్ధితముగా, లోకకళ్యాణ కరముగా, జీవోద్ధరణ హేతువుగా నుండవలెను. జీవుని ఉద్ధరించు దీక్షతో ఆత్మతత్వ స్వరూప జ్ఞానమునుపొంది, యోగసాధననుచేసి, సచ్చిదానందమును, పరమ శాంతిని పొంది, మహాపరినిర్వాహణ మార్గమున పరంధామముచేరి శాశ్వతానం దమును అనుభవించవలెను. ఈ దీక్ష సాధకుడికి ఎట్లా తోడ్పడుతుందో వివరిస్తాను వినండి.

బుద్ధుడు కపిల వస్తునగరానికి వచ్చినప్పుడు దీక్ష వహించిన ప్రధాను లలో ఆనందుడు ఒకడు. శుద్ధోధనుని సోదరుడైన అమితోదనుని కొడుకు లలో నొకడైన మహానాముడే దీక్షానంతరం ఆనంద నామం ధరించాడు. బుద్ధునకు అంతరంగిక పరిచారకుడయ్యాడు. ఇట్లా అర్హతను ఆయనకు ఆయనసేవాదీక్ష సంపాదించి పెట్టింది. బుద్ధుడు ఆనందుని తన అంతరం గిక పరిచారకునిగాచేసుకోవటానికి పూర్వం ఇరవై సంవత్సరాలపాటు తనపని తానే చేసుకొంటూ ఉండేవాడు. వృద్ధత్వం పైనపడగానే పరిచారకుడు కావలసి వచ్చింది. సారిపుత్రుడు, మొగ్గల్లాన మొదలైన ఎనిమిది మంది ముఖ్య శిష్యుల్ని కాదని, బుద్ధుడు ఆనందుని ఎన్నుకున్నాడు. అప్పటినుంచి ఇరువై ఐదు సంవత్సరాలు ఆనందుడు బుద్ధుణ్ణిఛాయలా వెన్నంటి, తన విపుల ప్రవర్తనతో మెప్పించి, భక్తి శ్రద్ధలతో ఆయనకు సేవచేశాడు. బుద్ధునివద్దకు తనకు ఇష్టము వచ్చినప్పుడెల్లా పోగలిగిన అధికారం కలిగి ఉండేవాడు. దూరాగతులైన వారికి బుద్ధ దర్శనంకోసం ప్రవేశం కల్పించే అధికారం ఆయనకు మాత్రమే ఉండేది. ఆయన ఎన్నడు బుద్ధుని మందిరంలో తాను నిలువకుండ, విలువైన వస్త్రాలు కట్టుకోకుండా, బుద్ధునికి ఇతరు లొసగి భిక్ష తానుగైకొనకుండా, జాగ్రత్తగా, బుద్ధభగవానుని తదేకదీక్షతో సేవించి ఇత రులకు మార్గదర్శకుడయ్యాడు.

రాజగ్రహలో సాల్వతికి అనే రాజ నర్తకి ఉండేది. ఆమెకు జీవకు డనే కొడుకు ఉండేవాడు. జీవకుడు అక్రమసంతానం కావటంవల్ల అతడు జన్మించగానే అతణ్ణి ఒకబుట్టలోపెట్టి, చెత్తకుప్పపై పారవేశారు. జనం అంతా ఆ శిశువుచూడటానికి మూగుతున్నారు. రాజకుమారుడైన అభయుడు ఆ సమయంలో అటుగా వెళ్ళుతూ "ఆ శిశువు జీవించే ఉన్నాడా?" అని అడిగాడు. "జీవించే ఉన్నా"డని అక్కడివాళ్ళుసమాధాన మిచ్చారు. అందుకే ఆ పిల్లవాడికి "జీవకు"డనే పేరువచ్చింది. అభయుడు అతణ్ణి దత్తత చేసుకొని పెంచిపెద్ద వాణ్ణిచేశాడు. జీవకుడు పెద్దవాడయ్యాక తాను ఏలా రక్షింప బడింది తెలుసుకొన్నాడు. అభయుడికి చెప్పకుండా ఒకనాడు ఇంటి నుండి పారిపోయి, తక్షశిల విశ్వవిద్యాలయంలో ఏడేళ్ళపాటు వైద్య విద్య నేర్చుకొన్నాడు. తిరిగి రాజగ్రహకువచ్చి, మంచి వైద్యుడిగా పేరు ప్రతిష్టలు సంపాదించాడు. అతడి గొప్పతనాన్ని గ్రహించి అభయుడు రాజసౌధంలోనే అతడికి ఆవాసం కల్పించాడు. నేర్పుగా చికిత్సచేసి రాజగ్రహలో బింబిసారుని దీర్ఘ వ్యాధిని అతడు నయం చేశాడు. ఇందుకు ప్రతిఫలంగా బింబసారుని ఐదువందలమంది భార్యలు తమ నగలన్నింటిని వొలిచి, అతని కిచ్చారని చెబుతారు. జీవకుడు తథాగతుని ఆరాధించేవాడు కనుక బౌద్ధ సంఘానికి వైద్యుడుగా వ్యవహరించేవాడు. బుద్ధుడు అతణ్ణి శిష్యుడిగా స్వీకరించాడుగాని-వైద్యసేవ చేయటానికి స్వేచ్ఛా ఉండాలి కాబట్టి భిక్షువుగా దీక్ష ఇవ్వలేదు. బింబిసారుని మరణానంతరం జీవకుడు అతని కుమారుడు అజాత శత్రువు కొలువులో పని చేశాడు. తండ్రిని చంపిన అజాత శత్రువు పరివర్తన చెంది, బుద్ధుని చేరుకోవటానికి జీవకుడే ప్రధాన కారకుడు. ఉత్తముడిగా, సంఘంలో గౌరవప్రదమైన వ్యక్తిగా రూపొందటానికీ-బుద్ధుని అనుయాయిగా మారటానికి జీవకుడికి తోడ్పడింది- అతని దీక్షయే! నన్న సంగతి మనం మరువరాదు. దీక్షఅన్నది అన్నికార్యములను జయప్రదముగా నెరవేర్చు దివ్యశక్తియై ఉన్నది.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

మానవులు దీక్షలేనిదే ఏ కార్యమును సాధించలేరు. జీవుడు దీక్షా

మయుడు. ఏ విషయమున దీక్ష వహించిన ఆ దీక్షరూపుడౌతాడు. మనసు అనేక సంకల్పములను కల్పిస్తుంది. ఏ సంకల్పమునందు దీక్ష ఉన్న ఆ సంకల్పము కార్యరూపమును పొందుతుంది. దీక్ష వలననే జ్ఞానము కలుగుతుంది. జ్ఞానం వలన పరమ శాంతి లభిస్తుంది. దీక్షను శాస్త్రధర్మమునకు జతపరచవలెను. అప్పుడది దైవరూపమును పొందుతుంది. ఆత్మతత్వ స్వరూపజ్ఞానమును, ఆత్మానందమును ప్రాప్తింపచేస్తుంది అందువలన శాస్త్ర ధర్మ ప్రమాణమైన దీక్షను మనం వహించవలసి ఉన్నది. యోగసాధన యందు దీక్షను వహించి, మనస్సును చలించనీయక హృదయమునందు నిరోధించి, ఇంద్రియములను నిగ్రహించి, నిశ్చల బుద్ధితో యోగమును చేయవలెను.

దీక్ష 1. దివ్యదీక్ష, 2. ధర్మదీక్ష, 3. స్వధర్మదీక్ష, 4. దుష్టదీక్ష, 5. ఆశాదీక్షఅనిఐదువిధములు ఉన్నది. మానవులుఎక్కువగా ఆశాదీక్షయందు నిమగ్నులౌతుంటారు. వేలాది ప్రజలయందు ఒకానొకడు దివ్యదీక్షను వహిస్తారు వారిలో కొందరు యోగసాధన ప్రారంభిస్తారు. అట్లా ప్రారంభించిన వాళ్ళల్లో కొందరు మాత్రమే పట్టువదలకుండా అభ్యాసంచేస్తుంటారు. అందులోకొందరు మాత్రము దివ్యదీక్షనువహించి, శరీరమును నిగ్రహించి, మనస్సును ఇంద్రియములను జయించి, విజయమును సాధించి, పరంధామనుచేరి, పరమశాంతిని, సచ్చిదానందమును, దివ్యతేజస్సును, అమృతత్వమును పొందుచున్నారు. పరంధామను చేరినవాళ్ళకు పునర్జన్మ లేదు.

కొందరు మానవులు ధర్మకార్యములందు పుణ్యమును అపేక్షించి, దీక్షతో చేస్తుంటారు. వాళ్ళను భక్తులంటారు. మోక్షసాధకులను యోగులంటారు. యోగులు శ్రేష్ఠులు. వేదములు చదువువారు, యజ్ఞములుచేయువారు, తీర్థయాత్రలు చేయువారు వ్రతములుచేయువారు, మోక్షార్థులుకారు. కించిత్ పుణ్యమును మాత్రమే వారు పొందుతున్నారు. పుణ్యము జీవుని ఉద్ధరించదు. అది జీవునకు జన్మబంధకారణ మౌతుంది. జ్ఞానము ఒక్కటే మోక్షమార్గము. యోగ మొక్కటే మోక్షసాధనము. కనుక మానవులు

పుణ్యము నపేక్షించి భ్రమలయందు పడక, జ్ఞానమునపేక్షించి, యోగము నందు దివ్యదీక్షను వహించవలెను.

మానవులందు దుష్టదీక్షకంటేస్వార్థదీక్ష శ్రేష్ఠము. స్వార్థదీక్షకంటె స్వధర్మ దీక్ష శ్రేష్ఠము. స్వధర్మదీక్షకంటెధర్మకార్యదీక్ష శ్రేష్ఠము. ధర్మకార్యదీక్షకన్నను యోగసాధనదివ్యదీక్ష సర్వోత్తమమైనది. పరమశ్రేష్ఠమైనది. కనుకమానవులు కొంచెము చేసినను జ్ఞాన స్వరూపమైన యోగమును చేయవలయును. యోగముప్రభువులకు, శ్రీమంతులకు, ఉద్యోగులకు, రైతులకు, వ్యాపారస్థులకు, కూలివారికి, పాపవు జన్మలైనవారికి, కుంటి, గుడ్డి వికలాంగులకు, భయంకర వ్యాధి గ్రస్తులకు, పండితులకు, విద్యావంతులకు అవిద్యావంతులకు స్త్రీలకు, పురుషులకు సర్వులకు హక్కు, అర్హత, అవకాశముగల సాధనము కనుక సర్వజనులు యోగదీక్షను వహించవలెను.

ఇతరులసొమ్మును దొంగిలించిగాని, దౌర్జన్యముగాగాని, హత్యచేసిగాని, అపహరించుట యందు దీక్ష వహించుట దుష్టదీక్షఅన బడుతుంది. ఒక దొంగ ఒక శ్రీమంతుల యింటికి కన్నమువేసి దొంగిలించుటకు ఆ యింటి దగ్గర అర్థ రాత్రివరకు నిద్రలేకుండా కూర్చున్నాడు. అర్థరాత్రికి వారింటికి బంధువులువచ్చారు. వేకువజామువరకు నిద్రలేకుండా దీక్షతో అతడు కూర్చు న్నాడు. కానివీలుపడలేదు. ప్రయత్నము చాలించుకుని వెళ్ళిపోయినాడు. మరుసటి రాత్రి మరలవచ్చాడు. అర్థరాత్రివరకు నిద్రలేకుండాకూర్చున్నాడు. ఆయింటిలోని ఒకరికి అర్థరాత్రి సమయములో కడుపు నొప్పి వ్యాధి సంభ వించినది. అందరు మేలుకొనినారు. దొంగతనం వీలుపడలేదు. రెండు రోజులు నిద్రలేకుండా కూర్చుని, దీక్షతో కాలముగడిపినాడు. మూడవ రోజు మరలావచ్చి దొంగతనంచేసినాడు. ఇది దుష్టదీక్ష.

స్వధర్మదీక్ష-తనస్వధర్మమున ఏంతకష్టము కలిగినను, ఎంతబాధకలిగి నను దీక్షతో నెరవేర్చవలెను. దేశరక్షణకై సైన్యమున్నది. శత్రువులు దండెత్తివచ్చినపుడు అడవులయందు పర్వతములందు ప్రయాణములు చేసి

సమయమునకు ఆహారము దొరకినను దొరకకపోయినను, చలి, యెండ బాధలను సహించుకుని దీక్షతో దేశమును రక్షించవలెను. లేకున్న దేశద్రోహులు, రాజద్రోహులు అగుదురు. రైతులున్నారు వారి స్వధర్మముపైరు పంటలను రక్షించుట. పంటను అడవి జంతువులు పాడుచేయు నపుడు రాత్రిన్నీ నిద్ర మేల్కొని, చేని చుట్టు తిరుగుతూ పంటను రక్షించుకొనవలయును. లేకున్న పంటను పక్షులు, అడవి జంతువులు పాడుచేసిన తన కష్టము వ్యర్థమై తనను నమ్ముకొనియున్న తనకుటుంబ సభ్యులు భార్యాపిల్లలు. తోబుట్టువులు పోషణ లేక అనేక కష్టములకు గురి కావలసి యుండును. అందువలన స్వధర్మమును దీక్షతో చేయవలెను.

కొందరుకార్యములు దీక్షతో నిస్వార్థముగా చేయుదురు. సామాన్యులు భ్రాంతి, మమకారములు కలిగి తనవారు సుఖములనుభవించవలయునని అనేక శ్రమలకోర్చి కార్యములును నిర్వహిస్తారు. ధర్మదీక్షగలవారు అనేక ప్రాణులు సుఖపడవలెనని. తనవారలకూ తనకూ ఏ సంబంధము లేకుండా అనేక శ్రమలకోర్చి ధర్మ కార్యములను చేస్తారు. ఇది ధర్మదీక్షతో చేసేపని.

ఆత్మతత్వ స్వరూప జ్ఞానముతో ఇంద్రియములను నిగ్రహించి, శరీరమునకు వెలుపలనుండు శబ్ద, స్పర్శ, రూప రసలిగంధములను వెలుపలకు నెట్టివేసి. మనస్సును హృదయమున నిరోధించి, స్థిరమైన బుద్ధిగలిగి శరార అంతర్భాగమున ఉండు అంతర్జ్యోతిని జ్ఞాననేత్రముతో చూచుచూ స్మృతితో సుషుమ్నా శ్వాసనుగుర్తించుచు, ఆత్మానందమును పొందుచూ తన ఆసనమును, శరీరమును. అవయములనుకదలనీయక యోగముచేయుట దివ్య యోగమునకు అంతర్జ్యోతి, జ్ఞాననేత్రము, సుషుమ్నా శ్వాస, స్మృతి ఆధారము. శరీరమునకు వెలుపలి యే పదార్థముతోనూ యోగమునకు అవసరములేదు. ప్రకృతివస్తువులతో అనగా సమిధలు, నెయ్యి, పూలు, తీర్థము, మంత్రములు

మొదలగు పదార్ధములతో చేయుదైవోపాసన పుణ్య కర్మయేగాని మోక్షామార్గ ముగాదు. యోగసాధనే మోక్షమార్గము. అదే దివ్యదీక్ష.

యోగసాధన చేయువారు తీవ్రదీక్షను వహించనిదే మనస్సును నిగ్రహించలేరు. మనసు చంచల స్వభావము కలిగినది. కోరికల స్వరూపమైనది. సంకల్పవికల్పాత్మక మైనది. అట్టిమనస్సును అభ్యాస వైరాగ్యముల చేతనే నిగ్రహించ వలెను. రాగద్వేషములకు, మమకార భ్రాంతులకు, కామ, క్రోధములకు ఏ విధమైన స్థానము నివ్వకూడదు. మనసును ఆత్మయందు నిరోధించవలెను. ఇంద్రియ సంఘముతోగాక ఆత్మాను సంధానముచేయ వలెను. ఆత్మానుభూతి కల్పించ వలెను. అప్పుడు మనస్సునందలి వికారములు శమించి ప్రసన్నత యేర్పడుతుంది. అప్పుడే బుద్ధి బహుశాఖలు గాక నిశ్చయాత్మకము ఏర్పడును. బుద్ధియోగముకలుగును. బుద్ధిని ఆశ్రయించి దీక్షతో యోగము చేయవలయును.

యోగసాధకులు కొందరు తగిన శాకాహారమును తీసికొందురు. కొందరు పాలు, పండ్లు, అపక్వాహారము తీసికొందురు. కొందరు అమృతాహారమును తీసికొని, ఆసనమును కదిలించక, శరీరవెలుపలి యింద్రియ విషయవాసనలను వెలుపలకు నెట్టివేసి, ఆకలి నిద్రలనుజయించి, శరీరము నిగ్రహించి, యే అవయవమును కదలనీయక కన్ను తెరచిలోకమును చూడక తుపాను వచ్చినను చలించక, శరీరము కృశించి మాంసము రక్తము క్షీణించి, ఎముకలుఅస్థిపంజరముగా ఏర్పడిననులక్ష్యపెట్టక, చలించక, దీక్షతోతనలక్ష్యము నెరవేరువరకు యోగ సాధనయందు యోగసమాధి స్థితిని పొందెడివారికి బాహ్య ప్రపంచముతో సంబంధము ఉండదు. సచ్చిదానంద స్వరూపులుగ నుందురు. నేను ఆరు సంవత్సరములు సత్యమును, దుఃఖ నివృత్తి మార్గమును, జ్ఞాన సిద్ధిని పొందువరకు సమ్యక్ సమాధియందుంటిని.

మానవులు కొందరు తమ లక్ష్యసాధనకు తీవ్రమైన దీక్షతో తపస్సు చేయుదురు. కొందరు ఒక్కకాలి మీద నిలువబడి, కూర్చొనకు పరుండక,

ఆహారనిద్రలులేక తపస్సుచేయుదురు. వారియందు కొందరి లక్ష్యములు దుష్టలక్ష్యములుగానుండును. కొందరు నీటిలోఆసనము వేసికొని జలస్తంభన చేసి, శ్వాసను తగువిధముగా నడుపుచు తపస్సుచేసి తమ లక్ష్యమును సాధించుచున్నారు. ఇది దివ్యదీక్షగాదు. లక్ష్యదీక్ష యనబడును. ఈ దీక్ష వలన తనకుగాని లోకమునకుగాని క్షేమములేదు. లోకమునకు ఉపకారముగాక మహాపకారము కలుగును. సంఘమునకు ఉపకారముచేయు దీక్ష ధర్మదీక్ష. దుష్టకార్యదీక్ష పాపభూయిష్టమగును.

కొందరు దీక్షతో సాధనలుచేసి అన్యదేవతోపాసన తగు నియమములను దీక్షతో ఉపాసించి సిద్ధులను సాధించి లోకమును మోసముచేయుచుందురు. అనేక విధములైన మహిమలను చూపుచుందురు. నేనేదేవుణ్ణి అని కూడ చెప్పుదురు. వారిని ఉపాసించుభక్తులుకూడ కొంతమంది ఏర్పడుదురు.

కొందరు పేరు ప్రఖ్యాతుల కొరకు తీవ్రదీక్షతో అన్యదేవతోపాసన చేసి సిద్ధిని పొంది వ్యాధులను నివారణ చేయుదురు. వారి స్వార్థమునకు పేరు ప్రఖ్యాతులు కొరకు దీక్షతో సాధన చేసినను లోకమునకు మహోపకారము జరుగుచున్నది. కొన్ని వ్యాధులు వాళ్ళ మంత్రశక్తి చేత మందులు ఉపయోగించకయే నివారణ యగుచున్నవి. ఎంతో మంది రోగులకు ఉపకారము జరుగుచున్నది. గృహములందలి అరిష్టములకుకూడ యంత్రములు వేసి మేలుకలుగునటుల చేయుదురు. శరీర వ్యాధులకు కూడ యంత్రములు వేయుదురు. ఇట్లు సంఘమునకు ఉపయోగపడుచున్నారు. కాని ఇది పుణ్యకర్మయగును. ఇటు వంటి కర్మల వలన జ్ఞానముగాని, మోక్షార్హత గాని కలుగదు. జీవునకు ప్రయోజన ముండదు. జీవునకు బంధహేతువే యగును. అందువలన ఇది ధర్మదీక్ష అవుతుంది. కాని దివ్యదీక్ష కానేరదు.

మానవులు కొందరు విద్యలకొరకు, కళలకొరకు, తీవ్రదీక్షతో అభ్యాసము చేయుదురు. అందు శిల్పము ముఖ్యమైనది. రాతిపైన విగ్రహములు చెక్కుట, శాసనములువ్రాయుటవలన, ఆకాలమునాటి నాగరికత, ఆకాలము నాటి ఆచార సిద్ధాంతములు, రాబోవు కాలమునకు తెలియజరచుచున్నవి.

సంగీతవిద్యకూడ శ్రద్ధాదీక్షతోనే నేర్చుకొనెడివిద్య. సంగీతము తనకు సంతోషముకలిగించుటేగాక అనేకమందినిసంతోషపెట్టెడిది. సగుణోపాసకులు సంగీతముతో దైవోపాసన చేయుదురు. వారి మనస్సునకు ఆహ్లాదకరమగు దైవ భావనకలిగి పాటలుస్తోత్రములు, పద్యములుశ్రావ్యముగాపాడి ఆనందించుచుందురు. వినువారుకూడతన్మయులగుచుందురు. సగుణోపాసనాభక్తులు వివిధరాగములందు వివిధభావములతో దైవతత్వము వర్ణించి పాటలుపాడుచుందురు, కొందరు భక్తులు భిక్షకువచ్చినను చక్కని సంగీతముతో శ్రావ్యముగాపాటలు తత్వములు పాడుచూ భిక్షాటనముచేయుదురు, కొందరు గృహస్థులు కూడా సంగీతముతో భిక్షాటనముచేయు సాంప్రదాయము కలదు. ఇది దీక్షతో అభ్యసించు విద్య. దీనిని లక్ష్యదీక్షయందురు.

సాలె పురుగు కార్యదీక్షగల ప్రాణి. అది గూడును నిర్మించుకొనునపుడు శరీరమునకు వెలుపల నుండు పదార్థములతోగాక, తన గర్భమునందలి పదార్థముతోగూడును నిర్మించుకొను. ఆగూడునిర్మించుకొను సమయమున ఎన్నియో సారులు తెగిపోవును. కాని తన దీక్షవదలదు. మరలా ప్రయత్నము చేసి, తన గూటిని నిర్మించును. తన గర్భమునుండి వెలుపలికితీయు సన్నని నూలుపోగులాంటి దారమును పట్టుకొనిపైకిప్రాకును. క్రిందికిజారును ప్రక్కలకు ప్రాకును. మధ్య యే ఆధారములేక చుట్టూ ఆధారమును కల్పించుకుని, గూటిని నిర్మించి, మధ్య నివాసవసతి కల్పించుకొని, సంతానోత్పత్తిని చేసికొనును. ఇతరయేప్రాణి సహాయముగాని. యే పదార్థ సహాయముగాని కోరదు. ఎవరినీ ఆశ్రయించదు. ఇదిమహత్తరకార్యము. సామాన్యముగ క్రిములు మట్టితోను, పక్షులు పుల్లలు నార యాకలుమొదలగు పదార్థములతోను, గూడు నిర్మించుకుని తమ సంతానోత్పత్తి చేసికొంటువి. సాలెపురుగు అటులుగాక తనలోని పదార్థముతో దీక్షతో ఒంటరిగనే. మగసాలె, పురుగు సహాయంకూడాలేకయే గూటిని నిర్మించుకొని సంతానోత్పత్తి చేసుకొంటుంది.



# ఇరవదవ అధ్యాయము

## (ప్రవర్తనా యోగము)

**శ్రీ నాగార్జున ఉవాచ :**

భిక్షులారా! మానవుడు తన జీవితంలో అత్యంత ప్రధానశ్రద్ధతీసుకొని జాగ్రత్త వహించవలసినది ప్రవర్తన. తన ప్రవర్తన మీదనే తన జీవితం, భవిష్యజ్జన్మ లేదా జన్మరాహిత్యం ఆధారపడి ఉంటుంది. ఎంతగొప్ప సాధకులైనా, గురువులైనా, పీఠాధిపతులైనా తమప్రవర్తనయందు భ్రష్టులైతే, ఇతర ప్రాణులకు బాధకలిగిస్తే తమ జీవితాలనే పతనం చేసుకోక తప్పదు. బుద్ధుడు ఈ ప్రవర్తనకు ప్రథమ స్థానం కల్పించాడు. భిక్షులకు ప్రవర్తన నియమావళి ఏర్పాటు చేశాడు. స్త్రీలకు ప్రత్యేక విహారాలను ఏర్పాటు చేశాడు. ప్రవర్తనకు పంచశీలములు ప్రధానమైనవి. అష్టాంగమార్గము ప్రాణము. ఇవిగాక పంచవ్రతములున్నవి. అనగా సత్యవ్రతము, ఏకపత్నీవ్రతము, పాతివ్రత్య వ్రతమున ధర్మవ్రతము, దీక్షావ్రతము. మానవుడు ఈ అయిదు వ్రతములను తప్పకదీక్షగా ఆచరించుచుండవలెను. పంచవ్రతములు మానవుని నివృత్తి మార్గమున ప్రవేశపెట్టి, ఆత్మతత్వ జ్ఞానమును ప్రసాదించి, మహాపరి నిర్వాణ మార్గమున జీవుని పరంధామము చేర్చును అదే సత్ప్రవర్తనఫలితము కనుకసత్ప్రవర్తనకలిగి యుండవలెను. సమదృష్టి, సమసంకల్పలం,సమవాక్కు,సమకర్మ, సమఆర్జన,సమవ్యాయామం, సమశక్తి, సాధించాలనుకొనేవాళ్ళకు అత్యాశ, దుర్బుద్ధి, జడత్వం, అవిశ్వాసం, అనిశ్చితత్వం అనే ఐదు అవరోధాలు కల్పిస్తుంటవి, అందువల్ల శృంఖలాలవంటి ఈ ఐదింటిని ఛేదించటం అవసరం. అది సమాధివల్లే సాధ్యమౌతుంది. సమ సమాధి, సమాధి ఒకటి కాదని గ్రహించండి. సమాధి అంటే ఏకాగ్రత ఏకాగ్రత ఆ ఐదు అవరోధాలను తొలగించి, స్వయం కల్పిత ధ్యానస్థితికి మానవుణ్ణి తీసుకొని పోతుంది. శాశ్వతంగా వాటిని నిరోధించే స్థితినే సమ సమాధి అంటారు. సమసమాధి మనిషి మనస్సుకు నిరంతరం మంచిగురించే ఆలోచించడం అలవాటు చేస్తుంది. సత్కార్యం చేయడానికి కావలసిన అంతర్ ప్రేరణను మనస్సుకు మహా సమాధి ప్రసాదిస్తుంది. బుద్ధుడు శీల పథాన్ని బోధించాడు. ఇది పరివ్రాజకులకు చాలాముఖ్యమైంది. శీలపథంలో

1. శీలం 2. దానం 3. ఉపేక్ష 4. నిష్కామం 5. వీర్యం 6. క్షాంతి 7. సత్యం 8. అధితానం 9. కరుణ 10. మైత్రి అనే గుణాలున్నాయి. శీలమంటే చెడు చెయ్యడానికి భయపడటం. అంటే నైతిక స్వభావం. దానమంటే తను, మన, ధనాన్ని ఫలాపేక్ష లేకుండా ఇతరులకు అర్పించడం. ఉపేక్ష అంటే నిర్లిప్తత. రాగద్వేషాలకు అతీతమైన మనస్థితి. తనప్రయత్నాల ఫలితానికి దుఃఖంగాని, ఆనందంగాని చెందకుండా లక్ష్యసాధనను కొనసాగించటం. నిష్కామమంటే ప్రపంచ సుఖాలను పరిత్యజించటం. వీర్యమంటే సత్ప్రయత్నం. కర్తవ్యాన్ని పట్టుదలతో శాయశక్తులా నెరవేర్చడం. క్షాంతి అంటేసహనం. ద్వేషంద్వేషంవల్ల నశించదని, సహనంవల్లనే నశిస్తుందని తెలుకోవడం. సత్యమంటే ఎల్లప్పుడూ నిజమే చెప్పటం. అధితానమంటే లక్ష్యంచేరుకోవాలనే స్థిరసంకల్పం. కరుణ అంటే ప్రాణులపట్లప్రేమ, దయ చూపడం. మైత్రి అంటే జీవకోటి పట్ల స్నేహభావంతో ఉండటం. శత్రువులకు కూడా స్నేహాన్ని అందివ్వడం. ఈ సన్మార్గాలను ప్రతివ్యక్తి తన శాయశక్తులా ఆచరించాలి. తన ప్రవరనను నిష్కళంకంగా దిద్ది తీర్చుకోవాలి. అప్పుడే మానవుడు పరిపూర్ణస్థితి పొందుతాడు. ఈ విషయం మీకు సుబోధకం కావటానికి నిగ్రోధమిగ (న్యగ్రోధమృగ) జాతక కథచెబుతాను. వినండి!

ఒకసారి బోధిసత్వుడు మృగంగా పుట్టి ఐదువందలమృగాలు తనను సేవిస్తుండగా వనంలో ఉంటుండేవాడు. అందరూ ఆయన్ను "న్యగ్రోధమృగ"మని పిలుస్తుండేవాళ్ళు. ఆ సమీపంలోనే మరో మృగం ఉండేది అదికూడా అయిదు వందల మృగాలకురాజై "శాఖామృగ"మని పిలవబడుతుండేది. ఆ సమయంలో కాశీరాజు అడవికి నిత్యం వేటకు వెళ్ళి ప్రతిపూట ఒక మృగాన్ని చంపి, ఆమృగమాంసంతో భోజనం చేస్తుండేవాడు. ప్రతిదినం తన ప్రజలను వారివారి పనులను వాళ్ళను చేసుకోనీయకుండా వాళ్ళందరినీ తనవెంటబెట్టుకొని, వేటకు తీసుకొనిపోతుండేవాడు. అందువల్ల ఆ ప్రజల పనులకు అంతరాయం కలిగి, వాళ్ళు బాధపడి, అడవిలోని మృగాలనే రాజుగారి దగ్గరికి తోలితే తమపనుల కంతరాయం కలుగదని వాళ్ళుభావించారు.

రాజుగారు అందుకు వప్పుకొన్నాడు. వారట్లాతోలిన మృగాలలో ఈ రెండు మృగరాజులున్నాయి. రాజు ఆ రెండు మృగాల దేహములు స్వర్ణచ్ఛాయతో మెరిసిపోతూ ఉండటం చూచి, వాటిని చంపవద్దని చెప్పాడు. ఆ తర్వాత ఆరాజే స్వయంగా వనంలోకిపోయి, రోజుకొకమృగము(జింక)చొప్పున చంపుతుండేవాడు. రాజునుచూడంగానే ఆ మృగాలు భయపడి, గాబరాతో ఒక దానినొకటి పొడుచుకుంటూ పారిపోతుండేవి. ఆ గాయాల వలన అవి మరణిస్తుండేవి. ఈప్రమాదాన్ని అపుటకు నాయకులైన ఆ రెండు మృగాలు రోజుకొక మృగాన్ని చంపుటకు నిలబెట్టాలని నిర్ణయించుకొన్నవి. ఒకనాడు గర్భవతియైన ఒక జింకవంతు వచ్చింది. బోధిసత్వునకిది తెలిసి ఆ జింక స్థానమునతాను నిలబడ్డాడు. వంటవాడు ఆస్వర్ణమృగాన్నిచూచి, ఆ వార్త రాజుకు చెప్పాడు. రాజు ఆ మృగం చూపిన ప్రేమ, దయ, త్యాగం చూచి, చాలాసంతోషించి, స్వర్ణమృగాన్నేకాక తక్కిన మృగములన్నింటికి ప్రాణ దానంచేసి వాటిని విడిచి పెట్టాడు. బోధిసత్వుడు ఆ రాజుకు పంచ శీలములు బోధించి, సత్ప్రవర్తన కలిగి ఉండేటట్లు చేశాడు.

బోధి సత్వుడంటే బుద్ధుడు కాగోరువ్యక్తి. బోధిసత్వుడైనవాడు సత్ప్రవర్తనతో, పదిజన్మలపాటు బోధిసత్వునిగా ఉంటూ-సాధనలో ఒక్కొక్క మెట్టు అధిరోహిస్తూ ఉండాలి. దిగజారకూడదు. ఇట్లా పదిజన్మల పాటు అర్హతను కోల్పోకుండా ఉంటే పదవజన్మలో అతడు బుద్ధుడుగా మారతాడు. బోధిసత్వుని ప్రవర్తనకు చెందిన కథలన్నీ జాతక కథలుగా పాళీభాషలో చెప్పబడ్డాయి.

బుద్ధుడుకాగోరువ్యక్తి మొదటి జన్మలో "ముదిత" ఆనందము పొందుతాడు. మబ్బులు తొలగిన చంద్రుడుప్రకాశించినట్లు ప్రమత్తుడు ప్రశాంతచిత్తుడౌతాడు. అతనిలో అందరికి శుభం కలుగచెయ్యాలనే గాఢమైనకోరిక కలుగుతుంది. రెండవజన్మలో విమలత్వాన్ని పొందుతాడు. కామపరమైన ఆలోచనలు తొలగిపోతాయి. దయాళువు అవుతాడు. మూడవజన్మలో "ప్రభాకరు"ని వంటి తేజస్సు సాధిస్తాడు. అత్యున్నత జ్ఞానాన్ని పొందాలని

గాఢంగా వాంఛిస్తుంటాడు. దేనినైనా త్యాగం చెయ్యటానికి సంసిద్ధుడౌతాడు. నాలుగవజన్మలో "అర్చిష్మతి" సాధిస్తాడు. అష్టాంగ మార్గంపై దృష్టి నిలుపుతాడు. ఐదవజన్మలో "సుదుర్జయ" అనే అజేయస్థితిని పొందుతాడు. నిరపేక్ష సాపేక్షలమధ్య గల సంబంధాన్ని బాగాఅర్థం చేసుకొంటాడు. ఆరవ జన్మలో "అభిముఖి"గా మారతాడు. పదార్థ వికాసం, వాటి కారణాలు, ద్వాదశ నిదానాలను గురించి పూర్తిగా గ్రహించగలుగుతాడు. ఏడవ జన్మలో "దూరంగమ"గా మారతాడు. బోధిసత్వు డిపుడు కాలానికీ, స్థలానికీ అతీతుడౌతాడు. ఏవాంఛలు అతణ్ణిఅంటుకోవు. అందరి కోర్కెలుతీర్చేవాడవుతాడు. ధర్మాన్ని గురించి లెస్సగా తెలుస్తుంది. పరమశాంతి మూర్తి అవుతాడు. ఎనిమిదవ జన్మలో "అచలు"డవుతాడు, అతడుచేసే ప్రతికార్యం విజయవంతమౌతుంది. అన్నిప్రయాసలు దూరమౌతాయి. తొమ్మిదవ జన్మలో "సాధుమతి" అవుతాడు. ఈ స్థితిని పొందిన వ్యక్తికిఅన్నిధర్మాలు, శాస్త్రాలు కరతలామలకమౌతాయి. పదవజన్మలో "ధర్మమేఘు"నిగా మారతాడు. ఈ జన్మలో బోధిసత్వుడు బుద్ధుడై అనంత దివ్యదృష్టిని పొందుతాడు. ఈ పది శక్తులు అతనికి ఆ జన్మలో ఉంటాయి. బోధిసత్వుడు తనకు దశల వారీగా సంక్రమించిన ఈ పది శక్తులనుపొందటమే కాకుండా, వాటిలో సంపూర్ణత్వం సిద్ధించే వరకూ సాధన చెయ్యాలి. బోధిసత్వుడు బుద్ధుడుగా మారటానికి యోగ్యత ఈ శక్తులను ద్విగుణీకృతం చేసుకోవటంవల్లనే జరుగుతుంది. కనుక బుద్ధత్వం పొందటానికి ప్రధానమైంది మన ప్రవర్తనే నన్న విషయం మనం మరచి పోరాదు.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

ప్రబుద్ధులారా! ఈ లోకంలో సర్వసామాన్యుడి దగ్గరనుంచి సమ్రాట్టు వరకూ, అజ్ఞాని నుండి పీఠాధిపతి వరకూ, స్త్రీలకూ, పురుషులకూ వారివారి ప్రవర్తనే వన్నె తెస్తుంది. సత్ప్రవర్తకులైన వారే సజ్జనులు, మోక్షార్హులు. జ్ఞానవంతులు, మహోత్తములు, మహాత్ములు. బౌద్ధ ధర్మానికి ప్రజ్ఞ (సదాలో

చన) మూలస్తంభమనిపించినా కరుణకూడా మూలస్తంభమేనని మీరుగ్రహించాలి. శీలమనేది మానవుడికి ఒక ఆభరణం వంటిది. మానవుడు తన జ్ఞానాన్ని ఏలా ఉపయోగిస్తున్నాడన్నది అతని శీలాన్ని బట్టి మనకు తెలుస్తుంది. శీలం అభయమిస్తుంది. సర్వగుణాలలోనూ, సులక్షణాలన్నింటిలోనూ అదిమేటి. శీలం లేని మానవుడు పశువుకన్నను హీనుడు. శీలానికి సంబంధించిన ఐదు మూల సూత్రాలను మీకు చెబుతున్నాను. ఇదే పంచశీల. అందులో మొదటిది ప్రాణహానికి సంబంధించింది. రెండవది అపహరణకు సంబంధించింది; మూడోది లైంగిక నీతికి సంబంధించింది. నాలుగోది అసత్యానికి సంబంధించింది. మనం ఏ ప్రాణిని చంపరాదు. ఏ వస్తువును అపహరించరాదు. నీతితప్పివ్యవహరించరాదు. అసత్యమాడరాదు. మత్తు పానీయములు సేవించరాదు. ఇట్టి నియమావళి పాటిస్తూ, సత్ప్రవర్తన కలవాడే బౌద్ధుడనిపించుకొంటాడు.

ఏ విధమైన పాపము చేయకుండటం, పుణ్య కర్మలు చేయటం, చిత్తమును పరిశుద్ధంగా ఉంచుకోవటం, ప్రతిమానవుడి విధ్యుక్త ధర్మం; మంచి ప్రవర్తన గలవారు పురుషార్థములను, (ధర్మార్థ కామమోక్షములను) సాధించాలి. మన మే కార్యము తలపెట్టినను ధర్మమును ముందుంచుకొనియేచేయవలెను. మోక్షమన్నది శరీరము విడచిన తరువాత లభించునదిగాదు. ఈ శరీరమువ్నప్పుడే ఆస్థిని పొందవలెను. అదే జీవన్ముక్తి. అందుకై విషయ వాంఛలను విడచి యోగ సాధనచేయవలెను. మానవులు మోక్షమును మరచి, ప్రకృతి భ్రాంతి మమకారములయందుపడి, అనిత్యము, క్షణభంగురమైన, నశ్వరమైన శరీరమును నమ్ముకొని, ఇంద్రియ వాసనలకు బానిసలై, మనోవికారములను పొంది, ధర్మమును విడచి, పాపకార్యములుచేసి జీవుని నీచ జన్మలకు గురి చేస్తున్నారు. తమదుష్ట ప్రవర్తనయొక్క ఫలితంగానే జన్మలు కలుగుతవన్న సత్యాన్ని ప్రతివ్యక్తి తెలుసుకొని, సత్ప్రవర్తన కలిగి, పురుషార్థములను సాధించుకొంటూ ఉండాలి. అంతేకాదు. సాంఖ్యము, తారకము, అమనస్కము, పరిపూర్ణము అను సాధనాచతుష్టయమును ఆశ్ర

యించాలి. జ్ఞానులతో సఖ్యము కలిగించుకోవాలి. సత్సంగమునచేరి తెలుసుకోవాలి. మహాత్ములు చెప్పెడి వాక్యములు శ్రద్ధగావినాలి. వాటిని మననం చేసుకొని అభ్యాసంలో పెట్టాలి. మంచి ప్రవరనతో కూడి యుండవలయుననుకొంటే మంచి వారి సాంగత్యము చేయాలి.

మానవుల ప్రవర్తనకు ప్రధానముగా నాలుగు కారణములున్నవి. మొదటిది జన్మాంతర సంస్కారము. రెండవది పాలించు ప్రభువులు. మూడవది సంఘము. నాల్గవది పరిస్థితులు. అంతేకాని "ఏదో ప్రారబ్ధము వలన జరుగుతున్నది. దేవుడేచేస్తున్నాడు" అనిభావించటం అజ్ఞానము. జన్మాంతర సంస్కారమును మార్చు ప్రభావము సంఘమునకున్నది. మన పరిసర వాతావరణమును దిద్ది తీర్చుకొన్నచో, మన ప్రవర్తన సరిగా ఉంటుంది. అప్పుడప్పుడు పరిస్థితులకు తలవంచ వలసిన అవసము కలిగినను మరుక్షణము ఆ పరిస్థితులను మనసత్ ప్రవర్తనకు అనువుగా ఉండేటట్లు చక్క చేసుకొనుట మన బాధ్యత.

మానవులలో కొందరు సగుణోపాసన చేయుచుందు. వీరు దైవకార్యములుచేయుటకు, ధర్మకార్యములు, ధర్మశాలలు, విద్యాశాలలు నిర్మించుటకు ప్రజలనుండి ధనమును వసూలు చేస్తుంటారు. పరమభక్తులుగా ప్రవర్తిస్తుంటారు. ఆ సేకరించిన ధనమును దైవకార్యములకు ధర్మకార్యములకు పూర్తిగావినియోగించక అందు కొంత దాచిబెట్టి తమస్వార్థమునకు వినియోగించు కొంటుంటారు. వీరుదేవునిపేరు మీద, ధర్మముపేరుమీద ప్రజలనుమోసము చేయు ప్రవర్తనగలవాళ్ళు. గొప్పసంగీత విద్యాంసులచేత కార్యక్రమములు ఏర్పరచి, ప్రభువుల అభిమానమును కూడా పొందుతుంటారు. ఇటువంటి వారు ఆత్మద్రోహులు. ప్రజాద్రోహులు. ఇట్టి వారికి పుణ్యము లభించవలయు నన్నచో సేకరించినధనమును. అపహరించక, ధర్మసమ్మతముగా సద్వినియోగము చేయవలెను. లేకున్న పాపము ప్రాప్తించును.

ప్రాణులయందు కొన్ని తమపోషణకు, తమసంతతి పోషణకు యితర ప్రాణులను చిత్రహింసలు పెట్టుచున్నవి. అటువంటి ప్రాణులందు కాకి ఒకటి.

కాకి తన బిడ్డను పోషించుకొనుటకై ఆవుశరీరముపై చర్మమును చీల్చి, రక్త పాతముచేసి, ఆ మాంస ముక్కలను తన బిడ్డకు బెట్టి పోషించుచున్నది. ఇతర పక్షులు "అయ్యో! ఆవు విలవిల తన్ను కొనుచున్నది. ఎంతో బాధ పడుచున్నది" అవి విచారపడుచున్నవి. కాని కాకికి ఆ భావనలేదు. ఆవు విలవిల తన్నుకొనినను, చచ్చినను "నాకేమి. నేను నాబిడ్డలు లక్షణంగా ఉండాలి." అని భావించుచున్నది. మానవులందు ఇటువంటి ప్రవర్తనగల వారు కొందరున్నారు. దొంగ తనముచేయువారు, హంతకులు, మోసగాండ్రు ఈశాఖకు చెందినవారు. మానవులు కాకులవలె ఇతరులకుబాధకలిగించి బ్రతు కరాదు. అదిదుష్ట ప్రవర్తన అవుతుంది. మానవులు తేనేటీగవలె మధుర మైన శాఖాహారులుగా, ఏ ఇతర ప్రాణికి అపకారము చేయక, పరులకు ఉప కారము చేయుచు సత్ప్రవర్తనతో జీవించవలెను.

మానవుల శరీరమునందు ఉద్రేక మనునది మహాభయంకరమైనది. కోపమునకు ఒక హద్దు ఉన్నది. ఉద్రేకమునకు హద్దులేదు. ఉద్రేకపూరి తుడు ఏమిచేయునో వానికే తెలియదు. ఏదుటి వానిని చంపగలడు. ఆత్మ హత్యచేసికొని చావగలడు. హత్యలు, ఆత్మహత్యలు ఉద్రేకమువలన కలి గెడి కార్యములు దుష్టగుణములు యెనిమిది కలవు. అవి ఉద్రేక, ఉన్మాద మూర్ఖత,కామ,క్రోధ, లోభ,భ్రాంతి అసూయలు.అందుఉద్రేక, ఉన్మాదములు మహాప్రమాదకరమైనవి. విచక్షణాజ్ఞానములేక, దాని ప్రతిఫలమును గమ నించక చేయునవి ఉద్రేక కర్మలు. నిగ్రహ శక్తిని పూర్తిగా వ్యర్థముచేసి, "యుక్త" మనుతత్వమును మరచిపోయి, విపరీతముగా ప్రవర్తించుట ఉద్రే కము. దానినే 'పిచ్చి' అనికూడా అంటారు. ఉద్రేక పడినవారు ఏది చేసి నను అతిగా, పిచ్చిగా, విచక్షణ జ్ఞానములేక చేస్తారు. ఇతరులు ఎంతమంది చెప్పినను వినరు.

కొందరు ఉద్రేకముతో కర్మలుచేసి ఉద్రేకము తగ్గిన తర్వాత పశ్చా తాపపడి, తాముచేసినది తప్పుఅని బాధపడుతారు. గనుక మానవులు ఏ కార్యమును ఉద్రేకముతో చేయరాదు. విజ్ఞానముతోచేయవలెను. ఏ విషయ

మునను అతిపనికిరాదు. తగిన ఆహారము, తగిన విహారము, తగిననిద్ర, తగినపని, తగిన ప్రేమ, తగిన యోగసాధన మరువరాదు. తన సంసారము పట్ల తగినప్రేమతోనే ఉండవలయును. రాత్రులు నిద్రకు భంగము కలిగించ రాదు. పగలు పరుండరాదు. పనిచేయక సోమరులై నిద్రించరాదు. తాను చేయవలసినపని సక్రమముగా సకాలమునకు చేస్తూ ఉండాలి.

మానవులందు మూర్ఖత యనునది భయంకరమైనది. మానవులుచేయు పాపపు పనులకు, ప్రవర్తనకు, మూర్ఖత, అజ్ఞానము కారణములుగా ఉన్నవి. అజ్ఞానమువలన దుష్టప్రవర్తనగలవారు. పాపభూయిష్టమైన కర్మలుచేయువారు అజ్ఞానము తొలగి, పాప సంకల్పములు వదలి, జ్ఞానము నాశ్రయించి, సత్ప్రవర్తన గలిగి, జ్ఞాన యోగసాధనచేత మోక్షార్హత పొందగలరు. హత్యలు మొదలగు భయంకరపాపములు చేసినవారైనను వారికిగూడమోక్షార్హతగలదు. అంగుళీమాలుడు భయంకరమైన హత్యలు చేయుచుండెను. అజ్ఞానముతొలగి జ్ఞానమునుపొంది, సత్ప్రవర్తనగల వాడై యోగసాధనచేసి మోక్షార్హుడాయెను. వసుంధరుడను విద్వాంసుడుండెను. అనేక గ్రంథములు చదివి వాని తత్వమును వంటబట్టించు కొనక, తన బుద్ధికి తోచినటులు చేయుచుండెను. జ్ఞానులు 'ఇదితప్పు. ఇట్లుచేయరా"దన్నను వాడువినిపించుకొనెడివాడుకాడు. విషయలోలుడై దుష్ప్రవర్తకుడైనాడు. తాను దుర్మార్గుడగుటయే కాక మరి కొందరిని తనవైపు ఆకర్షించి, వారినికూడా తనవలె మార్చినాడు. మూర్ఖుడు తానొక్కడేకాదు. తనతో నున్న వారి నందరిని చెడగొడతాడు. కనుక మనము మూర్ఖులకు దూరముగా నుండవలెను.

నిత్యము రాత్రి సమయము లందు మనము పరుండబోవునపుడు ఆ రోజు ఉదయం నుండి పరుండువరకు తానుచేసినపనులలో మంచిపనులుఏవి? చెడు పనులేవి? యని జ్ఞాపకము తెచ్చుకొనవలెను. తాను చేసిన చెడు పనులు, దుష్ప్రలాపములు, దుస్సంకల్పములు ఏ పరిస్థితులలో కలిగినవో ఎవరిప్రోద్బలముతో అట్లు జరిగినవో గమనించి, అట్లుచేసినందుకు పశ్చాత్తాప పడి అవి పునరావృత్తముకానట్లు జాగ్రత్త వహించవలెను. ఇట్లు ప్రతిరోజు

రాత్రిపూట తాను చేసిన పనులు, సంకల్పములు, మాటలు ఒకసారి సింహావలోకనము చేసుకొనుట ఒకచక్కనిఅలవాటు. మానవులలో పరస్పరము ఒకరినొకరు సరిగా అర్థము చేసుకొని ప్రవర్తించక పోవుటచే, ఇతరులమాటలను, చర్యలను త్వరపడిఅపార్థము చేసుకొనుటచే విభేదములు పొసగుచున్నవి. ఈ అపార్థము చేసుకొనుటఅన్నది తొందరబాటుతో, అలసత్వముతో, అజ్ఞానముతో కూడిన చర్య. విజ్ఞులైనవారు సహనము నవలంబించి, ఇతరుల మాటలను, చర్యలను చక్కగా అర్థముచేసుకొన్ననాడు అపార్థములకూ, కలతలకూ, ఉద్రేకములకూ తావుండదు. మానవుడు ఎదుటి వారిని విమర్శించుటకు ముందు తన్నుతాను విమర్శించుకొనుట మంచిది. తమలోని దోషములే ఇతరులలో కనిపించునన్న సత్యమునుగ్రహించి, ఆ దోషములను ప్రతివ్యక్తి సరిదిద్దుకొనుట ఉత్తమమైన ప్రవర్తన.

## ఐదు కలలు

బుద్ధుడగుటకు ముందురాత్రి సిద్ధార్థునకు అయిదు కలలువచ్చెను. ఆ దినము తనకు తప్పక జ్ఞానోదయము కాగలదని విశ్వసించెను. అట్లే జరిగెను. ఆ అయిదు కల లివి. మొదటికల. పెద్దపాన్పు. హిమాలయ ముతలగడగా ఉండెను. తూర్పు సముద్రంలో ఆయన ఎడమచెయ్యి ఉంచబడెను. కుడి చేయి పడమటి సముద్రంలో ఉంచబడి ఉండెను. దీనికి ఆయన పొందిన పరిపూర్ణ జ్ఞానమని అర్థము. రెండవకల అతని చేతిలోనుండి 'తిరియ' అనే వృక్షంపుట్టి ఆకాశానికి ఎగబ్రాకింది. అదే అష్టాంగ మార్గము. మూడవకల. నల్లని తలలుగల తెల్లని పురుగులు ఆయనమోకాళ్ళ వరకుప్రాకి ఆ ప్రాంతములను కప్పివేసెను. అపురుగులే తెల్లని వస్త్రములు ధరించి తథాగతుని ఆశ్రయించిన గృహస్థులు. నాలుగవకల. నాలుగువర్ణములుగల పక్షులు నాల్గు వైపుల నుండివచ్చి, ఆయన పాదములపై వాలి తెల్లని పక్షులుగామారిపోయెను. ఈ పక్షులు తథాగతుని ధర్మోపదేశములు విని మోక్షముపొందిన చాతుర్వర్ణముల వారైన గృహస్థులు. ఐదవకల. పెంటకుప్పపై మాలిన్యమునంటుకొనకుండా ఆయననడుచుచుండెను. అందరినుండి అవసరమైనవస్తువులనుగ్రహించి, వాటిపైఎట్టిమమకారములేక అనుభవించెడి తథాగతు డతడే!

# ఇరవది యొకటవ అధ్యాయము

## (ప్రకృతి యోగము)

**శ్రీ నాగార్జున ఉవాచ :**

భిక్షులారా! మనశరీరము ప్రకృతితో ఏర్పడినది. నిర్వాణము సాధించ గోరువారు దివ్యప్రకృతిని ఉత్తమ ప్రవర్తన ద్వారా పొందవలసి ఉన్నది. మానవుడి హృదయము కరుణా పూరితముకావలెను. బుద్ధభగవానుడు ప్రజ్ఞ కంటే శీలానికీ, శీలాని కంటే కరుణకు కరుణకంటే మైత్రికి అత్యున్నత స్థాన మిచ్చాడు. మైత్రియే మిన్నయని బోధించే ధర్మమే సద్ధర్మమని మనం గ్రహించాలి. మన ప్రకృతిని సరిదిద్దుకొని, మనం ధర్మపథంలో పయనిం చాలి. ఈ విషయం మీకు అర్థం కావటానికి బుద్ధుని జీవితంలో జరిగిన సంఘటన వివరిస్తాను. వినండి!

తథాగతుడు శ్రావస్తిలో ఉంటున్నప్పుడు మైత్రినిగూర్చి భిక్షువులకు బోధిస్తూ ఇలా అన్నాడు. "మానవుడు భూమిని తవ్వుతుంటే అది వద్దని అడ్డపడుతుందా?". లేదని భిక్షువులు సమాధానమిచ్చారు." ఎవరన్నా గాలిలో బొమ్మలు వేయాలనుకొంటాడనుకోండి! అదివీలవుతుందా?" మళ్ళీ అడిగాడు. ''సాధ్యంకాదుభగవాన్!" అన్నారు భిక్షులు. "ఎవరన్నా గంగానదిని మండు తున్న కొరివితో తగుల బెట్టాలనుకొంటే సాధ్యమౌతుందా? "మళ్ళీ అడిగాడు బుద్ధుడు. ''సాధ్యంకా"దని చెప్పారు వాళ్ళు. అప్పుడాయన "నేలను తవ్వితే అదిబాధపడుతూ రోదించనట్లూ, గాలిలో చిత్రలేఖనం సాధ్యంకానట్లూ, గంగానదిని తగులబెట్టలేమనట్లూ భిక్షువులుకూడా అవమానాలనూ, అన్యాయా లనూసహించి, హానితలపెట్టేవాళ్ళపైకూడా మైత్రీభావాన్నే చూపాలి. ఎలాంటి అవాంచనీయ సంఘటనలు మీమనస్సును చలింపచేయరాదు. ఇట్లా చేస్తే మీకు అపకారం తలపెట్టిన వాళ్ళుకూడా వాళ్ళ మనస్సు మార్చుకొని స్నేహి తుల్లాగా మారిపోతారు. మనతో ఒక్క కరుణ మాత్రమే ఉంటే సరిపోదు. దానికితోడు మైత్రిభావంకూడా చాలా అవసరం" అని చెప్పాడు. ఆ తర్వాత ఒక కథ ఇట్లావాళ్ళకు చెప్పాడు.

ఒకప్పుడు శ్రావస్తిలో వైదేశిక అనే ఒక స్త్రీ ఉండేది. ఆమె చాలా

మంచిదనీ, నెమ్మదస్తురాలనీ, ఎంతో వినయవతనీ పేరుండేది. ఆమెకు వచ్చ ధర్కి అనే పనిపిల్ల ఉండేది. ఆ పిల్ల చాలా చురుకైంది. పెందలాడే నిద్ర లేచి తన పనులు తానుచేసుకొంటూ ఉండేది. ఒకరోజు ఆమె "మాయజమాను రాలికి నెమ్మదస్తురాలనే పేరుందికదా! పరీక్షించిచూద్దాం" అనుకొంది. మరు నాడు కాస్త ఆలస్యంగా నిద్రలేచింది. యజమానురాలు కోపించి 'ఏమిటీ? ఇంత ఆలస్యంగా నిద్రలేచావ్?" అనిఅడిగింది. "ఏంలేదమ్మా! మెళకువరాలే' దంది పనిపిల్ల "ఓహో! మా యజమానురాలికి కోపం ఉందన్నమాట! కానీ అట్లా కనిపించదు. నేనుపని సక్రమంగా చేసుకొంటూ పోతుంటే ఆమెకు కోపంరాదు. ఇంకా ప్రయత్నించి చూద్దాం" అనుకొని ఆరోజు మరింత ఆల స్యంగా లేచింది. యజమానురాలికి మరికాస్త కోపంవచ్చి అరిచింది. ఆ దాసీ పిల్ల ఏమీ మాట్లాడకుండా మరునాడు మరికాస ఆలస్యంగా లేచింది. యజమానురాలు ఇహ ఆగలేక పోయింది. కోపంతో ఆ దాసీదాన్ని రక్తం కారేట్లు చావబాదింది. అప్పుడా పరిచారిక గొంతెత్తి "చూడండమ్మా! ఈవిడ నెంతో సౌమ్యురాలని మీరంతా అంటూ ఉంటారు. ఎంతో నెమ్మదస్తురా లంటారు. ఏదో వొంట్లోబాగుండక బద్ధకంవేసి రవ్వంత ఆలస్యంగాలేచా నని ఎట్లా నాతల పగులగొట్టిందో చూడండి!" అని పొరుగు వాళ్ళకు చూపిం చసాగింది ఆరోజు నుంచి ఎంతోసౌమ్యురాలని పేరుగాంచిన ఆ యజ మానురాలు "వట్టిదుడుకు మనిషి" అనే పేరుపొందింది. ఇదే విధంగా భిక్షు వైనవాడుఎంతో నెమ్మదస్తుడు కావచ్చు. కానీ ఏవైనాఅవాంఛనీయ పరిస్థితు లేర్పడినప్పుడు, తననుగూర్చి చెడుగా చెప్పుకొంటుంటే అది తనలోని మైత్రీ భావానికీ, సోదరత్వానికీ పరిక్ష అనిగ్రహించాలి. కేవలం తిండి కోసమో, బట్టలకోసమో మైత్రీభావం కలిగి ఉంటే అది నిజమైన మైత్రీభావంకాదు. నిస్వార్థంగా, నిత్యం సంపూర్ణ విశ్వాసంతో సాధించే మైత్రీభావమే "మైత్రీ భావం" అనిపించు కొంటుంది. భిక్షులారా! బుద్ధభగవానుని ప్రబోధం విన్నారు గదా! పుణ్యం సాధించేందుకు మీరెన్నిప్రయత్నాలు చేసినా ప్రేమ, పూర్వక మైన కరుణతోఅవేవీ సమానంకావు. ప్రేమపూరితమైన కరుణయే హృదయ స్వేచ్ఛ. అది మీ హృదంతరాళాల్లో ఉండి ప్రకాశించాలి.

శ్రీబుద్ధ భగవాన్ ఉవాచ ;

1. దివ్యప్రకృతి 2. దుష్టప్రకృతి 3. ఉత్తమ ప్రకృతి 4. హీన ప్రకృతి 5. వ్యక్త ప్రకృతి, 6. అవ్యక్తప్రకృతి 7. చలప్రకృతి 8. జడ ప్రకృతి అని ప్రకృతిఎనిమిది విధములుగానున్నది. దివ్యప్రకృతి అనగాపవిత్ర ముగా భావించు ప్రకృతి. శరీరములు ప్రకృతితో ఏర్పడినవి. ఏ శరీరము దివ్యత్వము పొంది పూజనీయముగా నున్నదో ఆ శరీరము యొక్క ప్రకృతి దివ్యప్రకృతిగా చెప్పబడుచున్నది. దైవ తేజస్సుయొక్క అంశమున జన్మిం చిన వారి శరీరములును, ధర్మోపదేశముచేసి, సంఘమును సంస్కరించి, లోకమును ఉద్ధరించు వారి శరీరముల ప్రకృతియును దివ్యప్రకృతిగా చెప్ప బడుచున్నది.

చెట్లయందు కొన్ని చెట్లను దైవ భావనతో ఆరాధించుచుందురు. కొన్ని చెట్ల ప్రకృతియందు దైవభావన యుండుటచేత ఆచెట్లుదివ్యప్రకృతియన బడుచున్నవి. రావి చెట్టును అశ్వత్థ నారాయణ వృక్షమని ఆరాధించు చున్నారు. తులసిచెట్టును పూజచేయుచున్నారు. ఔషధవృక్షముల, మొక్కలు వేరులు, ఆకులు, కాయలు వ్యాధులను నివారణచేసి, బాధలను తొలగించి, సుఖమును, సంతోషమును కలిగించుచున్నవి. కనుక అవి దివ్య ప్రకృతిగా చెప్పబడుచున్నవి. సంజీవియను వృక్షము మరణించిన వానిని బ్రతికించు చున్నధి. సంఘమునకు మహోపకారము చేయుచున్నది. అందువలన ఆ చెట్టు ప్రకృతి దివ్యప్రకృతిగా చెప్పబడు చున్నవి.

క్షేత్రములందు కొన్ని క్షేత్రములు దివ్యక్షేత్రములుగా చెప్పబడు చున్నవి. నదులు ప్రవహించుచున్నవి. ఒక్కొక్క భూమియందు ఒక్కొక్క ప్రత్యేకత యున్నది. గంగానది హిమాలయ పర్వతములందు పుట్టి ప్రవ హించి సముద్రమున కలయు చున్నది. కాని కాశి ప్రయాగల దగ్గర దానికొక ప్రత్యేకత యున్నది. నీరు ఒకటేకాని క్షేత్ర ప్రభావమువల్ల దైవభావన కలుగుచున్నది. అందువలన ఆ భూమి దైవ ప్రకృతి అనబడుచున్నది. పుణ్యక్షేత్రములన్నియు దివ్య ప్రకృతి భూములుగా చెప్పబడు చున్నవి.

దుష్టప్రకృతిగల మానవులు దొంగలు, హంతకులు, వ్యభిచారులు, సంఘ ద్రోహులు లోక కంటకులుగా ఉన్నారు. వారి శరీరముల ప్రకృతియే దుష్ట ప్రకృతిగా చెప్పబడుచున్నది, శరీరము మూడు పదార్థములతో పరివర్తన చెందు చున్నది. పైకి ఆకారముగ కనిపించునది ప్రకృతితో యేర్పడిన శరీరము. శరీరమునకుఅంతర్భాగమున నుండి, చైతన్యమునిచ్చి, పనులు చేయు శక్తి జీవుడు. సాక్షిశక్తి ఆత్మ. జీవుని యందు, ఆత్మయందు దుష్టత్వం, దివ్యత్వ వ్యత్యాసములులేవు. వ్యత్యాసములన్నియు శరీరములకే క్రూరమృగములున్నవి. అవి ప్రాణులకు అపకారము చేయుటయేగాని ఏ ప్రాణికి ఉపకారము చేయవు. వాటి శరీరము ప్రకృతితో యేర్పడినదే. ఆ శరీరముల ప్రకృతి దుష్ట ప్రకృతి అనబడుచున్నది. ఇట్లు ఇతర ప్రాణులకు హాని, అపకారము చేయు ప్రాణుల శరీరము లన్నియు దుష్ట ప్రకృతిగా చెప్ప బడుచున్నవి.

మానవులందు కొందరు సత్వగుణ ప్రధానులై తమస్వధర్మము తాము నేరవేర్చుకొనుచు, పరులకు ఉపకారము చేయుచు, సంఘమునకు ఉపకారము చేయుచుందురు. ఉన్నతాధి కారులుగ ప్రజలచేత గౌరవసన్మానములు పొందుచు ధర్మప్రవర్తన గలిగి, ప్రజలకు ఉపకారము చేయుచు, "దేవుడున్నా"డను పరిపూర్ణ విశ్వాసము గలిగి, అధర్మప్రవర్తన లేక, పంచశీలములను అనుసరించుచు "ఉత్తము"లని ప్రజలచేత సన్మానముల పొందువారి శరీరములు ఉత్తమ ప్రకృతియని చెప్పబడుచున్నవి.

చెట్లయందు మంచిరుచిగల ఫలములను ఇచ్చుచెట్లు, మంచి సువాసన గల పూలచెట్లు, ప్రయాణ మార్గము లందు ప్రయాణీకులకు చల్లని నీడనిచ్చు చెట్లు ఉత్తమ ప్రకృతిగ చెప్పబడుచున్నవి. పండ్లయందు మానవులు ఆ పండునందు ఉత్తమ ప్రకృతిని తీసుకుని హీన ప్రకృతిని పారవేయుచున్నారు అరటి పండునందు తొక్కలోపలిభాగము రుచిగా, మధురముగానుండును. దానిని తీసికొని దానిపై చర్మమును తీసి పారవేయుదురు. పండు ఉత్తమ ప్రకృతి, చర్మము హీన ప్రకృతిగ చెప్పబడుచున్నది.

పదార్థములు కొన్ని ఉత్తమ ప్రకృతిగా నున్నవి హీనప్రకృతిగామారు చున్నవి. మానవులు ఆహారము తినునపుడు అదిఉత్తమ ప్రకృతిగా ఉండి,

గర్భములో జీర్ణమైన తర్వాత కొంత ఉత్తమ ప్రకృతిగా రక్తశుక్లములై శరీరమును పెంచుచున్నది. మరొక శరీరమును సృష్టించుచున్నది. కొంత భాగము హీనప్రకృతిగా,మలమూత్రములుగా, విసర్జింప బడుచున్నది. విస్తరిని భోజనం చేసిన తర్వాత హీనప్రకృతిగా బయట పారవేయుచున్నారు.

శరీరములు దివ్యప్రకృతి, ఉత్తమ ప్రకృతిగా నున్నను ప్రాణము పోయిన తర్వాత హీనప్రకృతిగా పరిణమించి, ఇంటిలో నుంచి తొలగించు చున్నారు. శబ్దస్పర్శరూప రసగంధములందు దైవ తత్వము, ధర్మమును గురించిన శబ్దస్వరూప రసగంధములందు దైవ తత్వము, ధర్మమును గురించిన శబ్దములు, శాస్త్రసతనము, ప్రబోధము ఉత్తమ ప్రకృతి. స్పర్శయందు దైవ భావనతో పాదములు తాకుట, శిరస్సుపై హస్తముంచి ఆశీర్వదించుట, వృద్ధులను, వ్యాధిగ్రస్థులను పరోపకార భావనతో తాకిపట్టుకొని తీసుకొని పోవుట ఉత్తమ ప్రకృతి. స్త్రీలను దుష్టసంకల్పముతో తాకుట, కొట్టుట, ఇతరుల వస్తువులు దౌర్జన్యముగ తీసి కొనుట మొదలైనవి హీన ప్రకృతిగ చెప్పబడుచున్నవి. శబ్ద స్పర్శ రూపరస గంధములందును ఉత్తమ హీన ప్రకృతులున్నవి.

రూపమును చూచి ఇతరుల సుఖమును చూచి సంతోషించుట ఉత్తమ ప్రకృతి. ఇతరుల మేలు సంహిచికొనలేక అసూయ కలుగుట, స్త్రీల అవయవములను చూచికామించుట హీనప్రకృతి.

రుచినాలుక అనుభవించుచున్నది. మధురమైన పదార్థములు,పండ్లు, ఆహారమునందు ఉత్తమ ప్రకృతి. ఆయువును పెంచునది, సత్వగుణము నిచ్చునది, ఆరోగ్యమును యిచ్చునదియైనరుచిగల ఆహారము ఉత్తమ ప్రకృతి, మిక్కిలి పుల్లగానుండు మత్తుపదార్థములు, మిక్కిలికారముగాఉండిఆరోగ్యమునకు భంగము కలిగించు వానిరుచిని కోరుట, హింసా స్వరూపమైన మాంసము రుచి కోరుట, అందులో ఆరోగ్యమునకు భంగము కలిగించు పదార్థములను కలుపుట, పొగత్రాగుట హీన ప్రకృతిగా చెప్పబడుచున్నది.

పుష్పములనుండియు, గంధము మొదలగుచెట్ల నుండియు సువాసన వెలుపడును. కొన్నిసుగంధద్రవ్యములున్నవి. ఆహారపదార్థములందు సుగంధ

ద్రవ్యాలు రుచిని, సువాసనను, జీర్ణతత్వమును కలిగిస్తవి. దైవారాధన యందు సుగంధ పుష్పములను, అలంకారము నందు సుగంధములను ఉపయోగిస్తారు. ఇది ఉత్తమ ప్రకృతి. ఏదేని జంతువు మరణించినపుడు దుర్గంధము బయలు దేరును. అది ఆరోగ్యమును భంగము చేయును. బాధను కలుగజేయును. మానవుల శరీరము నందు కురుపులు లేచినపుడు అది దుర్గంధము నిచ్చుచున్నవి. ఇవి హీన ప్రకృతిగ చెప్పబడుచున్నవి.

ప్రకృతి యందు వ్యక్తప్రకృతి, అవ్యక్తప్రకృతి-అనగా, కంటికి కనుపించు ప్రకృతి, కనుపించని ప్రకృతి అని రెండు విధములుగలవు అంతఃకరణ" మని చెప్పబడు మనసు, బుద్ధి, తెలివి అహంకారము కంటికి కనుపించుట లేదు. మనసు, బుద్ధి యే ఆకారముతో నున్నది? ఏ రంగుతో నున్నది? తెలియుటలేదు, కాని ఉన్నది. వాటిచర్యలు గోచర మగుచున్నవి. అందువలన అవ్యక్తప్రకృతి అనబడుచున్నది. జీవుడు అవ్యక్తం. కనిపించుటలేదు. ఉన్నాడని ప్రమాణము నిరూపణ అగుచున్నది. కనిపించు శరీరమునకు చైతన్యశక్తి లేదు. కనుపించని జీవుడు చైతన్యమును ఇచ్చుచున్నాడు. కాని జీవుడు ప్రకృతికాదు. దైవాంశవలన ఏర్పడినవాడు. "దైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" దేవుని అంశస్థుడైన జీవుడు కనిపించుటలేదు. అదే విధముగ ప్రకృతియందు మనసు, బుద్ధి, తెలివి, అహంకార ములు కనుపించుట లేదు. కార్యములు వాని వలననే జరుగుచున్నవి. అందువలన వానిని "అవ్యక్తప్రకృతి" అనుచున్నారు.

వ్యక్త ప్రకృతి అనగా కనుపించు ప్రకృతి, శరీరము నందలి కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, తినెడి ఆహారము, పంచభూతములు, భూమి, జలము, అగ్ని,వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు చెట్లు, పర్వతములు, పక్షులు, జంతువులు, మృగములు, లోహములు, లోహములతో తయారుచేసిన వస్తువులు, చెట్ల నుంచి వెలువడిన కర్రలతో చేసిన వస్తువులు, పత్తితో తయారైన బట్టలు, రాయితోతయారైన వస్తువులు,

విగ్రహములు, మట్టితో తయారైన పాత్రలు, బొమ్మలు, నిర్మించు భవనములు, ఆభరణములు మొదలగు వస్తువులన్నియు వ్యక్తప్రకృతి.

ఇంద్రియములకు గోచరమగు శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు వాని వలన గలుగు కామ క్రోధలోభమోహమద మత్సరములు, మరియు, త్రిగుణముల వలననే ఈ జగత్తు పరివర్తన చెందుచున్నది. వేదములు ఈ గుణ తత్వములనే ప్రతిపాదించుచున్నది. అందు వలన వేదములు చదువరాదు. వేదములను ఆశ్రయించరాదు. శబ్ద, స్పర్శ, రూపరస గంధములందు సాత్విక శబ్దము, రాజశ శబ్దము, తామసశబ్దము లున్నవి. అదే విధముగ తదితర పంచతన్మాత్రలయందుగల గుణములును, మానవుడు అనుభవించు సుఖదుఃఖములును విషయ వాసనలును ప్రకృతి వికారములే.

విషయవాసనలు పాపకార్యములుగ పరిణమించి జీవుని కర్మబద్ధుని చేయుచున్నవి. ఇంద్రియ విషయ వాసనను చింతించు మానవునకు వాని మీద ఆసక్తి కలుగ చున్నది. ఆసక్తి కోరికగా మారుచున్నది. ఆ కోరిక నెరవెరనియెడల అది కోపముగా మారుచున్నది. కోపమువలన ధర్మమును మరచిపోవుట జరుగును. ధర్మమును మరచిన బుద్ధినశించును. బుద్ధినశించిన, బుద్ధి లేని పని చేసి చెడిపోవుదురు పాపపు పనులుచేసి జీవుని కర్మబద్ధుని చేయుచున్నారు ఒక గ్రామమున ఒకకూలివాడుకలడు భార్య ప్రక్కయింటి శ్రీమంతుని భార్యధరించిన పట్టుచీరను చూచి అలాంటి పట్టుచీర తీసుకు రమ్మని భర్తను కోరింది. భర్త "నాకు అంత శక్తిలే"దని తెచ్చుటకు తిరస్కరించాడు. తన కోరిక నెరవేరనందుకు అమెకు కోపము వచ్చింది. కోపము వలన బుద్ధినశించి, తన స్వధర్మమైన వంటచేయకఅలిగి కూర్చుంది. శ్రమపడినకూలివాడు ఆకలితో ఇంటికివచ్చి అన్నము పెట్టమని భార్యను అడిగాడు. భార్య కోపముతో"నాకు పట్టుచీరతేలేదు గనుక నేను వంటచేయను" అనితీవ్రముగ సమాధానముచెప్పింది. కూలివానిఆకలిమంటకు కోపంతోడై భార్య వీపుపగులగొట్టాడు. ఆమె చేయునది లేక ఏడుస్తూ వంట

చేసి వడించింది. మరొక కూలివాడు భార్య కోరిక తీర్చుటకు దొంగ తనముచేసి పాపమును పొందాడు. ఇది ప్రకృతి పరివర్తనము. ఒక చిన్న విషయ వాసన నిగ్రహించుకొను శక్తి లేక మానవులు విషయవాసనకు బానిసలై కష్టములకు, పాపములకు బలియగుచున్నారు.

వేదములయందలి అర్థవాదవాక్యములచే నాకర్షింవబడినవారై విషయ భోగములందు, స్వర్గాది సుఖములందు ఆసక్తులై, ఆత్మజ్ఞాన శూన్యులై, అవివేకులై, విషయ సుఖముల కంటె శ్రేష్ఠమైనవి మరొకటి లేవని, జన్మ కర్మలను, విషయ సుఖములను, ప్రతిపాదించు వేదముల ప్రతిపాదిత వివిధ కర్మ కలాపములను, హింసాస్వరూపమైనయజ్ఞయాగాదులను నిర్వహించుచున్నారు ఇవి వాసనలేని మోదుగపువ్వులాంటివి. అవిచూచుటకు అందముగ ఉంటవి, సువాసన ఉండదు. వేదములయందు ఆసక్తిగల వారి బుద్ధి అస్థిరమై. చంచలమై ఉన్నందునమోక్షమార్గమైన యోగమునందు నిశ్చలముగా స్థిరముగ నిలువజాలదు ఆత్మజ్ఞానభావన కలుగనే కలుగదు. ప్రకృతి ప్రవృత్తి మార్గమున తనభావనలందు, తనభార్యపుత్రుల భోగైశ్వర్య మమకార భ్రాంతులందు బద్ధమై, బంగారు సంకెళ్ళచేత జీవుని కర్మ బద్ధుని చేయుచున్నది. అందువలన త్రిగుణాత్మకమైన వేదములయందు వాంఛలను వదలి, త్రిగుణాతీతమైన ఆత్మజ్ఞానమును పొంది, యోగసాధన చేతపరమశాంతిని, సచ్చిదా. నందమును, అమృతత్వమును, దివ్యతేజస్సును పొంది, పరంధామను చేర వలెను.

ప్రకృతికి స్వేచ్ఛ పనికిరాదు. బుద్ధికూడా ప్రకృతికనుక బుద్ధిని నియమ బద్ధముగ నుంచవలయును. అందుకే బుద్ధిని "వ్యవసాయాత్మక బుద్ధి" అంటారు. అనగా వ్యవసాయదారుడు నీటిని క్రమబద్ధముగా కాలువయందు నీరు నడిపినపుడే పంటపండును. అందుచేత బుద్ధిని అనేక శాఖలుగా పోనీయక, నిశ్చయాత్మకముగా నుంచవలయును. నిశ్చయాత్మకములేని బుద్ధి యోగము నందు నిలువదు. అందువలన ప్రకృతి స్వరూపమైన దేహేంద్రియములను స్వాధీనమునందుంచుకొని, చంచలతత్వము గలమనస్సును ఏకాగ్రత

చేసి, ప్రకృతి గుణములైన కామ క్రోధలోభ మోహ మదమాత్సర్యములు లేక సుఖ,భోగైశ్వర్యములను, కోరక, వైరాగ్యమును, నిగ్రహశక్తిని, భద్ర పరచు కొనవలయును. అప్పుడే ప్రకృతి మార్గము నుండి నివృత్తి మార్గము నకు రాగలదు.

చలన(చర)ప్రకృతి అచల(అచర)ప్రకృతిఅనిప్రకృతిరెండువిధములుగనున్నది. వానిని స్థావరములు, జంగమములుఅంటారు. ప్రాణము ఉండియును కదలక యుండు ప్రకృతిచెట్లు. చెట్లకు ప్రాణమున్నది. కాని కదలవు. పర్వతములు కదలవు. వాటిని స్థావరములు అంటారు. ప్రాణముండి కదలెడి శక్తిగల మానవులు, జంతువులు, పక్షులు తదితరప్రాణులన్నియు చలనప్రకృతి. వీటిని జంగమములు అంటారు. కొన్ని భూతముల కలయికవలన కలిగిన శక్తిచేత యంత్రములు కదలుచున్నవి. యంత్రములు ఆకసమున యెగిరెడి శక్తిని కూడా కలిగి యుంటున్నవి. అనేకవిధములైనకార్యములనునెరవేర్చుచున్నవి. ఇవిచలనప్రకృతి. చలనప్రకృతివలన అనేకయంత్రములుఅనేకకార్యములను నిర్వ హించుట కలదు. పంచభూతములలోని ఒకభూతముతో మరియొక భూతము కలియుటచేత ఈ చలన శక్తి కలుగుచున్నది. నీరు వాయువు కలసినపుడు చలనశక్తి కలుగు చున్నది.

ప్రకృతిశక్తి, శరీర శక్తి, యంత్రశక్తి అను మూడు విధములైన శక్తులచేత లోకము పరివర్తన చెందుచున్నది. భూమి యందలి ఆకర్షణ శక్తి ప్రాణులను ధరించుచున్నది. అగ్నియందలి ఆకర్షణ శక్తి ఆకసము నకు ఆకర్షించుచున్నది. సూర్యుడు అగ్ని అంశము కనుక పొగ, ఆవిరి. సూర్యుని ఆకర్షణశక్తిచేత పైకి పోవుచున్నవి. ఆవిరి ఆకసమున ఘనీభ వించి, చల్లనిగాలి తగిలినపుడు వర్షముగా భూమిని చేరుచున్నది. వర్షమునకు కారణము ప్రకృతి వలన ఉద్భవించిన సూర్యుడే కానిదేవుడు కాదు. "దేవుని పేరుతో యజ్ఞములు చేసిన వర్షములు కురియును" అని కొందరు చెప్పు చున్నారు. అది పచ్చి అబద్ధము. ప్రకృతి పరివర్తన వలననే వర్షము కురియుచున్నది. పంటలు పండుచున్నవి. పంచభూతములందు కొన్ని శక్తులు ఉద్భవించి జగత్తు పరివర్తన చెందుచున్నది.

సూర్యుని ఆకర్షణ శక్తివలన సముద్రములందు నీరు, నదులు చెరువులు సరస్సులు తదితర జలాంశయములందలి నీరు ఆవిరిగ ఆకసమున చేరి మేఘముగా ఎర్పడు చున్నది. దానికి చల్లనిగాలి తగిలినపుడు వర్షముగ భూమిని చేరుచున్నది. దాని వలన పంటలు పండుచున్నవి. పంటలవలన ఆహారము ఉద్భవించుచున్నది. ఆహారము వలన శరీరములు పెరుగుచున్నవి. శరీరములందు రక్తము కలుగుచున్నది. స్త్రీశోణితము, పురుషుని శుక్లము కలిసినపుడు జీవునిఆకర్షించిప్రకృతి స్వరూపమైన శుక్లము పరమాత్మ అంశుడుతైన జీవుడు కలిసికొని ప్రాణుల సృష్టి యేర్పడుచున్నది. సృష్టికి ప్రకృతి జీవుడు కారణముగాని దేవుడుకాదు. దేవుడు సర్వమునకు శక్తి. సర్వమునకు ఆధారము. కర్త కాదు.

ఆధారము, కారణముల వ్యత్యాసమును తెలిసికొనవలయును. అన్ని పంటలకును భూమి ఆధారముగా నున్నది. భూమి లేనిదే యే పంటయు పండదు. పండించు పంటకు భూమికి సంబంధములేదు. రైతు బుద్ధికి తోచిన పంట పండించును. దానికి తగునీరు, ఎరువులువేసి, చెడుమొక్కలు తీసివేసిచేసే తదితర కృషియంతయు రైతుపై నాధారపడియున్నది. అదే విధముగ సర్వమునకు ఆధారము దైవశక్తి. కార్యములకు కారణము ప్రకృతి. "కార్యకారణకర్తుత్వే హేతు ప్రకృతిరుచ్యతే" కార్యకారణము దేవుడు కాదు. "అన్నాద్భవంతిభూతానిపర్జన్యాదన్నసంభవంసూర్యాద్భవంతిపర్జన్యఃసూర్యః ప్రకృతి సంభవం"ఆహారమువలనప్రాణులు, వర్షమువలనఆహారము,సూర్యుని వలన వర్షము, ప్రకృతి వలన సూర్యుడు, పంచబూతములందు అగ్ని అంశమున సూర్యుడు ఏర్పడెను.

పంచభూతములందును ఆకర్షణ శక్తియున్నది. భూమి యందలి ఆకర్షణశక్తి ప్రాణులను ధరించుచున్నది. నీటియందలి ఆకర్షణ శక్తిసముద్రములను నియమ బద్ధముగ నుంచుచున్నది. ఒక సముద్రము మరొక సముద్రమునకు కొన్నివేల అడుగుల ఎత్తులో నున్నది. కాని యెక్కడ సముద్రము

అక్కడే యుంటున్నది. ఇది నీటిలోని ఆకర్షణ శక్తి ప్రభావము. అగ్నిలోని ఆకర్షణ శక్తి ఆవిరినిపైకి తీసికొని వర్షమునకు కారణమగుచున్నది. వాయువు నందలి ఆకర్షణ శక్తి పుష్పములందలి సువాసనను ఆకర్షించి మరొకచోటు నకు అందచేయుచున్నది. ఆకాశమునందలి ఆకర్షణశక్తి జీవుని ఆకసము నకు నక్షత్రమండలంవరకు ఆకర్షించుచున్నది. మనసుతోకూడిన ఆరుఇంద్రియ ములు జీవుని ఆకర్షించి శరీరములందు బంధించుచున్నవి.

సూర్యుడు,చంద్రుడు, నక్షత్రములు ఆకసమునకు మధ్య అంతరిక్ష మున నిలిచితమ దివ్యశక్తులను భూమికి ఇచ్చుచున్నవి. ఇవి పరమాత్మ ఆకర్షణ శక్తివలన నిలచియున్నవి. పరమాత్మశక్తిలేక యేదియు కొంచమైనను లేదు. హారమునందు మణులనుకూర్చియున్న విధముగా అనగా హారమునందు ఆధారమైనదారముకనుపించదు.కనిపించేమణులు,హారములేనిదేనిలువలేవుఅదే విధముగాకనుపించని పరమాత్మ ఆకర్షణశక్తి, కనుపించే ప్రకృతిసర్వవస్తువు లకు ఆధారముగ నున్నది. సర్వమునకు ఆధారము పరమాత్మ ఆకర్షణ శక్తి తేజశ్శక్తి అనితెలియవలయును. సూర్యుని యందుతేజస్సు. చంద్ర, నక్షత్ర, అగ్నులయందలి తేజస్సు పరమాత్మగానే తెలసికొనవలెను. పరమాత్మ ఆధా రముతో ప్రకృతి ఆకర్షణ శక్తులవలన జగత్తు పరివర్తన చెందుచున్నది. దేవుడు చేయుకర్మయేదియును లేదు. "నకర్తృత్వం కర్మాణి" దేవుడు చేయు కర్మయేదియులేదు, ప్రకృతి జీవునివలన సకల ప్రాణులు పరివర్తన చెందు చున్నవి. కార్యములకు కారణం ప్రకృతి.



# ఇరువదిరెండవ అధ్యాయము

## (విజ్ఞాన యోగము)

### శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షులారా! మనం విజ్ఞానంతో మెలగాలి. ఏది మంచో అది చెయ్యాలి. సత్కార్యాన్ని గురించి "ఇదినావల్లకాదు" అని తేలికగా తోసిపారెయ్యరాదు. బొట్టుబొట్లుగా పడినజలంతోనే పాత్రనిండుతుంది. అట్లాగే కొద్దికొద్దిగామనం చేసేమంచితుదకు ఎంతగానో పెరుగుతుంది. చెడునన్నేంచేస్తుందని చులకనగా చూచిదానికిదాసోహమంటే క్రమక్రమంగా అదినిన్నేకబళించివేస్తుంది. పశ్చాత్తాపం కలిగించే పనులు చేయటం శ్రేయస్కరంగాదు. దాని ఫలితంగా కష్టాలు, కన్నీళ్ళు కలుగుతవి. బౌద్ధ జీవన విధానాన్నిక్షుణ్ణంగా గ్రహించి, ఆచరణలో పెట్టండి. అప్పుడేమీరు విజ్ఞానులనిపించుకొంటారు.

1) మంచిచెయ్యి-చెడుకుదూరంగా ఉండు. 2) కోరికలను దగ్గరకు రానీయకు, 3) ఎవరికి అపకారం తలపెట్టవద్దు 4) క్రోధాన్ని విసర్జించి, ప్రేమతోనే శత్రువులను జయించు 5)మంచిని అలవరచుకొనేట్లు నీమనస్సుకు శిక్షణ నివ్వు 6) అహాన్ని విసర్జించు 7) వివేకంగా, న్యాయంగా మసలుకో. మంచి సహవాసాన్నిఎన్నుకో. 8) ప్రతి విషయములోను ఆలోచనా పరుడివిగా ఉండు. అప్రమత్తతతో మెలగు. ఎల్లప్పుడూ ధైర్యంగా ఉండు. 9) దారిద్ర్యం దుఃఖానికి కారణమంటారు. కానీ దాని నివారణం నిజమైన సౌఖ్యాన్ని ఇవ్వదు. సంస్కార దారిద్ర్యమే నిజమైన దారిద్ర్యం. ఉన్నతమైన సంస్కారమే సౌఖ్యాన్నిస్తుంది. 10) అబద్ధం చెప్పకండి. చెప్పించకండి. పరిపూర్ణుడైన బుద్ధుడు ఏమి చెబుతాడో అది ఆచరిస్తాడు. ఏది ఆచరిస్తాడో దాన్ని చెబుతాడు. తాను చేసేది చెప్పి, చెప్పింది చేస్తాడు. 11) సన్మార్గాన్నే అనుసరించు. దుష్టపథాల్లో చరించకు. ఈ ఏ ఏకాదశ సూత్రాలను అనుసరించేవారే నిజమైన బౌద్ధులు. ప్రలోభమెంత వినాశానికి దారితీస్తుందో తథాగతుడొకసారి వివరించాడు. ఆ విషయం మీకు చెబుతాను, వినండి.

భగవానుడొకప్పుడు కురుదేశంలోని "కామసదమ్మ"లో బసచేశాడు.

పూజ్య ఆనందుడు ఒక రోజు ఆయన దగ్గరికిపోయి "ప్రతి దానికి కారణ ముంటితీరుతుందని జినుడు బోధించిన సిద్ధాంతం. అద్భుతమైంది. చాలాలోతైంది.అది నాకుబాగాఅర్థమైంది" అన్నాడు. "అలాఅనవద్దు. ఆసిద్ధాతాంన్ని పూర్తిగా అర్థంచేసుకోవటం చాలాకష్టం. దాన్ని సరిగ్గా అర్థం చేసుకోకపోవటం మూలాన్నే ఈ తరం దుఃఖాన్ని పోగొట్టుకో లేక పోతున్నది. ఆశే అన్ని దుఃఖాలకూ కారణం. ఆశలేకపోతే దుఃఖానికి ఏ ఆస్కారమైనా ఉంటుందా?"అనిఅడిగాడుబుద్ధుడు. ఆనందుడు"ఉండదు"అన్నాడు.ఆశవల్లనే లాభాపేక్ష కలుగుతుంది. దాని నుంచి కోరిక, మోహం, దానివల్ల సాధించాలనే పంతం కలుగుతుంది. ఆపంతం,"నాస్వంతం" అన్నభావానికి పునాది అవుతుంది. స్వంతమైనవి ఏర్పడిన తరువాత మరింత దురాశ, మరింత స్వార్థం పెరుగుతవి. స్వంతమైన వాటిని కాపాడు కోవటానికి జాగ్రత్తలు అవసరమౌతాయి. ఈ క్రమంలో ఎన్నో దుష్ట ప్రయత్నాలు, ప్రమాదాలు, అబద్ధాలు, ఘర్షణలు మొదలైనవి ఎదురౌతాయి. కార్యకారణ సంబంధమనేది ఇట్లా ఒకదానితో ఒకటి లంకెపడిఉంటుంది. ఆశలేకపోతే లాభంపొందాలని ఉండదు. లాభాపేక్ష లేకపోతే మోహం ఉండదు. మోహం ఏర్పడకపోతే పంతాలుండవు. స్వత ఆస్తులపై మమకారముండదు. మరింత ఆస్తి సంపాదించాలనేకోరికా ఉండదు. అంతేగదూ! ఆనందా?" అన్నాడు భగవానుడు. "అవునుప్రభూ!" ప్రత్యుత్తరమిచ్చాడు ఆనందుడు. "స్వంత ఆస్తులంటూ లేకపోతే మనస్సుప్రశాంతంగా ఉంటుందికదూ?" ప్రశ్నించాడు భగవానుడు. ఆనందుడు"ఔ"నన్నాడు. "ఈభూమిని నేనుభూమిగానే గుర్తిస్తాను. అదినాకు చెందాలన్న ఆశలేదు ఇట్లా ఆశలన్నింటినీ వదలినందువల్లనే నేను జ్ఞానోదయం పొందాను" అని భగవానుడు కూడబెట్టే వ్యసనంవల్ల కలిగే చెడును ఆనందునికి వివరించి చెప్పాడు. కాబట్టి ఆ పథంలో పయనించి మనంకూడా జ్ఞానులంగావాలి,

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

ప్రబుద్ధులారా! జ్ఞానమనునది అయిదు విధములుగా నున్నది. దివ్యజ్ఞానము ప్రకృతి తత్వ జ్ఞానము దానినే విజ్ఞానమని అంటారు. శాస్త్రజ్ఞానము

శాస్త్రములందుచెప్పబడియుండు ప్రమాణములను ధర్మములనుఅనుసరించుట. అనుభవ జ్ఞానము ఏ శాస్త్రమును చదువక, ఏ గురువులను ఆశ్రయించక తానుస్వయముగా సాధన చేసి కృషిచేసి పొందెడి జ్ఞానము. లౌకిక జ్ఞానము అనగా సంఘములో ఎట్లు ప్రవర్తించవలయును?. యెవరితో ఎటుల మర్యాదగా మాట్లాడవలయును ఎవరిని ఎటుల గౌరవించవలయును? ఏవరిని ఎటులదండించ వలయును?, అనుతత్వమును తెలిసికొని ప్రవర్తించుట. గృహస్థులకు ఈ అయిదు జ్ఞానములు ఉండవలయును.

దివ్యజ్ఞానము అనగా పరమాత్మతత్వము [సత్యమును] తెలిసికొనుట. లోకము రెండు విధములైన పదార్థములతో పరివర్తన చెందుచున్నది. ఒకటి సత్‌పదార్థము మరొకటి అసత్‌పదార్థము. ఒకటి అవ్యక్తము మరొకటి వ్యక్తము. పరమాత్మ సత్యము. పరమాత్మ తత్వమును తెలిసికొనుట అనునదే దివ్యత్వము. దేవుడు సత్పదార్థము. జీవుడు సత్పదార్థము. దేవుడు నశించువాడుకాదు. అక్షరుడు నిత్యుడు సర్వమునకు ఆధారభూతుడు, దివ్య తేజోమయుడు,సర్వమునకు సాక్షి,శక్తి,జననమరణములు లేనివాడు, సూక్ష్మాతి సూక్ష్మము, పరమాణువు, అచలుడు, [కదలికలేనివాడు], పరంధామకు [మోక్షస్థానమునకు] ఆధార భూతుడు, దివ్యశక్తి, సర్వవ్యాపకుడు.

జీవుడు సత్‌పదార్థము. నశించువాడుకాదు. శరీరమునుండి మరొక శరీరమునకు మారుచుండును. కష్ట సుఖములు అనుభవించుచుండును. పాపపుణ్యములుచేయునది దేహేంద్రియములు. అనుభవించునది అనుభవించి, భద్రపరచి, మరొకశరీరమునకు తీసికొనిపోయి, తదనుగుణ్యజన్మనెత్తి, సుఖ దుఃఖములను అనుభవించునది జీవుడు. జీవుడు, శరీరమునందు పదిఅవస్థలు అనుభవించును. మొదటస్త్రీ, పురుష శుక్లముల కలయిక, బిందు అవస్థ. తరువాత అవి ఘనీభవించి, బీజావస్థతరువాత చెట్టు వేరునుంచిఆహారమును, ఆకులనుంచి, పై భాగమునుంచి గాలితీసుకొను విధముగ మానవుడు నాభి నుంచి ఆహారమును, శిరస్సు నుంచి గాలినితీసుకొని వృక్షావస్థయందుండును. తల్లి గర్భము నుండి జన్మించిన తరువాత జంతుపులవలె మలమూత్రములలో

సంచరించును. అది జంతు అవస్థ. తర్వాత శుచిశుభ్రము తెలిసిన తర్వాత బాల్యావస్థ. తరువాత కౌమారము, యౌవనము. తరువాత పితావస్థ, ప్రపితావస్థ. తరువాత వృద్ధావస్థ. జీవుడు తొమ్మిది అవస్థలు అనుభవించి శరీరమును విడుచును. దానినే మరణావస్థయందురు. మరణావస్థ తరువాత మరలామరియొక తల్లిగర్భమున ప్రవేశించి, మరలాబిందుఅవస్థ ప్రారంభించును. మానవులు దివ్యజ్ఞానమును పొంది యోగసాధనము చేసిన జీవుడు స్వస్థానము అయిన పరంధామను చేరును. వానికి ఇక జన్మయుండదు. అదే మోక్ష స్థానము. జీవుడు చేరవలసిన స్థానము.

దివ్యజ్ఞానసాధకులు కొందరు దేవుడే జీవుడనియును, మాయతోకూడినపుడు జీవుడనియు, మాయరహితుడు దేవుడనియు, మోక్షమనగా దేవునిలో జీవుడు కలసిపోవుట అని చెప్పుదురు. అది అపార్ధము. దేవుడు జీవుడుకాదు. దేవుని అంశముగలవాడు అక్షరుడు. దేవుని అంశమున ఏర్పడినవాడు జీవుడు అతడుదేవుడుకాదు. జీవుడుదేవునిలో కలిసిపోయిన అచలమునకు భంగముకలుగును కనుక అదిసత్యముకాదు. దేవుడు జనన మరణములు లేనివాడు. తల్లి గర్భమున జన్మించువాడుకాదు. జీవుడు తల్లిగర్భమున జన్మించువాడు. సుఖదుఃఖములు అనుభవించువాడు. దేవుడు సుఖదుఃఖములకు అతీతుడు. కనుక జీవుడు దేవుడుకాదు.

విజ్ఞానము అనగా ప్రకృతి వస్తుతత్వజ్ఞానము. ముందు శరీరమును గురించి తెలుసుకొనవలయును. శరీరము ఇరువది నాలుగు తత్వములతో కూడి యున్నది. అయిదు పంచ భూతములు [భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము], అయిదు పంచతన్మాత్రలు [శబ్ద, స్పర్శ, రూపరసగంధములు], ఐదుజ్ఞానేంద్రియములు [చెవి కన్ను నాలుక, ముక్కు, చర్మము], కర్మేంద్రియములు అయిదు [కాళ్ళు, చేతులు, నోరు, పాయువు, ఉపస్థ], అంతఃకరణములు. నాలుగు[మనసు, బుద్ధి, తెలివి, అహంకారము] సంక్షిప్తముగ ఇరువదినాలుగు తత్వములు చెప్పబడుచున్నను విశేషించితొంబైయారు తత్వములుగలవు. జగత్తుఅంతయు మూడుగుణములచేత, పరివర్తన చెందు

చున్నది. "త్రిభిర్గుణమయైర్భావై రేభి సర్వ మిదం జగత్" సత్వరజస్త మోగుణముల వలననే ఈ జగత్తు పరివర్తనచెందుచున్నది.

అరిషడ్వర్గములు ఆరు. అవికామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్స ర్యములు. శమదమాదిషట్క సంపత్తిఆరు. పంచకోశములు అయిదు. అన్న మయకోశము, ప్రాణమయ కోశము, విజ్ఞానమయకోశము మనోమయకోశము శాంతిమయకోశము [దీనినే ఆనందమయ కోశమని అందురు]. అన్నమయ కోశమునమానవులుతినిన అన్నముజీర్ణమై రక్తముగను. మలమూత్రములుగను విభజింపబడును. ప్రాణమయ కోశము. ఇది ప్రాణశక్తివలన శరీరముచేత పనులు చేయించును. విజ్ఞానమయకోశము. జ్ఞానేంద్రియములు కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము, శబ్ద, స్పర్శ రూపరస గంధములనుతెలిసి కొనును. మనోమయ కోశము సంకల్ప వికల్పములను కలిగించును.

శాంతిమయకోశము :- దీనినిగురించి మానవులు బొత్తిగాతెలియకుండా జీవించుచున్నారు. మానవులు ఇంద్రియ సుఖములను, శరీరభోగములను అను భవించి తృప్తిపడుచున్నారు. ఇంద్రియసుఖములు దుఃఖములనుకల్పించును. ఆత్మానందము శాశ్వతమైన సుఖము ఈ ఆనందమయ కోశము, పరమశాంతి మనశరీరములో అంతర్భాగమున బుద్ధికి పైభాగమున ఉన్నది. ఆది యింద్రియములకు అతీతముగా ఉన్నది. దానిని శ్వాస తోనే పొందవలయును. సామాన్యముగా రెండు ముక్కులతో శ్వాసనడచు చున్నది. దానిని సూర్యనాడి, చంద్రనాడి మరియు ఇళ పింగళనాడి అం టారు. ఇవి రెండునుగాక సుషుమ్నానాడి కలదు. అది మూలాధారము నుంచి సహస్రారమునకు పోవును. ఆ సుషుమ్నానాడితో శ్వాస నడిపిన ఆనందమయ, పరమశాంతి లభించును.

ప్రకృతి వస్తువుల యందలి తత్వమును తెలిసికొని వానిని సక్రమముగా వినియోగపరచుకొనుట, ఆహారమున ఏపదార్థములు ఏవిధముగా వినియోగిం చిన అరోగ్యముగా, రుచికరముగా నుండును? అను పక్వవిధానమును తెలిసి కొని సకాలనముకు అహారమునుతగినట్లుగాతీసుకొనుట విజ్ఞానము.పంచభక్ష్య

సక్రమముగా తయారుచేసికొని అనుభవించవలయును. ఈఅనుభవము స్త్రీలకు ఎక్కువగా నుండవలయును. మేధావులు పరిశోధించి, వస్తుతత్వములను తెలుసుకొని, మానవ జీవితము సుఖవంతమగునట్లు వానిని వాడుకలోనికి తెచ్చుకొనునట్లు చేయుటవిజ్ఞానము.

శాస్త్రజ్ఞానము గలవారుప్రజ్ఞచేత శాస్త్రములుచదివి, దానియందలి ధర్మములను, సూత్రములను అర్థముచేసికొని ఇతరులకు బోధింతురు. వినిన వారిలో కొందరు ఆచరించి ఫలమును అనుభవింతురు. చెప్పువారు అనుభవించరు. ఇదిగుడ్డివానిచేత దీపములాంటిది. గ్రుడ్డివాని చేతి దీపము వానికి కనుపించదు. కనులుకలవారికి కనిపించును. అదేవిధముగా శాస్త్రజ్ఞానముగల పండితులకు జ్ఞానము లభించదు. వినెడివారు జ్ఞానులుకాకపోయినను ఇతరులు జ్ఞానవంతులగుటకు అవకాశమును కల్పించుచున్నారు. ఇది శాస్త్రజ్ఞాన విధానము.

అనుభవజ్ఞానము అనగా శాస్త్రములు చదువక, ఏ గురువులను ఆశ్రయించక సంస్కార ప్రభావానుగుణ్యముగ సాధన ప్రారంభించి, జ్ఞాన సిద్ధిని పొంది మోక్షార్హులగుట. వీరు పడవను నిర్మించుకుని, తాము పడవలో కూర్చొని అనేక మందిని పడవలోకూర్చుండ బెట్టుకొని, నదియగు సంసారమును తానుదాటి, అనేక మందిని దాటించువారు. వీరుశ్రేష్ఠులు. పూజ్యులు. వీరు ఎక్కువ ఉపన్యాసములు చెప్పరు. ధర్మములు, సూత్రములు సూక్ష్మముగా బోధించెదరు. వీరియోగశక్తివలన వినిన వారికి అవి ఫలించి అనుభవమునకు వచ్చును. కాని ఇలాంటివారు చాలా తక్కువ.

మరికొందరు గురువులను ఆశ్రయించి, వారి ఆజ్ఞను పాలించి వారికి సేవచేసి, శాస్త్రములనుచదివి, అందు తమకుకలిగిన సందేహములను గురువులను ప్రశ్నించితెలిసికొని, సాధనచేసి, విజ్ఞానమునుపొంది, మోక్షార్హులై అనేక మందికి బోధించియు, పవిత్ర గ్రంథములు రచించిశాస్త్రజ్ఞానము కలిగి అనేక మందిని బోధకులుగాశిక్షణలిచ్చియు, సంఘమునుసంస్కరించియుసంఘము·

నకుఎంతో మహోపకారమును వేయుదురు. వారి తదనంతరముకూడ వారు స్థాపించిన పీఠములు జ్ఞాన ప్రబోధము చేయుచుండును. వారు వ్రాసిన గ్రంధములు లోకమునకు ప్రయోజన పడుచుండును. ఇది అనుభవజ్ఞానము

గురువులను ఆశ్రయించునపుడు తత్వవేత్తలుగనుండు గురువులను, సత్ప్రవర్తనగలగురువులను ఆశ్రయించవలయును. బోధగురువులు లోకోద్ధారకులుగా యుందురు. మరికొందరు ఉదర పోషణకు ఏ అనుభవము లేకయున్నను శాస్త్రవిరుద్ధముగా, ధర్మవిరుద్ధముగా బోధించుచుందురు. గురువునేసర్వస్వముగానెంచి పూజంచవలయును. గురువే మోక్షమిచ్చును. శరీరముతో చేయుకర్మల ఫలితము జీవునకు చెందవు. కనుక వ్యభిచారముచేయవచ్చును. త్రాగవచ్చు. అవి జీవునకు చెందవు" అని శాస్త్రవిరుద్ధ ధర్మములను బోధించుచుందురు. "ఏ సాధనము అవసరము లేక గురువు జీవునకు మోక్షార్హత యిచ్చివేసెను. మీరుపరిపూర్ణులై పోయియున్నారు". అని బోధించుచుందురు. ఇటువంటి గురువులు, మోసగాళ్లు. సంప్రదోహులు. ఇటువంటివారివి చేరరాదు, తత్వవేత్తలు, సాధనాపరులైన గురువులను చేరవలయును. శాస్త్రప్రమాణములను ఆచరించవలయును.

లౌకిక జ్ఞానము అనగా లోకమునందు మానవులు ఒకరితో మరియొకరు ఎటుల ప్రవర్తించవలయును? అనుజ్ఞానమును కలిగియుండుట. మొట్టమొదటి ధర్మము "ఆత్మౌపమ్యేన సర్వత్రసమంపశ్యతి సజ్జనసుఖింవాయదివా దుఃఖం సయోగి పరమోత్తమం". తన సుఖదుఃఖముల వలెనే యితరుల సుఖ దుఃఖములను చూడవలెను. మానవులు తమ సుఖములను ఎట్లు కోరుచున్నారో సకల ప్రాణుల సుఖములను అదే విధముగా కోరవలయును. తన దుఃఖమును తొలగించుకొనుట కెటుల కోరుచున్నాడో సకలప్రాణుల దుఃఖములను అటులనే తొలగించుటకు కోరవలయును. ఇది మొదటి లౌకిక జ్ఞాన ధర్మము.

కుటుంబము నందలి సభ్యులతో అభిమానము ప్రేమభక్తులతోప్రవర్తించవలయును. భార్యాభర్తలుఅనుకూలదాంపత్యముతో పరస్పరము ప్రేమగలిగియుండవలయును. తల్లి దండ్రులయందు భక్తి శ్రద్ధలు, ఆధారభిమానములు

కలిగి, గౌరవ సద్భావములతో నుండ వలయును. ఒకరితో నొకరు మధుర మైన మాటలు గౌరవ యుక్తముగా మాట్లాడవలయును. అట్లేసమాజములో కూడాఎవరుఎవరితో మాట్లాడినను సన్నిహితముగా, గౌరవయుక్తముగానుండ వలయును. కఠినముగా, బాధను కలిగించునట్లు మాటలాడరాదు.

బంధు మిత్రులతో ఎటుల ప్రవర్తించవలయును? ఎటుల ఆహ్వానించ వలయును? అను విధానమును తెలిసికొనవలయును. అల్లుడు, ఆడబిడ్డలు, వేరుగనుండు తోబుట్టువులు పినతండ్రిమొదలగు వారిని దంపతులుగా ఇంటికి వెళ్ళి ఆహ్వానించవలయును. కొంత మందిని ఉత్తరముల ద్వారా, కొంత మందిని వార్తలు ఇతరులచేత అందచేసి ఆహ్వానింతురు. ఇరుగుపొరుగు వారితో మిత్రభావముతో, అభిమానముతో, ఒకరిని మరొకరు తగు పరస్పర సహాయము చేసికొనుచు నుండవలయును. ఒక సమయమున అభిప్రాయభేద ములు కలిగినను వానిని దీర్ఘకాలము ఉంచరాదు. త్వరలోనేవానినిసవరించు కొని మిత్రభావముతో ఉండవలయును. రాగద్వేషములతో నుండరాదు.

కొందరు పొరుగువానితో ఇంటి సరిహద్దుల దగ్గరగాని, చేను సరి హద్దుల దగ్గరగాని అభిప్రాయ భేదములు గలిగి, అది రాగ ద్వేషములుగా మారి, శత్రుత్వము ఏర్పడిప్రాణాపాయములు కలిగించుకొనుచుందురు. వారు బొత్తిగా లౌకిక జ్ఞానము లేనివారు. పొరుగువారు ఏకులమువారు అయినను కులతత్వము పాటింపక మిత్రభావముతో ఐకమత్యముతో ప్రవర్తించవల యును. ఏదేని అభిప్రాయభేదములు కలిగినపుడు సంఘము చెప్పినటులవిని విరోధమునకు చోటీయక సమర్థించు కొనవలయును.

ప్రభువాజ్ఞను పాలించవలయును. శాసనమును తిరస్కరించరాదు. రాజునందు భక్తి కలిగియుండుట లౌకిక జ్ఞానము. రాజు ప్రజలకు ఏ విధ మైన బాధలు కలుగనీయక కన్నబిడ్డలవలె కాపాడుట రాజధర్మము. ప్రభు వులు స్వయముగా ప్రజల దగ్గరకు పోయి కష్టసుఖములను విచారించుట,

ప్రజలకు వైద్యవసతులు కల్పించుట రాజులకు లౌకికజ్ఞానము. ఇతర రాజ్యములతో మైత్రభావమున ఉండుట, శతృత్వమునను చోటీయక ఒకరితో నొకరు గౌరవ ప్రదముగా నుండుట. ఆధారాభిమానములతో ప్రవర్తించుట లౌకిక జ్ఞానము. మగధ కోసలరాజులు ఒక చిన్న విషయమున యుద్ధమునకు సిద్ధమైనారు. నేను చెప్పినటులు విని యుద్ధమువిరమించుకొని ఒకటైనారు.

లౌకిక జ్ఞానము గలవారు చీమలవలె జీవించవలయును. చీమలు ఎక్కడకు వెళ్ళినను వరుస తప్పవు. వరుసగా క్రమ శిక్షణాబద్ధముగా నడచును. మానవులు సిపాయిలు శిక్షించుచున్నను వరుసగానడవలేకయున్నారు. చిన్నవయస్సు నుంచి క్రమ శిక్షణాబద్ధముగ వరుసగానడచుట మానవులు చీమలను చూచి నేర్చుకొనవలయును. తల్లి, దండ్రి, అన్న, తదితరులు చిన్న పిల్లలకు చీమలవరుసనుచూపించి "వాటివలెమీరును వరుసగానడువవలెను." అని వారికి బోధించి వరుసగా నడిపించవలెను. "క్రమశిక్షణయే సర్వరక్షణ"

ఒక చీమకు ఏదేనివస్తువు లభించినపుడు అదివ్యక్తిగత స్వార్థము లేక అనేక చీమలను పిలిచికొనివచ్చి సామూహిక కృషితో భద్రపచును. అన్ని కలసి పనిచేసిఆఫలితమును అన్నియునుసమముగా అనుభవించును. అదియే సహకారపద్ధతి. మానవులు-తండ్రికొడుకులే-సంపాదనయందు వేరుఅగుచున్నారు. సామూహిక సంపాదనసామూహికముగా ననుభవించుటలేదు. సహకార స్వభావము లేక సంకుచిత స్వభావముతో ప్రవర్తించుచున్నారు. చీమలవలె సహకార స్వభావముతో జీవించవలెను. సహకార వ్యవసాయం, సహకార వ్యాపారము, సహకార పరిశ్రమలు మానవ జీవితఔన్నత్యమునకు ఆధారము.

చీమలు వేసవికాలమున సహకారముగ సంపాదించి పొదుపుచేసి, వర్షాకాలమునకు కొంతదాచి యుంచుకొని, వర్షాకాలము బయట తిరుగుటకు వీలు లేనపుడు హాయిగా పుట్టలో ఉండి తినుచుండును. మానవులు కూడ తన సంపాదనను పొదుపుచేసి, కొంత భద్రపరచుకొని వృద్ధాప్యమున తినుటకు దాచుకొనవలయును. మరియు ముందు జన్మకు కొంత దానము చేయవలయును. మానవులు పొదుపు విషయము బొత్తుగా మరచిపోవుచున్నారు.

భవిష్యత్తును గుర్తించుటలేదు. భావిజీవితమును గుర్తించుటలేదు. భవిష్యత్తునకు పొదుపు అవసరమని చీమలను చూచి మానవులు నేర్చుకొన వలెను. తానుతినునది శరీరభోగైశ్వర్య శరీర భాగము. దానము చేయునది ధర్మముచేయునది జీవుని జన్మకు, జీవునకు ఆధారము. కనుక దానధర్మ ములుచేయవలయును.

చీమలకు ప్రభువు ఒకరు ఉండును. వానినిరాజుచీమ అందురు. రాణి చీమ యుండును. వానిమూలమున వాటి సంతానోత్పత్తియగును. చీమ లన్నియు గుడ్లుపెట్టవు. రాజు రాణి చీమల గ్రుడ్లవలన కలుగు చీమలను ఇతర చీమలుపోషించును. అవిప్రభువునందు అత్యంత భక్తిగలిగి యుండును ఒక్కొక్క సమయమున రాణిచీమ పెట్టిన గ్రుడ్లను ఒక చోటు నుండి మరి యొక చోటికి చీమలు తరలింపు చేయును. తగురక్షణయిచ్చును. ఆగ్రుడ్డుకు కలిగిన చీమలను యితర చీమలు ఆహారము తెచ్చిపెట్టి పోషించును. మాన వులందు తమసహోదరులపైన అలాంటి ప్రేమసద్భావన యుండిన ఎంత బాగుండును! రాజుమీద చీమలకు ఉన్నభక్తి విశ్వాసములవలె మానవులకు కూడ తమప్రభువులపైన భక్తివిశ్వాసము లుండవలెను. తోబుట్టువులయందు ఆదరాభిమానములు, ప్రేమ, దయ యుండవలయును.

చీమలు ఒక చీమ మరణించినపుడు మరొకచీమ దాని శరీరమును మోసికొని పుట్ట దగ్గరకు వచ్చును. వాటి శవమును బయట ఉంచవు. మానవులలో ఆ కులమువారే ఆ శవమును మోసికొని పోవుదురు. మరొక కులమువారు ఆశవమునుతాకరు. అదేఆచారముగా భావింతురు. తామంతయు చీమలన్నియు ఒకే సంఘముగ భావించును. ప్రపంచమున ఏ దేశ చీమ ఏదేశమునకు వచ్చినను ఆదేశ చీమలతో కలసిపోవును. ఒక మహారాణి తీపి ఫలహారములను మరొక రాజ్యమునకు తీసికొనిపోవు చుండును. అది ఆమె బంధుప్రీతి.

కొన్నిచీమలు ఆ ఫలహారముతో పరరాజ్యము చేరి అక్కడయున్న చీమలను కలయును. ఆదేశచీమలు, పరదేశచీమలు అన్ని కలసి ఆ తీపి

పదార్థమునుతీసుకొనిపోయి తమపుట్టలో భద్రపరచి అభేదముగా జీవించును, మానవులు చీమలవలె సంఘ సంస్కారము చేయవలెను. జగత్తునందలి మానవులందరు ఒకే సంఘముగా ప్రవర్తించవలెను. కులతత్వములు, సంఘ ఆచారములు, మానవుల కల్పితమైన కొన్ని పద్ధతులకు, ఆసవాయితీలకు మూఢనమ్మకములకు బానిసలై సంఘమునకు ద్రోహముచేయుచున్నారు. మానవులు లౌకికజ్ఞానము కలిగి సామూహికవిధానమును వృత్తియందును· దైవోపాసన యందును, పొదుపుపరుచుట యందును అనుసరించవలయును.

చీమలకు "ఈ పుట్ట నా స్థిరనివాసము"అనుభ్రాంతి మనుకారములేదు. ఎక్కడి చీమ అయినను ఏ పుట్టచేరినను అది తన పుట్టగనే భావించును స్థిరనివాసిగఅక్కడేయుండి పోవును. తానుసంపాయించినది తెచ్చి ఆ పుట్టలో నున్నపదార్థములందు కలిపిహెచ్చుతగ్గుల వ్యత్యాసములేక హాయిగా జీవించును. మానవులలో అన్నదమ్ములు వేరైనపుడు, ఒక అంగుళము భూమి కొరకు తలలు పగులగొట్టుకొనుచున్నారు. బొత్తిగ లౌకిక జ్ఞానములేక, త్యాగ బుద్ధిలేక, సంకుచితభావము, మమకారము, భ్రాంతులకు బానిసలై, సంఘ సంస్కార ధర్మమును మరచిపోయి, స్వార్థపరులై పాపకార్యములు చేయుచున్నారు. లౌకిక జ్ఞానము కలిగి సహకార పద్ధతులను అనుసరించి సంఘ జీవులవలె జీవించవలెను.

మానవులు చీమలనుచూచి యెనిమిదిధర్మములను నేర్చుకొనవలయును. వానినే "పిపీలికా అష్టాంగ ధర్మములు"అంటారు. 1. క్రమశిక్షణా బద్ధముగా యెక్కడకు వెళ్ళినను వరుసగా వెళ్ళుట. మానవులను పరిపాలకులు ఎంత కృషిచేసినను వరుసగా నడిపించలేక యున్నారు, 2. సహకార సంపాదన :- అందరు కలసి సహకారముగా సంపాదించుట (కాని వ్యక్తిగా సంపాదించు చుందురు.) 3. పొదుపుచేసి భవిష్యత్తునకు భద్రపరచి అవసరమైనపుడు సామూహికముగ అనుభవించుట. 4. ప్రభువునందు భక్తివిశ్వాసములు కలిగి రాజు ఆజ్ఞను పాలించుట. [చీమలెట్లు రాజాజ్ఞనుపాలించునోఅట్లు రాజాజ్ఞను పాలించవలెను. తిరస్కరించి శిక్షలు అనుభవించరాదు.] 5.మృతకళేబరము

లకు తగుక్రియలు చేయుట. [మానవులు కులతత్వమును అనుసరించి శవ మునుతాకరు. అదియొక ఆచారముగా భావించి సంఘద్రోహము చేయుచు న్నారు.] 6. చీమలకునాది. అనుభ్రాంతి, నేను సంపాయించినాను అను అహంకారము ఉండదు. ఈ పుట్టమాది అను భ్రాంతియుండదు, ఏ ప్రాం తము నుండి ఏప్రాంతపుట్టకు చీమవచ్చినను అదితనస్వంతపుట్టగనే భావించి నివసించును. నాదినీదియను భేదము ఉండదు.[మానవులు నాయిల్లు అను భ్రాంతితో నేనుకటించితిని అనుఅహంకారముతో, సంకుచిత బుద్ధితో సంచరించుచుందురు.]7.చీమలలోరాగద్వేషములుండవు.వాటిలో విరోధము [కరచుకొనుట అపకారముచేసికొనుట] ఉండదు.పక్షి, జంతు, మృగములకు విరోధములుకలుగు చుండును. కాని చీమలకు కలహములేదు.

మానవులకు కలహము సహజముగ కలుగుచుండును. తన కులము వారిలోను. తండ్రికొడుల మధ్య, అన్నదమ్ములమధ్య, భార్య భర్తల మధ్య కలహములు ఏర్పడి, తండ్రికొడుకులు ఒకరి నొకరు చంపుకొనుట, అన్న దమ్ములు చంపుకొనుట, భార్యాభర్తలు చంపుకొనుట సంభవించుచుండును. చీమల సంఘమునందు విరోధమునకుచోటులేదు. విరోధము అంటే ఏమిటో చీమలకు తెలియదు. 8 చీమలకు కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యములులేవు. వాటిజీవితము అస్ఖలితబ్రహ్మచర్యముతో గడు పును రాణి చీమ ఒక్కటే సంతానోత్పత్తి చేయును. మిగిలిన చీమలన్నియు ఆ సంతతిని పోషించిరక్షించును.ప్రాణులందుబ్రహ్మచర్యమును అనుసరించు నది చీమల సంఘము. నెమలికినీ కామములేదు. చీమలకు క్రోధములేదు లోభత్వంలేదు. అన్నియుసమముగా అనుభవించును. మదము మత్సరము లేదు.మానవులు ఈయెనిమిదిధర్మములనుచీమలనుచూచినేర్చుకొనవలయును.

లౌకిక జ్ఞానముగల తండ్రికొడులు మర్రి చెట్టువలె జీవించవలయును. మర్రిచెట్టు కొమ్మలను పెంచుచున్నది. కొంత పెరుగుసరికి ఆ కొమ్మకు ఊడదిగి, భూమిని పట్టుకొని, కొమ్మబరువును భరించి. భూమినుండి ఆహార ముసు తీసుకొని మొదలునకు బరువును ఆహార బాధ్యతలను తొలగించు

చున్నది. కాని మొదలును వదులుటలేదు. తండ్రి కొడుకులు ఆ విధముగా జీవించవలెను. కొంత వయస్సు వచ్చిన తరువాత తన బాధ్యత, భారము తండ్రికి కొడుకు ఉంచకూడదు. తనసంపాదన తానుసంపాదించుకొనిజీవించ వలయును. తండ్రిని విడవకూడదు. అనగా తండ్రి మీద భక్తి విశ్వాసములు అభిమానము విడువరాదు. ఇది మర్రి చెట్టును చూచి మానవులు నేర్చు కొనవలసిన ధర్మము.

బంధు మిత్రులతో సుహృద్భావముతో నుండవలయును. పురుషుల కంటె స్త్రీలు బంధుమిత్రులను గౌరవవించి ఆదరించవలయును. పురుషులు సమయమునకు ఉండవచ్చును లేకపోవచ్చును. పురుషులు ఉన్నను లేకున్న నుస్త్రీలు ఆదరాభిమానములతో గౌరవించి సత్కరించవలయును. సమయము నకు భోజనస్నానాదులు, సమయమునకురుచికరముగా, వంటచేయవలయును. కార్యములందు బంధుమిత్రులను తగువిధముగా ఆహ్వానించి, తగు విధముగా గౌరవించి సత్కరించవలయును. కొంత మందికి బట్టలుపెట్టి సత్కరించ వలయును. ఇది లౌకిక జ్ఞానము. తగిన విధముగ బంధువులను సత్కరించ వలెను.

మానవులు బంధు మిత్రులుగా మరొకరింటికి వెళ్ళినపుడు వారికి ఏ విధమైన ప్రతిబంధకములు, బాధలుకలిగించకప్రసన్నతగా నుండవలయును. అతిధులు వచ్చినపుడు గౌరవ సూచకముగా విందులు చేయుదురు. ఈ విందులు శరీరమునకు, ఇంద్రియములకు విందులుగాని, జీవునకుగాదు. సత్సంగమే జీవుని విందు. జీవునియందుగల దైవ స్మృతియే [దేవుని జ్ఞాపకం చేసుకొనుటయే] సత్సంగము. బంధు మిత్రుల భోజనమునకు ముందు గాని భోజనానంతరముగాని తప్పకసత్సంగముజరుపవలయును. లేకున్నఆత్మ ద్రోహము. జీవుని హింసించిన వారగుదురు. కనుక బంధు మిత్రులు వచ్చి నపుడు తప్పక సత్సంగ్ జరుపవలయును ఆత్మసంబంధ మైన విచారచర్చ, విచార ప్రబోధము, శాస్త్రపఠనముచేయ వలయును.

బంధుమిత్రులు వచ్చారు అంటే శరీరమునకు అనేక పదార్థములతో విందు పెట్టుటేకాదు. సచ్చిదానందమును పొందవలయును. వారి అనుభవములను ఒకరినొకరు బోధించుకొనవలయును బుద్ధధర్మమును ప్రతిపాదించు గ్రంథముల పఠనముచేసి, వాని యందలి తత్వమును విచారించుట "ఆత్మతత్వ వినిశ్చయం నిరతాసుమోక్ష సుఖోదకం" మోక్షము నిచ్చునది ఆత్మతత్వ విచారణ యొక్కటే! వేదములు త్రిగుణాత్మకమైన సుఖములను పుణ్యమును ప్రతిపాదించునవిగా ఉన్నవి. త్రైగుణ్యవిషయా వేదానిస్త్రై గుణ్యోమోక్షముచ్యతే "గుణాతీతమైన ఆత్మతత్వము చేత పరమశాంతమును పొందవలయును. వేదములు చదువరాదు. వేదములు ప్రతిపాదించు ధర్మములు జీవునకు బంధకారణమగును. నీచజన్మలకు కారణమగును.



## బుద్ధుని ప్రథమ తపస్సు

బుద్ధుని బాల్యములో జరిగిన సంఘటన ఇది :-

ఒకనాడు రైతులు పొలము దున్నుచుండిరి. బుద్ధుడు చిన్నచిన్న గడ్డి పోచలను నాగలి పెకలించి వేయుట చూచెను. క్రిమికీటకాదులు నశించుచుండుట గమనించెను. తన వారి వధను తాను కళ్ళతో చూస్తున్నట్లు ఆయన కుంగి పోయెను. శ్రామికులైన రైతుల యొక్క వాడిపోయిన ముఖములను చూచి జాలిపడెను. వెంటనే ప్రక్కనేఉన్న జంబూ వృక్షము కడకుపోయి, దాని క్రింద కూచోని సకల జీవుల కష్టములను గూర్చి ధ్యానించుట మొదలు పెట్టి ఆ తపస్సమాధిలో మునిగి పోయెను. రాజు ఆయనను వెదకి తెచ్చుటకై భటులను పంపెను. వారు ఆయనను వెదకుచూ జంబూ వృక్షము కడకు వచ్చిరి. సూర్యాస్తమయమున గూడా అన్ని వృక్షమున నీడలు, తిరిగినప్పటికిని జంబూవృక్షము నీడ తిరుగకుండ బుద్ధునకు ఛత్రమువలె నీడపట్టుచుండుట చూచి వారు ఆశ్చర్యపోయిరి.

# ఇరువదిమూడవ అధ్యాయము
## (ఉపాసనా యోగము)

**శ్రీ నాగార్జున ఉవాచ :**

భిక్షులారా! ఈ ప్రపంచాన్ని ఎవరు సృష్టించారనేది మనందరికీ నిత్యం కలిగే ప్రశ్న. దేవుడు సృష్టించాడని కొంతమంది చెప్పటం మనం వింటున్నాం. హిందు ధర్మంలో బ్రాహ్మణులు రూపొందించిన విధానంలో దేవుడికి పతి, ఈశ్వర, బ్రహ్మ. పరబ్రహ్మ ఈమొదలైన పేర్లుచాలా ఉన్నాయి. అయితే ఈ దేవుడెవరు? ఏలా అవతరించా? డనేదానికి మాత్రంసంతృప్తికర మైన సమాధానం రావటంలేదు. దేవుణ్ణి నమ్మేవాళ్ళు ఆయన సర్వశక్తి మంతుడనీ, సర్వాంతర్యామియనీ, సర్వజ్ఞుడనీ విశ్వసిస్తారు. దేవుడే ఈ విశ్వాన్ని సృష్టించాడని నమ్ముతారు. ఆయన్ను కీర్తిస్తారు పూజిస్తారు. ఆయన్ను ఆరాధించటంలోగూడ సగుణ, నిర్గుణోపాసనలున్నాయి. అయితే దేవుడే ఈ విశ్వాన్ని సృష్టించాడనటంలో తథాగతునికి నమ్మకంలేదు. అసలు దేవుని నమ్మినందువల్లకూడా ఫలం నిష్ప్రయోజనమనే ఆయన నమ్మకం. "ఏ ఫలితమైనా మనం చేసే కర్మమీదనే ఆధారపడి ఉంటుం"దని ఆయన చెప్పాడు. "దేవునిపై విశ్వాసంతో ఏర్పాటయిన ఏ మతమైనా కేవలం ఊహాజనితమైనదే"నని ఆయన అన్నాడు. భగవంతుని ఉపాసిస్తూ కాలాన్ని వ్యర్థం చెయ్యడంకంటే మనం మన ప్రవర్తనను చక్కదిద్దుకొని ఆత్మోపాసన చేసుకోవటమే ఉత్తమమోత్తమని చెప్పాడు. వశిష్ఠుడు, భరద్వాజుడనే ఇద్దరు బ్రాహ్మణులతో తథాగతుడు చేసిన చర్చను పరిశీలిస్తే ఇందుకు సంబంధించిన విషయాలెన్నో మనకు తెలుస్తవి.

ఒకసారి తథాగతుడు కోసలకు ప్రయాణం చేస్తూ ఐరావతి నదీతీరంలో మానసఘాట్ అనే ఒక బ్రాహ్మణ పల్లెదాపునగల మామిడితోపులో బస చేశాడు. అప్పుడు వశిష్ఠుడు. భరద్వాజుడనే బ్రాహ్మణులిద్దరు ఆయన దగ్గరికి వచ్చి, ఆయనకు తమ తమవాదాలు వినిపించారు. "తారుక్కు"మార్గాన్ని అనుసరిస్తే నేరుగా మోక్షమార్గంలో పయినించి బ్రహ్మసాన్నిధ్యం పొందడానికి వీలవుతుంది" అన్నాడు భరద్వాజుడు." ముక్తిసాధన విషయంలో బ్రాహ్మణులు అనేక మార్గాలు చూపిస్తున్నారు. ఎవరికి వాళ్ళు తమ మార్గమే సరియైందంటున్నారు. ఈలానే ఉపాసనా మార్గాలుకూడా. ఇందులో ఏది మంచిదో, ఏదికాదో తెలుసుకోలేక పోతున్నాం" అన్నాడు వశిష్ఠుడు.

అప్పుడు బుద్ధుడు "వేదాలను తల్లక్రిందులుగా వల్లించే బ్రాహ్మణుల్లో ఏ ఒక్కడైనా బ్రహ్మనుముఖాముఖి కలుసుకొన్నాడా?" అని ప్రశ్నవేశాడు. లేదన్నారు- వాళ్ళు. "పోనీ వేదాధ్యయనం చేసి, బ్రాహ్మణాలను బోధిస్తున్న వాళ్ళల్లో ఎవరైనా బ్రహ్మను ముఖాముఖి చూశారా?" మళ్ళీ ప్రశ్నవేశాడు. "ఎవ్వరూలేరు" అన్నారు వాళ్ళు. "అయితే బ్రహ్మను ఎవ్వరూ చూడలేదు. బ్రహ్మనుగూర్చి ఖచ్చితమైన జ్ఞానం కూడా ఎవరికీలేదు. ఔనా? అయితే బ్రహ్మ అంటూ ఒకడున్నాడని నమ్మటానికి తగిన ఆధారం ఏమిటి? గుడ్డి వాళ్ళు ఒకళ్ళను పట్టుకొని మరొకళ్ళు నడుస్తునట్లుగా ఈ బ్రాహ్మణులుకూడా చేస్తున్నారు. వ్యర్థ ప్రసంగాలు కావిస్తున్నారు. ఇదంతా చూస్తుంటే ఒకడు తానెప్పుడూ చూచే ఎరుగని స్త్రీని ప్రేమించాడన్నట్లుగా లేదా? ఆ స్త్రీ ఎంత అందంగా ఉంటుంది? ఆమె వంశం ఏమిటి? బ్రాహ్మణులా? క్షత్రియులా? వైశ్యులా? శూద్రులా? అంటే అతడు ఏం సమాధానమిస్తాడు? మిత్రులారా! బ్రహ్మ సనాతనుడు. అజేయుడు. సర్వాధికారి. సృష్టిస్థితిలయకారకుడు-జగత్పిత అయిఉండాలికదా! ఆయన్నుమనం శాశ్వతుడని అంటున్నా!మే అటువంటివాని సంతానమైన మనం అశాశ్వతులమై, కొంత కాలానికి తనువు చాలించాల్సిరావడానికి కారణం ఏమిటి?" అని అడిగాడు. వాళ్ళ దగ్గర్నుంచి ఏ సమాధానం రాలేదు.

"దేవుడు సర్వశక్తిమంతుడైనట్లయితే-ఈ సృష్టికి తానే కారకుడైనట్లయితే-ఇక మానవుడు చేయగలిగిందేముంది? అతనికి ఏదీ చేయాలన్న సంకల్పం కూడా ఉండదు. అటువంటప్పుడు మానవుడు సృష్టిలో ఒక భాగంగా ఉంటూ ప్రాపంచిక విషయాల్లో ఉదాసీనంగా ఉండిపోవలసిందే. ఇదే నిజమైతే బ్రహ్మ మానవుణ్ణి ఎందుకు సృష్టించినట్లు?" అడిగాడు మళ్ళీ. వాళ్ళు మౌనంవహించారు. అప్పుడు మళ్ళీ ఆయన ఈలా చెప్పసాగాడు.

"దేవుడు చాలా మంచివాడని అంటున్నారు. అటువంటివాడు దుర్మార్గుల్ని, అత్యాశాపరుల్ని, వదరుబోతుల్ని ఎందును సృష్టించాడు? ఈలాంటి

వారి సృష్టికి ఈశ్వరుడే కారకుడా? అదే వాస్తవమైతే ఆలాంటి దేవుడితో మనకు ప్రయోజన మేమిటి? దేవుడే సృష్టికి కారకుడై, న్యాయవంతుడై, దయామయుడై ఉన్నట్లైతే లోకంలో ఇంతటి అన్యాయం ఎందుకు జరుగుతున్నది? దేవుడు సర్వజ్ఞుడుగదా! లోకంలో ఇన్ని బాధలు చెలరేగుతుంటే ఎందుకు నిర్మూలించలేక పోతున్నాడు? తన సంతానం బాధలతో కుమిలిపోతుంటే తండ్రి సహించగలడా? ఇంతటి మోసం, అజ్ఞానం లోకంలో అవతించబడటానికి కారణమేమిటి ? దేవుడే సర్వశక్తిమంతుడై ఉన్నట్లయితే ఇట్లా ఎందుకు జరుగుతున్నది? దేవుడున్నాడా?లేడా? అని వ్యర్థంవాదనలతో కాలం వృధా చెయ్యడం కంటే మానవుడికీ దేవుడికీ గల సంబంధ మేమిటనే మీమాంసకంటే - మానవుడికీ మానవుడికీ మధ్య ఏలాంటి సంబంధాలుండాలన్నదే మతం పరమార్థంగావాలి. మానవుడు సాటి మానవునితో సత్సంబంధాలు కలిగి ఉన్నట్లయితే, తద్వారా విశ్వం యావత్తూ సుఖప్రదమౌతుందన్నది మతం ఉద్దేశ్యం కావాలి" అని వివరించాడు. దేవుడున్నాడా? లేడా? అన్న విషయంపై భగవానుడు తటస్థ వైఖరి అవలంభించాడు. దేవుడి విషయం ఆలోచిస్తూ కాలయాపన చేయడాన్ని ఆయన వ్యతిరేకించాడు. ఎందుకంటే దేవుడిపేరుతో పూజా పునస్కారాలు, జపతపాలు జరుగుతున్నవి. అవి మూఢాచారాలుగా మారుతున్నవి. అంతేకాని వాటి వలన కలుగవలసిన మానసిక పరిణామం కలగటం లేదు. కాగా దానితోబాటు అతనిలో సదవగాహన లోపిస్తున్నది. స్వార్థం పెరుగుతున్నది. అందుకనే భగవానుడు అష్టాంగ మార్గాన్ని ప్రవేశపెట్టాడు. దేవునిపైగల నమ్మకం మానవుడిలో సదాచరణాన్ని ప్రేరేపించటం పోయి చాలా ప్రమాదకరంగా మారుతున్నది. ఎందుకంటే దేవుడున్నాడని నమ్మేటట్లయితే ఇక పూజలు, క్రతువులు తప్పవు. వాటిని నిర్వహించేందుకు పూజారులు కావాలి. ఈ పూజారుల బుద్ధి చాలా కుటిలమైంది. వీళ్ళు మానవుల్లో మూఢాచారాలనూ, మూఢనమ్మకాలనూ ప్రోత్సహించి, సమదృష్టి ఏర్పడకుండా చేస్తుంటారు. కనుక దేవుడున్నాడా? అనే విషయాన్ని మనం ఆలోచించేదానికన్నా, సృష్టించాడనబడేవాడు దాన్ని ఏలా సృష్టించగలిగాడో పరిశీలించడం ప్రధానమైంది. దాని వలన సృష్టి

రహస్యం తెలుస్తుంది. ధ్యానంలో నిమగ్నమై తానెవరో ఆత్మవిమర్శనం చేసుకోవాలి. యోగాన్ని ఆశ్రయించాలి. యోగంలో శారీరకశ్రమ, ప్రాణాయామము, ధ్యానము అనే మూడంశాలు ముఖ్యంగా ఉంటవి. వీటిని అభ్యాసం చేసి ఆత్మోపాసన చెయ్యాలి.

**శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :**

ప్రబుద్ధులారా ! ప్రజలయందు దైవోపాసన ఎట్లు చేయవలయును? అనుసమస్యఉన్నది. జ్ఞానులగువారు మోక్షము కొరకు, పరమశాంతి కొరకు, సచ్చిదానందముకొరకు యోగముతో ఉపాసనచేయుదురు. ఈ శరీరమునకు వెలుపలనున్న శబ్ద, స్పర్శ, రూప, రసగంధాదులను వెలుపలకి నెట్టివేసి, వెలుపల ఏ వస్తువుతో అవసరములేక చంచలమగు మనస్సు వైరాగ్యముచేత ఏకాగ్రతచేసి, కోరికలను, మమకారమును భ్రాంతిని వదలి మనస్సును హృదయమున నిరోధించి, సంకల్ప వికల్పములను నిరోధించి, ఇంద్రియములను నిగ్రహించి, మానవులకు ప్రకృతి సిద్ధమైన మాంసనేత్రములు రెండేకాదు, జ్ఞాన నేత్రము మరొకటి కలదని తెలిసికొని, అనుభూతిని పొంది, ఆదివ్యనేత్రముతో అంతర్ దృష్టి గలిగి, తనలోని అంతర్జ్యోతిని చూచుచు స్మృతిలో తెలిసి కొనుచు, శ్వాసతీసుకొన్నపుడు, విడుచునపుడు స్మృతితో శ్వాసను గుర్తించుచు, ఎంతటి ఝుంఝూమారుతము వీచినను కదలనిపర్వతములాగా స్థిరాసనమునుఏర్పరచుకొని, చేతులు,కాళ్లు కదలించక, శిరస్సును, వెన్నెముకను చక్కగా నుంచి, చేతులను ముద్రభావనందుంచి, కండ్లు తెరవక, చెవులతో శరీరంవెలుపలి శబ్దములు వినక, నోరు తెరచి ఏ విధమైన మాటలు పలుకక, రాగద్వేషాసూయలకు చోటు నీయక, ఆత్మానంద స్వరూపుడై యోగము చేయువాడు మోక్షార్హుడై జన్మరాహిత్యమును పొందుతాడు. జీవుడు పరమ శాంతిని, సచ్చిదానందమును, అమృతత్యమును పొంది, తేజోమయుడై పరంధామమును చేరి, శాశ్వతముగా ఉండిపోతాడు. ఎన్నిజన్మలు గడచినను ఇక వారికి జన్మ ప్రాప్తించదు. అక్షరుడై ఆత్మానందమును అనుభవిస్తుంటాడు. వారికి ఆకలిబాధ, వ్యాధుల బాధ. ఇతరమైన బాధలు, భయములు, దుఃఖములు ఉండవు.

మానవులందు కొందరు పుణ్యమును కోరి అశ్వమేధయాగము. గోమేధ యాగము, రాజసూయ యాగము మొదలగు అనేకవిధములైన యాగములను చేస్తుంటారు. అశ్వమేధ యాగమున, యజ్ఞాశ్వమును రాజ్యమున ఎవరు బంధించినను యుద్ధము చేయుదురు. ఇరుపక్షములందు అనేకులు మర ణింతురు. దాని వలన పుణ్యము వచ్చునని పరిపూర్ణవిశ్వాసము. యుద్ధమున జయించి. తీసికొని వచ్చిన గుఱ్ఱమును కాళ్లు కట్టి, హోమగుండమున వేసి, నెయ్యిపోసి, బాగుగా కాల్చి దాని మాంసమును యజ్ఞముచేసిన ఋత్విక్కులు, చేయించిన చక్రవర్తి తినెదరు "అది మాంసాహారము కాదు. ఆ యుద్ధమున ఎంతమందిని చంపినను, పాపము లేదు" అని పండితులు వాదింతురు. అది మహా మూర్ఖత్వము. వారు మహా మూఢులు. "ఇది వేదోక్త దైవోపాసన" అని పండితులు చెప్పుచున్నారు.

ప్రాణములు తీయు యాగములు, పుణ్యము నిచ్చునవిగా చెప్పు చున్నారు. యాగములవలన పుణ్యము ప్రాప్తించుట, సత్యమైననూ ఆపుణ్యము భోగైశ్వర్యములను కలిగిస్తవి. అవి జీవుని కర్మబంధమున బంధించునటుల చేస్తవి. అవి దేహేంద్రియములకు వికారములను కల్పించునే గాని జీవునకు శాంతి నీయజాలవు, కర్మబంధములను త్రెంచజాలవు. పాపములను తొల గించజాలవు, జ్ఞానమొక్కటే పాపములను తొలగించు శక్తిగలది. ఎన్ని జన్మలనుంచి యున్న పాపమైనను, జ్ఞానమనెడి అగ్ని చేత దగ్ధము అవుతుంది. అంతేగాని, పుణ్యము, పాపమును నాశనము చేయలేదు.

వేదములు చదువుట, తపస్సు చేయుట, పూజలు చేయుట, ఈ మొద లైన వాటివలన, పుణ్యము లభిస్తుంది. పుణ్యమువలన మరుసటి జన్మలో సుఖములను అనుభవిస్తారు. పుణ్యము క్షీణించిన తరువాత, పాపభూయి ష్ఠులై, అనేక దుఃఖములకు గురిఅవుతారు. అందువలన, మానవులు, పుణ్య మును అపేక్షించి, కర్మలు చేయక మోక్షము నపేక్షించి, యోగమును చేయ వలయును. యోగము నశించునది కాదు. మరుజన్మలోకూడా అది ప్రకా శిస్తుంది. దైవోపాసనకు ప్రేరేపిస్తుంది. కనుక, మానవులు యోగముతో

దైవోపాసన చేయవలయును. దేహేంద్రియ భోగముల నపేక్షించక జీవుని యుద్ధరించుకొనవలయును. ధ్యాన యోగముతో, దైవోపాసన చేయ వలయును.

మానవులు కొందరు వామాచారములతో, దైవోపాసన చేస్తుంటారు. జంతువులను, మానవులనుకూడ దేవతల పేరుతో నరికి, దైవోపాసన చేస్తుం టారు. వారు శుచి, శుభ్రము లేక మధుపానమును, మాంసమును దేవతకు ఆరగింపు చేసి, తిని, త్రాగి, తందనాలాడుతుంటారు. అన్నము వండి పెద్ద రాసిగాపోసి, దేవత తన శరీరముమీదకు వచ్చినదని యేదేదో చెప్పుతుం టారు. ఇవేవీ సమ్యక్ ఉపాసనా మార్గములు కావు.

మానవులు కొందరు వ్రతములతో దైవమును ఉపాసించుచున్నారు. ఈ వ్రత నియమములను సక్రమముగా ఆచరించకున్న చేదు ఫలితములు, కష్టములు, సంభవించగలవని పండితులు చెప్పుచున్నారు.

కొందరు పర్వదినములందు, దైవోపాసన చేస్తుంటారు. ఆ దినములలో బొత్తిగా అన్నము తినకుండా, బొత్తిగా నిద్రపోకుండా, మేలుకొని యుంటారు. ఇది శాస్త్ర విరుద్ధము. యోగవ్యతిరేకము, బొత్తిగా ఆహారము తినక యుండిన, జీవుడు మలము తినవలసివచ్చును. జీవునకు మలముపెట్టి, దేవుని ఉపాసించుట శాస్త్ర ప్రమాణముకాదు. అలాగే బొత్తుగా నిద్రించక యున్న స్మృతి మరుపుగా మారి, అపకారం చేస్తుంది.

కొందరు మంత్రములు చెప్పి, సంధ్యావందనము చేయుదురు. బ్రాహ్మణులకు తప్ప, యితర కులములవారికి మంత్రాలు చెప్ప అర్హత లేదు. అందువలన వారు నామ సంకీర్తనము, భజనలు, సప్తాహములతో, దైవో పాసన చేస్తుంటారు. కొందరు భాషా పరిజ్ఞానముగలవారు. పవిత్ర గ్రంథ ములు పఠనముచేసి, దైవోపాసన చేస్తుంటారు. "శూద్రులిట్లు చేయరాదు. వేదములు చదువు అర్హత శూద్రులకు లేదు. వేదమంత్రములు వినిన సీసము కరిగించి వారి చెవులయందు పోయవలయును." అని బ్రాహ్మణులు చెబుతారు.

దైవోపాసనయందు, సామూహిక దైవోపాసన బుద్ధ మతమునందు ఆచార ముగా ఉన్నది. భిక్షువులు, భక్తులైన గృహస్థులు, కులతత్వ విచక్షణ లేక, సామూహికముగా కూర్చొని ధ్యానము చేస్తుంటారు. అనర్హత అను సమస్య బుద్ధమతమున లేదు. సర్వమానవులకు దైవోపాసనకు అర్హత సమానముగా నున్నది. సర్వమానవులును మోక్షార్హులే !

"దేవుడు ఒకడు, తేజోమయుడు సాక్షి, శక్తి" అని కొందరు ఉపాసించు చున్నారు. మరికొందరు "దేవుడు ఒక్కడు, మానవాకారుడు. అనేక కార్యములు చేయుచున్నాడు. సృష్టి, స్థితిలయములు దేవునివే"నని కొందరు ఉపాసించు చున్నారు. మరికొందరు "దేవుళ్ళు అనేకమంది. రోజునకు ఒకదేవుని ఆరాధించవలెను." అని రోజునకు ఒక దేవుని అరాధించుచున్నారు. ఇది శాస్త్ర విరుద్ధము. దేవుడు మానవాకారుడు కాదు. దేవుడు మానవా కారుడు అనువాడు. దేవుని అవమానముచేయుచున్నాడు. దేవుడు తేజో మయుడు. సూక్ష్మాది సూక్ష్మము. పరమ అణువు. మర్రి విత్తనము సూక్ష్మ మైనది. బ్రహ్మాండమైన వృక్షము దానిలో నున్నది. అదివిధముగనే దేవుడు సూక్ష్మము. సర్వము ఆయన దివ్యశక్తియందున్నది. సూర్య, చంద్రుల యందు తేజశ్శక్తి, భూమియందు ధారణ ఓజశ్శక్తి, సముద్రమునందాకర్షణ శక్తి దేవునిదే. అలాంటి సాక్షి శక్తిని మానవాకారుడనుట అజ్ఞానము, మూర్ఖ త్వము. దేవుళ్ళు అనేకమంది అనుట భక్తి వ్యభిచారము. "మాంచ అవ్యభి చారేణభక్తియోగేన సేవతే" స్త్రీలకు ఒక భర్త, మానవులకు ఒక దేవుడు. స్త్రీ భర్తను మార్చిన దేహ వ్యభిచారము. మానవులు దేవుని మార్చిన భక్తి వ్యభి చారము. దేవుడు ఒక్కడేనను ధృఢమైన విశ్వాసముతో ఉపాసించవలెను "సర్వధర్మాన్ పరిత్యజ్య దైవ మేకం శరణం వ్రజ" దేవుడు ఒక్కడేనని. దేహేంద్రియ కర్మలను వదలి నిశ్చలముగా కూర్చొని, నిశ్చల మనస్కులై పరిపూర్ణమున సమాధిస్థితిలో దైవోపాసన చేయవలయును.

మానవులు దైవమును నాలుగు లక్ష్యములలో ఉపాసించుచున్నారు. "అర్తో పుణ్య అర్థార్థి, జ్ఞానీచ" కొందరు దైవచింతనయే లేకయుందురు.

వ్యాధివచ్చి ప్రాణాపాయము కలిగినపుడు దేవుని ఉపాసించి, ఆప మ్రొక్కులు, మొక్కుచుందురు. అపద తీరిన తర్వాత దైవభావన ఉండద దైవమును మరచిపోతుంటారు. వీరు ఆర్తులు, కొందరు పుణ్యముకొరక దైవోపాసన చేస్తారు. వేదములు చదువుతారు, యజ్ఞములు చేయువార దానము చేయువారు, ధర్మశాలలు, విద్యాశాలలు కట్టించువారు, అన్నదా సత్రములు ఏర్పరచువారు, మొదలగువారు పుణ్యముకొరకు దైవోపాస చేస్తుంటారు. వేదములు చదువువారు, యజ్ఞములు చేయువారు, అనేక దా ములు చేయువారు, అన్నదాన సత్రములు ఏర్పరచువారు, తీర్థయాత్రల చేయువారు మొదలగువారు పుణ్యముకొరకు దైవోపాసన చేయుదురు పుణ్యము జీవునకు జన్మ కలిగిస్తుంది. దేహేంద్రియములకు మాత్రమ భోగములను, సుఖములను ఇస్తుంది. జీవునకు శాంతిని, ఆనందమును పుణ్యము ఇవ్వలేదు, మరికొందరు ధనము కొరకు దైవోపాసన చేస్తారు. వ్యాపారములందు లాభము వచ్చుటకు, వ్యవసాయమున పంటలు వచ్చు టకు, ఉద్యోగములందు అధిక వేతనములు, వచ్చుటకు, ధనముకొరకు, దైవోపాసన, పూజలు, వ్రతములు మొదలగు దైవ కార్యములు చేస్తారు. ఇట్లు చేసేవాళ్ళను అర్థార్థులంటారు. కొందరు మాత్రము జ్ఞానముకొరకు, మోక్షముకొరకు దైవోపాసన, యోగముచేయుదురు. వీరు శ్రేష్ఠులు. వారు పరమ శాంతిని, మోక్షమును పొందుదురు. మానవులు పుణ్యమును ఆపే క్షించి, ధనమును ఆపేక్షించి, దైవోపాసన చేయక, జ్ఞానముతో యోగము చేయవలెను. అదియే సత్యస్వరూపమైన దైవోపాసన.

కొందరు చెట్లను దైవస్వరూపముగా భావించి పరిపూర్ణ విశ్వాసము కలిగి, చెట్లక్రింద కూర్చుని పూజలు చేయుదురు. చెట్లక్రింద భోజనము చేయు దురు. రావిచెట్టు అశ్వత్థనారాయణమని, వేపచెట్టు లక్ష్మీస్వరూపము అని వాటికి పూజలు చేయుదురు. వానిచుట్టు ప్రదక్షిణలు తిరుగుదురు. కార్తీక మాసమున ఉసిరిక చెట్టును పూజింతురు. స్త్రీలు ప్రతిరోజు తులసిచెట్టును పూజింతురు. పుణ్యము లభించునని వారి మూఢనమ్మకము. కొందరు

కలశమును పూజచేయుదురు. కలశము పంచభూతముల స్వరూపమని వారి నమ్మకము. వ్రతములు చేయువారు, వివాహములు చేయువారు ముందు మంత్రములు చెప్పి, కలశమును పూజచేయుదురు. బుద్ధ ధర్మమున "పూర్ణ కుంభము" అని కొబ్బరికాయ లేకుండా పూలు పెట్టి, పంచభూతములకు శాంతి చెప్పెడి సాంప్రదాయము కలదు. భూమి, నీరు, అగ్ని, వాయువు, అకాశము పంచభూతములు. అతివృష్టి, అనావృష్టి, తుఫాను, భూకంపము మొదలగుగాగల అరిష్టములు లోకమునకలుగగుచుండును. అటువంటివికలుగ కుండాయుండుటకుగాను, పంచభూతములకుశాంతిచేయుదురు.పూర్ణకుంభమున పంచభూతములున్నవి. పాత్రమట్టి భూమి. అందునీరు పోయుదురు. అచ్చట దీపము వెలిగింతురు. అది అగ్ని, వాయువు, ఆకాశము సర్వవ్యాప్తముగ నున్నది. అందుచేత పూర్ణకుంభారాధన అంటే పంచభూతములకు శాంతి. యోగులుకూడా తన యోగము ప్రారంభించుటకు ముందు పంచభూతములకు శాంతి చెప్పవలయును. అది సంప్రదాయము. అవిప్రత్యక్షముగా మానవులకు నిత్య, అవసరమైనవి. ఆధారమైనవి గనుక వీనికి శాంతి చేయవలయును మనము ఇట్లు చేయుట కృతజ్ఞతయగును. మనకు ఉపకారముచేయు. దేనికైనను మనము తిరిగి కృతజ్ఞత చూపవలయును.

మానవులు కొందరు సంగీతముతో దైవోపాసన చేయుదురు. ఏదో ఒక రూపమును విశ్వసించి వానిని వర్ణించుచు అనేకరాగములందు శ్రావ్యముగా భావయుక్తముగా, వినువారికి అనందముగా, తన్మయము చెందు విధముగా వారునూ భక్తియందు తన్మయమై పాడుచుదైవోపాసనచేయుదురు. ఈ ఉపాసన శ్రావ్యమైన కంఠముగల వారికేగాని సర్వులకు సాధ్యముకాదు. కొందరు నామస్మరణతో దైవోపాసన చేయుదురు. దేవుళ్ళకు అనేక పేరులు చెప్పుదురు. అందుతనకు విశ్వాసము, ఇష్టము, ప్రీతిగల నామమును నిరంతరము సర్వ కాలసర్వావస్థల యందును స్మరించుచు దైవోపాసన చేయుదురు. శరీరమునకు రెండు పనులుచేయుశక్తి యున్నది. బుద్ధితో శరీరము పని చేయుట, మనస్సులో నామస్మరణ చేయుట ఇవి పుణ్యములే కాని మోక్షార్హములుకావు. "శబ్ధబ్రహ్మాదివర్తతే" శబ్ధమును విడిచి సమాధి స్థితిని పొందినపుడే మోక్షార్హత. శబ్ధము ఉన్నంత వరకు మనసున్నది. మనసు

ఉన్నంతవరకు సంకల్పవికల్పములున్నవి అమనస్కముకాదు. అమనస్కము గాక, పరిపూర్ణముకాక మోక్షార్హతలేదు.

దైవోపాసనలో "అలంకారము చేయుట" అనుఆచారముకలదు. దేవునిసగుణ స్వరూపమునమానవాకారునిగాభావించిరాతితోగాని,లోహములతోగానిమట్టితో గాని,కర్రతోగాని విగ్రహముచేసి ఆవిగ్రహమునకు అభిషేకము నీటితోను,నేత తోను, పాలతోను, చేయుదురు. మంచి పట్టుబట్టలుకట్టబెట్టెదరు. పూల మాలలతోను విడి పువ్వులతోను అలంకారము చేయుదురు. మంచివిలువైన బంగారు ఆభరణములను ధరింప చేయుదురు. వింజామరలు వీచుదురు. కొబ్బరికాయలు కొట్టి కర్పూరహారతులిచ్చెదరు. అక్కడ నీరు తీర్థమని అక్కడ ఆరగింపుచేసిన పదార్థములను ప్రసాదమని స్వీకరింతురు. తినిన మలమగు ఆహారపదార్థము ప్రసాద మగునా? మనసునకు ప్రసన్నత నిచ్చునది ప్రసాదమగునుమనసురాగద్వేషరహితమై, సంకల్పవికల్పములులేక విషయవాసనలను తొలగించి ఆత్మప్రసన్నతను పొందించునది ప్రసాదము. సర్వదుఃఖరహితవైరాగ్యము, నిత్యానందము ప్రసాదము. ఈ విధమైన ప్రసాదమును తీసుకొనవలయును. ఆహార పదార్థములు ప్రసాదముకాదు.

దైవకార్యములు చేయించుటదైవోపాసనగా కొంతమంది భావించుచు న్నారు. కొంతమంది పండితులను పిలిపించి, వారికి భోజన వసతి కల్పించి, దక్షిణలు సమర్పించి వారి చేత కోటిజపయజ్ఞము చేయించెదరు. దానికి కావలసినధనము దాతల దగ్గర నుంచి వసూలు చేయుదురు. తాముచేయు దురు. ఇతరులచేత పుణ్యకార్యములు చేయించెదరు. చందాలు వసూలు చేసి ధర్మశాలలు కట్టించెదరు. వారిలో కొందరు ఆ వసూలు చేసిన ధన మును కొంతతాము అపహరించి, కొంత మాత్రమే ఖర్చుపెట్టెడివారుందురు. వారుదైవోపాసన పేరుతో, పెట్టుబడిలేని వ్యాపారముతో డబ్బుసంపాయించు చుందురు. వీరు పెద్దపెద్ద సభలు సమావేశములుకూడ జరిపించి ప్రసిద్ధి

చెందిన పండితులను గురువుల అభిమానించి, ఆహ్వానించి, ఉపన్యాసములు ఇప్పించి, ప్రజల అభిమానమును, ప్రభువుల అభిమానమునుకూడ పొందు చుందురు.

యజ్ఞములలో దైవోపాసన చేయుచుందురు. యజ్ఞములు నాలుగు విధములుగానున్నవి.1)ద్రవ్యయజ్ఞము 2)తపోయజ్ఞము 3) స్వాధ్యాయయజ్ఞము 4) యోగయజ్ఞము. ద్రవ్యయజ్ఞము ధనముఖర్చుపెట్టిచేయునది. అశ్వమేధ యాగము, రాజసూయయాగము మొదలగునవి ద్రవ్యయజ్ఞములు. తపో యజ్ఞము డబ్బుతో అవసరములేక, ఇంద్రియములను నిగ్రహించి, మనసును ఏకాగ్రతచేసి, స్థిరబుద్ధితో ఏదియో ఒకదేవతనువిశ్వసించి, దేవతానామమును స్మరించుచు, నియమిత ఆసనముపై కూర్చుని, తనలక్ష్యము నెరవేరువరకు చేయుదురు. ఈ తపోయజ్ఞము సాత్విక తపస్సు, రాజస తపస్సు, తామస తపస్సు, నిర్గుణ తపస్సు అని నాలుగు విధములుగా నున్నది. పుణ్యముకొరకు చేయుతపస్సు సాత్వికతపస్సు. స్వార్థలాభముకొరకు చేయు తపస్సు రాజసతపస్సు ఇతరులకు అపకారము నష్ట, కష్టములు కలిగించుటకు చేయునది తామసతపస్సు. జ్ఞానముకొరకు, మోక్షము కొరకుచేయు తపస్సు నిర్గుణతపస్సు. ఈ నాలుగు తపస్సులందు నిర్గుణ తపస్సు శ్రేష్ఠమైనది.

స్వాధ్యాయయజ్ఞ మనగా పవిత్రగ్రంథములను, శాస్త్రములను, నియమిత కాలములందు శ్రద్ధాభక్తులతో తప్పకుండా చదువుట. ఇతర ప్రాంతములకు పోవలసి వచ్చినను గ్రంథమును వెంటపెట్టుకొనిపోయి చదువుటయును, ఆ శాస్త్రధర్మములను ఇతరులకు బోధించుటయును స్వాధ్యాయయజ్ఞమే. పవిత్ర గ్రంథములను రచించుటయు స్వాధ్యాయయజ్ఞము యోగయజ్ఞము జ్ఞానముతో చేయునది. దీనికిధనము అవసరములేదు. విద్య అవసరములేదు. బుద్ధి, జ్ఞానము, వైరాగ్యము, ప్రజ్ఞ, దీక్ష అవసరము. ఈ యజ్ఞమును చేయుటకు సర్వమానవులకు అర్హతకలదు. ప్రభువులకు, కూలివారికి, స్త్రీలకు, పురుష లకు ఏ కులముఅయినను, పండితులకు, అవిద్యావంతులకు సర్వజనులకు

అర్హత కలదు. సంస్కార ప్రభావముగలవారు స్వయముగా చేసుకొన వచ్చును.

సంస్కార ప్రభావములేనివారు స్వయముగా చేయుటకుశక్తిలేనివారు, పరమదయాళురైన సద్గురువులనాశ్రయించి వారిఆజ్ఞను శిరసావహించి. శ్రద్ధా భక్తులతో ప్రవర్తించి నేర్చుకొనవలయును. ఈయోగ యజ్ఞమునకు శరీరము నకు వెలుపల ఏ వస్తువుతో అవసరములేదు. తన హృదయ సీమలో యున్న అజ్ఞాన అరణ్యమును ధృడమైన చిత్తముతో, వైరాగ్యమను శస్త్రము చేత నరికివేసి, జ్ఞానాగ్నిచేత కాల్చివేయవలయును. మోక్షరాజ్యమునుచేర్చు రథము వైరాగ్యము. ఇంద్రియములు గుఱ్ఱములు. మనసు కళ్ళెము. బుద్ధి సారథి. తృప్తి కొరడా అది కోరికల మీదికిఇంద్రియములను పోనీయక సాధ్వీ నమున నుంచును. ఈ రథమునకు దారి సక్రమముగా నుండవలయును. దారియందు అహంకారము అనురాతి బండలుండును. ఆశఅను అరణ్య ముండును. దారియందు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లనెడి ఆరుగురు దొంగలుందురు. వార్లు జ్ఞానధనమును అపహరింతురు. వారిని ప్రజ్ఞ యనెడి ఆయుధముతో తరుమవలెను, దారిలోనున్న కోరిక లనెడి చెట్లను జ్ఞానాగ్నిచేత దగ్ధము చేయవలయును. ఆశ అనెడి గుంట లుండును. వాటిని నిగ్రహమనెడి గడ్డపారతో పూడ్చివేయవలయును. సుఖములు, భోగములనెడి దుష్టమృగములుండును. వాటిని ఆత్మనిగ్రహమనెడి ఖడ్గముతో తరుమవలెను. అన్నింటికంటె మించినవి అహంకారము, గర్వ ములనెడి ఏనుగులు. అవిఅడ్డము పండుకొనియుండును. సద్బుద్ధియనెడి అంకు శముతో వాటినితరుమవలెను. ధైర్యము, శ్రద్ధా, దీక్షాయనెడిభటులనుతోడుగా తీసుకొని, జీవుని రథమున కూర్చుండ బెట్టి, పరంధామమును, మోక్షస్థానమును చేర్చవలెను.

జ్ఞానయజ్ఞముచేయు వానికి ఉండవలసిన లక్షణము అమానిత్వము, అభిదత్వము, అహింస, ఓర్పు, కపటము లేక త్రికరణ శుద్ధిగానుండుట, గురువులను పెద్దలను గౌరవించుట, సత్కరించుట నమస్కరించుట, అంతః

కరణ బాహ్యేంద్రియములు, శరీరము శుచిగానుండుట, ధైర్యము, తృప్తి ఆత్మనిగ్రహము, ఇంద్రియ విషయములందు వైరాగ్యము, అహంకారము లేక యుండుట, జన్మమృత్యు, జరావ్యాధి దుఃఖములను లక్ష్యపెట్టక యుండుట, వానికి లోబడకయుండుట, ఇష్టాయిష్టము లందు సమచిత్తమును కలిగియుండుట, ప్రాప్తించిన దానితోతృప్తిపడుట, "దైవమునందు పరిపూర్ణ విశ్వాసము కలిగి యుండుట, సర్వము దైవశక్తి వలన పరివర్తన చెందు చున్నది, కార్యము ప్రకృతివలన జరుగుచున్న" దను జ్ఞానవిజ్ఞానములు కలిగియుండుట, పరోపకారబుద్ధి కలిగియుండుట. దుష్టసంఘములందు చేరకుండుట, వ్యసనములు లేక యుండుట, సర్వకాల సర్వావస్థలయందును ఆత్మతత్వజ్ఞానము కలిగి యుండుట.

జ్ఞానయజ్ఞముచేయు యోగి అనుసరించవలసిన ధర్మములు సకల భూతము లయందు మిత్రభావమున ఏ ప్రాణినిద్వేషింపక, హింసించక, దయకలిగి యుండుట, కులతత్వము, బంధుప్రీతి, పక్షపాతములేక సమత్వ బుద్ధిని కలిగి యుండుట, సుఖములను, భోగములను కోరక ఆత్మానందమును అనుభ వించుట, దుఃఖము, విచారమును, దిగులు పడక నిత్యసంతోషిగ నుండుట, ఆత్మవిశ్వాసము కలిగి ఆత్మయే ఉద్ధరించెడిఆత్మబంధువను సత్యమును తెలిసి కొని ఆత్మజ్ఞానము కలిగియుండుట. పుట్టుటసత్యము. పుట్టినవారికి సుఖదుఃఖ ములు సత్యము. ముసలితనము సత్యము. మరణము సత్యము. మరణించిన వారు జన్మించుట సత్యము. పరంధామమును చేరినవారు పునర్జన్మ లేక యుండుట సత్యము. ఈ సత్యములను తెలిసికొని సంచరించ వలయును. లోకమువలన తాను భయపడరాదు. తన వలన లోకమునకు భయముండరాదు. భోగభాగ్యములందు వైరాగ్యముగలిగియుండవలయును. కార్యసాధనయందు ప్రజ్ఞ కలిగి యుండుట, లంభించినదానితోతృప్తిపడి సంతోషముగా నుండుట, అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము వ్యసనత్యాజములను అనుసరించుట, పరమాత్మ దివ్యతేజస్సును జ్ఞాననేత్ర మున దర్శించుట, పరమాత్మయందు దృఢమైన చిత్తము, స్థిరమైన బుద్ధికలిగి యుండుట, ప్రకృతి విలక్షణముగ నివృత్తి మార్గమున నుండుట.

మరియును సంఘమునందు సేవచేసి, సంఘమును సంస్కరించి. సంఘమునందలి దోషములనుతొలగించి,సంఘమునందు సామూహిక దైవోపాసన బోధించుట, సంఘమునందలి దురాచారములను దురభ్యాసములను తొలగించుట, సదాచారములను సద్బుద్ధిని నెలకొల్పుట తానున్న, స్థలమునందేకాక ఇతరప్రాంతములకు దారులు సక్రమముగా లేకయున్నను ప్రయాణ సౌకర్యములు లేక యున్నను పాదయాత్రచేసియైనను సంఘమునకు జ్ఞానోపదేశము చేయుట. ఇతరులకు జ్ఞానోపదేశము చేయువారితో సమానమైనవాడు మరొకడులేడు. అతడు శ్రేష్ఠుడు. ఉత్తముడు. బోధించువారిలో తాను అనుభూతిని పొంది ఇతరులకు బోధించువాడు శ్రేష్ఠుడు. గ్రంథములు చదివి అనుభవము లేకయే ఇతరులకు బోధించువాడు విరబూసిన మోదుగ పువ్వుతో సమానము. మోదుగపువ్వుచూచుటకు అందముగానుండును. కాని సువాసనయుండదు. తానుఅనుభవించి బోధించు వాడురోజా పువుతో సమానము. రంగు అందము సువాసన కలిగి అది యుండునటు లత డుండును. తాను బొందిన జ్ఞానమును ఇతరులకు బోధించనివారు పరమలోభులు, సంకుచిత బుద్ధిగలవారు. అట్టివారు సంఘద్రోహులు. మానవులు అటులుండరాదు. సంఘోద్ధారకులుగ నుండవలెను. జ్ఞానయజ్ఞము చేయువారు ఈ ధర్మములనెరిగి యుండవలెను. ఇతరయజ్ఞములు మోక్షము నివ్వజాలవు. కించిత్ పుణ్యమును మాత్రము ఇవ్వగలవు. పుణ్యము జీవునకుబంధహేతువు. అందువలన ఆయజ్ఞములు పవిత్రమైనవికావు.

దైవోపాసనయోగములుకూడమూడుగలవు. కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము. కర్మయోగము ప్రతిఫలము అపేక్షించక కర్మలు చేయుట, సంఘమునకు ఉపకారముచేయుట, సంఘము నడచుటకుదారులుఏర్పరచుట, నీటివసతులు, బావులు త్రవ్వించుట, చెఱువులు త్రవ్వించుట నదుల నుండి కాలువలు త్రవ్వించుట, వైద్యశాలలు, పాఠశాలలు నిర్మించుట, ప్రయాణీకులకు వసతి కల్పించుట, చెట్లును పెంచుట, బీదలకు పెండ్లిచేయుట. విద్యను చెప్పించుట, చేయవలసిన స్వధర్మమును సకాలమునకుసక్రమముగాచేయుచు తన జీవితమును గడుపుట, ధర్మసమ్మతమైననిషిద్ధముగాని కర్మనుచేసి జీవిం

చుట, బీదలకు ఇండ్లు కట్టించియిచ్చుట. తనకార్యమునకు భంగము కలిగినను లక్ష్యపెట్టక చేయుట. ఒకరైతు పొలమును దున్నుచుండెను. ఒక వ్యాధిగ్రస్తుడు నడువలేక పడిపోయెను. రైతు నాగలిని విప్పివేసి, తాను తనపని నిలిపివేసి, ఆవ్యాధిగ్రస్తుని భుజమున ఎక్కించుకొని వైద్యునికడకు మోసికొని పోయెను. ఇది కర్మయోగము ఇదిపుణ్యమును మాత్రమే ఇవ్వగలదు. మోక్షమును ఇవ్వజాలదు.

భక్తియోగమనగాసగుణోపాసన. దేవునకురూపమునిచ్చి ఒకనామమును ఏర్పరచుకొని ఆనామోచ్చరణ చేయుట, అవిగ్రహమునకు అభిషేకము చేయుట, విలువైనపట్టు బట్టలు ధరింపచేయుట, మంచిశ్వంగారమైన బంగారు నగలు అలంకరించుట, పూలమాలలు, పుష్పములు రకరకాలుగా అలంకరించుచు చూచుటకు అందముగానుండునట్లుచేయుట మంత్రములు చెప్పి పూజలుచేయుట,హారతులిచ్చుట, భక్తులు రకరకాలవంటలుచేసి నివేదనసమర్పింతురు.సంగీతపరిజ్ఞానముగలవారు. శ్రావ్యముగా రాగయుక్తముగాపాటలు పాడిభజనలు చేయుదురు. ఏడురోజులు నిలుపకుండా సప్తాహములుగా ఒకే నామము ఉచ్చరించి భజనలు చేయుదురు. ఈ దేవుళ్ళకు వాహనములు కూడా ఉండును. అవాహనాలతో నగరరోత్సవములు కూడ చేయుదురు. కొన్ని పర్వదినములందు ఆదేవునిపేరుతో ఒక్కప్రొద్దులని ఒకపూట అన్నం తినకుండా ఉపవాస ముంటారు. ఇది భక్తియోగము. పూజల వలన మోక్షమురాదు. ఉపాసన నామరూప రహితమైనపుడే (నిర్గుణోపాసనవల్లనే) మోక్షార్హత కలుగును.

మోక్షార్హతనిచ్చునది జ్ఞాన యోగము ఒక్కటే. ఈ యోగసాధనకు ధనము అవసరములేదు. విద్య అవసరములేదు. శరీరమునకు వెలుపల ఏ వస్తువుతో అవసరములేదు. శరీరమునకు వెలుపలి యింద్రియముల స్పర్శతో అనుభవించు సుఖములు, బోగములు, దుఃఖమునకు కారణమగును. అందు వలన యింద్రియసుఖములను, భోగములను అపేక్షించక జ్ఞాన యోగి తన శరీర అంతర్భాగముననుండు ఆత్మానందమును అనుభవించును. శరీరమునకు వెలుపల నుండు అన్యదేవతలను, దైవాంశసంభూతులను ఉపాసించక తనలో ఆత్మగానుండు పరమాత్మ దివ్యతేజస్సును [అంతర్జ్యోతిని] సుషుమ్నా శ్వాసతో ఉపాసించును.

# ఇరువదినాలుగవ అధ్యాయము

## (ధ్యాన యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షులారా! మనము ఇంతవరకు మానవుని నడవడిక ఎట్లా ఉండాలో? మానవుడు, మానవుడుగా ఎట్లా జీవించాలో? శ్రీబుద్ధగీతోపదేశం ద్వారా తెలుసుకొన్నాము. ప్రతి మానవుడు అష్టాంగ మార్గాన్ని, పంచశీలములనూ, అవలంబిస్తూ మధ్యేమార్గమును స్వీకరిస్తూ, తథాగతుడు ఏయోగాన్ని అవలంభించి జ్ఞానాన్ని సముపార్జించి బుద్ధుడైనాడో ఆయోగాన్ని మనంకూడా అభ్యసించాలి ఒట్టిమాటలు చెప్పడం కంటే సాధనంచెయ్యడంముఖ్యము. సాధన లేనిదే ఎరుకపడదు. సాధనలో సిద్ధినిపొందినమహాత్ములు, యోగులు స్వానుభవంతో వివరించినప్పుడు మనము కొంత వరకు ఆ యోగరహస్యాన్ని తెలిసికొని సాధన చేయుటకు వీలవుతుంది. కానీ కేవలం వాచా వేదాంతం వలన, వినికిడి వలన, గ్రంథములను చదువుట వలన, ఆ తత్త్వాన్ని తెలిసికోవటం మనకు సాధ్యం కాదు. బుద్ధభగవానుడు శుద్ధోధన మహారాజు పుత్రుడై సిద్ధార్థుడుగా ఉన్నప్పుడు అందరు రాజకుమారులవలెనే వేదవేదాంగాలనూ, గుఱ్ఱపు స్వారీ, విలువిద్య మొదలగు క్షత్రియోచిత విద్యలనూ, అభ్యసించాడు. ఆయన జీవితం ఒక రాజకుమారుని జీవితంలాగ సాగిపోయింది. యుక్తవయస్సు రాగానే యశోధర అనుకన్యను వివాహం చేసుకున్నాడు. రాహులుడనే పుత్రుడు కలిగాడు, ఆ సమయంలో సిద్ధార్థుని మనస్సులో తీవ్రమైన ఆందోళన చెలరేగింది. "అనాదికాలంనుండి ఎందరో అవతార పురుషులు, ఈ అవనిపై ఉద్భవించారు. వారు హింసతోనే దుష్ట శిక్షణతోనే ధర్మస్థాపన చెయ్యటానికి పూనుకొన్నారు. వీరు తాత్కాలికముగా ఫలితాన్ని పొందారేకాని సమూలంగా దౌష్ట్యాన్ని ఈ ప్రపంచములో రూపుమాపలేక పోయారు. మానవులలో నైతిక విలువలను పెంపొందించలేక పోయినారు." ఈ ఆలోచన రాగానే బుద్ధుడు ఇంద్రియ సుఖములలో నిజమైన సుఖము లేదని గ్రహించాడు. ప్రజలు పుట్టటాన్ని, చావటాన్ని, వ్యాధిగ్రస్తులు కావటాన్ని, వృద్ధాప్యము పొంది మరణించటాన్ని చూచాడు. ఈ బాధలనుండి మానవ సమాజాన్ని తప్పించి, విశ్వశాంతిని నెలకొల్పాలని

సంకల్పించాడు, దానికొరకై తపించాడు. విశ్వశాంతిని స్థాపించటానికి, అహింసయే మార్గమని గ్రహించాడు. పర్వతప్రాంతానికి ప్రయాణాన్ని సాగించాడు. ఎందరో సిద్ధులనూ, యోగులనూ దర్శించి, విశ్వంలో శాంతిని నెలకొల్పటానికి ఏంచెయ్యాలో చెప్పవలసిందిగా అర్థించాడు. కొందరు మహాత్ములు చెప్పినట్లుగా ఆరు సంవత్సరములు కఠోరతపమును ఆచరించాడు. దేహం శుష్కించిపోతున్నది. కాని ఆయన సమస్య పరిష్కారం కావటంలేదు.

ఇట్లా ఆయన తపస్సు చేసుకొంటుంటే ఆదారినే కొందరు గాయనీమణులు నగరంలో ఉత్సవాల్లో పాల్గొని, ఆ అరణ్యమార్గం గుండా పాటలు పాడుకొంటూ ఆనందంగా తమ గ్రామానికి తిరిగిపోతున్నారు. వాళ్ళుపాడుతున్నపాటలోని "వీణాతంత్రులు వదులు వదలుగా బిగియింపకె ఓ సఖియా! వదులగు తీగెలు తగు సుస్వరములు పలుకలేవు ఓసఖియా! గట్టిగ తీగలు లాగి బిగించిన తీగలు తెగునని తెలియవె సఖియా!" అన్నచరణం సిద్ధార్థుణ్ణి ఆకర్షించింది. ఆయన దాని భావాన్ని ఆలోచించటం మొదలు పెట్టాడు. పరమార్థం బోధపడింది. మధ్యేమార్గం స్ఫురించింది. "సాధకుడు ఉపవాసాధికఠినాతి కఠిన నియమాలు పెట్టుకొని, తీవ్రాతితీవ్రంగా తపస్సుచేస్తూ, వైరాగ్య జీవితమే జీవితమని భావించరాదు. అట్లాగని తపస్సునుపూర్తిగా పరిత్యజించి, దైహిక వాంఛలను సంతృప్తి పరచుకోవడమే జీవితంగానూ భావించరాదు. ఈ రెండు మార్గాలూ విసర్జనీయాలే! మధ్యేమార్గాన్ని చేపట్టాలి" అనుకున్నాడు. వెంటనే సుజాత ఒసగిన భిక్షను స్వీకరించి, ఉరువేలను వదలిపెట్టి, గయకువెళ్ళి, అక్కడ నైరంజీరా నది ప్రక్కనగల బోధివృక్షం క్రింద కూర్చొని ధ్యాన నిమగ్నుడయ్యాడు. నాలుగు వారాలు గడిచింది. వైశాఖ పౌర్ణమినాడు ఆయనకు జ్ఞానోదయమైంది. బుద్ధుడైనాడు.

# ధ్యానయోగము



విపశ్యన



పంచకోశములు

ఆయన నాలుగు దశలలో సంపూర్ణ జ్ఞానం పొందాడు. మొదటిదశలో "దుఃఖానికి హేతువేమిటి?" అనే శోధనను ఆయన చేపట్టాడు. ఆయన ఒంటరితనం దానిని సులభంగా గ్రహించడానికి తోడ్పడింది. రెండవ దశలో ఆయన దానికి ఏకాగ్రతను జోడించాడు మూడవ దశలో సమచిత్తం, అప్రమత్తతలను వినియోగించుకొన్నాడు. నాలుగవ దశలో స్వచ్ఛతను సమచిత్తానికీ, సమచిత్తాన్ని అప్రమత్తతకు సంధించాడు. స్థిర చిత్తంతో ఆయన అట్లాధ్యానంలో మునిగాడు నాలుగవ వారం చివర వైశాఖపౌర్ణమి నాడు, మొదటి జాములో ఆయనకు "పూర్వనివేశానుస్మృతి జ్ఞానం" కలిగింది. రెండవ జామున "దివ్యచక్షు జ్ఞానం" కలిగింది. మూడవ జామున " పతీత్య సముత్పాద సత్యం" అర్థమైంది. నాలుగవ జామున!" జీవిత "మంతాబాధలతో, అసంతృప్తితో, రోగులతో కూడి ఉండి, సంతోషాన్ని పొందలేక పోవటం చేత అది దుఃఖ మయమై ఉంది. 2. స్వార్థంతో కూడిన కోరికయే ఆ దుఃఖానికి కారణం 3. కోరికలను నశింపచేస్తే దుఃఖం కూడా నశిస్తుంది. 4. మధ్యేమార్గాన్ని అవలంబించి పవిత్ర జీవనం గడిపితే నిర్వాణం (లక్ష్య సిద్ధి) కలుగుతుంది." అనే చతురార్యసూత్రాలు బోధపడ్డాయి. సమ్యక్ సంబోధి అయిన తర్వాత ఆయన బుద్ధుడయ్యాడు. బుద్ధత్వప్రాప్తి కలిగిన ఆ సుముహూర్తంలో ఆయన నోటినుండి ఈలా దివ్యవాణి వెలువడింది.

"అనేకజాతి సంసారం సంధానిస్సం అనిబ్బిసం
గహకారం గవేసంతో దుఃఖాజాతి పునప్పునం॥
గహకారక దిట్ఠోసి పునగేహం నకాహసి
సబ్బాతే ఫాసుకా భగ్గా గహకూటం నిసంఖతం
నిసంఖార గతం చిత్తం తష్హానం ఖయ మజ్ఝగా॥"
(ధమ్మపథం)

"ఈదేహమనే గృహాన్ని నిర్మిస్తున్న వాడెవరో తెలుసుకోవడానికి అన్వేషణ మొదలు పెట్టాను. అతడెవరో తెలుసుకోకలేకపోవటం వల్లనే అనేక

జన్మలెత్తుతూ ఇన్నాళ్ళు ఈ సంసార చక్రంలో పరిభ్రమించాను. మళ్ళీమళ్ళీ జన్మ లెత్తాలంటే దుఃఖం కలుగుతుంది. ఓ గృహ నిర్మాతా! ఇప్పుడు నీ వెవరివో కనుక్కొన్నాను. ఇక నీవు నాకు ఇల్లు కట్టలేవు. నీవు కట్టినగోడలు, స్తంభలూ, దూలాలు, వాసాలూ అన్నీ కుప్పకూలిపోయాయి. నా చిత్తం నిర్వాణం పొందింది. అర్హత అనే ఫలం నాకు లభించింది." భిక్షులారా! తథాగతుడు పేర్కొన్న ఆగృహ నిర్మాత ఎవరోకాదు. అది తృష్ణ!

తథాగతుడు నాలుగు వారాలపాటు బోధి వృక్షం క్రింద చేసింది తపస్సు కాదు. ధ్యానం. ప్రకృతి లోపలా, బయటాక్షణంక్షణం మారుతున్నట్లు ఆయన గమనించాడు. జీవితాలూ క్షణంక్షణం మారుతుంటాయి. ఆలోచనలూ క్షణంక్షణం మారుతుంటాయి సర్వము ప్రతిక్షణము మార్పుచెందుతూ ఉన్నది. మార్పుచెందని దానికోసం ఆ నాలుగు వారాలు ఆయన తీవ్రంగా అన్వేషించాడు తనలోనికితాను అవలోకించటం మొదలు పెట్టాడు. అదే "విపశ్చన", విపశ్చన అంటే"విశేషరూపేణ పశ్యతిఇతివిపశ్చన"అని తనలో తాను విశేషంగాచూచుకోవటమే! (వెతుక్కోవడమే).తనశరీరంలోపలనే విశ్వ మంతాఉంది.పాలపుంతలు,నక్షత్రసమూహములు,వివిధగ్రహములు,చతుర్దశ భువనాలు, సప్తసముద్రములు, పర్వతసమూహములు, వనములుఒకటేమిటి! సరుస్త విశ్వం మనలోనే ఉన్నది. కాని క్షణక్షణము మార్పు చెందుతున్నవి. స్థిరత్వములేక యున్నవి. కాబట్టి ఆచంచల ప్రకృతిని మన లోపలనే మనం విశేషంగా చూచుకోవాలి. మనలోగల విశ్వమున కావల స్థిరమైన ఆత్మ ఉన్నది. దానినే మనం తెలుసుకోవాలి. మనలోకి మనం ప్రయాణంచేయాలి. ఆజ్యోతి స్వరూపాన్ని అవలోకించి మరల జన్మలేని వాళ్ళం కావాలి. ఈ ఆత్మసాక్షాత్కారానికి బుద్ధభగవానుడు శారీరకశ్రమ, ప్రాణాయామం, ధ్యానము అత్యంత ఆవశ్యకములని బోధించాడు. తాను ఆచరించి, కోరిక లను నిర్మూలించుకొని, నిశ్చలమైన బుద్ధిని పొందాడు. ఉపనిషత్తులలో"అను పశ్యంతి ధీరాః" అని చెప్పారు. ఇక్కడ "అను" అంటే నీ లోపలఉన్న చంచల ప్రకృతికావల" అని అర్థం. "పశ్యతి ధీరాః" అంటే దానిని(చంచల

(ప్రకృతి కావలయున్నదానిని) చూచినవాడే ధీరుడని భావము. ఆ దర్శన భాగ్యంకోసమే బుద్ధ భగవానుడు ధ్యానంచెయ్యమని చెప్పాడు. ఆ విధానం తెలుసుకొందాం.

శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :

ప్రబుద్ధులారా! ఇంతవరకు మీకు ధ్యాన స్థితిని పొందటానికి కావల సిన అర్హతను కలిగించే ప్రవర్తనను గురించి, మనస్సును నిగ్రహించుకొనే గురించి దీక్షను గురించి బోధించటం జరిగింది. మానవునిలో ఈ విశ్వంతో అంతర్భూతమైయున్న మహాశక్తి యావత్తూ ఉన్నది. తానొక మహాశక్తి కేంద్రమన్న విషయాన్ని మానవుడు మరచిపోయి. దుర్బలుణ్ణని ఆక్రోశిస్తు న్నాడు. తాను ఆనందస్వరూపాన్నన్న విషయాన్ని విస్మరించి, విషయ వాంఛలకు లోనై, దుఃఖాన్ని కొని తెచ్చుకొంటున్నాడు. ఇది విచారించదగ్గ విషయం. ధ్యాన స్థితి, యోగాభ్యాసం మానవుని సచ్చిదానంద స్వరూపునిగా మారుస్తవి. కర్మ, భక్తి, జ్ఞానంలో పర్యవశించకపోతే మనస్సు నిశ్చలం కాదు. మనస్సు స్థిరపడటమే జీవన్ముక్తి. ఏ మార్గాన్ని అనుసరించిన వారైన ననూ సరే! చివరి చేరుకోవలసిన గమ్యస్థానమదే! ముందుగా మీకు ధ్యానాన్ని గురించి చెబుతున్నాను. సావధానంగా వినండి!.

ధ్యానమునకు ఆద్యంతములులేవు. ధ్యానంచేయని హృదయం ఎడారి వంటిది. ఎవరంతటవారే ధ్యానం చేసుకోవాలి. అంతేకాని ధ్యానాన్ని ఇత రులకడ మనము నేర్చుకొనలేము. మీలోపల బయట, మిమ్మల్ని మీరు బాగా పరిశీలించుకోవటమే ధ్యానము. మీనడవడికను, ఆహారాన్నీ మీరు మాట్లాడే తీరును, మీ మనస్సు కల్పించే సంకల్పాలను, మీకు ఇతరులపై గల ద్వేషాన్ని, అసూయను, కోపాన్ని, అహంకారాన్నీ మదాన్నీ, స్వార్థాన్నీ, ఈమొదలైన వాటి నన్నింటినీగమనిస్తూ ఉండటమేధ్యానం. వీటిని గమనిస్తూ ఉంటే ఇవిక్రమక్రమంగా మీ నుండి తొలగి పోతవి. పర్యవసానంగా మీరు పరిశుద్ధులౌతారు. మీలోని కోరికలు, ఆలోచనలు, నశించటమే నిజ

మైన ధ్యానం. ఆలోచనలు లేని, స్థితిద్వారా మనం కాలమునకు అవతలి. ప్రక్క చేరుకోగలము. కోరికలునశిస్తేసంకల్పములు ఆగిపోతవిసంకల్పములు ఆగిపోతే నిశ్శబ్దబ్రహ్మం మనకు లభిస్తుంది. ధ్యానాన్ని ప్రేమతో చెయ్యాలి. విశ్వంలోగల సకలజీవరాశియెడల ప్రేమ, కరుణ, దయ కలిగియుండాలి. ప్రేమలో విభేదాలు ఉండరాదు. దగ్గర దూరము లుండరాదు. విభజనలుండరాదు. గొప్పవారు తక్కువ వారని విభేదములు ఉండరాదు. ప్రేమ విడదీయరాని శక్తి. ప్రేమ కలిగిన మనస్సే ధ్యానంలో నిశ్శబ్ద తత్వాన్ని పొందుతుంది. కాబట్టి మిమ్మల్ని మీరు సదా పరిశీలించుకుంటూ ఉండాలి. క్షణక్షణం మార్పు చెందుతున్న అనంతమైన మిలోని పకృతితత్వాన్ని పరిశీలిస్తూ ఉండి జీవితంవేరు ధ్యానంవేరు కాదు. రెండూ కలిసి ఉండటమే నిజమైన ధ్యానం. కాలం, దూరం, ఆలోచనలుఆగిపోవుటయేధ్యానం. ఎవరూ మార్గ్గ లేనిదిధ్యానం. మనమేఅర్థం చేసుకొనగలశక్తి అనెడి పుష్పం వికసించటమే ధ్యానం ఇదిమన జీవితశైలిని, మనఆలోచనా విధానాన్ని, మనంచేసే పనులను పూర్తిగామార్చి వేస్తుంది మిమ్మల్ని మీరు తెలుసుకొన్న తక్షణమే అన్నికష్టములు, విచార ములు మీ నుండి తొలగి పోతాయి. బాహ్య చైతన్యమును అంతర్గత చైతన్యమును ఒకటిగా తెలిసికొనుటయే ధ్యానం. దానినిఅభ్యసించండి. మీలో, మీమెదడులో దాచబడినజన్మజన్మల ఆలోచనలను విషయములను, అనుభవములను తెలిసికొనుటయే ధ్యానం అసమానతలను తొలగించగల నిష్కామ కర్మను సహజంగా చేయుటయే ధ్యానము. ధ్యానము మన కర్మ లను పరిశుద్ధంచేసి ఆత్మసాక్షాత్కారాన్ని కలుగచేస్తుంది. ఇతరుల నుండి విడ దీయు ఆలోచనలుండుటవలన, ఇతరులకన్న ఎక్కువఅనెడిభావముకల్గియుం డుటవలన మానవుడు అనేక బాధలకు గురి అవుతున్నాడు. ఈభావాల్ని వది లించుకోవటమే ధ్యానం. స్వార్థం లేకుండా ఉండటమే ధ్యానం. మానసిక శారీరక ఆరోగ్యము ఉన్నప్పుడే మన భావములు చాలా ఉన్నతములుగాను, సున్నితములుగాను, పటిష్ఠంగాను ఉండి. మనజీవిత విధానమును కాపాడ తాయి. మనలో నిక్షిప్తమై, అదృశ్యంగా ఉన్న దివ్యశక్తిని పూర్తిగా బహిరంగపరచుకోవటమే ధ్యానం. ''నేనొక దివ్యజ్యోతిని. నిస్వార్థమైన

ప్రేమ"నని అంతులేని ఆనందాన్ని అనుభవించటమే ధ్యానము. నిశ్శబ్దము యొక్క చర్యయే ధ్యానము. ఎరుకతో గాఢనిద్రయే నిజమైన ధ్యానము. ధ్యానం చెయ్యటానికి ముందు హృదయాన్ని నిస్వార్థమైన ప్రేమతో నింపుకోవాలి.

ప్రకృతితి 24 తత్వాలుకలిగియున్నది. పంచభూతాలు 5, పంచేంద్రియాలు 5, జ్ఞానేంద్రియాలు, 5, గంధాదులు 5, మనస్సు అహంకారము, మహత్తు ప్రకృతి-మొత్తం 24 ప్రకృతి తత్వాలు. "పంచవింశోయం పురుషః" అని 25వ వాడు పురుషుడు ఈ 25 తత్వములకు అంతరాత్మగా పరమేశ్వరుడున్నాడు. అదే ఆత్మతత్వం. అందువలన ఈ బుద్ధగీతను నేను ఇరువది ఐదు అధ్యాయాలుగా చేసి ఇప్పుడు ధ్యానాన్ని బోధిస్తున్నాను. ధ్యానానికి మొదట మనము మన శరీరప్రకృతియొక్క చర్యలను పరిపూర్ణంగా గమనించాలి. అందుకు సులభమైన మార్గం ఒకటున్నది. దాన్ని మీకు తెలియ జేస్తాను.

ఉదయాన్నే కాలకృత్యములు తీర్చుకొని, రెండు చెంచాలు పరిశుద్ధం చేసిన సూర్యముఖి నూనె (పొద్దు తిరుగుడు పూవునూనె)ను నోట్లో వేసుకొని, మింగకుండా ఒక అరగంటసేపు పుక్కిలించాలి. తరువాత ఆ నూనె యావత్తు నీరుగామారి పోతుంది. దాన్ని ఉమ్మేసి, నోరు శుభ్రంగా కడుక్కోవాలి. ఇలానే సాయంత్రం సూర్యాస్తమయకాలంలో కూడా చెయ్యాలి. ఇట్లా ప్రతి దినము చేస్తూ ఉండాలి. మన మస్తిష్కములోగల నాడుల కొసలు బుగ్గల్లో వ్యాపించి ఉంటాయి. మనం పుక్కిలించినపుడు వాటికి కదలిక కలిగి మన ఆలోచనలు పరిశుద్ధమౌతాయి, మనలో వ్యాధులు కలగటానికి కారణం మనలోని దురాలోచనలే. ఒక దురాలోచన ఆనందమయ కోశంనుండి బయలుదేరి విజ్ఞాన మయ కోశం, మనోమయకోశము, ప్రాణమయ కోశమును తరించి అన్నమయకోశం మీదకు చేరుకొని వ్యాధిగాపరిణమిస్తుంది. అందువలన మనం దురాలోచన కలుగకుండా జాగ్రత్త పడాలి. ఈ తైల చికిత్స వలన మన మానసిక శారీరక ఆరోగ్యాలు చక్కబడతాయి. మన శరీరంలో

గల ప్రతి అణువు, ప్రతి అవయవము వాటి చర్యలు, ప్రతి చర్యలు మనకు అవగతమౌతాయి. ఈ చికిత్స చేసిన తర్వాత, పళ్ళుబాగాతోముకొని, ఒక రాగి చెంబెడు నీళ్ళు తాగాలి. ఈ చికిత్స చేస్తున్నప్పుడు మొదట శైత్య భారం కలుగుతుంది. ఉష్ణోగ్రతకూడా పెరుగుతుంది. కఫంపస్తుంది. వీటిని చూచి భయపడరాదు. నిత్యం చికిత్సకొనసాగిస్తునే ఉండాలి. క్రమక్రమంగా పై బాధలు తోలగి ఆరోగ్యం సిద్ధిస్తుంది. నేను చెప్పిన ధ్యానం ఆచరించే ప్రతివ్యక్తి నిత్యనియమంగా ఈ తైల చికిత్స చేసుకోవాలి. లోపలి విష క్రిములకు మన నోరు వేదిక వంటిది. ఈ తైల చికిత్స వలన నోటిలో విషక్రిములు మరణిస్తవి. ఇది జీవహింస కాదు. ఈ చికిత్సను ఒక సంవత్సరం పాటు ఆపకుండా కొనసాగించాలి.

మనము బ్రహ్మానందముగా జీవించటానికి మంచి ఆరోగ్యము కావాలి. అనారోగ్యం కలగటానికి ముఖ్యంగా ఐదు కారణములున్నవి. 1) మనం తీసుకునే ఆహారం పౌష్టికంగా, మితంగా, సమతుల్యంగా లేకపోతే మన శరీరం అనారోగ్యం పాలౌతుంది. 2) మనంచేసే కర్మ సక్రమంగా లేనట్లయితే మన ప్రాణమయకోశం, అనారోగ్యం పాలౌతుంది. 3) విశ్రాంతికి లోపం కలిగినట్లయితే మన మనోమయకోశం దెబ్బతింటుంది. 4) అనేక జన్మలనుండి మనంవెంట తెచ్చుకున్న ఆలోచనలు, కోరికలు మొదలైనవి, మన మెదడులో నిక్షిప్తమై ఉన్నాయి. బయటకు వచ్చే ఆలోచనలకు అవియే స్ఫూర్తినిస్తాయి. మనం ఆలోచనలను సక్రమంగా చూసుకోకపోతే, విజ్ఞానమయకోశం దెబ్బతింటుంది. 5. మనం ఆలోచన సరిగ్గా చేయకపోయినట్లయితే ఆనందమయకోశం దెబ్బతింటుంది. కావున ఈ ఐదింటిని ఎక్కువ తక్కువలు లేకుండా గమనిస్తూ సరిచేసుకొంటూ ఉండాలి.

ఒక సమతల ప్రదేశంలో మెత్తటి దుప్పటి పరచుకొని, ఉత్తరాభిముఖంగా, మీ ఇష్టం వచ్చిన ఆసనంలో కూర్చోవాలి. ధ్యానానికి కూర్చునే ముందు శారీరక శ్రమ ఒక గంటసేపు చెయ్యాలి. పవనముక్తాసనాలు, సూర్య నమస్కారములు మొదలగునవి చెయ్యాలి. తదనంతరం ఒక ఐదు నిమిష

ములు శవాసనంలో విశ్రాంతిని పొందాలి. తర్వాత కదలకుండా కూర్చొని "విపశ్చన" చెయ్యాలి. విపశ్చన అనగా నిన్ను నీవు బాగా పరిశీలించు కోవటం, ప్రకృతి యావత్తూ లోపల, బయట, క్షణక్షణము మార్పు చెందుతూ ఉన్నది. ఈ మార్పుచెందేవి మనకు శాంతిని ప్రసాదించ లేవు. వాటి కావల ఉన్న నిశ్చల ప్రాణమే మన గమ్యం కావాలి. నిశ్చల ప్రాణం చెంతకు మనం (మనస్సు) ప్రయాణం చెయ్యాలి. దీనికి ఏకాగ్రత చాలా అవసరం మనస్సు ఎప్పుడూ మారుతూఉంటుంది. చంచలంగా ఉంటుంది. దాన్ని ఏకాగ్రం చెయ్యాలి, మా చంచల ప్రాణములు శ్వాసగా మారి, ముక్కులోనుంచి బయటకు వస్తూపోతూ ఉంటాయి, వస్తూపోతూ ఉన్నంత కాలం మనోసంచారాన్ని నిలపటం చాలా కష్టమౌతుంది. మనం మన ఎరు కను మన శ్వాసలపై కేంద్రీకరించాలి. శ్వాసబయటికి వస్తుంది. లోపలికి పోతుంది. మళ్ళీ బయటికి వస్తుంది. లోపలకు పోతుంది. దాన్ని గమనిస్తూ ఉండాలి. మీ శ్వాసలను బలవత్ పూర్వకంగా చేయరాదు, ప్రకృతి సహ జంగా మీరు చేసే శ్వాసలను మాత్రమే గమనిస్తూ ఉండాలి.

శరీరంలోపల ప్రతి కణమూ, ప్రతి అవయవమూ, క్షణంక్షణం మారుతూ ఉన్నవి. ఒక క్షణమునకు మన శరీరములో 57లక్షల జీవకణములు పుడుతూ ఉంటాయి. కాలేయములో శిరము (స్ప్రీన్) మాంసకృత్తులు ప్రతిరోజూ మార్పు చెందుతూ ఉంటాయి. ఊపిరితిత్తులు, మెదడు, చర్మము, ముఖ్య కండర ములలోని మాంసకృత్తులు మారుతూ ఉంటాయి. జీవకణముల మధ్యగల అకర్షణ, వికర్షణలవలన మన జీవితం సాగుతూ ఉంటుంది. మనలోని ఈ చర్యలను నిత్యం విపశ్చనతో మనం గమనిస్తూ ఉండాలి. అశాశ్వతములైన, క్షణక్షణమూ మార్పులు చెందుతూ ఉన్న ఇరువది నాలుగు ప్రకృతి పదార్థ ముల కావలఉన్న నిశ్చలమైన పరబ్రహ్మను ఏకాగ్రతతో మనం చేరు కోవాలి. శ్వాసలోపలికిపోతూ ఉన్నపుడూ, బయటికి వస్తూ ఉన్నపుడూ, శ్వాస నాళములో ఏ యే గోడలను రాసుకుంటూ వస్తున్నదో, పోతున్నదో, ఏకాగ్రతతో గమనిస్తూఉండాలి. మన నాసిక ముందర, పై పెదవిపై గుంటలాంటి ప్రదేశం ఉంటుంది. దానిమీద శ్వాస తాకిడిని

ఏకాగ్రంగా గమనించాలి. తర్వాత వేయినుండి ఒకటి వరకు వెనకకు మనసు లోనే లెక్క పెట్టాలి. లెక్క తప్పినట్లయితే మరల వేయినుండి ఒకటివరకులెక్క పెట్టుకోవాలి. ఈవిధంగా ఒక గంటసేపు కదలకుండా విపశ్యన చేసి ఆ తర్వాత లేచి చక్రమణం చెయ్యాలి. ధ్యాన సమయంలో సాధకుల్లో రక్త ప్రసరణం తగ్గుతుంది. కాబట్టి, దాన్ని యథావిధికి తీసుకురావటానికి ఈ చక్రమణం ఉపకరిస్తుంది.

"చక్రమణం" నెమ్మది అంటే నెమ్మదిగా పరిగెత్తుతూ ఉండాలి. గుండ్రంగా పరిగెత్తాలి. ఎడమకాలుముందరవేస్తున్నపుడు శ్వాసపీల్చుకోవాలి. కుడికాలు ముందర వేస్తున్నపుడు శ్వాసను వదలాలి. ఇట్లా శ్వాసను గమనిస్తూ దృష్టి నాసికాగ్రంపైనిలిపి ఒక అరగంటసేపు నెమ్మదిగా, గుండ్రంగాపరిగెత్తాలి. పరుగెత్తడానికి స్థలం చాలకపోతే, అడుగులో అడుగువేసుకుంటూనైనా నడవ వచ్చు. భవిష్యత్తులో సర్వ మతానుయాయులు ఈచక్రమణాన్ని ఆచరిస్తారు. దీనిద్వారా సకల రుగ్మతలు నయమౌతాయి. పర్యవసానంగా మానసిక శారీ రక ఆరోగ్యం సిద్ధిస్తుంది. మన మనస్సు ఏకాగ్రమౌతుంది. మీకున్న సమ యాన్నిబట్టి, ఎన్నిసార్లు వీలైతే అన్నిసార్లు ఈ విపశ్యన అనంతరం చక్ర మణం చేయవచ్చు. ఇట్లా చేస్తే, లోపలఉన్న ఇరవైనాలుగు ప్రకృతి తత్వాలు విడిపోయి, ఆత్మ సాక్షాత్కారానికి మార్గం సుగమమౌతుంది.

ఇక రెండవ మెట్టు చెబుతున్నాను. ధ్యానమంటే మనోవాక్కాయ కర్మలచేత ఏమీ చేయకుండా, మెదలకుండా ఉండటమే ధ్యానము. ఉత్తర ముఖంగా కళ్ళుమూసుకుని కదలకుండా కూర్చోవాలి. మీ మెదడులో ఆలోచ నలు, సంకల్పములు వస్తూపోతూ ఉంటాయి. వాటిని నిరోధించటానికి మీరు ఏ మాత్రం ప్రయత్నం చెయ్యకూడదు. అట్లా నిరోధించినకొద్దీ అవి ఎక్కువ అవుతాయి. మీరు కేవలం సాక్షీభూతులు మాత్రమే ! వస్తూపోతూ ఉన్న ఆలోచనలను ఏకాగ్ర చిత్తంతో గమనిస్తూ ఉండండి. ఆలోచన వెంటపడి పోతూఉన్నట్లనిపిస్తే, ఏదైనా ఒక మంత్రాన్ని మననం చేసుకొని, మీ ఎరు

కను ఆ ఆలోచననుండి స్వస్థలానికి మళ్ళించండి. ధ్యానం చేస్తూ ఉన్నపుడే మీ శరీరాల్లో మంట, దురద మొదలగు అవాంతరములు కలుగుతుంటవి. వాటిని నివారించటానికి ఎలాంటి ప్రయత్నమూ చేయవద్దు. ఆ అవరోధా లను, సహనంతో ఓర్చుకోండి. అవి మీరు పూర్వ జన్మలలో చేసుకున్న పాపములు. ధ్యానంలో అంతరాయం కలిగించటానికి అవి విశ్వప్రయత్నం చేస్తూఉంటాయి. అయినాకూడా దీక్షగా ఓర్పుతో వాటిని సహిస్తే, అవి శాశ్వ తంగా నశించి పోతాయి. ఈ పాపాలను మీరు మరల అనుభవించ వలసిన పని ఉండదు. ఇట్లా ధ్యానమగ్నులై ఉంటే, మీ మనస్సు సంకల్పములను విడిచి, సమస్థితికి చేరుతుంది. అప్పుడు మీకు నిద్రవస్తుంది. అప్పుడు మీరు ఎన్నుకున్న మంత్రాన్ని స్మరించుకుంటూ, ఎరుకతో ఉండాలి. నిద్రపోరాదు. సంకల్పానికీ, సంకల్పానికీ మధ్యనున్న విరామమే మనో నిశ్చలత. ఆ విరా మమును పెంచుకొంటూపోవాలి. అప్పుడు, మీ శ్వాస క్రమక్రమంగా తగ్గు ముఖంపడుతుంది. క్రమక్రమంగా శ్వాస ఆగిపోతుంది. కానీ లోపల నడు స్తూనే ఉంటుంది. ఇదియే నిష్కామ కర్మ. సహజ కర్మ. ఈ స్థితిని చేరు కున్న తర్వాత ధ్యానం విరమించవచ్చు. ఈ స్థితి రావడానికి సుమారుగా ఒక అరగంట పడుతుంది. రోజూ సూర్యోదయానికి ముందు అరగంట, మధ్యాహ్నం ఆహారం తీసుకోవటానికి ముందు ఒక అరగంట, సూర్యాస్తమ యంలో ఒక అరగంట, ఇట్లా ధ్యానం చెయ్యాలి. దీన్నే త్రికాల సంధ్య అంటారు. ప్రతి మానవుడు తప్పకుండా, ఈ త్రికాల సంధ్యను ఆచరించి, నిర్వాణాన్ని పొందవచ్చును.

ధ్యానంలో మూడవ మెట్టు చెబుతున్నాను. మీ భ్రూమధ్యంలోగల కాంతి పుంజాన్ని, కూటస్థ చైతన్యాన్ని ఏకాగ్రంగా ధారణ ద్వారా, ధ్యానం ద్వారా దర్శిస్తూ ఉంటే మీకు సమాధి సిద్ధిస్తుంది. దీన్ని హృదయకమలం మీదకూడా చేయవచ్చు. నాడీ కేంద్రములపై గూడా చేయవచ్చు. లేదా గురువు ఆకారంమీద కానీ, ఇష్ట దైవంమీద కానీ చేయవచ్చు. ఈ ధ్యానం

చేస్తే మీరు ధ్యానించిన వ్యక్తి మీకు సాంధీనమౌతాడు. స్వాధీనం అంటే పరస్పర ప్రేమ. ఓంకారాన్ని చేస్తూ, సత్యస్వరూపుడైన విశ్వేశ్వరుణ్ణి ధ్యానించాలి.

మీ బయట, లోపల సర్వత్రా వ్యాపించి ఉన్న పరమాత్మను దర్శించటానికి విపశ్యనద్వారా మీలోకి మీరు ప్రయాణం చేసి, మనోచాపలత్వాన్ని అరికట్టి, ఆత్మ దర్శనం పొందాలి. మొదట వెన్నుపూస నిటారుగా ఉండేటట్లు ఉత్తర ముఖంగా, సుఖాసనంలో కూర్చోవాలి. కళ్ళు మూసుకుని భ్రూమధ్యాన్ని చూస్తూ ఉండాలి. ఆలోచనలు లేకుండా ఉంటే, భ్రూమధ్య స్థానంలో మీ దృష్టి నిలుస్తుంది. కళ్ళు మూసుకుంటే, మీకు చీకటి గోచరిస్తుంది. అంటే మీలో చీకటి (అజ్ఞానం) ఉన్నదన్నమాట! ఆ చీకటి వెనుక ఏముందో తెలుసుకోటానికి, విపశ్యన చేయాలి. దానిని తెలుసుకోవటానికి ప్రయత్నం చేయాలి. దాని వెనుక దివ్యజ్యోతి స్వరూపమైన విశ్వాత్మ ప్రకాశం అఖండమైన బ్రహ్మానందంగా విరాజిల్లుతున్నది. ఇట్లా లోపలే చూస్తూచూస్తూ ఉండగా ఆ అఖండ మైన ప్రకాశం మొదట నక్షత్రంగా మీకు గోచరిస్తుంది. క్రమంగా ఆ నక్షత్రంలోంచి వెలుపడే ప్రకాశం మిమ్మల్ని నఖశిఖ పర్యంతం ఆక్రమిస్తుంది. మొదట ఈ విధంగా జరుగుతున్నట్లు భావించుకోవాలి. తరువాత అది మీ గృహాలను ఆక్రమిస్తుంది. మీ ఇంట్లోని వారంతా ఆ ప్రకాశంలో మునిగి పోతారు. ఆ జ్యోతి ఇంకా ఇంకా పెద్దదౌతున్నట్లు మీరు చూస్తారు. మీ ఇరుగు పొరుగువారు, మీ వీధి, మీ ఊరు, మీమండలం, మీ రాష్ట్రం, మీదేశం, యావత్ప్రపంచం, ఆ ఆత్మజ్యోతిలో నిండి పోతున్నట్లుగా మీరు భావించాలి.

తరువాత సౌరకుటుంబం, నక్షత్ర మండలాలు, పాలపుంతలు మొదలైనవాటి అన్నింటియందు ఈ విశ్వాత్మ ప్రకాశం నిండి మించిపోతున్నట్లుగా ధ్యానం చెయ్యాలి. మీ ఆత్మయొక్క దివ్య కాంతుల మీద ధ్యానంచేస్తూ పోవాలి. ఈ కాంతి ప్రవాహంలో బ్రహ్మాండ గోళములు, నక్షత్రములు మొదలగునవి అన్నియూ తేలియాడు తున్నట్లు ధ్యానం చెయ్యాలి. మీలో

గల అసంఖ్యాకములైన రోమకూపాలలో అనేక ప్రపంచాలు ఉన్నట్లుగా ధ్యానం చెయ్యాలి. ఈ రూపాలు, ఈ కాలమూ తుదకు స్తంభించి పోతవి. అస్పృశ్యమౌతవి. మిగిలింది ఒక్కటే అదే మీ ఆత్మప్రకాశము. ఇట్లా కనీసం ఒక అరగంటసేపు ధ్యానం చేసి కళ్ళు తెరచి మీ శరీరాన్ని చూసుకోవాలి. మీ ఆత్మానంద ప్రకాశం ముందు ఈ దేహం, ఈ ప్రపంచం ఎంత అల్పమైనవో మీరు గమనిస్తారు. మీతోనే సకల జీవరాశి నివాసమున్నట్లు గమనిస్తారు. అప్పుడు నేనే విశ్వాత్మ ప్రకాశాన్ని, నేనే విశ్వాత్మను, నేనే విశ్వానందాన్ని "అనే భావం మీకు కలుగుతుంది. నేను చావుపుట్టుకలేని ఆత్మవు. నిశ్చల ప్రాణాన్ని అని మీరు గ్రహిస్తారు. ఎప్పుడైతే ఈ సత్యాన్ని మీరు గ్రహిస్తారో అప్పుడు మీ బాధలన్నీ నశించి పోతాయి. మీరంతా నిశ్శబ్ద స్వరూపుడైన భగవంతుని స్వరూపాలు. సాధనాసమయములో నిశబ్దంగా ఉండటంనేర్చుకోవాలి. బాహ్య మౌనంగా, అంతర్మౌనంగా ఉండటానికి సాధన చెయ్యాలి. దీని వలన అపరిమిత మైన ఆనందాన్నీ, శక్తినీ మీరు పొందుతారు విరోధులుండరు. విశ్వమంతా మీరే అయినపుడు ఇంకామీకు విరోధులు ఎక్కడ ఉంటారు? మీకు నిర్వాణం ప్రాప్తిస్తుంది. శబ్ద, స్పర్శ, రూప, రస గంధాల్లో ఏఒక్కదానిపైనైన మనస్సును ఏకాగ్రంచేసి ధ్యానం ద్వారా సమాధి పొందవచ్చు.

"ధ్యానంకుదరలేదే!"అని మీరు నిరుత్సాహ పడనవసరంలేదు. ఈ ధ్యానానికి పూర్వం మీరు పాటించవలసిన నియమాలు కొన్ని ఉన్నాయి. అవేమి లేకుండా మీకు ధ్యానం సిద్ధించాలంటే సిద్ధించదు మొదట మీరు సత్సాంగత్యము సంపాదించుకోవాలి. రెండవది మీరు సన్న్యాస నియమాలు [అష్టాంగమార్గాలు] మూడవది వాఙ్నియమం. సత్యమైన,హితమైన, ప్రియమైన మాటలనే మీరుమాట్లాడాలి. నాలుగవది శీలసంపతి, మైత్రి, సుఖితుల యెడ), కరుణ (దుఃఖితులయెడ), ఉపేక్ష, (పాపాత్ములయెడ), ముదితము (పుణ్యాత్ములయెడ) అనే నాలుగు బ్రహ్మ విహారాలనూ, శ్రద్ధ, అహింస, హ్రీ (చేయరాని పనుల విషయంలో తానే సిగ్గుపడి చేయకుండా ఉండడం.) అపత్రాప్యం (ఇతరులుచూస్తే ఏమనుకొంటారోఅనే లోకభీతివల్ల చేయకుండా

ఉండటం) అలోభం, అమోహం, వీర్యం, అప్రమాదం(జాగరూకత)కరుణ, ఉపేక్ష అనే దశకుశల ధర్మాలను పాటిస్తూ ఉండాలి. ఇక ఐదవది విచారం. ఆర్యసత్యాలను గురించి, ప్రతీత సముత్పాదం గురించి ద్వాదశాంగనిదానం గురించి బాగా విచారం చేస్తుండాలి. ఇవన్నీ చేస్తుంటే క్రమంగా మీకు ధ్యానం అలవడుతుంది. మనస్సు స్వాధీన పడుతుంది.

## శ్రీ బుద్ధగీత

**స్పందనం చపలం చిత్తం దూరక్ష్యం దుర్నివార్యం**
**ఋజుం కరోతి మేధావీ ఇషుకార ఇవ తేజసమ్**

చిత్తము ఎల్లప్పుడు స్పందిస్తూ ఉంటుంది, అదిచపలమైంది. విషయాల నుండి దీన్ని మళ్ళించటం చాలాకష్టం. విషయాలపైకి పోకుండా నిలపాలన్నా కష్టమే! బాణాలు తయారు చేసేవాడు వంకరగా ఉన్న బాణాన్ని ఎట్లా సరిచేస్తాడో అట్లా బుద్ధిమంతుడైనవాడు చిత్తాన్ని స్థిరం చేసుకొంటాడు.

**వారిజమివ స్థలే క్షిప్తం ఉదకౌకత ఉద్భృతమ్**
**పరిస్పందత ఇదం చిత్తం మారధేయం ప్రహాతుమ్**

రాగం, ద్వేషం, మోహం మానం, విచికిత్స, మిథ్యాదృష్టి ఈ ఆరింటిని క్లేశములని పేరు. ఈక్లేశాలకు సంబంధించినవన్నీ మారుని పరివారం క్రిందకే వస్తాయి. ఈ మారసామ్రాజ్యం నుంచి బయటపడాలన్న ఉద్దేశ్యంతో విషయాలమీదకు ఎప్పుడుపోయే మనస్సును మళ్ళించాలని ప్రయత్నిస్తే నీళ్ళలోని చేపను బయటపడవేస్తే అది ఎట్లా గిలగిలకొట్టుకొంటూందో అట్లా ఆ మనస్సు అల్లలాడి పోవటం సహజమేగదా!

**ఆత్మనా చోద యేదాత్మనం ప్రతివసే దాత్మాన మాత్మనా**
**స అత్మగుప్తః స్మృతిమాన్ సుఖం భిక్షో విహరిష్యసి।**

ఓ భిక్షూ! నిన్నునీవే పరిశీలించుకో! నిన్నునీవే ప్రేరేపించుకో!ఎవడైతే తన్నుతాను రక్షించుకొంటాడో, తన్నుతాను పరిశీలించు కొంటూ ఉంటాడో ఆ భిక్షువు సుఖశాంతులతో జీవిస్తాడు.

**ఆత్మాహ్యాత్మనో నాథ ఆత్మాహ్యాత్మనో గతిః**
**తస్మాత్ సంయమ యాత్మనం అశ్వం భద్ర మివ వణిక్॥**

ఆత్మయే ఆత్మకు అభయస్థానము. ఆత్మయే ఆత్మకు గమ్యస్థానము. అశ్వముల వ్యాపారంచేసేవాడు తనగుఱ్ఱాలను ఎట్లాజాగ్రత్తగా చూసుకొంటూ ఉంటాడో, అట్లా ఎవడికివాడే తన విషయంలో జాగ్రత్తగా చూసుకొంటూ డాలి.

**హస్తసంయతః పాదసంయతో వాచాసంయతః। సంయతోత్తమః**
**అధ్యాత్మరతః సమాహితః ఏకః సంతుష్టస్తమాహుర్భిక్షుమ్॥**

చేతులను, పాదాలను, వాక్కును అదుపులో పెట్టుకొని తననుతాను చక్కగా అదుపులో పెట్టుకొనేవాడు, ధ్యానాది అధ్యాత్మిక విషయాలలో ఆసక్తి చూపించేవాడు, శాంతుడు, దాంతుడు, ఏకాకి, సంతుష్టుడైనవాడు భిక్షువని చెప్పబడతాడు.

**భిక్షునా సంవరః సాధుః సాధుః శ్రోత్రేణ సంవరః**
**ఘ్రాణేణ సంవరః సాధుః సాధుః జిహ్వాయా సంవరః॥**
**కాయేన సంవరః సాధుః సాధుః వాచా సంవరః**
**మనసా సంవరః సాధుః సాధుః సర్వత్ర సంవరః**
**సర్వత్ర సవృతో భిక్షుః సర్వదుఖాత్ ప్రముచ్యతే॥**

సాధకుడైనవాడు చక్షు రింద్రియాన్ని, శ్రవణేంద్రియాన్ని, ఘ్రాణేంద్రియాన్ని, జిహ్వేంద్రియాన్ని నిగ్రహించాలి. ఇంకా స్పర్శేంద్రియాన్ని నిగ్రహించాలి. అన్ని ఇంద్రియ నిగ్రహాలు మంచివే. ఒక్క ఇంద్రియాన్ని నిగ్రహించినా దుఃఖాలన్నీ తొలగి పోతవి.

**న తద్ దృఢం బంధన మాహుర్ధీరా**
**యద్ ఆయసం దారుజం వర్వజం చ**
**సారవద్ రక్తా మణికుండలేషు**
**పుత్రదారేషు చ యాపేక్షా॥**

ఏతద్దృఢం బంధన మాహుర్ధీరా
అపహారి శిథిలం దుష్ప్రమోచం
ఏతదపి ఛిత్వా పరివ్రజ
న్త్యనపేక్షిణః కామసుఖం ప్రహాయ॥

ఇనుముతో, కొయ్యతో, త్రాళ్ళతో వేసిన బంధనాలను దృఢమైనవి అని ప్రాజ్ఞులు తలవరు. మణికుండలాలు మొదలైన ఆభరణాలమీద, పుత్రులమీద, భార్యమీద ఉన్న మమకారాన్నే దృఢమైన బంధనంగా భావిస్తారు. ఈ బంధం మానవుణ్ణి పతనం చేస్తుంది. సడలినట్లనిపించినా వదలదు. దాన్ని వదలించుకోవటం కష్టసాధ్యం. వీతరాగులు ఇంద్రియ సుఖాలను త్యజించడం ద్వారా తృష్ణ అనే బంధాన్ని తెంచుకొని స్వేచ్ఛా జీవులవుతారు.

సర్వదానం ధర్మదానం జయతి
సర్వరసం ధర్మరసో జయతి
సర్వాం రతిం ధర్మరతి ర్జయతి
తృష్ణాక్షయః సర్వదుఃఖం జయతి॥

అన్నిదానాలల్లో (అభ్యుదయ నిశ్రేయస్సులకు హేతువైన) ధర్మదానం (అజ్ఞానులకు ధర్మబోధ చెయ్యటం) గొప్పది. అన్నిరుచులలో ధర్మరుచి గొప్పది. అన్ని ఆనందాలల్లో ధర్మంవల్లకలిగే ఆనందం గొప్పది. సర్వ దుఃఖాలను పోగొట్టే తృష్ణాజయాన్నే అన్నింటికంటే గొప్పదిగా విజ్ఞులు భావిస్తారు.

అప్రమాద రతా భవత స్వచిత్త మనురక్షత
దుర్గా దుద్ధరతాఽఽత్మానం పంకే సక్త ఇవ కుంజరః॥

అప్రమాదం (జాగ్రత్త) అనే భావం కలిగి ఉండండి. మీ చిత్తాలను (ఆధ్యాత్మిక సాధనలద్వారా) రక్షించుకోండి. బురదలో ఇరుక్కుపోయిన ఏనుగు ఏలాగైతే తనంతతానే స్వశక్తితో పైకి లేచివస్తుందో అట్లాగే మిమ్మల్ని మీరే ఉద్ధరించుకోండి!

యద్ధి కృత్యం తద్ అపవిద్ధం అకృత్యం పునఃపునః
ఉన్నలానాం ప్రమత్తానాం తేషాం వర్ధంత ఆస్రవాః॥

చేయవలసిన పనులు చేయకుండా, చేయకూడని పనులుచేస్తూ ఉండే అజాగ్రత్త పరులు చిత్తమాలిన్యాన్ని పెంచుకొంటూ ఉంటారు.

ఏషాం చ సుసమారబ్ధా నిత్యం కాయ గతా స్మృతిః
అకృత్యం తే న సేవంతే కృత్యే సాతత్యకారిణః
స్మరతాం సంప్రజానానాం అస్తం గచ్ఛంత్యాస్రవాః॥

మనదేహాలు అశాశ్వతమైనవి. అపరిశుభ్రమైనది. దుఃఖానికి నిలయమైనవి. ఈ సత్యాన్ని ఎవరైతే గ్రహిస్తారో వాళ్ళు చేయవలసిన పనులు సకాలంలో చక్కగా చేస్తూ ఉంటారు. చేయకూడని పనులు చేయకుండా తగిన జాగ్రత్త తీసుకొంటూ ఉంటారు. స్మృతి, సంప్రజన్యం (intro spection). అనే సాధనాద్వయాన్ని ఎవరు కలిగి ఉంటారో వాళ్ళల్లో చిత్త దోషాలు నశించి పోతాయి.

పర వద్యానుదర్శినో నిత్యం ఉద్ధ్యానసంజ్ఞినః
ఆస్రవాః తస్య వర్ధంతే ఆరాద్స ఆస్రవక్షయాత్॥

అహరహం ఇతరులలో దోషాలు చూడటమే పనిగా పెట్టుకొంటూ, ఇతరులను కించ పరుస్తూ హేళనగా మాట్లాడే వాళ్ళల్లో చిత్తమాలిన్యాలు (ఆస్రవాలు) వృద్ధి అవుతుంటాయి. మాలిన్యాలు వాళ్ళల్లో నశించి పోవక పోవటం వల్ల వాళ్ళకు అర్హత సిద్ధించదు.

అనుపూర్వేణ మేధావీ స్తోకంస్తోకం క్షణేక్షణే
కర్మారో రజతస్యేవ నిర్ధమేత్ మలమాత్మనః

స్వర్ణకారుడు ఎట్లా వెండి బంగారాల్లో నుంచి మలిన పదార్థాలను నేర్పుతో తొలగిస్తూ ఉంటాడో అట్లాబుద్ధిమంతుడు ప్రావీణ్యంతో తనలోని దోషాలను క్రమక్రమముగా తొలగించుకొంటూ పరిశుద్ధచిత్తుడౌతాడు.

ఆత్మాహి ఆత్మనో నాథః కోహి నాథః పరః స్యాత్
ఆత్మానైవ సుదాంతేవ నాథం లభతే దుర్లభం

తనకుతానే ప్రభువు. ఇతరులెట్లు తనకు ప్రభువులు కాగలరు? తనను తాను చక్కగా నిగ్రహించు కొన్నప్పుడు అర్హత పొందటం జరుగుతుంది.

ఆత్మనోఽర్థం పరార్థేన బహునాఽపి హాసయేత్
ఆత్మనోఽర మభిజ్ఞాయ సదర్థ ప్రసితః స్యాత్

ఇతర విషయాలు ఎంత గొప్పవైనా వాటి కోసం పరమార్థమైన ఆత్మ ముక్తిని వదలుకోరాదు. అన్నీ ఆత్మ విముక్తిలోనే అంతర్భాగాలు కాబట్టి దాన్ని సాధించటానికే ముఖ్యంగా ప్రయత్నించాలి.

కృచ్ఛ్రో మనుష్య ప్రతిలాభః కృచ్ఛ్రం మర్త్యానాం జీవితమ్
కృచ్ఛ్రం సద్ధర్మశ్రవణం కృచ్ఛ్రో బుద్ధానాం ఉత్పాదః॥

మానవజన్మ దుర్లభమైంది. మానవ జీవితం దుర్లభమైంది. సద్ధర్మ శ్రవణం లభించటం దుర్లభమైంది. బుద్ధత్వం ప్రాప్తించటం దుర్లభమైంది.

అంధ భూతోఽయం లోకః తనుకోఽత్ర విపశ్యతి
శకుంతో జాల ముక్త ఇవాల్పః స్వర్గాయ గచ్ఛతి॥

వలలో చిక్కుకొనే పక్షులే చాలా ఉంటాయి. తప్పించుకొని పోయేవి చాలా తక్కువగా ఉంటాయి. అట్లాగే ప్రజల్లో అజ్ఞానులు ఎక్కువ. జ్ఞాన దృష్టిగల వాళ్ళు తక్కువ. ఎవడికైతే జ్ఞాన దృష్టి ఉంటుందో వానికి స్వర్గం (నిర్వాణం) లభిస్తుంది.

ఉత్తిష్ఠేత్ న ప్రమాద్యేద్ ధర్మం సుచరితం చరేత్
ధర్మచారీ సుఖం శేతేఽస్మిన్ లోకే పరత్ర చ॥
ధర్మం చరేత్ సుచరితం న తం దుశ్చరితం చరేత్
ధర్మచారీ సుఖం శేతేఽస్మిన్ లోకేపరత్ర చ॥

లే! ప్రమాదానికి లోనుగాకు! ధర్మాన్ని ఆచరించు! ధర్మాచరణ గలిగిన వానికి ఈ లోకంలోనూ పరలోకంలోనూ సుఖం లభిస్తుంది.

సర్వపాపస్యాకరణం కుశలస్యోపసంపదా
స్వచిత్తపర్యవదానం ఏతద్ బుద్ధానాం శాసనమ్॥

పాపకర్మలు చేయకుండా ఉండటం, పుణ్యకర్మలు చేస్తూ ఉండడం, చిత్త శుద్ధిని సంపాదించటం - అనేవి బుద్ధులందరి ఉపదేశం.

క్షాంతిః పరమతప స్తితిక్షా నిర్వాణం పరమం వదంతి బుద్ధాః
సహిప్రవ్రజితః పరోపఘాతీ శ్రమణో భవతి పరంవిహారయిన్॥

క్షాంతి, తితిక్ష కలిగి ఉండటమే గొప్పతపస్సు. నిర్వాణమే అన్నింటి కంటే శ్రేష్ఠమైంది. నిర్వాణం అభిలషించేవాడు అహింసా పరుడుగా ఉంటాడు. ఇతరులను హింసించే వాడికి నిర్వాణం ప్రాప్తించదు.

అనువాదోఽనుపఘాత ప్రాతిమోక్షే చ సంవర
మాత్రజ్ఞతా చ యోగ భక్తేప్రాంతం చ శయనాసనమ్
అధిచిత్తే చ యోగ ఏతద్ బుద్ధానాం శాసనమ్॥

ఇతరులను నిందించనివాడు, ఇతరులకు అతకారం చేయకుండా ఉండే వాడు, బిక్షు నియమాలను పాటించటం ద్వారా తననుతాను నియమించుకొనే వాడు మితాహారం తీసుకొంటూ ఉండేవాడు, ఒంటరిగా శయనించేవాడు, ధ్యాన యోగంలో మనస్సు పెట్టేవాడు బిక్షువనబడతాడు. ఇది బుద్ధులందరి అనుశాసనం.

యుష్మాభిః కార్యం ఆతప్యం ఆఖ్యాతార స్తథాగతాః
ప్రతిపన్నాః ప్రమోక్ష్యంతే ధ్యాయినో మారబంధనాత్॥

బుద్ధులు (జ్ఞానులు) మార్గాన్ని మాత్రమే చూపిస్తారు. ఆ మార్గంలో మీరంతటా మీరే ప్రయాణం చెయ్యాలి. ఆత్మవలోకనం చేసుకొనే వాళ్ళ

మారునిబంధాలనుంచి విముక్తు లౌతారు. అష్టాంగ మార్గంలో పయనిస్తుంటే మారుణ్ణిముప్పతిప్పలు పెట్టివిజయాన్నిసాధించగలుగుతారు. ధ్యానసిద్ధికిఅష్టాంగమార్గం కంటే మరోమార్గంలేదు.

ఏతం హి యూయం ప్రతిపన్నా దుఃఖస్యాన్తం కరిష్యథ
ఆఖ్యాతో వై మయామార్గ ఆజ్ఞాయ శల్యసంస్థానమ్

ఈ మార్గాన్ని అనుసరించడంద్వారా మీరు దుఃఖాన్ని శాశ్వతంగా అంతమొందించగలరు. కామం, భవం, దృష్టి, అవిద్య అనే వాటిని తొలగించి వేసే మార్గాన్ని నేను స్వయంగా కనిపెట్టాను కనుకనే మీకిట్లా చెబుతున్నాను. ఈ ధ్యానాన్ని మీరు అభ్యాసం చేసి నిర్వాణ లాభంపొందండి! శుభం భూయాత్!



# ఇరువదిఐదవ అధ్యాయము

## (కాలజ్ఞాన యోగము)

శ్రీ నాగార్జున ఉవాచ :

భిక్షులారా! ప్రజ్ఞా పారమితత్వం పొందిన బుద్ధులకు భూతభవిష్యత్ వర్తమానములు కరతలామలకంగా ఉంటవి. వారిదృష్టికి కాలము, దూరము అడ్డురాదు. వైదికఋషులిట్టిత్రికాల నేతృత్వము కలిగినవారే. వారు భవిష్యపురాణమును వెలువరించినట్లు తథాగతుడుకూడా దేశభవిష్యత్తును వెల్లడించినాడు. ఆనందాది ముఖ్యశిష్యులకు ఏ కొద్దిమందికో తప్ప ఆ విషయము తెలియదు. ఆనంతభిక్షువైనను ఆ విషయము నెచ్చటను గ్రంథస్థము చేసి ఉండలేదు. "బుద్ధుడు కాలజ్ఞానము చెప్పెనా!" అనుసందేహము కలవారు కొందరు లేకపోలేదు. ఆయన సర్వజ్ఞత ఎట్టిదో తెలిపినవాళ్ళకు ఈ సందేహముండదు.

బుద్ధుడు తన పూర్వజన్మలను గురించి చెప్పిన వృత్తాంతములను జాతక కథలుగా నేడు మనము పఠించుచున్నాము. ఆయన తన జన్మను గురించి మాత్రమేకాదు. ఇతరుల పూర్వజన్మలను గురించియు వివరించి యున్నాడు. 'ధర్మపథం'లో ఆయన చెప్పిన ఛత్రపాల అనంద శ్రేష్టుల కథలు ఇందుకు ప్రబలోదాహరణములు.

ఒక రోజు శ్రావస్తిలోని జేతవనంలో బుద్ధుడు నివసిస్తున్నప్పుడు కొందరు భిక్షులు ఆయన దగ్గరికివచ్చి "చక్షుపాలుడనే బిక్షువు కీటకాలను త్రొక్కిచంపుతున్నా"డని అభియోగం మోపారు. "చక్షుపాలుడు ఆకీటకాలను బుద్ధిపూర్వకంగాత్రొక్కిచంపుతున్నాడన్నవిషయంమీరుచూచారా? అనిఆయన వాళ్ళను అడిగాడు. లేదని వాళ్ళు చెప్పారు. "అతని కాళ్ళ క్రిందపడి అవి నలిగి చని పోవటం మీ రెట్లా చూడలేదో, అతడూ అట్లానే చూడ లేదు. అర్హతుడైన భిక్షువెవడూ జీవహింస చెయ్యడు. అతడు నిర్దోషి" అన్నాడు బుద్ధుడు. "మరి చక్షుపాలుడు తనకాళ్ళక్రింద పడి నలిగి పోతున్నా ఆకీటకాలను చూడలేక పోవడానికి కారణమేమిటి భగవాన్?" అనివాళ్ళు ఆయన్ను అడిగారు. అప్పుడు సర్వజ్ఞుడైన బుద్ధుడు వాళ్ళ కిట్లా చెప్పాడు.

"ఒకానొక పూర్వజన్మలో ఛత్రపాలుడు నేత్రవైద్యుడు. ఆయన ఒకసారి తన దగ్గరకు చికిత్స కోసం వచ్చి ఒక స్త్రీకి బుద్ధిపూర్వకంగా అంధత్వం కలిగించాడు. ఒక స్త్రీ తనకు సరిగా కళ్ళు కనిపిటం లేదని చికిత్స కోసం ఛత్రపాలుడి దగ్గరకు వచ్చింది. తన కళ్ళుబాగైతే తానూ తన పిల్లలూ యావజ్జీవం ఆయనకు సేవకులుగా ఉంటామని ప్రాధేయ పడింది.! ఆయన చికిత్స చేశాడు. ఆమె అంధత్వం పోయింది. తనకళ్ళు కనిపిస్తున్నవని చెబితే ఎక్కడతాము ఆయనకు సేవచేయవలసి వస్తుందో! నని ఆమె తనకళ్ళు నయం కాలేదనీ, పైగా పూర్వంకన్నా దృష్టి మరింత మందగించిదనీ అబద్ధం చెప్పింది. ఆమె నిజం కప్పి పుచ్చుతున్నదన్న విషయం ఆయన గ్రహించి, ఆమెకుబుద్ధి చెప్పాలని వేరే ఔషధం ఇచ్చాడు. ఆ ఔషధ ప్రభావంవల్ల ఆమెకు పూర్తిగా కంటి చూపుపోయింది. ఆపాపఫలంగా ఆయన ఆతరువాత జన్మల్లో చాలాసార్లు అంధుడుగా పుట్టాడు. ఈ జన్మలోకూడా ఆ పాపఫలం ఆయన్ను విడిచిపెట్టలేదు. ఇదీ విషయం.

ఇక ఆనంద శ్రేష్ఠివృత్తాంతం చూస్తాం. ఆనందశ్రేష్ఠి శ్రావస్తినగరంలో కోట్లకు పడగలెత్తిన మహాశ్రీమంతుడు. అయితే ఏం లాభం? పట్టి పిసినారి, ఎంగిలిచేత్తో కాకినైనా విదలించేవాడుకాదు. అతని కొడుకు మూలాశ్రీకి తండ్రి పిసినారితనం నచ్చేదికాదు. తండ్రి చూడకుండా చాటుమాటుగా దానధర్మాలు చేస్తుండేవాడు ఈ సంగతి ఆనందశ్రేష్ఠి తెలుసుకొని" ఇట్లాగైతే లాభంలేదు. వీడు అస్తినంతా కర్పూరంలా హరించివేస్తా"డనుకొని, కొడుక్కు తెలియకుండా ఐదు ఏండెల బంగారాన్ని ఒకచోట ఇంట్లోభూమిలో పాతిపెట్టాడు. ఆ తరువాత మరణించి ఒక బిచ్చగత్తెకు కొడుకుగా పుట్టాడు.

పూర్వజన్మలో ఎవడికీ పెట్టినవాడు కాకపోవటచేత ఆ కొడుకు కలిగిన తరువాత ఆ బిచ్చగత్తెకు ఎక్కడా బిచ్చం దొరికేదికాదు. పస్తులుండవలసి వచ్చేది. తన కష్టాలకు కారణం ఆ పిల్లవాడే నన్న విషయం గ్రహించి ఆమె ఆ పిల్లవాణ్ణి ఒకచోట వదలి పెట్టింది. అప్పటి నుంచి ఆ బిచ్చగత్తెకు మామూలుగా బిచ్చం దొరుకుతుండేది. ఆపిల్లవాడు అష్టకష్టాలు పడి,

పెరిగి కొంచెం పెద్దవాడయ్యాడు. అతడికి పూర్వజన్మ స్మృతి కలగసాగింది. అతడు శ్రావస్తినగరం చేరుకొని, తనపూర్వపు ఇంటిని వెళ్ళాడు. ఆ పిల్లవాణ్ణి ఎవరూ గుర్తుపట్టలేదు. "ఇది నాయి"ల్లని ఎంతగా వాడుచెబుతున్నా ఆ విషయం పట్టించుకొకపోగా, పైగా తిట్టిబైటికి గెంటివేశారు. అప్పుడు అదారిన పోతున్న బుద్ధభగవానుడు మూలాశ్రీ దగ్గరికివచ్చి" ఈ పిల్లవాడు పూర్వజన్మలో నీ తండ్రి-అనందశ్రేష్ఠి!" అని చెప్పాడు. బుద్ధుడిపై అమిత గౌరవాభిమానాలున్న మూలాశ్రీ ఆ మాటలు నమ్మలేక" ఎట్లా నమ్మేదిభగవాన్? అనిప్రశ్నించాడు. బుద్ధుడుబిచ్చగత్తె కొడుకునుచూచి"పూర్వజన్మలో నువ్వుదాచి పెట్టినఐదువిందెల బంగారం మూలాశ్రీకి చుపిం!" అని ఆదేశించాడు. ఆపిల్లవాడు ఆబంగారాన్ని చూపించాడు. బుద్ధుని సర్వజ్ఞతను చూచి అక్కడున్న వాళ్ళంతా ఆశ్చర్యపోయారు.

బుద్ధభగవానుడు ఇట్లా జరిగిన విషయాలు చెప్పటంలో మనం ఆశ్చరపడనవసరంలేదు. ఆయన భవిష్యత్తు వృత్తాంతాలు గూడా చాలా వివరించాడు. మహాపరినిర్వాణం చెందబోయేముందు "కుశినార"లోని సాల వృక్షవనంలో నా నిర్వాణం సంభవిస్తుం"దని ఆనంద భిక్షుతో ఆయన చెప్పాడు. "ఆ అడవి మధ్యలో, ఆ చిన్నపట్టణంలో భగవానుడు నిర్వాణం చెందరాదు. భగవానుడి కోసం చంప, రాజగ్రహ, శ్రావస్తి, సాకేత, కోశాంబి, వారణాసులవంటి మహానగరాలున్నాయి. భగవానుడు వాటిలో ఒక దాన్ని ఎంచుకోవాలని కోరుతున్నా"నవి ఆనందుడు అభ్యర్థిస్తే, భగవానుడు నవ్వివిూ అలాఅనవద్దు. ఈ కుశినార నీవు చెప్పిన పట్టణాలకంటే తక్కువైందేమికాదు. ఒకప్పుడిది "కేశవతి" అనేపేర మహాసదస్సున (మహాసుదర్శన) మహారాజుకు రాజధానిగా ఉండేది" అని ఆ పట్టణపూర్వ ప్రశస్తి వివరించాడు. ఇట్లా ఎన్నో భవిష్య విషయాలు చెప్పాడు. కనుక తథాగతుల కాలజ్ఞాన విషయంలో మనం సందేహాలు పెట్టుకోక అవన్నీ ఆయనవెల్లడించినవేయని విశ్వసించవలెను.

శ్రీ బుద్ధభగవాన్ ఉవాచ :

ప్రబుద్ధులారా ! అతి రహస్యమైన ఈ కాలజ్ఞానాన్ని మీకీనాడు వెల్లడిస్తున్నాను. సావధానులై వినండి. నిర్వాణ ప్రాప్తికోసం నేను పరివర్తనం

చేస్తున్న ఈ ధర్మం అచిరకాలంలో దేశం నలుమూలలకు వ్యాపిస్తుంది. బౌద్ధసన్యాసుల వాగ్ధాటికి నిలువలేక వేదమతం కంపించి పోతుంది. భారత దేశంలో చక్రవర్తులే బౌద్ధ ధర్మ ప్రచారకులౌతారు. సముద్రయానంద్వారా, కాలినడకన పర్యటించి బౌద్ధ భిక్షులు విదేశాలలో ఈ ధర్మాన్ని వ్యాపింప జేస్తారు. బౌద్ధారామాలలో పరివ్రాజికల ప్రాధాన్యం ఎక్కువౌతుంది. మహా రాణులు బౌద్ధమతాన్ని స్వీకరిస్తారు. వీళ్ళు కొన్ని విహారాలను కూడా నిర్మి స్తారు. ఈ సంప్రదాయం ఆంధ్రదేశంలో విస్తారంగా ఉంటుంది. కొన్ని స్థూపాలుకూడా అక్కడ వెలుస్తవి. కృష్ణా నదీతీరంలో బౌద్ధ ధర్మ ప్రబోధా త్మకమైన ఒక విశ్వవిద్యాలయం నెలకొల్పబడుతుంది. నేను జన్మించిన లుంబినీ వనం, నా జ్ఞాన సిద్ధికి కేంద్రమైన గయ, తొలిసారి నేను ధర్మచక్ర ప్రవర్తనం జేసిన సార్‌నాథ్, ఈనాడు గీతోపదేశానికి మూలమైన ఈసాగర్, నేను మహా పరినిర్వాణము చెందబోవుచున్న కుశీనగరము ఈ ఐదును భవి ష్యత్కాలమున బుద్ధ సంఘమునకు దర్శనీయపుణ్యక్షేత్రములై ప్రసిద్ధి కెక్క గలవు.

నేను లుంబినీ వనమున మఱ్ఱిచెట్టు క్రింద జన్మించితిని. గయలో మఱ్ఱిచెట్టుక్రింద తపస్సుచేసి బుద్ధుడనైతిని. సారనాథ్‌లో మఱ్ఱిచెట్టుక్రింద కౌండిన్యుడు, అశ్వజిత్తు, కశ్యపుడు, మహానాముడు, భద్రకుడనే నామములు గల అయిదుగురు సన్యాసులకు మొదటపర్యాయము చతురార్య సూత్రములు తెలిపి, ధర్మచక్ర పరివర్తనము చేసితిని. ఇప్పుడిచ్చట ఈ మఱ్ఱిచెట్టుక్రింద బుద్ధగీతనుఉపదేశిస్తున్నాను. నాయెనుబదవసంవత్సరమున కుశీనారలో సాల వనమున మఱ్ఱిచెట్టు క్రిందనే నిర్వాణము చెందుదును. "సాలవనమున నున్నవన్నియుసాలవృక్షములేననిభావించిలోకులునేనుసాల వృక్షముక్రిందనే నిర్వాణము చెందితినని భావింతురు. అట్లే ప్రచారముకూడా జరుగును.

నేను జన్మించినది వైశాఖపౌర్ణమి. జ్ఞానసిద్ధినిహొందినది వైశాఖపౌర్ణమి. బుద్ధ ధర్మమును ప్రవచించిన దినము వైశాఖ పౌర్ణమి. ఈ బుద్ధ గీతను బోధించుచున్నది వైశాఖ పౌర్ణమి. వైశాఖ పౌర్ణమినాడే నేడు మహాపరి

నిర్యాణము చెందెదను. ఇక నాకు జన్మములేదు. పెక్కు జన్మలక్రితము "సుమేధు"డను పేరుగల బోధిసత్వుడను. శుద్ధోధన మహారాజుకు మహామాయాదంపతుల గర్భమున నేను జన్మించితిని. దేవతలకూ, మానవులకూ, నేను కనుగొన్న ధర్మమును బోధించి, ఎల్లరనూ జాగృతుల గావించుటే నా ధ్యేయము. నేను సర్వసంగ పరిత్యాగిని. "సర్వసంగ పరిత్యాగం" అంటే లోకాన్ని విసర్జించటం గాదు. ప్రపంచంనుండి పిరికిపందలా పరుగెత్తి పోవటంగాదు సన్యాసిపని. తాను సముపార్జించిన జ్ఞానశక్తితో ప్రపంచాన్ని మార్చి, మరింత ఉన్నతంగా, ఆదర్శంగా దాన్ని తీర్చిదిద్దటం. నాకు జ్ఞానోదయం కలిగిన తర్వాత "నాకు లభించిన ఈ జ్ఞానాన్ని ఇతరులకు బోధించడమా ? లేక నా వ్యక్తిత్వ పరిపూర్ణతకు నా జీవితాన్ని వెచ్చించడమా ?" అనే సందేహం కలిగింది. "నేను కనుగొన్న క్రొత్తధర్మాన్ని లోకులు ఆమోదించి ఆచారించటం చాలా కష్టం. నేను నా ధర్మాన్ని బోధించి, ఇతరులు దాన్ని అర్థంచేసుకోక పోయినా, ఆమోదించకపోయినా, ఆమోదించి ఆచరించకపోయినా అది వాళ్ళకు శ్రమను,నాకు విసుగును కలిగిస్తుంది. నా ధర్మం ద్వారా నేను పరిపూర్ణత్వం సాధించుకొంటా"నని నిష్క్రియత్వంలో పడిపోయినప్పుడు నా ఆలోచనలు పసిగట్టి, బ్రహ్మ సహంపతి బ్రహ్మలోకం నుండి నాదగ్గరకు వచ్చి "నువ్వు కనుగొన్న ధర్మసూత్రాన్ని మానవులకూ, దేవతలకూ ఉపదేశించు!" అని విజ్ఞప్తిచేశాడు. ఆయన ప్రార్థన మన్నించి నేను కనుగొన్న సత్యాలను బోధించడానికి పూనుకొన్నాను. నా నిర్యాణం కుశినారలో జరుగుతుందని చెప్పానుగదా. ఆ సమయంలో ఆనందుడు నాదగ్గర ఉంటాడు. యశోధర, రాహులుడు, శారిపుత్రుడు మొగ్గలణ్ణ మొదలైనవాళ్ళు నాకంటే ముందే నిర్యాణం చెందుతారు. నా అంత్యక్రియల అనంతరం నా అస్థికలకై కుశినారమల్లులు, మగధ రాజైన అజాతశత్రువు, వైశాలీ లిచ్ఛవీయులు, కపిలవస్తు శాక్యులు, అట్టకప్ప (అర్ధకర్ప) బులియులు, రామగామ కొలియులు, ప్లవమల్లులు తీవ్రంగా కలహిసారు. చివరకు "ద్రోణు"డునే బ్రాహ్మణునిద్వారా ఆ వివాదం శాంతియుతంగా పరిష్కరించబడుతుంది. నాతదనంతరం ఆనందుడు, ఉపాలి

కాశ్యపుడు నా ధర్మాలనూ, నా ఉపదేశాలనూ సూత్రీకరిస్తారు. తర్వాతి వాళ్ళకు ఆ గ్రంథాలు ప్రామాణికాలు అవుతాయి. భారతదేశంలో ప్రభువులే బోధకులైనా ధర్మాన్ని ప్రచారం చేస్తారు. నా అస్థికలపై స్థూపాలు నిర్మిస్తారు. భారతదేశంలో ప్రభువులే బోధకులై నాధర్మాన్ని ప్రచారంచేస్తారు. నాఅస్థికలపైస్థూపాలు నిర్మిస్తారు. భారతదేశంలోనూ విదేశాల్లోనూస్థూపాలు. అధికంగా వెలుస్తాయి. ఈ ప్రదేశంలోనే ఒకఆంధ్రభిక్షువు నామధ్యేమార్గాన్ని అందరికి అర్థమగు రీతిలో వ్యాఖ్యానించి ఒక ఉద్గ్రంథాన్ని వెలువరిస్తాడు. ఆయన పేరిట ఈ సాగర్ ప్రసిద్ధిలోకి వస్తుంది.

ఇటుపై ఐదువందల సంవత్సరములకు భారతదేశంలో వేద ధర్మం క్షీణిస్తుంది. విగ్రహారాధనలు ఎక్కువౌతాయి. వేదానుయాయులు అనేక ఉపాసనా మార్గాల నవలంభించి, అనేకశాఖలుగా చీలి పరస్పరం కలహించుకొంటూఉంటారు. ఆ సమయంలో ఈశ్వరాంశతో ఒక మహాత్ముడు జనించి, నాధర్మాలనే తన ధర్మాలుగా చేసుకొని, మాయావాదంతో జైన, బౌద్ధమతాలను ఖండించి అద్వైత సిద్ధాంతాన్ని స్థాపిస్తాడు. వేద ధర్మానుయాయుల్లోని వివిధ శాఖలను ఏకీకృతం చేస్తాడు. ఆ తర్వాత విశిష్టాద్వైతం, ద్వైతమతాలు వెలుస్తాయి. జైన బౌద్ధాలు, శైవవైష్ణవాలమధ్య కలహాలు బయలుదేరతాయి. జనక్షయం జరుగుతుంది. దేవుడు ఒక్కడేనని – ఆయన నిర్గుణుడనీ, అనేక నామాలతో పిలవబడుతుంటాడనీ, మానవులకంటే అధికమైన శక్తిగలవారు దేవతలనీ, దేవతలందరూ దేవుడి ఆధీనంలోనే ఉంటారనీ గ్రహించలేక ఒక దేవుణ్ణి ఆరాధించేవాళ్ళు మరొక దేవుణ్ణి ఆరాధించే వాళ్ళను ద్వేషిస్తూ ఉంటారు. యజ్ఞయాగాదులు తగ్గినా, వివిధ దేవతోపాసనలు, జంతుబలులు బహుళమౌతాయి. వేయిసంవత్సరముల అనంతరం బౌద్ధసన్యాసులలో శీలప్రవర్త లోపిస్తుంది. సన్యాస సన్యాసినులు విషయ వాంఛాలోలురౌతారు. బౌద్ధారామాలు పాడుబడి మట్టిదిబ్బలుగా మారతాయి. ఇంతమార్పు సంభవించినను బౌద్ధము తన ఉనికిని మాత్రం కోల్పోదు.

ఇకపై ఐదువందల సంవత్సరములకు పాశ్చాత్య దేశములో ఒక బీద కన్యకకు ఒక పుత్రుడు జన్మిస్తాడు. అతడు అత్యద్భుత సిద్ధులు ప్రదర్శించి

దేవునికుమారుడుగా పరిగణింపబడతాడు. ఆయన పుట్టినప్పుడు తూర్పున ఒక తేజోవంతమైన నక్షత్రం ఉదయిస్తుంది. ఆయన ప్రేమ, కరుణలను బోధిస్తాడు. ఆయన ధర్మోపదేశములను అర్థము చేసుకొనని వారు ఆయనను చిత్రహింసలకు గురిచేసి చంపుతారు. ఆయనమరణానంతరం ఆయన మాహాత్మ్యములు, ఆయనబోధలు ప్రపంచవ్యాప్తమౌతాయి. ఆయనఅనుయాయులు ప్రపంచంలో బహుళంగా ఉంటారు.

అటుపై మరి ఐదు వందల సంవత్సరములకు అరబ్బీ దేశములో ఒక మహాత్ముడు జన్మిస్తాడు. ఆయనతాను దేవదూతనని ప్రకటించుకొని నిర్గుణ రూపమైన ఏకేశ్వరోపాసనను బోధిస్తాడు. ఆయనకు బహుభార్యలుంటారు. ఆయనసిద్ధాంతాలు గూడా బహుళప్రచారం పొందుతాయి. వీరుగాక మరి కొందరు మహాత్ములు జన్మించి తమ సిద్ధాంతాలను లోకములో స్థాపిస్తారు. ప్రపంచంలో విశేషంగా ఆరుమతాలు విలసిల్లుతాయి.

ఇకపై పదిహేను వందల సంవత్సరాలకు భారతదేశం పరమతస్థులకు ఆధీన మౌతుంది. పరాయి పాలన ఆపై దాదాపు వెయ్యి సంవత్సరాలు దేశంలో ఉంటుంది.

ఇటుపై2500ల సంవత్సరములతర్వాత భారతదేశములోఒకమహాత్ముడు నా అంశతో జన్మిస్తాడు. సత్యాహింసలు సాధనాలుగా చేసుకొని జన సహాయంతో దేశస్వాతంత్ర్యాన్ని కొని వస్తాడు. రాజ్యాంగ విధానంలో ఎన్నో మార్పులు సంభవిస్తాయి. దేశంలో రాజరికం అంతరిస్తుంది. గణతంత్ర రాజ్యం ఆవిర్భవిస్తుంది. ప్రజలే ఏలిక లౌతారు. తమను తామే పరిపాలించుకొంటారు, కాని ప్రజలలో ఐక్యత ఉండదు. కుటిల రాజనీతిజ్ఞులు బయలుదేరి కులాలను, మతాలనురెచ్చగొట్టి, పబ్బం గడుపుకొంటారు. ప్రతిభకు కాక, కులానికి పెద్ద పీటవేస్తారు. బ్రాహ్మణుల ప్రాబల్యం క్షీణిస్తుంది. మేధావులు నిర్వీర్యులౌతారు. నైతిక విలువలు నశిస్తవి. ధనం విలువ

హెచ్చుతుంది. యంత్రాగారాలలో మనుష్యులకు బదులు మరమనుషులు పని చేస్తారు.

ఈ అనంత విశ్వంలో భూమండలముపై 1) మేఘ మండలము, 2) చంద్రమండలము, 3) సూర్యమండలము, 4) వాయుమండలము 5) నక్షత్ర మండలము, 6) ఆకాశ మండలము (అంతరిక్షము) అను ఆరు మండలములున్నవి. ఈ ఏడుమండలములు ఏడు లక్షణములు కలిగి యున్నవి. మానవులు భూమండలమున నున్నారు. పక్షులు గాలిలో ఎగిరి సంచరించుచున్నవి. భవిష్యత్కాలమున మానవులు కూడా యంత్ర సహాయమున ఆకాశమున సంచరించి, మేఘమండలమును దాటి చంద్రమండలము చేరుదురు. ఈ మండలములు భూమండలముపై గల పంచభూతములకు అయిదు విధములైన తత్వముల నిచ్చుచున్నవి. వాసనలు భూమండలము వలన కలుగుచున్నవి. రుచి జలస్వరూపము. ఇది మేఘమండలము వలన కలుగుచున్నది. వెలుతురు అగ్నితత్వము, ఇది సూర్యమండలము వలన కలుగుచున్నది. విచిత్రమేమనగా ప్రతి భూతమునందును మిగిలిన నాలుగు భూతముల శక్తి ఆయా పరిమాణములుగా లోనున్నది. నీటికి అగ్నిని చల్లార్చు శక్తి ఉన్నది. కానీ అందులోనే అగ్నితత్వ మున్నది. రాబోవు కాలమున మానవులు నీటి యందు అగ్ని శక్తి కలదని తెలుసుకొని, దానిని పైటకు తీసి, యంత్రముల ద్వారా దీపములు ప్రకాశవంతముగా వెలుగునట్లు చేసుకొంటారు. అవి గాలి వీచినను ఆరిపోవు. ఒక దీపము వార్పిన అన్ని దీపములు ఆరిపోవును. ఇంకా ఆ శక్తితో అనేక విధములైన యంత్రములను నడుపుతారు. జడపదార్థములకు చలన శక్తి కలిగించి, అనేక కార్యములు చేసుకొంటారు. పంచభూతములలో కొన్ని కలిసినప్పుడు కొన్ని విధములైన శక్తు లుద్భవిస్తాయి. భవిష్యత్ కాలమున ఆశక్తులను కనిపెట్టి వాటితో అత్యద్భుత కార్యములు జరుపు కొంటారు ఆకాశము శబ్దతత్వము – ఆ తత్వమును పరిశోధించి, ఒక దేశ ప్రజలు వేలాది యోజనముల దూరములోనున్న మరొక దేశప్రజలతో ముఖాముఖి మాట్లాడెదరు. అగ్నిజల తత్వములు కలసిన శక్తితో యంత్రములను తయారుచేసి, శీఘ్ర ప్రయాణమున కనుకూలముగా వాడుతుంటారు. గుడ్డి

ములు, రథములు, ఎద్దుల బండ్లు మొదలగు వాహనములకంటే ఆ వాహన ములు త్వరితగతిని నడుస్తుంటవి. ప్రయాణములందు ప్రయాస, కాలయాపన ఉండదు.

ప్రజలు కోడికూతను ప్రమాణముగా తీసుకొనిఇప్పుడుమేల్కొనుచున్నారు. పగలు సూర్యుని గమనము, రాత్రిపూట నక్షత్ర గమనము ననుసరించి, నేడు కాలమును గుణించుచున్నారు. రాబోవు కాలమున మానవుని మేధస్సు పెరిగి, గుండె కొట్టుకొను విధంగా ఘంటికా యంత్రము లుండునట్లు నిర్మి స్తారు. దానినిబట్టి కాలమును తెలుసుకొంటూ ఉంటారు

ఇరవై అయిదు వందల సంవత్సరములకు రానున్న ప్రళయమునకు ముందు ఏకాలమునందును లేని విధంగా అనేక ప్రాంతములందు మహాత్ములు, సిద్ధపురుషులు జన్మించి, యోగ పద్ధతులను, సత్ప్రవర్తనా ప్రాముఖ్యమును, ప్రేమ, దయ, సత్యాహింసలను లోకమున ప్రబోధించి, మానవులను సన్మార్గగాములుగా చేయుటకు, ప్రయత్నిస్తారు. వివిధ దేవతా విగ్రహములతో పాటు ఆ మహాత్ములకు కూడా గుళ్ళు, గోపురములు కట్టి, పూజించుట జరుగును. ప్రళయమునకు ఒక యాబదిసంవత్సరములకుముందు ఆంధ్రదేశములో మూర్తీభవించిన సత్యమై ఒక మహాత్ముడు అవతరిస్తాడు. అనేక సిద్ధులు ప్రకటించును. విశ్వవిఖ్యాతి నందును. ధర్మప్రచారముచేసి జనులను సన్మార్గగాములను జేయును. ప్రేమ, దయ, త్యాగము, సేవలను ఉద్బోధించి, మానవతావిలువలను లోకమునప్రతిష్ఠించును. సత్యనామమున విలసిల్లును.

ఆకాలమునందే కృష్ణానదీ తీరమున బుద్ధుడవతరించును. అప్పటి పరి స్థితుల కనుగుణముగా విశ్వమానవ సమైక్యతను ఉద్బోధించును. మానవుల ప్రవర్తనను చక్కదిద్దుటకై జీవితమును ధారపోయును. విదేశములు పర్య టించి, ధర్మ చక్రపరివర్తనము చేయును. తన విహార స్థలిలో ఒక స్థూపము నిర్మించును. అది ధ్యానమునకై ఏర్పాటు చేయబడిన "ఉద్దేశిక" మనెడి

స్థాపము. ఈ బుద్ధగీత ఆ కాలముననే ఆంధ్ర దేశమున వెలువరించ బడును. ఆసమ్యక్ సంబుద్ధుడే అగ్రంధాన్ని ఆవిష్కరించును.

ఇరవై ఐదువందల సంవత్సరములు గడచిన తర్వాత ప్రపంచము నందు, భారతదేశము అగ్రస్థానము వహించి విశ్వమునకు జ్ఞానభిక్ష నొసగ గలదు. ప్రపంచ శాంతికి మూలము కాగలదు. అప్పుడు మానవు లందరూ కులమత రహితమైన ఒకే ఒక మానవకులముగా ఏర్పడి సుహృద్భావముతో ప్రశాంతముగా సహజీవనము చేయుదురు. భవిష్యత్‌లో స్త్రీ,పురుషుల కలయి కతో సంబంధము లేక యే సంకల్ప మాత్రమున సృష్టి జరుగును. మానవులు గ్రహాంతర యానములు చేయుదురు. శాస్త్రీయ విజ్ఞానము ప్రబలి సురణించిన వారినిగూడా పునరుజ్జీవితులను చేయగలుగుదురు. సత్యం, శీలం, పవిత్రత, సమైక్యత, అనే సనాతన ధర్మాలు మానవుల కుపాధేయాలవుతాయి. ఆకాలం మానవవిశ్వకళ్యాణానికి పూలబాటలు పరచి విశ్వచరిత్రలో సువర్ణాధ్యాయం తెరుస్తుంది. ఆనందం వెల్లివిరిస్తుంది-ధర్మం పండువెన్నెల కురిపిస్తుంది. భూతలం స్వర్గమౌంది.

బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి.

సర్వేజనాస్సుఖినోభవంతు



# తృంది పలుకుల

పాఠక మహాశయులారా ! ఇంతవరకు బుద్ధుడు ఆనందునకు ప్రవచించిన బుద్ధ గీతను మీరు విన్నారు. బుద్ధ ధర్మమంతయు తృష్ణారాహిత్యముపైనే ఆధారపడి ఉన్నది. ఆశలేనివాడే నిర్వాణమునకు అర్హుడు. అర్హతకై మన శీలమును ఎట్లు అభివృద్ధి చేసుకొనవలెనో, ఈ గీత మనకు బోధిస్తున్నది. ఈ గీత ఆనందభిక్షువు నుద్దేశించి పలుకబడినదైనను సర్వులు సచ్చిదానంద స్వరూపులు కావలయునని, ప్రబుద్ధులు కావలయునని తథాగతుని ఆశయమైనట్లు మనకు బోధపడుతుంది.

ఆనందుడు విలక్షణమైనవాడు. ఆయన శుద్ధోధనుని తమ్ముడైన అమితోదనుని కుమారుడు. బుద్ధుడికి వృద్ధాప్యంలో (50వ ఏట) ఒక సేవక శిష్యుడి అవసరంకలిగింది. ముందు ఆయనతన తమ్ముడైన నందుని ఎంచుకున్నాడు. ఆ తర్వాత ఆనందుని ఎంచుకున్నాడు. ఆనందుడు ఎనిమిది షరతులు పెట్టి, ఆ షరతులకు ఒప్పుకుంటేనే తాను సేవక శిష్యుడిగా ఉంటానని బుద్ధునితో చెప్పాడు. ఆనందుని నిబంధనలు ఇవి.

1) తథాగతుడు తాను స్వీకరించిన వస్త్రాలను నాకు ఇవ్వరాదు.

2) తన ఆహారాన్ని నాకివ్వరాదు.

3) తన కుటీరంలో నన్ను ఉండ మనరాదు.

4) తన్ను ఆహ్వానించిన చోట్లకు నన్ను రమ్మనరాదు.

5) నన్నాహ్వానించిన ప్రదేశాలకు బుద్ధుడు నాతో దయచేయవలెను.

6) బుద్ధుని దర్శనం కోసంవచ్చే భక్తులను లోపలకు ప్రవేశపెట్టి పరిచయం చేసే అనుమతి నాకు సర్వవేళలయందు ఉండవలెను.

7) నాకు సందేహములు వచ్చినవెంటనే తథాగతుడు వానిని నివారణ చేయవలెను.

8) నేను దగ్గరలేనపుడు తానుచేసిన ధర్మబోధలను మళ్ళీ నాకు విన్పించవలెను.

బుద్ధుడు ఈ షరతులకు అంగీకరించాడు. ఆనాటినుండి ఇరవై ఐదు సంవత్సరములపాటువిడవకుండాబుద్ధుణ్ణిఆనందుడుసేవించాడు. బుద్ధునినిర్వాణ సమయంలోదగ్గరఉండే అదృష్టంఆయనకులభించింది. తదనంతరము ఆయన ధర్మ బోధలను గ్రంథస్థము చేసి ప్రపంచమునకు ఆయన అందివ్వటం జరిగింది. ఇంతటి అర్హత కలినవాడు కావటంచేతనే బుద్ధుడు ఆయనకు గీతాప్రబోధం కావించాడు. గీతాప్రబోధము వినుటకు తగినఅర్హత ఆనందుడు పొందాడు. ఈ బుద్ధగీత మనిషిఅన్వేషణను అంతర్ముఖంచేసి తనలోని సామర్థ్యాన్ని గుర్తించేలా చేస్తుంది. ధర్మ బద్ధంగా ప్రవర్తించేందుకు మనస్సుకు శిక్షణ ఇవ్వాలన్న భావనను ఇది కల్పిస్తుంది. ఇది మానవుని బుద్ధునిగా మార్చే ఒక అత్యద్భుత మంత్రదండం. బుద్ధధర్మం ఎంతగొప్పదో ఈ గీత వల్ల మనం తెలుసుకొంటాం. నిర్వాణ ధర్మానికి సంబంధించిన ఈగీత లోకులకు మనశ్శాంతినీ, ఆనందాన్నీకలిగించి ఎల్లరనూ సమ్యక్సంబుద్ధులను కావిస్తుం దనటంలో సందేహం లేదు.



## బుద్ధబోధ

"ఆ చిరునవ్వులో అందాలహరివిల్లు
సన్నజాజులవానజల్లు కురియు,

ఆ కటాక్షములో రాకా శరశ్చంద్ర
చంద్రికాపూరాలు జాలు వారు;

ఆ మధురోక్తిలో అమ్నాయపరమార్థ
విజ్ఞాన వాహినుల్ వెల్లివిరియు;

ఆ పదస్పర్శలో అనురాగమయ వియ
ద్గంగా తరంగాలు పొంగి పొరలు;

అతడు "సర్వజ్ఞు", డతడు "తథాగతుండు"
"బుద్ధు" డాతడు, "సర్వార్థ సిద్ధు"డతడు;
కనుడు జనులార! కన్నుల కరవుదీర
వినుడు మనస్వామి బోధలు వీనులార!

   

"దుష్టచిత్తులు దుష్ప్రవృత్తు లగు జనుల
వెంబడించును దుఃఖాలు విడువకుండ;
బండి లాగెడు తరి వృషభములఁ గదిసి
కదిలి వెంటాడు శకట చక్రములభంగి."

దుమ్ము తుడిచిన నిలువుటద్దమ్మునందు
ప్రతి ఫలించిన స్వీయరూపమ్ము పగిది
స్వచ్ఛమగు సన్మనుష్యుని స్వాంతమందు
స్పష్టముగ దర్శనమ్మిచ్చు సృష్టి ఎల్ల

"పరమభాగ్య" మారోగ్యమే నరులకెల్ల
"పరమధనము" సంతుష్టియే ధరణియందు.
"పరమ సఖము" విశ్వాసమే, తరగిపోని
"పరమ సుఖము" నిర్వాణమే ప్రాజ్ఞులార!

కామమునుబోలు అగ్ని లోకమున లేదు.
ధరణి ద్వేషమ్ము వంటి భూతమును లేదు
మోహసమమైన వల జగముననె లేదు.
ఆశవంటి మహాప్రవాహమ్ము లేదు.

కరుణ శాంతి నిచ్చు; కరుణ కాంతి నొసంగు
కరుణ లేనినాడు ధరణి లేదు.
కరుణ శుభము నిచ్చు; పరమ సౌఖ్యము నిచ్చు
కరుణ లేని నరుడు గడ్డిబొమ్మ.

"మంచిదృష్టి" మరియు "మంచి సంకల్పంబు"
"మంచి భాషణంబు", "మంచి చర్య,"
"మంచి జీవనంబు", "మంచిప్రయత్నందు"
"మంచి సంస్మృతి"యును" "మంచిదీక్ష"

ఇదియే "అష్టాంగ మార్గ" మీ ఎనిమిదింటి
నభ్యసించిన మనుజు లనంత సుఖము
లందుకొందురు; శాశ్వతానంద మబ్బు;
నష్ట మగు తృష్ణ; దుఃఖ మన్నదియె రాదు.

శోకమయమ్ము లోక మిది; శోకనిదానము తృష్ణ; లోకశో
కాకరమైన తృష్ణను నిరాకరణం బొనరింపగావలెన్;
ప్రాకృతమైన తృష్ణ నణంపంగల వెన్మిది మంచి మార్గముల్
చేకొను డెల్లవారలును; జ్ఞేయము లీ చతురార్య సత్యముల్

క్షాంతి, దాన, శీల, సత్య, నైష్కర్మ్యముల్
శాంతిదాయకములు సద్గుణములు.
మరి ఉపేక్ష, వీర్య, మైత్ర్యధిష్ఠానాలు
ప్రజ్ఞతోడ పదియు "పారమితలు"

ఈ "పారమితలు" పదియును
చేపట్టిన మానవునకు శ్రేయము గలుగున్;
పాపములు తొలగు; భవసం
తాపంబులు మలగు; చెలగు ధర్మ పథమ్ముల్.

దృఢమైన కప్పుతో నొప్పు గృహమునందు
వానజల్లు ప్రవేశింపలేని యట్లు;
ఇల జితేంద్రియుఁడగువాని హృదయమందు
చెడ్డ భావంబు లవి ప్రవేశింపలేవు.

విషయ సుఖలోలుడగు నవివేకి నెపుడో
మృత్యువు హఠాత్తుగా దిగమ్రింగివేయు
మైమరచి నిద్రపోవు గ్రామమును వరద
వెల్లువ అమాంతముగ ముంచివేయునట్లు.

చిత్తము "ప్రమత్త","మీర్ష్యాప్రవృత్త" మధిక
చంచలము" స్వేచ్ఛమెయి సంచరించు నెపుడు;
ఆ మనో మర్కటము సివా లాడకుండ
వశమునం దుంచుకొను వాఁడె ఘనుఁడు.

పరిగణింపరాదు పరులదోషమ్ములు;
పరితపింపరాదు పరుల సిరికి;
పరిహసించరాదు నిరుపేదలను గాంచి
పరవశింపరాదు భాగ్యములకు.

బీదవాని పెదవిమీద చిర్నవ్వులు
చిందునట్లు మీరు చేతురేని
వేయిస్వర్ణనిధులు వెలుఁగొందు మీ ముందు
వంతనందనములు క్రందళించు!!

పలుకకుండు పరుషవాక్కులు;
నలుపకుండహితంబు సాధుజనులకు; గురులన్
తలిదండ్రుల పూజింపుడు;
తలపోయుం "డహింస పరమధర్మం" బనుచున్.

(డాక్టర్ "కరుణశ్రీ" జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి "కరుణశ్రీ" కావ్యంనుండి)

ఓం అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు, ఓం సర్వేషాం శాంతిర్భవతు
ఓం సర్వేషాం పూర్ణం భవతు, ఓం లోకస్సమస్తాః సుఖినోభవంతు
ఓంజీవోసమస్తాః సుఖినోభవంతు, ఓంసమస్త చరాచరశ్రేయోభవంతు!

* * *

అజ్ఞానాన్ని హరించేది, భవదుఃఖాన్ని దూరంచేసేది, క్లేశాలన్నింటినీ నివారించేది, అశాంతిని హరించేది, సుఖాన్ని, శుభాన్ని ప్రసాదించేది, శ్రేయోదాయకమైంది, పరమపావనమైంది, ఆనందప్రదమైంది, నిర్వాణప్రాప్తి (మోక్షం) చేకూర్చేది, జ్ఞానప్రదమైంది, సచ్చిదానంద స్వరూపమైంది. యోగశాస్త్రమైంది, అనఘాదేని స్వరూపమైంది, సహజ నిష్కామ కర్మయోగమైంది, విశ్వయోగమైంది శ్రీశ్రీశ్రీ హరిబాబుయోగి మహారాజ్‌చే ప్రోక్తమైంది, మట్టుపల్లి జగన్నాథ మహాలక్ష్మ్యంబికా తనూభవుడు శివసుబ్బరాయ గుప్తచే పరిష్కరింపబడినది అగు "శ్రీబుద్ధగీత" అను విశ్వయోగ గ్రంథము మూడవ భాగముసర్వము సంపూర్ణము.

ఓం సత్.

* * *